| | | ప్రతి 1-కి రూ. |
|---|---|---|
| కాలజ్ఞానము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 |
| రావణకుమారతంత్రము ,, | ... | 0 |
| చక్రదత్త ,, | ... | 4 |
| ఘృతతరంగము ,, | ... | 1 |
| చికిత్సాసారము ,, | ... | 2 |
| నాడీజ్ఞానము | ... | 0 |
| భేషజకల్పము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 |
| దేహతత్త్వనిర్ణయము ,, | ... | 0 |
| మసూరికము (Small-Pox) | ... | 0 |
| వైద్యశతశ్లోకి | ... | 0 |
| రసప్రదీపిక, పద్యకావ్యము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 |
| రాజమార్తాండము ,, | ... | 0 |
| లోలంబరాజీయము, సద్వైద్యజీవనము,, | ... | 0 |
| హోమియోపతి గృహవైద్యము | ... | |
| వస్తుగుణమహోదధి, తెనుగువచనము | ... | 6 |
| వంధ్యాతంత్రము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 |
| వృక్షాయుర్వేదము ,, | ... | 0 |
| సహదేవపశువైద్యశాస్త్రము, తాత్పర్యము | ... | 0 |
| సర్వౌషధిగుణకల్పము ,, | ... | 2 |
| శార్ఙ్గధరసంహిత, క్రొత్తకూర్పు ,, | ... | 5 |
| శార్ఙ్గధరకృత త్రిశతి | ... | 0 |
| సుశ్రుతశారీరము | ... | 2 |
| ద్రవ్యగుణనిఘంటువు, అభిధానరత్నమాల | ... | 0 |
| సూతికాచికిత్స, డా॥ వరదప్పనాయుడు | ... | 1 |
| మాధవనిదానము, ఆంధ్రవ్యాఖ్యానము | ... | 4 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, మదరా

శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము

పడవ ప్రకరణము.



ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుఁడగు
కావ్యస్మృతితీర్థ
జనమంచి శేషాద్రిశర్మచే రచింపఁబడినది.



చెన్నపురి:
'వావిళ్ల' ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.
1928

# సురుచిర వృత్తాంతము.

పరమాత్మభక్తవరులారా!

శ్రీకృష్ణావతారతత్త్వమున నేడవప్రకరణము నిప్పుడు మీయెదుటం బెట్టుభాగ్యము భగవంతుఁడునాకుం గల్గించెను. ఇప్పటి కిదియే సంతోషవార్త యనవలయు. తక్కుంగలప్రకరణముల మీ కందించుభాగ్య మాపరమేశ్వరుఁ డొసంగునని నమ్మెదను. ఈప్రకరణమున శ్రీకృష్ణసనత్కుమారసంవాదము. నందునకు శ్రీహరి యనేకధర్మము లుపదేశించుట. ఉద్ధవుఁడు శ్రీకృష్ణానుమతిని గోకులమున కరుగుట, భ్రమరగీతలు, శ్రీకృష్ణసందేశము నుద్ధవుఁడు గోపికలకుం దెలుపుట, రాధోద్ధవసంవాదము, రాధ యుద్ధవునకు జ్ఞానోపదేశము చేయుట, కృష్ణుఁడు రాధ నూఱడించుట, ఋభునారదచరిత్రములు, కోలదానవసంహారము. మథురాపురమాహాత్మ్యము, రామకృష్ణుల కుపనయనమహోత్సవము సాగుట, వారు విద్యనభ్యసించుట లోనగు నద్భుతగాథలు ముఖ్యములు. భ్రమరగీతలు లోనగువాని యందు నే వ్రాసినయభిప్రాయము విమర్శింపఁ దగినది. సర్వజనాంగీకారమును బడయునని భావింపఁ జాలనుగాని దానిసార మదియైయుండునని నమ్ముచున్నాఁడను. సర్వజనసమ్మత మగుమతమే లేనపుడు నాభావ మట్టిదని వ్రాయునంతటి యవివేక మిప్పటికి నాకు లేదు.

డను. కొందఱుపోషకులు వలదనిరి. అంతమంది వలయుననిరి. ముం దీశ్వరానుగ్రహ మేలాగుండునో చూడవలయును. ఇంత కంటెఁ బెంచి యీగొడవవ్రాసి మి మ్మలయింపఁజాలను. మొత్త ముమీఁద ద్రవ్యము కావలయునన్నమాటయే యీ వ్రాఁత లోనిసారమని మీరు కనుఁగొందురని నే నెఱుంగుదును. అట్లని యూరకుండ మన స్సొడఁబడకున్నది. కాన నాలుగు మాటలు వ్రాసితిని. విసుగునొందక మీమిత్రములకుఁ దెలిపి తోడ్పడుఁడు. కడుంగడుం బీదవాఁడను. పూనినకార్యము నాశక్తిం బట్టిచూడ నించుక గొప్పదియే. కావునఁ బ్రతిపర్యాయ మేదోయొకవిధమున మీ సాయమునకై నాలుకఁ జాఁచుచునే యున్నాఁడను. నావంటి యసమర్థునిచే నింతమాత్రపుఁ బనిచేయించుటయే మీ గొప్పతనము. ఇంతకన్న విశేషించి విన్నవింప నేమున్నది? "అతిసర్వత్ర వర్జయే"త్తని యున్నదియే కదా. కావున విరమించుచున్నాఁడను. తప్పులక్షమింప భక్తజనకోవిదులఁ దలయొగ్గి ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు సాధుజనపాదాబ్జసేవకుఁడు;

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ. శ్రీ. శ్రీ.

# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించు పుణ్యపురుషులు.



### కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
,, విరూరు పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. యల్.
,, కొకూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్.
,, బి. పి. దేవరాజులునాయఁడుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.
,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.
,, కే. సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.
,, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులు శ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, దేవతి పిచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వేంకటేశముశ్రేష్ఠిగారు.
,, మల్లెంకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, మాలేపాటి చిన్నవెంగన్నశ్రేష్ఠిగారు.
,, అన్నలూరు శేషగిరిరావుగారు.

మ. రా. శ్రీ. మాలేపాటి వీరయ్యశ్రేష్ఠిగారు.
,, బి. శేషగిరిరావుగారు.
,, శ్రీకంఠము నరసింహయ్యగారు.
,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్. టి.
,, పి. వీరభద్రరావుగారు.
,, పుప్పాల వేంకటస్వామినాయఁడుగారు.
,, కాట్రపాటి చలపతిరావుగారు.
,, బొందలగుంట వేంకటనారాయణరావుగారు.
,, ఆర్. గోవిందరావుగారు, బి. ఏ., తహసీల్ దార్.
శ్రీమతి తలుపుల వేంకటసుబ్బమ్మగారు.
మ. రా. శ్రీ. బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, సకలా వేంకటసుబ్బయ్యగారు.
,, చిల్లా వేంకటకొండయ్యగారు.
,, వీరబోయిన కొండయ్యగారు.
,, మాకం జంగంశ్రేష్ఠిగారు, చీమలపెంట. [పల్లె.
,, గంగవరము, వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారి
,, పి. సీతారామయ్య పంతులుగారు, ఎమ్. ఏ., మండలాధి
కారులు. [యుంత్తురువై ఎస్టేటు, వీరకేరళము.
,, సగరం గురురావుగారు, బి. ఏ., ఆఫిషియల్ రిసీవర్.
,, గడియారము కృష్ణస్వామయ్యగారు
,, గజరాంపల్లి రామచంద్రరావుగారు.
,, సూర్యవంశము వేంకటసుబ్బరావుగారు.

కామలాపురము.

మ. రా. శ్రీ. బచ్చు రాఘవయ్యశ్రేష్ఠిగారు.
,, జి. సుబ్బరావుగారు.

మ. రా. శ్రీ. రాణువ ఫణిరావుగారు.
,, హనుమగుత్తి. చెంచిరెడ్డిగారు, గ్రామమునిసిప్.

వల్లూరు.

మ. రా. శ్రీ. సముద్రాల రామస్వామిగారు.
,, బెస్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు.
,, తంగటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు.
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠిగారు, ఆరణిపోలేపల్లి సుబ్బయ్యశ్రేష్ఠిగారు.

ఎఱ్ఱగుంట్ల.

మ. రా. శ్రీ. ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము.
,, ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు.
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లము సూరయ్యగారు.
,, పేర్ల నాగిరెడ్డిగారు.
,, ఏ. శ్రీనివాసులునాయడుగారు.
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిడుజువ్వి.
,, అయ్యాదొరనాయడుగారు.

పులివెందుల

మ. రా. శ్రీ. మద్దాల బోగాదిశ్రేష్ఠిగారు, వేములకొత్తపల్లి.
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి
,, పుల్లగూర వేంకటశేషయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి.
,, కావుటూరు ఆనందరావుగారు, పోలీసు సబ్ ఇన్స్పెక్టరు.
,, లింగిరెడ్డి గంగిరెడ్డిగారు, ఎద్దులాయగారికొత్తపల్లి
,, పడ్డకుంట అశ్వత్థమయ్యగారు, వేంపల్లి.
,, వద్దిరెడ్డి కొండారెడ్డిగారు, లింగాల.

## ప్రొద్దుటూరు.

మ. రా. శ్రీ. కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు.
,, వంగీపురము శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ., ప్లీడరు.
,, సి. నరసరామశాస్త్రిగారు, బి. ఏ., ప్లీడరు.
,, యం. రామస్వామయ్యగారు, ప్లీడరు.
,, రావులూరు సుబ్బరావుగారు, డిప్టీనాజరు.
,, ఉప్పలూరు భద్రయ్యగారు.
,, డి. రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు.

## రాజంపేట.

మ. రా. శ్రీ. ఆర్కాటు పరశురామరావుగారు, యం. యల్. సి., నెందలూరు.
,, ఏచూరు చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము.
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట.
,, పిడతల చిన్నవేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు.
,, అచ్యుతన్న రామచంద్రరావుగారు, టంగుటూరు.
,, మంచి వీరరాఘవయ్యగారు, మందపల్లె.
,, పుట్టా నాగసుబ్బరాయశ్రేష్ఠిగారు, చిట్టివేలు.
,, గాలా వేంకటరెడ్డిగారు, పాటూరుగ్రామమునిసిప్.

## సిద్ధవటము.

మ. రా. శ్రీ. చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లి.
,, గోపవరము గోపాలురెడ్డిగారు, గోపవరము.
,, యాదాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లె.

## రాయచోటి.

మ. రా. శ్రీ. కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.
,, రేవులూరు సిద్దయ్యశ్రేష్ఠిగారు, కస్తూరిరాజుగారిపల్లె.
,, చిన్నబయ్యన్నగారి లక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె.
,, కుర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె.
,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, సూలివేడు.
,, పుల్లగూర బాలసుబ్బయ్యదత్తుకుమారుఁడు పిచ్చయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

## అనంతపురమండలము, హిందూపురము.

మ. రా. శ్రీ. దొంతి భీమయ్యగారు.
,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు.
,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు.
,, సేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, గోరంట్ల వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.
,, ఆర్. వేంకటేశయ్యశ్రేష్ఠిగారు.
,, పి. ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు.
,, కరణము కృష్ణరావుగారు, బేవినహళ్లి.
,, శ్రీరాము తిమ్మయ్యశ్రేష్ఠిగారు.
,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు.
,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె.
,, ఈడిగి అంజనప్పగారు.
,, బి. నారాయణరావుగారు, బ్యాడిగెర, మడకశిరతాలూకా.

## గోదావరిమండలము.

మ. రా. శ్రీ. కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము.

,, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్, జమీంవారుగారు, ఏలూరు.

,, దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు, కరణం, పెద్దపట్నం.

,, బొడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు, ఏలూరు.

,, గిరెగె మాణిక్యముగారు.

,, ఏ. యస్. స్వామిగారు.

,, పెద్దిరెడ్డి రామరావుగారు, కైకవరము.

,, పి. యం. శ్రీనివాసయ్యంగారు, బిఏ. ఎంఎల్. డిస్ట్రిక్టు మునిసిప్, కాకినాడ.

## విశాఖపట్టణమండలము.

మ. రా. శ్రీ. మాడుగుల వేంకటప్పారావుగారు, జమీందారులు, బొంతలకోడూరు.

## గంజాము.

మ. రా. శ్రీ. పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము.

## చెన్నపురము.

మ. రా. శ్రీ. వి. యస్. నరసింహాచార్యులుగారు. బి. ఏ., బి. యల్.

,, కజ్జా. జోగయ్యగారు.

,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీధి.



మకుందాదాసు,

# విషయసూచిక.

శ్రీః

# శ్రీకృష్ణావతారతత్త్వము.

---

## ఏడవ ప్రకరణము.

శ్లో. బర్హోత్తంసవిలాసికుంతలభరం మాధుర్యమగ్నాననం
ప్రోన్మీలన్నవయౌవనం ప్రవిలసద్వేణుప్రణాదామృతమ్,
ఆపీనస్తనకుట్మలాభిరభితో గోపీభిరారాధితం
జ్యోతిశ్చేతసి నశ్చకాస్తి జగతామేకాభిరామాద్భుతమ్. ౧

మధురతరస్మితామృతవిముగ్ధముఖాంబురుహం
మదశిఖిపింఛలాంఛితమనోజ్ఞకచప్రచయమ్,
విషయవిషామిషగ్రసనగృధ్నుని చేతసి మే
విపులవిలోచనం కిమపి ధామ చకాస్తి చిరమ్. ౨

ముకుళాయమాననయనాంబుజం విభో
ర్మురళీనినాదమకరందనిర్భరమ్,
ముకురాయమాణమృదుగండమండలం
ముఖపంకజం మనసి మే విజృంభతామ్. ౩

౧. ఆశ్వాసము.

అభినవనవనీతస్నిగ్ధమాపీతదుగ్ధం
దధికణపరిదిగ్ధం ముగ్ధమంగం మురారేః,
దిశతు భువనకృచ్ఛ్రచ్ఛేదతాపింఛగుచ్ఛ
చ్ఛవినవశిఖిపింఛాలాంఛితం వాంఛితం నః. ౨. ఆ. ౧. శ్లో.

శ్రీకృష్ణకర్ణామృతము.

భక్తాగ్రగణ్యులారా! సత్యసంధులారా! శ్రీకృష్ణావతారతత్త్వము నాలవప్రకరణమునందుఁ బరమేశ్వరుని యద్భుతకృత్యములు దెలుపుగాథలఁ బఠించి ధన్యులైతిరి. మఱియు నాప్రకరణమున మహామునులు గోపికలై పుట్టుట, అర్జునుఁడు రాధాలోకమును దర్శించుట, అందతఁడు స్త్రీయగుట, అట్లే నారదమునియు రాధాలోకమునకుం బోయి స్త్రీయగుట యను కథలం బఠించిన మీ కిదియేమి చిత్రమాయని యచ్చెరువు మనసుల నంకురింపక పోదు. సామాన్యదృష్టిం బరికింప నీగాథలు సత్యదూరములని తోఁచు. దూరదృష్టిం బరిశీలింప నిందేమాత్రమే నసత్యములేదని స్ఫురించును. శ్రీకృష్ణుఁడే పరమాత్మయనియు, రాధాదేవియే తదిచ్ఛారూపిణి యగు మూలప్రకృతియనియు, నామహాజనని సకలబ్రహ్మాండములను భగవత్సాన్నిధ్యమున క్షణకాలమునఁ గల్పించుచుండుచున నిఁక నర్జునుని నారదుని వనితలగాఁ జేయఁజాలదా. త్రిమూర్తులను స్త్రీలను జేయఁజాలు. తద్వనితలం బురుషులం జేయఁజాలు. ఇట్టిగాథలు చదివినంతన రాధయనునదియే లేదని మొండితనమున వాదించు వారిపలుకులు విశ్వాసార్హములు గావనియు, వారు బహుగ్రంథములం బరిశీలింపని యలసులనియు, నంతియగాక భగవద్భక్తి వారిమదిఁ దిరముగ నిలువలేదనియు నెఱుంగవచ్చును. భాగవ

తమును మాత్రము పఠించి దానియందు లేనికథలు ప్రమాణములు కావనుటకన్న వెఱ్ఱితనము వేఱొండు కానరాదు కదా. కావున రాధామాధవుల మహిమము లగణ్యములనియు, దుర్జ్ఞేయము లనియు స్పష్టమగును.

మధురానగరంబున కరుగుతఱి మార్గమున బలరామకృష్ణులు యమునాజలంబుల నక్రూరునకుఁ దమరూపంబులు గనంబడంజేయుటయు, రజకాదులకు ముక్తినొసంగుటయుఁ, బూర్వభవంబునుండి నమ్మియున్న కుబ్జకు ముక్తి ననుగ్రహించుటయు లోనగుగాథ లామహానుభావుని మహిమముల వేనోళ్లఁ గొనియాడుచుండును. ప్రత్యక్షవిరోధి యగుకంసునకు ముక్తినొసంగుట భగవంతుఁడు కరుణాసముద్రుఁడని వెల్లడించుట లేదా. ఇట్టికథలం జదివియు శ్రీకృష్ణుఁడు జారచోరశిఖామణి యని నిందింపఁబూనుట వారివారి కర్మఫలమే యనుటకన్న వేఱేమన మనసొప్పకున్నయది.

నంద శ్రీకృష్ణసంవాదమును బరిశీలించినచో సకలసంశయములు తొలఁగును. ఆసంవాదమును శ్రీహరి ప్రపంచ శాంతికొఱకు నెన్నియోధర్మముల నుపదేశించెను. భోజ్యాభోజ్యవస్తువుల నిరూపించెను. తత్తత్కాలోచితాచారముల నిర్ణయించెను. ఇంతేల యెన్నియోధర్మముల నావిష్కరించి నందుని పుత్రవ్యామోహమును బోఁగొట్టెను. పుత్రవాత్సల్య మెంతవఱ కుండఁదగినదో యంతకంటె నెక్కుడుకాల మద్దానినే పట్టుకొని యూఁగులాడిన లాభము లేదనువిజ్ఞాన మానందుని మదిఁ గల్గింపనెంచియే భగవంతుఁ డాధ్యాత్మికరహస్యముల నుపదేశించెను. తాను భగవంతుఁడనని నందుని మనమునకుఁ

దోఁచుట కెన్నియెన్ని పద్ధతులు కావలయునో అన్ని విధముల నాతనికిం దెలియఁబఱచెను. దీనిచే నాత్మస్తుతి కాదా యని ప్రశ్నింపరాదు. భగవంతున కాత్మస్తుతి యెక్కడిది? ఆమహాత్ముని మహిమము లనంతములు. స్తుతియనఁగా నున్నదానిం బెంచి చెప్పుట కదా. అదియేకదా పాపమందురు. ఉన్నవానిలోఁ గోట్యంశమేని వచింపఁజాలక వేదములు మూలఁబడి మూల్గుచుండ నిఁక స్తుతియెట్లు? కావున నిట్టి కుప్రశ్నములు చేయకుండుట మంచిది.

మఱియు నందున కుపదేశించునెపమునఁ బామరజనులు తరించుపొంటె శ్రీహరి సకలవిధధర్మముల నుపదేశించెను. అవియే సకలశ్రుతిస్మృతిపురాణేతిహాసములయందుఁ బెక్కురీతులం గన్పడుచుండు. వాని నవలంబించినచోఁ ద్వరగ భగవత్కరుణకుఁ బాత్రుఁడు కాఁగలఁడనుట నిర్వివాదాంశము. ఈయుపదేశముల నడుమ చూడఁదగినపదార్థములఁ జెప్పుచు నందుఁ జతుర్థీదినమునఁ జంద్రుని దర్శింపరాదనియు, నతనికి నే శాపమిచ్చితిననియు నుపదేశించుచుఁ దారాశశాంకులచరిత్రము నించుక తెల్పెను. ఈవిషయమున నాల్గుమాటలు వ్రాయుట పునరుక్తిగాదని యూహించెదను. ఈకాలమునఁ దారాశశాంక చరిత్రము పెక్కుమార్పుల నొంది యవినీతి కుదాహరణముగ వ్రాయఁబడినది. ఈయుపదేశమునందుఁ గన్పట్టుకథ యట్టిదిగాక నీతి నుపదేశించెడిని. ఇట్టి చరిత్రములనుండి దురుద్దేశము సకలకష్టముల నిచ్చుననునీతి వెలువడియెడిని. ఇట్టి యద్భుతోపదేశము లీ యాఱవప్రకరణమునఁ గన్పట్టును.

సకలదేవతలు తానేయని భగవంతుఁడుపదేశించుచుండ నిఁక లోకమున దేవతాభేదబుద్ధి గలుగుటకుఁ గారణమేమో తెలియఁజాలకున్న వాఁడను. భగవంతునకు విరుద్ధపదార్థము లోకమున నుండఁజాలదనుట నిర్వివాదాంశము. కార్యాంతరముల కొఱకుఁ బరాత్పరుఁ డనేకరూపముల వెలయును. అం దేవి యుత్తమము? ఏది మధ్యమము? ఏయది యధమము? అని నిర్ణయింపఁబూనుట పనిలేని మంగలి పిల్లితల గొఱిగెనన్న సామెత కుదాహరణము. ఇన్ని రూపముల భగవంతుఁ డేల వెలయవలయు నను ప్రశ్నము చేయువారును గూడ నుందురు. రామరామ! ఇట్టి వారికి సమాధానము చెప్పుటకంటె నాకావిషయము తెలియద నుట యుత్తమమని నాభావము. కాని యట్టులని నోరుమూసికొని యూరకుండ వలనుపడదు. దాన లాభము లేదు. చెప్పఁబూనినను వారు బాగుపడువారు కారు కావున ఫలముకూడ లేదు. ఐనను జేతనైనంతదనుకఁ జెప్పిచూచి యప్పటికిని వారు మొండిపట్టుద లను మానకున్న నపుడూరకుండుట మంచిది. తలంచిన నింత కంటె సమంచితమార్గ మింకొకటిలేదని యెంచువాఁడ.

నిర్గుణుండగు భగవంతుఁడు ప్రపంచము సృజింపఁ దలంపుగొని సగుణుఁ డయ్యెను. అపుడు సగుణబ్రహ్మమని యా మహాత్మునకుఁ బేరుగల్గెను. అనఁగాఁ బ్రకృతివిశిష్టుఁడని భావము. నామరూపక్రియాత్మకమంతయుఁ బ్రకృతివిశిష్టమేయనుట చలింపఁబడని సిద్ధాంతము. త్రిమూర్తులు ప్రకృతివిశిష్టులన్నఁ గోపము కొందఱ కుదయించును. ఏలొకో. భగవంతుఁడే సగుణ బ్రహ్మమయినపుడు తదంశములగు నీ మూర్తిత్రయము ప్రకృతి బద్ధమనుటలో వింత యేమున్నది? వారేమో ప్రకృతిబద్ధులే

కాని వారియాత్మలు మాయాతీతము లఁట. ఏమి యిందుఁగల రహస్యము. ప్రకృతియన నేమి? అని ముందు విచారింపుఁడు. భగవదిచ్ఛయే ప్రకృతి. కావుననే ప్రకృతి కిచ్ఛాశక్తి యని పేరుగల్గెను. భగవదిచ్ఛను మీఱువా రెవ్వరు? అపరాత్పరుఁడే యనవలయు. మీఱుట యనఁగా లోకసృష్టిని జేయుటపూన్కి మానుట. అపుడా యిచ్ఛాశక్తి యేమగును. ఆ భగవంతునియందు లీనమగును. దానికి నాశము కలదా. కలదన్న భగవంతునకుఁ గలదనవలయు. ఆయనకు లేదన్న నామెకును లేదు. వారిద్దఱకు భేదము చెప్పఁబూనుట సూర్యునుండి యుష్ణమును వేఱుచేయఁ బూనినట్టిదే. కాఁబట్టి మొండిపట్టు దలనుబూని తత్త్వాన్వేషణమును మానక మతాభినివేశమున దానికి బాధగల్గింపక సర్వదేవతలయందు సమబుద్ధి నునుచుకొనుటయే భక్తునకు ముఖ్యకర్తవ్యము.

గోలోకవిషయమునఁ గొందఱ కాగ్రహము కలదు. వైకుంఠమునకన్న గోలోక ముత్కృష్టతమమని చెప్పునట్టిపురాణములు వారికిం గిట్టవు. పాపము! వారికి వైకుంఠమే ముక్తి యనునమ్మక మున్నది కాఁబోలు. నాకొక్కటి తోఁచుచున్నది. ముక్తికై యెందో యొక్కమండపమో దేవాలయమో గోపురమో నగరమో పల్లియో గ్రామమో వనమో పర్వతమో చిన్న గుడిసెయో నిర్మింపఁబడి యుండవచ్చు. ముక్తులగువారెల్ల నాచోటికిం బోవుదురు. వీరిని బిలుచుకొనిపోవఁ గింకరులు కొందఱుందురు. వారికొక్క యధిపతి. వారిపై నొకయుద్యోగి. వానిపై మఱొక్కఁడు. వీరికి వేతనములిచ్చుటకుఁ గొంతభూమి. దానిని బండించుటకుఁ గర్షకులు. వృషభములో యశ్వములో,

వానిరక్షించుటకుఁ గొందఱు. ఇట్లుకాఁగా నిదియొక పెద్దలో
కముగా నుండవలయు. ఆభూములలోఁ బండినపంట నమ్మువారు
కొందఱు.కొనువారు కొందఱు. ఇట్లుకాఁగా నిదే మర్త్యలోక
మగును. మఱియు నాముక్తిమండప మొకటి గాదు. మూఁ
డుండును. అందొకటి కదుంగడుం జిన్నది. అందుఁ జొచ్చిన
వారెల్ల నొక్కరూపముగ నుందురు. ఎందఱుపోయినను గనఁ
బడు బింబమొక్కటియే. కావున నామండపము వృద్ధిచేయ
నక్కఱలేదు. అదియే యద్వైతుల ముక్తిమండపము. దాని
కొక్కప్రక్కన దినదినము వెడలుపుగను, బొడవుగను, మార్పఁ
బడుచుండు మండప మొక్కఁడుండవచ్చు. అందుఁ జొచ్చినవా
రెల్ల నందున్నభగవంతునితో సమానరూపముల నలరుచు
నొక్కవిషయమునఁ దక్క నన్నివిషయముల సరిగా నలరా
రుచు నుందురు. రెండుపంక్తులుగా నుందురు. ఆపంక్తులనడుమ
స్థలముండవలయు. దానికే సన్నిధియని పేరు. ప్రతిదిన మది
పెద్దదిగాఁ గట్టకయున్న నందుఁ జొరఁబడువారికి స్థలముచా
లదు. అందఱకు సుఖము సమానముగా నుండఁదగుఁ గదా.
ఆమండపమే విశిష్టాద్వైతుల దగు. దానికొక్కదిక్కునఁ బ్రతి
దినము పొడవుమాత్రము వృద్ధిచేయఁబడుచుండు మండపమొ
క్కటి యుండవచ్చు. అందుఁ జొరఁబడువారెల్ల నొక్కరీతినుం
డక యుత్తమమధ్యమాధమ రూపములనుండుచు నన్గా నొక
రాంతరంగికుఁడు. వానినాశ్రయించి తమతమయోగ్యత ననుస
రించి తక్కుంగలవారుగ నుందురు. అందు వేంచేసియుండు
భగవంతుని పాదారవిందముల శిరసుననిడుకొని పావనియుండు.
తద్వారములనాశ్రయించి క్రమముగా నందఱుందురు. ఈమం

డపమే ద్వైతమతస్థుల ముక్తిస్థానము. ఈమూఁడు నుండకున్న వీలులేదు. ఇవెట్లున్నవో ఎందున్నవో మనకుఁ దెలియదుగదా.

ఈ నాయూహా యజ్ఞానజనితమే కావచ్చునని యొప్పుకొందును. కాని పైఁగల్పనలుమాత్రము నాకల్పించినవి కావు. ఇట్లున్నవని చూచివచ్చి చెప్పఁగలవారుమాత్రము లేరు. ఇట్టి స్థానములే లేవను వారును లేరు. ఏయేమతమున నమ్మకము గుదురునో ఆమతస్థాపకులు వచించినట్లు మనము ప్రవర్తించి వేదశాస్త్రములు ప్రమాణమని నమ్మి భక్తి ముక్తికి సాధనమను మాటను మఱువక పెద్దలమాటలఁ బాటించుచు దేవతాదూషణముచేసి పాపముల కొడిగట్టక శ్రుతిస్మృతిపురాణేతిహాసముల నాక్షేపింపక మతస్థాపకుల నీసడింపక వారిపాదారవిందముల సేవించుచుఁ దదుక్తప్రకారంబున భగవంతుని సేవించుట మానవులకు విధి. ముక్తివిషయ మవ్వలిది. ఇట్టులుండ నికఁ ద్రిమూర్తులలోఁ దారతమ్యములు గలవని వాదించుట మొండిపట్టుదల గాక మతేమిటిది? దాన లాభమేమి? ఏ దేమూర్తియందుఁ దనకు భక్తి కుదురునో ఆమూర్తియే పరమాత్మస్వరూపమని నమ్మి భజించిన ఫలము గలుగునుగాని దానిరూపాంతరమును దూషించిన నేమి ఫలము గలుగును? ఇంతమాత్ర మూహించినచో మతవైషమ్యముల కవకాశము గలుగదు కదా. ఈయల్పపుటూహ కవకాశము మదిని గల్పింపఁజాలనియఁనులు సాధించుపరమపురుషార్థము నాకు గోచరింపకున్నది. కాబట్టి నాయజ్ఞానమును మన్నింతురు గాక యని భక్తులను బ్రార్థించువాఁడను. సారాంశ మేమనఁగా శ్రీకృష్ణపరమాత్మను భక్తిభావమున భజించి తచ్చరిత్రము లపవిత్రములను తెలివితక్కువ

ప్రసంగములనుజేయక వానిభావములను జక్క నెఱింగినవారు కృతకృత్యులగుదు రనునదియే. కావున భక్తులారా! శ్రీకృష్ణ పరబ్రహ్మచరిత్రము నింకను బఠింప నుత్సుకుల రగుట మీా ధర్మము. చాలు నిఁకేలయని తృప్తిని బొందరాదు. ఆకథలు ప్రతిక్షణవిలక్షణములు. పూర్వపుణ్యానుసారిఫలముల నీఁజాలు నవియు నగు. వాని వినుచున్న భక్తుల కిఁకఁ జాలురా స్వామీా యనునట్టి తృప్తి జనింపదు. ఏలయన వానిని విన్నకొలఁదిని బుద్ధి పరిశుద్ధమై వైలక్షణ్యము నొందుచుండును. కావునఁ దృప్తి యేలాగు కలుగును? వినవిన నుత్సాహ మత్యధికమగు చుండును. కావునఁ దనివితీఱకుండఁజేయుటయే భగవత్కథల యందుండు గొప్పతనము. ఆగొప్పతనము తక్కుంగలకథల యందు లేదు. కావున భక్తు లింకను శ్రీకృష్ణపరమాత్మదివ్యచ రితమును వినఁగోరుచునే యుందురన్నవిశ్వాసము నాకుం గలదు.

ఇపుడు భగవంతుఁడగు శ్రీకృష్ణమూర్తి మధురానగర మున నున్నవాఁడని యాఱవప్రకరణమును బఠించినమీారెల్ల నెఱింగియే యుందురు. మధురానగర మిప్పట్టున దుష్టరాక్షస రాజవిహీనమై యున్నది. కంసాదులు మడియుట రాజకుటుంబ మున నించుక సంక్షోభమును గల్గింపక పోదు. కాని ఆక్షోభ మించుకనే వుండునదియే. ఉగ్రసేనుఁడు రాజయ్యె నన్నవార్త శ్రుతివివరములఁ జొరఁబడినంతనే తద్దేశవాసులకుఁ గల్గినయా నందమునకుఁ బారముండునని యూహింప వీలులేదు. కారణ మేమి? దుష్పరిపాలనమే యందులకు మూలకారణ మనక తప్పదు. ధర్మపరిపాలనము లేనిరాజ్యము రాజన్వంత మనఁబడదు. అందున్నప్రజలు తృప్తులుగా నుండరు. అఱచేతిలోఁ బ్రాణము

లునుచుకొని యీప్రభుత్వ మెన్నఁడు నశించునా యని యుందురు. ఈవిషయము మనుస్మృతియందు సప్తమాధ్యాయ మునందు.

శ్లో. "అరాజకేహి లోకేఽస్మిన్ సర్వతో విద్రుతే భయాత్,
రక్షార్థ మస్య సర్వస్య రాజానమసృజత్ప్రభుః. ౩
ఇంద్రానిలయమార్కాణా మగ్నేశ్చ వరుణస్య చ,
చంద్రవిత్తేశయోశ్చైవ మాత్రా నిర్హృత్య శాశ్వతీః.
యస్మాదేషాంసురేంద్రాణాంమాత్రాభ్యో నిర్మితోనృప,
తస్మాదభిభవత్యేష సర్వభూతాని తేజసా. ౫
బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః,
మహతీ దేవతాహ్యేషా నరరూపేణ తిష్ఠతి. ౮
తస్యాహు స్సంప్రణేతారం రాజానం సత్యవాదినం,
సమీక్ష్యకారిణం ప్రాజ్ఞం ధర్మకామార్థకోవిదం." ౯

అని చెప్పఁబడినది. రాజు దిక్పాలకాంశ జనితుఁ డనియుఁ, గావు ననే తన తేజోవిశేషమున సర్వభూతములఁ దిరస్కరింపఁజాలు ననియు, బాలుఁడైనను రాజు మనుష్యమాత్రుఁడని తలంపఁదగఁ డనియు. నరరూపమునుదాల్చిన మహత్తరదేవతయనియు మను వుతాత్పర్యము. అట్టిరాజు లేకయున్న నారాజ్యము మహార ణ్యమువంటి దనక తప్పదు గదా. అట్టి దుష్టరాజపరిపాలనము నుండి తొలఁగితిమన్న యానందము కలిగినది. నగరమంతయు హృష్టపుష్టజనాకులమై యున్నది. భగవంతునిమహిమము నెల్ల రెఱుంగఁజాలిరి. నందాదుల కున్నయజ్ఞానము తొలఁగుటకే శ్రీహరి ధర్మోపదేశ మొనరింపఁ బూనెను. ఇట్లున్న మధురానగ రమున ననంతరవార్త లెట్టివని యీయేడవప్రకరణమునఁ జదు.

వఁగలరు. ఇంతదనుక శ్రీహరి బాలుఁడనియే యంద ఱూహించు చుండిరి. కంసవధానంతరము భగవంతుఁడని యందఱకుఁ దెల్ల మాయెను. కావున నిఁకముందు కథ విచిత్రముగా నుండును. కాఁబట్టి భక్తులారా! తత్కథాపఠనసమాదృతిం గాంచుఁడు. అవియే పురుషార్థచతుష్టయ మనఁబడు ధర్మార్థకామమోక్ష ముల నొడఁగూర్చును. భగవత్సేవకు ద్రవ్య మక్కఱలేదు. దేహాయాసము ననుభవింప నక్కఱలేదు. తీర్థయాత్రలు సా గించి క్లేశములొంద నవసరము లేదు. బుద్ధిని సమాహితము గానొనరించి నియతినూని యించుకసేపు భగవద్రూపమును మనఃపద్మమున నునిచి ధ్యానించినఁ జాలు. అప్పటియానందము నకు మేఱలేదు. దానికిసాటియని చెప్పఁదగునానంద మింకొ క్కటి కానరాదనుట సిద్ధాంతము. కావునే

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్."

అని శ్రుతి చెప్పినది. ధ్యానము సామాన్యమా యన్నఁ గాదనవచ్చును. మనోనిగ్రహమునఁ గాని యది కుదురదు. అనేక సత్కార్యానుష్ఠానమునఁగాని మనోనిగ్రహము కానేరదు. ఇవి రెండును బరస్పరాశ్రయమున నున్నవి. సత్కార్యానుష్ఠాన మొనరించునూహ పుణ్యవశమునఁగాని కుదురదు. ఆపుణ్యము సాధుజనసహవాసలాభమునఁగాని యలవడదు. నిశ్రేణికాన్యా యము ననుసరించి యివియన్నియు సాధింపఁదగి యొకదాని వేఱొకటి యాశ్రయించియుండుననుట నిక్కము. కాఁబట్టియే.

శ్లో. "న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునంత్యురుకాలేన దర్శనా దేవ సాధవః."

అని మహాభారతము శాసించుచున్నది. సాధుసంగతి చేకూరుట

కన్నఁ దరణోపాయము వేఱొకటి గానరాకున్నది. ఈకాలమున సాధువుల సేవింతమన్న నతికష్టము. కపటవేషము లూని పరవంచనాదృతి గాంచుచు ద్రవ్యాకర్షణ మహాకార్యపరాయణులగు పెద్దలనేకులు పుట్టగొడుగులవలెఁ గృమిసముదాయమట్లు నిండియున్నవారు. వృత్తిశూన్యులైయున్న వీరినాశ్రయించి లాభమేమి? కాన నీమార్గము సుగమముగా లేదు. మార్గాంతర మావశ్యకమై యున్నది. అదేది? భగవత్సేవ. తత్కథా శ్రవణపఠనములు. ఈమార్గమే యీకాలమునఁ దగియున్నది. కాని మనస్సు పరిపక్వము గాకయున్న సంపూర్ణఫలము గలుగదు. మనస్సు పరిపక్వము కావలయునన్న యోగాభ్యాస మావశ్యకము. కొందఱలసులు యోగశాస్త్రము వ్యర్థమందురు. దానిమాన మానసము నిగ్రహింప మార్గాంతరము కానరాదు. ఇది నిక్కము. కాన యథాశక్తియను నానుడి ననుసరించి యోగ మభ్యసింపవలయు.

సూ. "యోగశ్చిత్తవృత్తినిరోధః. ౨.
తదా ద్రష్టుస్స్వరూపేఽవస్థానమ్. 3.
వృత్తిసారూప్యమితరత్ర. ౪."

అను పాతంజలయోగసూత్రములనుండి పైవిషయము సిద్ధాంతమని కనుఁగొనవచ్చును. చిత్తవృత్తుల నరికట్టుటకు యోగము నభ్యసింపక తప్పదు. ఎన్నిమాటలు చెప్పినను లాభము లేదు. వృథాకాలహరణమే యామాటలకుఁ బ్రతిఫల మనవలసి వచ్చును.

శ్లో. "యం సన్న్యాసమితిప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ,
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన. ౨

యదా హి చేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే,
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే. ౪
తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి విశేషతః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున." ౪౬

భగవద్గీత. ౬ అధ్యాయము.

ఈ పైనుదాహృతములగు శ్రీ భగవద్గీతావాక్యములుకూడఁ బైసిద్ధాంతమునే సత్యమని చాటుచున్నవి. కావునఁ బుణ్యపురుషులారా! ఇంచుక సమాధిచిత్తమున నెలకొల్పి శ్రీహరిని భజించినచోఁ గలుగుఫలము సంపూర్ణముగా లభించును. లేనిచో యథాశక్తి న్యాయమే. ఇంతట నీవిషయమును వదలి ప్రకృతప్రసంగమునకు వచ్చెదను.

ఈ యేడవప్రకరణమందు భగవంతుఁడు నందునకు సంశయబీజమే లేకయుండఁజేయు నుద్దేశముతో ననేకవిధముల బోధించును. దాన నందనుఁ డన్నభ్రాంతిని సంపూర్ణముఁగా వదలి నందుఁడు పరాత్పరుఁడే శ్రీహరి యన్నభావమును మది నలవరించుకొని కృతకృత్యుఁ డగును. మఱియు నీ ప్రకరణమున శ్రీకృష్ణపరబ్రహ్మము తనయవతారమునకు ఫలముగా ననేక విచిత్రకార్యముల నొనరించి భూభారము నడంచునన్న విషయము లుండును. కాఁబట్టి యేలాటిశంకలకు మనసునఁ జోటీయక తదేకాగ్రచిత్తమున దీనిం బఠింపుఁడు. అపుడే శ్రీకృష్ణచరిత్ర మెట్టిదో బోధపడును. పరమపవిత్రచరిత్రసుధారసము గ్రోలనుంకించు భక్తులకుఁగాక తదితరుల కీకథ యెట్లు రుచించును? ఇఁకఁ గథ నాలకింపుఁడు.

## శ్రీకృష్ణసనత్కుమారసంవాదము.

ఇట్లు శ్రీకృష్ణుఁడు పలికిన కేదారకన్యకాచరిత్రమును విని నందుఁ డాశ్చర్యరసనిమగ్నుఁడై మహాత్మా! శ్రీకృష్ణా! నిన్నుఁ దెలిసికొనుటకు శక్తులగువారు లేరు. వేదములుకూడ నీతత్త్వ మెఱుంగఁజాలవు. బ్రహ్మాదులే శక్తులు గారన నింకఁ దక్కినవారిమాట యిట నేటికి? నీవెవఁడవని యెఱుంగవలయు నన్న వాంఛ నాకుం గలదు? స్వాత్మయాథార్థ్యమును నిర్జన మగు నీస్థలమునఁ జెప్పుము. దీనిం దెలిసికొనవలయునన్న కుతూహలము నన్నుఁ ద్వరపెట్టుచున్నది. శ్రీకృష్ణా! నీ వెవఁడవు? తత్త్వమంతయుం దెల్పి నన్ను సఫలితాంతరంగకరణునిగాఁ జేయుము. అని ప్రశ్నింప నారాయణుం డిట్లని బదులుచెప్పఁ బూనునంతలోఁ దదిచ్ఛవలన నెచ్చటినుండియో శ్రీకృష్ణపరమాత్మనుజూచుటకు మునీశ్వరు లరుదెంచిరి. వారిముఖములనుండి బ్రహ్మతేజము వెడలుచుండెను. పులస్త్య పులహ క్రతుభృగ్వంగిరః ప్రచేతో వసిష్ఠ దుర్వాసః కణ్వ కాత్యాయన పాణిని కణాద గౌతమ సనక సనంద సనాతన కపిలాసురి వాయు పంచశిఖ విశ్వామిత్ర వాల్మీకి కశ్యప పరాశర విభాండక మరీచి. శుక్రాత్రి బృహస్పతి గార్గ్య వాత్స్య వ్యాస జైమిని మితవాగ్రుష్యశృంగ యాజ్ఞవల్క్య శుక సౌభరి శుద్ధజటిల భరద్వాజ సుభద్రక మార్కండేయ లోమశ విటంకణాష్టావక్ర శతానంద వామదేవ భాగురి సంవర్తోతథ్యనరనారద జాబాలి పరశురా మాగస్త్య పైల యుధామన్యు గౌరముఖో పమన్యు

---

* ఈ విషయము శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదియేడవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని తెలియవలయును.

శ్రుతశ్రవో మైత్రేయ చ్యవన ప్రభృతులగు మహర్షులు రాఁగా వారింగాంచి శీఘ్రంబ లేచి నమస్కరించి చేతులుజోడించి యుచితాసనములం గూర్చుండఁ బ్రార్థించి వా రుపవిష్టులు కాఁగా విధివిధానమునఁ బూజించి కుశలప్రశ్న మొనరించి పిదప శ్రీకృష్ణుఁడు వారినడుమం గూరుచుండెను. నందుఁడును వారికి నమస్కరించి తాను నొకచోఁ గూరుచుండెను. అంతలో నాకసమునందు సముజ్జ్వలించుచున్న తేజోరాశిని శ్రీకృష్ణుఁడు కాంచెను. మునులందఱును దానిం గాంచిరి. ఆతేజస్సునడుమఁ గనకచ్ఛాయగలదేహ మలరారఁ బంచవర్షీయుఁడై దిగంబరుఁడై యొకకుమారుఁడుండెను. ఆతేజోరాశి సభామధ్యమునకు వచ్చెను. ఆకుమారుఁడు లేచుచుండ నామునులందఱును జూచిరి. మును లతిభక్తి నాతనికి నమస్కరించిరి. శ్రీకృష్ణమూర్తియు నమస్కరించెను. ఆకుమారుఁ డత్తఱిఁ జిఱునవ్వువాలయు ముఖము స్నిగ్ధనేత్రములు గలిగి యాదరమును జూప నెంచుచున్నట్లుండెను. ఆకుమారుఁడు వారికందఱికి నాశీర్వచనము లొసఁగి వారందఱు వినుచుండ శౌరియు నాలకించుచుండ నిట్లు పలికెను. ఆకుమారుఁడు సనత్కుమారుఁడని యెఱుంగవలయును.

మునులారా! మీకు మేలుగలుగుఁ గాక. మీతపఃఫలము ప్రశంసనార్హము. శ్రీకృష్ణునిం గుశలప్రశ్నమున నాదరించుట నిరర్థకము. ఏలన నీకృష్ణుఁడె మంగళమూలకారణము. మీకెల్లఁ గుశలముకదా! పరమాత్మదర్శన మయ్యెను. ప్రకృతికంటెఁ బరుఁడైనను భక్తానుగ్రహార్థము దేహమును దాల్చిన యీనిర్గుణునకు, నిరీహునకు, సర్వబీజభూతునకుఁ గుశలములు గాక మఱేమిగలుగును. భూభారావతరణార్థ మీమహేశ్వరుఁ

డవతరించెను. అని సనత్కుమారుఁడు పలుక విని శ్రీహరి యిట్లు ప్రశ్నించెను. మునీశ్వరా! శరీరధారుల కెల్లఁ గుశలప్రశ్న మీాప్సితమే. అట్టులుండ నాయందుఁ గుశలప్రశ్న మేల వ్యర్థమగును? నావిని సనత్కుమారుం డిట్టులనియె. ప్రాకృతశరీరమునందుఁ గుశలప్రశ్నము ఫలప్రదమగును. నిత్యదేహమై క్షేమబీజమగు పరమాత్మయందుఁ గుశలప్రశ్నము వ్యర్థమే యగును. అన విని శ్రీకృష్ణుం డిట్టు లనియెను. విగ్రహధారి యెవ్వఁడగునో వాఁడు ప్రాకృతికుఁడే యగును. నిత్యయగు ప్రకృతి విడిచినదేహమే లేదు. అని హరి పల్క సనత్కుమారుం డిట్టులనియెను.

దేహములు రక్తబిందూద్భవములు. అవియే ప్రాకృతికములని చెప్పంబడును. ప్రకృతినాథునకుఁ బ్రకృతిబీజునకుఁ బ్రాకృతశరీర మెట్లు వచ్చును? నీవు సర్వప్రాణిబీజరూపుఁడవు. సర్వాదివి. భగవంతుఁడవు. సర్వావతార మూలకారణ భూతుఁడవు. అవ్యయుఁడవు. సనాతనుఁడవై నిత్యరూపుఁడవగు నిన్నుం గాంచి వేదములు ఘోషించుచున్నవి. నిన్ను జ్యోతిస్స్వరూపునిగా, పరమాత్మునుగా, నీశ్వరునిగా, మాయచే గుణవంతునిగా మాయేశునిగా నిర్గుణునిగా వేదాంగములు వేదవేత్తలును ఘోషించుచున్నారు. అని సనత్కుమారుఁడు పలుక శ్రీకృష్ణమూర్తి యిట్లు పలికెను. నే నిపుడు వాసుదేవుఁడను. రక్తవీర్యాశ్రితమగు వపువు ధరించితిని. కానఁ బ్రాకృతుఁడనే. కానఁ గుశలప్రశ్నము చేయవలసినదే. వాసుశబ్దము సర్వనివాస మనుభావమును దెలుపును. ఎవ్వని రోమకూపముల యందు విశ్వములుండునో ఆతని దేహము పరబ్రహ్మము. కావున

వాసుదేవుఁ డనుపేరు కలిగినది. వాసుదేవనామము చతుర్వే దప్రతిపాదితము. పురాణములయందు, నితిహాసములయందును గనఁబడును. రక్తవీర్యాశ్రితదేహము వేదమునం దెచ్చట నిర్ణ యింపఁబడినది. మును లిందులకు సాక్షులు. ధర్మము సర్వవ్యా పకము గాన నదియు సాక్షి. నా యీమాటకు వేదములు సాక్షులు. రవియుఁ జంద్రుఁడును సాక్షులు. అన విని భృగుమ హర్షి యిట్లు పలికెను. విప్రోత్తమా! సత్యము వచించితివి. నీవే వైష్ణవాగ్రణివి. నీకు స్వాగతము. ఏకార్యమును సాధింప నిచ్చటికి వచ్చితివి? అని ప్రశ్నింప విని సనత్కుమారుం డిట్లు లనియె.

మునులారా! ఆలకింపుఁడు. శ్రీకృష్ణా! చిత్తగింపుము. నే నేనిమిత్తమునఁ ద్వరపడి యిచ్చటికి వచ్చితినో వచించెదను. అనునంతలో శ్రీకృష్ణుఁ డాతని కిట్లనియెను. భగవంతా! సర్వ ధర్మజ్ఞా! ఏల వచ్చితివి? నీవు సర్వజ్ఞుఁడవు. సర్వ మెఱుంగు దువు. విద్వద్వరుఁడవనఁగా నీవే. అని భగవంతుఁడు ప్రశ్నింప సనత్కుమారుం డిట్లు బదులుచెప్పెను. భగవంతుఁడా! ధన్యుఁ డవైతివి. జగత్తులలో మాన్యుఁడవైతివి. సర్వేశ్వరుఁడవైతివి. ప్రపంచమున నీకంటె నధికుఁడు లేఁడు. అన శ్రీహరి యిట్లు ప్రశ్నించెను. ద్విజప్రవరా! యజ్ఞములకు వ్రతములకుఁ, దప స్సులకును సదా ఫలప్రదాతను నేనే. అనువాక్యమును విని సనత్కుమారుఁడు త్వరగా నాకాశమునఁ బోవనుంకించెను. ఆమునులందఱు నాతని నిలిపి యిట్లు ప్రార్థించిరి.

సిద్ధేంద్రుఁడా! మహాభాగా! కుమారకా! కరుణానిధీ! శ్రీకృష్ణసన్నిధియందే శంకితకథ చెప్పఁబడినది.? ఏమియాశ్చ

ర్యము చూడఁబడినది? ఏమిచిత్రవాక్కు వినఁబడినది? నీ వను భవించిన యానందమంతయు వ్యాఖ్యానరూపముగా మాకు వచింపుము. అనునంతలో సత్యలోకమునుండి బ్రహ్మయుఁ గైలాసమునుండి పార్వతీపరమేశ్వరులును, అనంత ధర్ములు, సూర్యనిశాకరులు, ఆదిత్యులు, వసువులు, రుద్రులు దిక్పాల కులు, తక్కుంగలదేవత లరుదెంచి శ్రీకృష్ణమూర్తిని సగౌరవ ముగా సత్కరించి మధుపర్కాదికము లొసంగి పూజించిరి. భక్తి మై మహర్షులు వలగొనిరి. శంకరవిరించులకును మును లభివందన ములాచరించిరి. మునులకు సురలకుఁ బరస్పరసంభాషణము జర గెను. సనత్కుమారుఁడు బంగరుచాయగల మేనికాంతి యల రార సభామధ్యభాగమున నుండెను. అప్పు డాసనత్కుమా రుఁడు మునులకు సమాధానము చెప్పఁబూని యిట్లుపలికెను.

మునులారా! నేనింతకుముందే గోలోకమునకుం బోయి తిని. అందు రాధానాథుఁడు గానరాలేదు. వైకుంఠమున కరిగితిని. అందుఁ జతుర్భుజుఁడు కానరాఁ డయ్యెను. అవ్వల క్షీరవారాశి కేగితి. అందు శ్రీహరి లేఁడు. ఆయాసపడి విషణ్ణుఁడనై క్షీరాంభోధియందు స్నానమొనరించి యుండఁగా విశాల వాలుకాభూభాగమున శతయోజన కచ్ఛపమొండు కానవచ్చెను. భీతినందితి. గాత్రము కంపించెను. దుఃఖించితి. కృశించితిని. అది మహాత్ముఁడగు రాఘవుఁడను మీనముచే నిస్సారితమయ్యెను. ధన్యుఁడవని పొగడితిని. నేను ధన్యుఁడను గానని యతఁడు పలికెను. మఱియు క్షీరోదమందలి జంతువు లన్నియు మృద్విధములు. కావున నీసాగరము ధన్యమంటిని. మహామునీ! నాకంటె మహత్తరములగు నసంఖ్యజంతువు

లించుఁగలవు. పాలసంద్రమా! నీవు ధన్యుఁడవని యతఁడు దానిం బొగడెను. నేను గానని యదిపలికెను. వసుంధరాదేవి ధన్యయగు. దానియందే సప్తసాగరము లున్నవి. వసుంధరా దేవీ! ధన్యవు నీవేయన నేనుగానని యదియనెను. సర్వాధా రుఁడగు ననంతుఁడు ధన్యుఁడు. కృష్ణాంశజనితుఁడు. నాగనాయ కుఁడు. సహస్రశీర్షుఁడు. శేషుఁడా ధన్యుఁడవు నీవు అన నేను గానని యతఁడు పలికెను. నాకు నాధారమగు కూర్మము ధన్య ము. దానిచెంతకుఁ బొమ్ము. ఓ కూర్మరాజమా! ధన్యమవు. అన నేనుగానని యదివచించెను. నేను వాయువుచే ధరింపఁబడి తిని. నాకంటె వాయువు ధన్యతమము. అనవిని నేను ధన్యుఁడను గానని వాయువనియె. భగవంతుఁడగు విధాత ధన్యుఁడు. జగ త్స్రష్టిగదా. కావున నో బ్రహ్మదేవా! నీవే ధన్యుఁడవన నేను ధన్యుఁడను గానని యతఁడనియె. మహేశ్వరుఁడు ధన్యుఁడు. యోగీంద్రులకుఁ బరమగురుఁడు. సర్వారాధ్యుఁడు. సర్వపూ జ్యుఁడు. కాలకాలుఁడు. సంహర్త. మృత్యుంజయుఁడు. ప్రభువు. కావున మహాదేవుఁడు ధన్యుఁడు. అనవిని శంభుఁడు నేను ధన్యుఁడను గాననియెను.

అందఱికంటె ముందుగాఁ బూజలంగొను సుజ్ఞానులలో వర్యుఁడై గురువులకు గురువునగు గణేశుఁడు ధన్యుఁడు. దేవో త్తముఁడు. సిద్ధముని దేవేంద్రుఁడని శ్రుతులు ఘోషించు చున్నవి. కాన నతఁ డుత్తముఁడగుననియె. నదులయందు గంగా నదియుఁ దీర్థములయందుఁ బుష్కరతీర్థ మెట్లుత్తమములో యట్లే యతఁడుత్తముఁడు. వేదప్రణిహితము ధర్మము. తద్వి పర్యయ మధర్మము. వేదము సాక్షాన్నారాయణ స్వరూపమనం

బడు. కావున శాస్త్రములన్నియుఁ బురాణసంతతులు ధర్మము ను గొనియాడుచుండును. ఇతిహాసములు నా ధర్మమునే పొగ డుచుండును. సంహితలును దానినే నుతించును. కావున వేద ములు ధన్యములని మహాత్ములు చెప్పుదురు. కావున వేదములు లోనగునవి ధన్యములనియంటిని. ఆమాటలువిని యావేదప్ర ముఖములు మేము ధన్యములనఁ దగము. యజ్ఞము ధన్యము. ఏలన మేము వ్యవస్థచేయువారము. యజ్ఞము ఫలప్రదము. కావున యజ్ఞము ధన్యము. యజ్ఞములకడకుం బోవ్మన నేను నోయజ్ఞసంఘమా! నీవే ధన్యమనం దగుదువంటిని. ఆమాట విని యజ్ఞములు మేము ధన్యములముగాము. మాకంటె శుభ కర్మమెక్కుడు. కాన నదిధన్యమనియె. నేను శుభకర్మమా! నీవు ధన్యమనం దగుదువన నేను గాదనియె. కర్మములకు ఫల దాత యెవఁడో కర్మహేతు వెవ్వఁడో సర్వకర్త యెవ్వఁడో అట్టి పరమాత్మ శ్రీకృష్ణుఁడు ధన్యుఁడు. మాన్యుఁడు. ఇది నిశ్చయము.

అనవిని ధర్మాలయమునకుం బోతిని. అందు జగన్నాయ కుఁడు కనఁబడఁడయ్యె. అటనుండి మధురాపురమున కరుదెంచి తిని. పరిపూర్ణతముఁడు, ప్రభువునగు పరమేశ్వరుఁ డందుండు నని తలంచితిని. యజ్ఞములకుఁ దపములకు వ్రతములకు శుభ కర్మములకు నీశ్వరుఁడు ఫలదాతయుఁ బరమాత్మయుఁ, గారణ కారణము, బ్రహ్మాదులకు బురస్సరుఁడు నగు శ్రీకృష్ణునిటం జూచి ధన్యుఁడవంటిని. దక్షిణలతోఁగూడ ధన్యుఁడననియె. యజ్ఞము దక్షిణాహీనమైన నిష్ఫలము. విప్రునుద్దేశించిన దాన మీయక యొక్కరాత్రి గడపెనేని యాదానము ద్విగుణము

చేయవలయును. ఒక్కనెలగడపిన శతగుణముగా దానినీవల యు. రెండునెలలు గడపిన వేయి యింతలుగా నీవలయును సంవత్సర మతిక్రమింపఁగా దాతకు నరకము గలుగును. అని సనత్కుమారుఁడుపలుక దేవతలు మును లాశ్చర్యపరవశులైరి. నందుఁడు విస్మయ మంకురింపఁగా శ్రీకృష్ణునియందుఁ బుత్ర భావమును వదలెను. సభామధ్యమునందు విలపించెను. లజ్జ నెడఁబాసెను. దుఃఖాకులమతి యయ్యెను.

ఆ నందునింగాంచి పార్వతీదేవి రాజా! మోహామును వదలుము. వదలుము. అని చక్కఁగా బోధించెను. అమూల్యర త్నమనఁబడు మాణిక్యము కుజన్మగలవానియింటిలోఁ బ్రకా శింపదో అట్లే నీవు నాయింట జనించితివి. నేను నిన్నెఱుంగక మోసపోయితి. నాయపరాధమును క్షమింపుము. ప్రకృత్యతీతా! పరమేశ్వరా! మరల నింటికిం బోనొల్లను. గోకులము యము నాతటము నాకానందము నీఁజాలవు. బృందావనము అందలి నా నివాసము, క్రీడావాసము నను నవియెల్ల యశోదకునగుం గాక. ఇపు డొక్కసారిమాత్రముపోయి నీయాజ్ఞం దెలిపెదః యశోదకు రాధికకు నింకనుం గలవారికి నేమని తెలుపమం దువు. అనిపలికి సభామధ్యభాగమున మూర్ఛనొందెను. నందు నెత్తుకొని శ్రీహరి బోధించెను. మూర్ఛనుండి స్మృతిగలుగఁ జేసెను.

ఆర్యులారా! ఈగాథ మిగుల విచిత్రమైనది. తొలు దొలుత నేదోకల్పితమని తోఁచును. విమర్శించి చూచిన నీవిషయమును గల్పించుటయం దెంతో రహస్యార్థముకల దని విస్పష్టమగును. ఆవిషయముల నించుక యవధరింపుఁడు.

శ్రీకృష్ణమూర్తి యెంత యుపదేశించుచున్నను నందుని మన స్సునం దాత్మజుండన్న భావము తుదముట్ట నశింపకుండెను. ఒకయద్భుతకథను నడపించినం గాని యీసంశయ మీతని డెందమునుండి వేఱొకతావునకుఁబోదని హరి తలంచెను. కా వుననే తనమనస్సున సంకల్పించెను. భగవత్సంకల్పము సకల బ్రహ్మాండముల క్షణకాలమున నలవరించునన నింక నిదేటి పని? అంతలో మహర్షులెల్ల విచ్చేసిరి. వారి నర్చించి శ్రీహరి కూరుచుండి యుండునంతలో నొక తేజోరాశియు దాని నడుమ నొకకుమారుఁడు నతఁ డైదువత్సరముల యీడు గలవాఁడయి యుండునట్లును దోఁచెను. ఆతఁడే సనత్కుమా రుఁడు. ఆతఁడు రాఁగా నందఱుమునులు నమస్కరించిరి. హరి యు మానవధర్మము ననుసరించియు లోకోపదేశముకొఱకును దాను నమస్కరించెను. ఇంతలో శంకరాదు లరుదెంచిరి. వా రెల్ల వినుచుండఁగా సనత్కుమారునకు శ్రీకృష్ణునకు నించుక సంవాదముసాగెను. అంత నాకుమారుఁడు తనసంశయము వా య నరుగుచుండఁగా మునులు నిలిపిరి. మీసంభాషణము సార మేమో తెలుపుఁడని కోరిరి.సనత్కుమారుఁడు గోలోకము మొ దలు సకలలోకములు తిరిగితిననియు శ్రీకృష్ణుఁ డగపడకపోయె ననియు మహాత్ములనుజూచి మీరు ధన్యులరన వారు మేము ధన్యులముగామని పలికిరనియుఁ దెలిపి భగవంతుఁడగు శ్రీకృ ష్ణుఁడే ధన్యుఁడని తెల్పిరనియు నిచ్చటికిరాఁగా భగవంతుఁడు కనఁబడెననియు నా సనత్కుమారుఁడు తెలిపెను. మునులచ్చె రువందిరి. ఈ సంవాదమును వినుచున్న నందుఁడు తనమదిని శ్రీకృష్ణుఁడు తనకుమారుఁడని తలంచియున్న యూహతప్ప

నియు, నీతఁడు లోకారాధ్యుఁడగు భగవంతుఁడనియు, భూభారహరణార్థము తనకుఁ గుమారుఁడుగా నొకప్రీతినిబుట్టించి తనయింటఁ బెరిఁగెననియుఁ దలంచెను. ఈసంవాదమున నిందఱు మహర్షులు బ్రహ్మయు మహేశ్వరుఁడును వినుచుండ సనత్కుమారుఁ డీ సంవాదరూపముగా నీరహస్య విషయమును దెలుపుటచే నందుని మదిఁగల సందియములు వీడెను. పరమానంద భరితుఁడై తా నిదివఱ కూహించినది యజ్ఞానముచేతనే యనియు భగవంతు నింతకాలము తెలిసికొనలేక పోతిని గదా యనియు నాలోచించి తనకుఁ గర్వము వీడి లజ్జితుఁడై భగవంతునిజూచి నాయపరాధములు క్షమింపుమా యని ప్రార్థించెను. ఇంతటి యజ్ఞానుఁడనైతినిగదా యని మూర్ఛిల్లెను. భగవంతుఁ డీతనియజ్ఞానము తొలఁగెఁగదా యని భావించి మూర్ఛనుండి స్మృతిగల్గఁ జేసెను.

ఒక్క క్షణమాత్రమున నిందఱువచ్చుట యచ్చెరువు గదా. స్మరించినమాత్రమున నిందఱికిచ్చుటికి రావలయునన్న యూహ యెట్లు కలుగునన్న సందియము కొందఱకుఁ గలుగవచ్చును. సమాధానము. సామాన్యమానవుని సంకల్పము ఫలవంతము కాఁజాలదు. శ్రీకృష్ణమూర్తి పరమపురుషుఁడు. గోలోకవాసి. పరాత్పరుఁడు. కాఁబట్టి భగవత్సంకల్ప మప్రతిహతము. ఏలయన నతఁడు సర్వాంతర్యామి. మన దేహమున నేయవయవమున కిసుమంతబాధకల్గినను మనస్సునకెట్లు తెలియునో యట్లే సర్వాంతర్యామియగు భగవంతుని యూహ యేకక్షణమున సకల బ్రహ్మాండములయందును వ్యాపించును. మన మనస్సు సర్వేంద్రియములను వ్యాపించియున్న యట్లే భగవంతుఁ

డా బ్రహ్మస్తంభపర్యంతము వ్యాపించియుండుటచే నామహాత్మునితలఁపు సకలజీవరాసుల కొక్కపర్యాయము తెలియఁగలదు. భగవంతుఁడు సర్వాంతర్యామియని యంగీకరింపనివారి కీసమాధానము పనికిరాదు. ఈ సమాధానమే కాదు. మఱే సమాధానము కూడ వారికిం బనికిరాదు. కాని తక్కినవారి కెల్లరకుఁ బనికివచ్చును. కావున లేనిపోనిశంకలకు మదిని జోటీయక భగవంతుఁడు సర్వవ్యాపకుఁడనియు, సర్వశక్తుఁడనియు నఘటనాఘటన సమర్థుఁడనియు నిశ్చయించి యామహాత్ముని భక్తిభావమున భజించవలయును. అదియే కలికాలమునఁ జేయవలసినపని. దానిని బాధించుశంకల కవకాశ మీయక యుండుటయే మనవిధి. ఇంక నీవిషయము వదలి తరువాతివృత్తాంతమును దెలిపెదను.

## శ్రీకృష్ణమూర్తి నందునకు దుర్గాస్తోత్రరాజము నుపదేశించుట.

సభామండపమున మూర్ఛిల్లి మరల స్మృతిగలిగిన నందునింగాంచి శ్రీకృష్ణమూర్తి తండ్రీ ! ధైర్యము తెచ్చుకొనుము. విస్మృతిం బొందకుము. సచరాచరంబగు నీ సంసారము జలబుద్బుదప్రాయము. ఈ విషయమును దృఢముగా మది నిలుపుము. మోహమును బరిత్యజింపుము. పరాత్పరాహ్వాయమున నలరు మాయాంబను వినుతింపుము. ఆయమ బ్రహ్మస్వరూప. పరమస్వరూపిణి. సర్వమోహనికృంతని. ముక్తిప్రదాయిని. మహాభాగ. సనాతని విష్ణుమాయ యనంబడు పరదేవిని భజింపుము. పూర్వము త్రిపురాసురులు భయంకరాకారులై లోకా

* ఈకథయు శ్రీకృష్ణజన్మఖండము ఎనుబదియెనిమిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపవలయును.

పకారము సదా చేయుచుండ వారిని వధించుపొంటెఁ బరమే శ్వరుఁడు యుద్ధముచేయఁబోఁగా నా సంగ్రామ మత్యంతభయం కరాకృతిం దాల్చెను. ఈశ్వరుఁ డా భయానక సంగ్రామము నందు భగవతి నారాధించి వినుతించి యశ్రమంబున వారిని జయించెను. ఆస్తోత్రరాజమును నీ కనుగ్రహించెదను. అది సర్వమోహపాశములఁ ద్రెంపఁగలదు. అంతియకాక సర్వవాం ఛాప్రదము. నందా! శ్రద్ధాయోగమూని దాని నాలకింపుము. ఈ సభ్యులుకూడ విందురు గాక. అనవిని నందుఁ డిట్లు ప్రశ్నించెను.

శ్రీకృష్ణా! సర్వవిఘ్నములు తొలఁగుట సర్వదుఃఖములు నశించుట యను నీ రెండు ఫలములు కలుగుటకును సంపద్య శస్సులు లభించుటకును, మనుజుల వాంఛితములు సిద్ధించుట కును జగదంబయు మహాదేవియునగు విష్ణుమాయకుఁ బ్రీతిని జనింపఁజేయుస్తోత్రరాజము నోజగత్ప్రభూ! యుపదేశింపుము. దుర్గతినాశని యంబయని విందును. ఆయంబస్తోత్రరాజము సుదు ర్లభము. వినీతుఁడనై భక్తుఁడనగు నాకు దానిని భక్తవత్సలుఁ డవు గాన దెలుపుము. నీవు వేదజనకుఁడవు. నిర్గుణుండవు. పరాత్పరుండవు. కాన నాకు దాని నుపదేశింపఁ దగుదువు. అని ప్రశ్నించి వినఁ గుతూహలుఁడై యుండుటెఱింగి శ్రీభగవంతుఁ డి ట్లనియెను. * వైశ్యేంద్రా! నందా! మోహపాశముల నా మూలము త్రెంచుటకై విఘ్నములు బాధింపకుండుటకై

* శృణువక్ష్యామి వైశ్యేంద్ర స్తోత్రయత్పరమాద్భుతమ్. అని మూలము. నందుఁడు క్షత్రియుఁడు కాన వైశ్యాదిజాతుల కధిపతియని వైశ్యేంద్రయను పదమున కర్థమును గ్రహించుట సరసమని నాకుందోఁచెను.

దానిం జెప్పెద. యుద్ధరంగమున భీతుఁడైన శంకరుఁ డీ స్తోత్ర రాజమునఁ గృతార్థుఁడయ్యెను. ఆతనికి నారాయణమూర్తి యుపదేశించెను. దీని నుపదేశింప నిదియె సుసమయమని యానారాయణమూర్తిని బ్రహ్మ పురికొలిపెను. అత్తఱి శంకరుఁడు శత్రుగ్రస్తుఁడు. రథమునఁ బడియుండెను. కావున ఘోరసంకట శాంత్యర్థము దుర్గతినాశినియగు దుర్గను మూలప్రకృతిని ఈశ్వరిని శివునకు మేలుచేకూర్ప నుతింపుమాయని నారాయణమూర్తి బ్రహ్మను హెచ్చరించెను. ఆ బ్రహ్మాయు శంకరుచెంతకుం బోయి శంభూ మహాదేవా శక్తిసహాయములేక యెవ్వఁడైన నెవ్వనిని జయింపఁజాలఁడు. కావున నీ వీ స్తోత్రరాజమున శక్తిని బ్రీతాత్మురాలగునట్లు చేయుము. ఇది శ్రీమన్నారాయణమూర్తి యుపదేశించినది. అని పలుక నప్పుడే స్మృతిగల శంకరుఁడు బ్రహ్మోపదేశప్రకారము దుర్గను స్మరించెను. కరయుగమును జోడించి భక్తిభారమున మస్తకమును వంచి స్నాతుఁడై పాదప్రక్షాళనము చేసికొని ధౌతవస్త్రములఁదాల్చి యాచమించి పవిత్రహస్తుఁడై తొలుదొలుత శ్రీమహావిష్ణువును స్మరించి శంకరుఁ డా దుర్గాదేవి నిట్లు ధ్యానించి వినుతించెను.

మహాదేవీ! నన్ను రక్షింపుము రక్షింపుము. ఓ దుర్గాదేవీ! నీవు దుర్గతినాశనివి. శత్రువులచే నాక్రమింపఁబడి భక్తుఁడనై యనురక్తుఁడనై యున్న నాయందుఁ గరుణ నునుపుము. విష్ణుమాయవు. మహామాయయనియుఁ బిలువఁబడుదువు. నారాయణివి. సనాతనివి. బ్రహ్మస్వరూపవు. నిత్యానందస్వరూపిణివి. బ్రహ్మాది దేవతలకు జననివి. జగములకు జననివి. గుణయుక్తవు గాన సాకారవు. నిర్గుణవుగాన నిరాకారవు. మాయచేఁ

బురుషాకృతిం దాల్తువు. ప్రకృతివి నీవే. వారిద్దఱికంటె నధికు రాలవు నీవే. పరమాత్మను భరించుచున్నదానవు. కావుననే సనాతనివనఁ జెల్లుదువు. వేదజననివి నీవే. సావిత్రియనియుఁ బరాత్పరయనియు. మహాలక్ష్మియనియు సర్వసంపత్స్వరూపిణి యనియు, మర్త్యలక్ష్మియనియు, క్షీరసాగరమున శేషశాయి యగు భగవంతునకుఁ గామినివనియు, స్వర్గమున స్వర్గలక్ష్మి యనియు, భూతలమున రాజలక్ష్మివనియుఁ, బాతాళమున నాగలక్ష్మియును బొగడఁబడు దానవు నీవే. గృహములయందు గృహదేవతవు. సర్వసస్యస్వరూపవు. సర్వైశ్వర్యప్రదాత్రివి. రాగాధిష్ఠాతృదేవివి. తల్లి నాయందు గరుణ నునుపుము. నాశత్రువులఁ బోకార్పుము. అని యనేకభంగుల వినుతించెను.

---

## విష్ణుప్రోక్త దుర్గాస్తుతిః.

రక్షరక్ష మహాదేవి దుర్గే దుర్గతినాశిని, మాంభక్త మనురక్తం చ శత్రుగ్రస్తే కృపామయి. ౧. విష్ణుమాయే మహాభాగే నారాయణి సనాతని, బ్రహ్మస్వరూపే పరమే నిత్యానందస్వరూపిణి. ౨. త్వం చ బ్రహ్మాదిదేవానా మంబికే జగదంబికే, త్వం సాకారే చ గుణతో నిరాకారే చ నిర్గుణాత్. ౩. మాయయా పురుషస్త్వం చ మాయయా ప్రకృతిస్స్వయం, తయోఃపరం బ్రహ్మపరం త్వం బిభర్షి సనాతని. ౪. వేదానాం జననీ త్వం చ సావిత్రీ చ పరాత్పరా; వైకుంఠే చ మహాలక్ష్మీః సర్వసంపత్స్వరూపిణీ. ౫. మర్త్యలక్ష్మీశ్చ క్షీరోదే కామినీ శేషశాయినః, స్వర్గేషు స్వర్గలక్ష్మీస్త్వం రాజలక్ష్మీశ్చ భూతలే. ౬. నాగాదిలక్ష్మీః పాతాళే గృహేషు గృహదేవతా, సర్వసంపత్స్వరూపాత్వం సర్వైశ్వర్య విధాయినీ. ౭. రాగాధిష్ఠాతృదేవీత్వం బ్రహ్మణశ్చ సరస్వతీ, ప్రాణానా మధిదేవీత్వం కృష్ణస్య పరమాత్మనః. ౮. గోలోకే చ స్వయం రాధా శ్రీకృష్ణస్యైవవక్షసి, గోలో

ఇట్లు శంకరుఁడు దీనుఁడై వినుతింపఁగా దుర్గాంబిక సూర్య కోటి ప్రభాభాసురాంగియై పరమాత్మయగు నారాయణమూర్తి తన్నుఁ బ్రేరేపింపఁగా శివునెదుట నావిర్భవించెను. ఆమె యావిర్భావము సదా మంగళములకు నాలవాల మగును.

---

కాధిష్ఠితా దేవీ బృందావన వనేవనే. ౯. శ్రీరాసమండలే రమ్యా బృందావన వినోదినీ, శతశృంగాధిదేవీ త్వం నామ్నా చిత్రావళీతి చ. ౧౦. దక్షకన్యా కుత్ర కల్పే కుత్ర కల్పే చ శైలజా, దేవమాతా దితిస్త్వంచ సర్వాధారా వసుంధరా. ౧౧. త్వమేవ గంగాతులసీ త్వం చ స్వాహా స్వధాసతీ, త్వదంశాంశాంశకలయా సర్వదేవాదియోషితః. ౧౨. స్త్రీరూపం చాపిపురుషం దేవి త్వం చ నపుంసకం, వృక్షాణాం వృక్షరూపాత్వం స్రష్టాచాంకురరూపిణీ. ౧౩. వహ్నౌ చ దాహికాశక్తి ర్జలేశైత్య స్వరూపిణీ, సూర్యే తేజ స్స్వరూపా చ ప్రభారూపాచ సంతతం. ౧౪. గంధరూపాచ భూమౌ చ ఆకాశే శబ్దరూపిణీ, శోభాస్వరూపా చంద్రే చ పద్మసంఘే చ నిశ్చితం. ౧౫. సృష్టౌసృష్టిస్వరూపాచ పాలనే పరిపాలికా, మహామారీ చ సంహారే జలే చ జలరూపిణీ. ౧౬. క్షుత్త్వం దయాత్వం నిద్రాత్వం తృష్ణాత్వం బుద్ధిరూపిణీ, తుష్టిస్త్వంచాపిపుష్టిస్త్వం శ్రద్ధాత్వం చ క్షమాస్వయం. ౧౭. శాంతిస్త్వం చ స్వయంభ్రాంతిః కాంతిస్త్వం కీర్తిరేవచ, లజ్జాత్వం చ తథామాయా భుక్తిముక్తి స్వరూపిణీ. ౧౮. సర్వశక్తి స్వరూపాత్వం సర్వసంపత్ప్రదాయినీ, వేదేనిర్వచనీయాత్వం త్వాం న జానాతి కశ్చన. ౧౯. సహస్రవక్త్రస్త్వాం స్తోతుం న చ శక్తస్సురేశ్వరి, వేదానశక్తాః కో విద్వాన్న చ శక్తస్సరస్వతీ. ౨౦. స్వయం విధాతా శక్తోన నచ విష్ణుస్సనాతనః, కిం స్తౌమి పంచవక్త్రైస్తు రణత్రస్తో మహేశ్వరీ. ౨౧. కృపాంకురు మహామాయే మమశత్రుక్షయం కురు.

ఇతి దుర్గాస్తోత్రం సంపూర్ణం.

కరుణమై శంకరుఁగాంచి మాయాశక్తిచే నీయసురావళిం జం
పుము. శంకరా! వరమును గోరుము. నీకు మేలగుగాక. నీవాం
ఛితముల దాఁపక వచింపుము. సురలలో నీవు శ్రేష్ఠుఁడవు.
కావున నీకువిజయము తప్పక కల్గించెదను. అని పలుక మహా
దేవుం డాజగదంబికం జూచి తల్లీ! యీదైత్యుఁడు నశించున
ట్లనుగ్రహింపుము. ఇదియే నాకు వాంఛింపఁదగు వరము. ఓ
సనాతనీ! యని ప్రార్థించెను. శ్రీదుర్గాదేవియు శంకరా! మహా
భాగా! శ్రీహరిని స్మరింపుము. దైత్యుని జయింపుము. విధా
తవు జ్యోతిస్స్వరూపుఁడవు నీవేకదా. ఈశ్వరుఁడన నీవే.

అని యిట్లు పలుకునంతలో భగవంతుఁడు మహావిష్ణువు
కలచే వృషభరూపుఁ డయ్యెను. శూలపాణి రథమును శిరస్సున
ధరించెను. మంత్రపూత మగునస్త్రమును బ్రసాదించెను. రథ
మును ధరించెను. అంత శంకరుఁ డాయస్త్రమునుగ్రహించి విష్ణు
వును ధ్యానించి దుర్గాంబను మదినిడుకొని యాయసురుని బడఁ
గొట్టెను. వాఁ డాయస్త్రస్పర్శమున నేలపైఁ బడియెను. రాక్షు
ససంహార మొనరించిన శంకరుని దేవతలు పొగడిరి. వృష్టిగాఁ
బూలను గురిపించిరి. దుర్గాంబ శంకరునకు శూలాయుధ మొసం
గెను. విష్ణువు పినాక మనుచాపము నొసంగెను. బ్రహ్మయు
శుభాశీర్వాదము లొసంగెను. మహర్షులు శంకరుని గీర్తించిరి.
దేవతాంగనలు నాట్య మొనరించిరి. గంధర్వులు పాడిరి.

అని పలికి శ్రీకృష్ణమూర్తి తండ్రీ! యీస్తోత్రరాజము
భక్తిమైఁ బఠింపుము. ఇది సర్వవిఘ్నములఁ దొలఁగించుచు
సర్వాపదల నశింపఁజేసి శత్రుసంహార మొనరించి పరమైశ్వర్యము
నొసంగి సుఖముల నిచ్చి నిర్వాణమోక్షము నీయఁజాలి హరి

భక్తిని బ్రసాదించును. వంధ్య దీనింబఠింపఁ బుత్రవతియగు. పెక్కుమాటలేల? ఏయేవాంఛితములఁ గోరి పఠించిన యవి యెల్ల లభించును. తైజసములలో రత్నమెట్టిదో, ఆశ్రమములలో ద్విజుఁ డెట్టివాఁడో, నదులలో గంగాతరంగిణి యెట్టిదో మంత్రములలోఁ బ్రణవమెట్టిదో, సర్వపత్రములలోఁ దులసీపత్ర మెట్టిదో, ధారణశక్తిగలవానిలో భూమియెట్టిదో, పుష్పములలోఁ బారిజాత మెట్టిదో, కాష్ఠములలోఁ జందనమెట్టిదో, తపస్సులలో విష్ణుపూజయెట్టిదో, మఱియు వ్రతములలో నేకాదశియు, జ్ఞానులలో శంభుఁడును, సిద్ధులలో గణపతియు, దేవతలలో విష్ణువును, శాస్త్రములలో వేదములును, దేవులలో దుర్గాదేవియు, శాంతులలోఁ గమలయు, విద్వాంసులలో సరస్వతియు, సుందరులలో రాధికాదేవియు నెట్టివారో స్తోత్రములలో నీదుర్గాస్తోత్రము పరమమైనది. మున్నొకతఱి సూర్యగ్రహణసమయమున బ్రహ్మదేవుఁడు ప్రార్థింపఁగా విష్ణువు దీని నొసంగెను శత్రుగ్రస్తుఁ డగు శంకరునకు నాయానతిచే బ్రహ్మ దీని నుపదేశించెను. శంకరుఁడు సనకాదిమహర్షుల కనుగ్రహించెను. దుర్వాసునకుంగూడ నొసంగెను. భగవంతుఁ డగుసనత్కుమారుఁడు గౌతమముని కనుగ్రహించెను. అంతియగాక పులహపులస్త్యాంగిరసులకుంగూడ నుపదేశించెను. సూర్యశీతాంశుయములకును సనత్కుమారుఁడే యుపదేశించెను. యముఁడొక్కపరి చిత్రగుప్తునకు నుపదేశించెను. నందభూపాలకా! ఈ స్తుతివర్యమును బ్రతిదినము పఠింపుము. గోలోకమునకుఁ బోవ నిది సాయపడును. తండ్రీ! నీవిపుడే ప్రత్యక్షముగా నాజగదంబను జూడఁగలవు. ఈస్తుతిరాజము నెవ్వరికే నుపదేశింపరాదు.

పాపాత్మునకు దీని నుపదేశింపఁ జనదు. విష్ణుభక్తునకు, శాంతునకుఁ, బండితునకు, సర్వజ్ఞునకుఁ దప్పక యుపదేశింపవలయు. వృషభము నెక్కువాఁడును, వృషలీపతి యగువాఁడు విప్రుఁడైనను జెప్పరాదు. శూద్రులకు వంటచేయువానికి, శూద్రశ్రాద్ధాన్నభోక్తకును, కన్యకను విక్రయించువానికిని దీనిం జెప్పరాదు. దీని ప్రభావ మనిర్వచనీయము. సర్వసిద్ధుల నొసంగును. సర్వతీర్థస్నానఫలము సర్వయజ్ఞఫలము దీనం గల్గును. ఈస్తోత్రము నా ప్రాణతుల్యము. ఇపుడే సభయం దిందుఁ బఠింపుము.

అనిపలుకు శ్రీకృష్ణునివచనమును విని నందుఁడు భక్తిభరితుఁడై పార్వతిని వినుతించెను. దుర్గాంబ నందునకు వరమొసంగెను. గోలోకప్రాప్తియే దానిఫలమని యెఱుంగవలయును. వేదములయందును గుప్తమగుజ్ఞానము నందునకుం గల్గెను. నందరాజా! గోలోకశాశ్వతనివాసము శ్రీకృష్ణదాస్యము నీకుం గలుగుఁగాతమని దుర్గపలికి యంతర్హిత యయ్యెను. మును లెల్లనా నందనందనుని వినుతించి తమతమ నివాసముల కరిగిరి. కృష్ణుఁడంత నందునిం గాంచి వ్రజేశ్వరా! ఇఁక వ్రజమునకుం బొమ్ము. త్యక్తమోహుఁడవగుము. అని యాజ్ఞాపించెను.

మహాభక్తులారా! ఈ యుపదేశమునం దొక్కవిశేషము కలదు. అది మన మెఱుంగఁ దగినది. నందునకు భగవంతుఁ డుపదేశించునపుడు శంకలు నందునిమదిఁ బొడమకుండుటకై దుర్గాస్తోత్రము నుపదేశించెను. ఇది తొలుదొలుత నచ్చెరువుగఁ దోఁచు. చక్కఁగా యోజించిన యుక్తమేయని తోఁచు. దుర్గయన నెవ్వరని మీ రూహింతురు. శివపత్నియనియా? కాదు.

ఎంతమాత్రము గాదు. త్రిమూర్తులఁబుట్టించిన మూలప్రకృతి. దుర్గతి నాశని. సర్వకామప్రదాత్రి. ఆమెను స్తుతింపుమాయని శ్రీహరి పలికెను. దానికి ఫలము గోలోక గమనము. అందు శ్రీకృష్ణపరమాత్మ దాస్యమనియుఁ దెలిపెను. సాకారధ్యానఫలము నిరాకారస్థితియే కదా. అనఁగా ముక్తి. ఇందు సారమేమన. ఏవాఁడుకాని నామరూపక్రియాత్మక మగు బ్రహ్మము నసఁగా సగుణబ్రహ్మము నుపాసింపవలయును. నిర్గుణబ్రహ్మము నుపాసించుట తొలుదొలుత శక్యముకాదు. కావున నొక్క లోకము, అందొక రమ్యస్థలము, అందొక సౌధము, దానియం దొక్కదివ్యస్థలము, అచ్చట నొకసింహాసనము, దానిపై సకలాయుధముల ధరించిన దివ్యమూర్తి కలఁడని భావించవలయు. ఆపరాత్పరునియందు భక్తినునిచి పూజలొనరించి నిగమాగమంబులవినుతించి యాపరమేశ్వరుని దివ్యసుందరమూర్తిని మనఃపీఠమునఁ బదిలముగా నునుచుకొనవలయు. అదికల్పితమూర్తి యేదైనను సకలమూర్తులాపరమేశ్వరమూర్తులేగావున భక్తుఁడు భావించినమూర్తి యాతనివాంఛితముల నొసఁగును. నిష్కామధ్యాన మొనరించిన నాభగవంతుఁ డెల్లవాంఛితముల నొసంగి ముక్తి నొసంగును. ఆభగవద్ధ్యానము నామమాత్రమైన ఫలము శూన్యము. చిత్తశుద్ధిగలిగి యామూర్తిని ధ్యానింపవలయును. చిత్తశుద్ధి యోగాభ్యాసమునఁ గాని కలుగదు. యోగశాస్త్రమునం దొక్కచక్కని సులభోపాయము చెప్పఁబడినది.

సూ. ఈశ్వర ప్రణిధానాద్వా. ౨౩

సమాధిపాదము.

ప్రణిధానం భక్తివిశేషః. విశిష్టముపాసనమ్. సర్వక్రియాణాం తత్రార్పణమ్, విషయసుఖాదికం ఫలమనిచ్ఛన్ సర్వాః క్రియా స్తస్మిన్ పరమగురావర్పయతి తత్ప్రణిధానం సమాధే స్తత్ఫలలాభస్య చ ప్రకృష్ట ఉపాయః ఇతి భోజవృత్తిః.

తా. ఈశ్వరు నుపాసించువాఁడు విధ్యుక్తకర్మము లాచరించి భక్తితో సర్వమును భగవదర్పణమని చేసినచో వానికి శీఘ్రముగా యోగము సిద్ధించును భక్తి మానసిక, కాయిక, వాచికమై యుండును. ఈవిషయమే భగవద్గీతలయందుఁ దొమ్మిదవయధ్యాయమున నిరువదిరెండవశ్లోకమునఁ గనంబడి యెడిని.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

కిం త్వనంయవిశేషః. అన్యేయే భక్తాః తే ఆత్మార్థం స్వయమపి యోగక్షేమం ఈహంతే. అనన్యదర్శినస్తు నాత్మార్థం యోగక్షేమమీహంతే. నహితే జీవితే మరణేవా ఆత్మనో వృద్ధిం కుర్వంతి. కేవలమేవ భగవచ్ఛరణాః తే, అతః భగవానేవ తేషాం యోగక్షేమం వహతీతి. అని శంకరభాష్యము.

కావున కోరికలు కోరక పరమేశ్వరుభజించిన నాపరమేశ్వరుఁడే ఆభక్తుని రక్షించునని పైప్రమాణముల సారతరార్థము. ఇట్లు ధ్యానించిన నారూపము కల్పితమైనను ముక్తి నొసంగును. ఎప్పుడు ఏ రూపమునుధ్యానించిన నద్దానఁ గలుగు జ్ఞానము సర్వజగత్స్వరూపుఁడు భగవంతుఁడని తెలుపును. సర్వవస్తువులయందు భగవంతు నెవఁడుచూచునో వానికి ముక్తి లభించును. ఇట్లు కాఁగా సగుణబ్రహ్మోపాసనము తొలుతఁ జేయఁ

దగినది. సగుణబ్రహ్మమనఁగాఁ బ్రకృతి విశిష్టపరమేశ్వరుఁ డని కాదా తాత్పర్యము. ఆప్రకృతియే యీదుర్గ. సర్వనామము లాజగజ్జననివే యగు. జగజ్జనని యనునామమే యీవిషయ మును దెల్పును. జగజ్జనకుఁడు విరాట్పురుషుఁడు. కాఁబట్టి యే దుర్గాస్తుతి రాజమును శ్రీహరి నందున కుపదేశించెను. ఈస్తుతియే సకలదేవతలు నీస్వరూపములేయని వర్ణింపఁబడుటచే సర్వ ప్రపంచకారణభూతుఁ డాలు ప్రకృతియని తెల్పును. ఇట్టులుం డఁగాఁ గొందఱకుఁ బ్రకృతియనఁగానే యులికిపడు నభ్యాసము గలదు. ఏలొకో తెలియరా కున్నది. వారి కది శివపత్ని యను భ్రాంతి కలదు కాఁబోలు. దానినివీడి శివాదులకు జననియని యెఱింగినచో నీలాటిసంశయములు వారికిం గలుగవని తలం చెదను. లేనిపోనిసంశయములఁ బెంచుకొని తమసద్గతిని బాడు చేసికొనక శ్రీహరి యాజ్ఞాపించినట్లు భగవతియగు రాధాం బికను భజింపుఁడు. ఆమెయే దుర్గ, పార్వతి, లక్ష్మి, శారద. ప్రపంచమంతయుఁ దదాకారమే. త్రిమూర్తులు తత్కళాబింబ ములే. నిస్సంశయము. కాఁబట్టియే

కరాంగుళినఖోత్పన్ననారాయణదశాకృతిః.

అని లలితాసహస్రనామములయందుఁ జెప్పఁబడుట యుక్తి యుక్తముగనే యున్నవి. దీనిచే విష్ణుభక్తు లులికిపడరని నాతలంపు. ఏలన? లలితాంబయన నెవరు? భగవదిచ్ఛాశక్తి. భగవంతుఁడు శ్రీమహావిష్ణువే యనుకొనువారు లలిత మహా లక్ష్మియని భావింపవచ్చును. శైవులు పార్వతి యనుకొనవ చ్చును. ఎవ్వరెవ్వ రేయేనామముల భజించినను ఫలమొక్క తీరున నుండును ఈవిషయము మదినుంచుకొని యేపురాణ

ములు చదివినను ఏమతగ్రంథములు పఠించినను జక్కఁగా నర్థమగును. కావున వెఱ్ఱిసిద్ధాంతములుమాని సర్వవేదసమ్మత మగు తత్త్వమునకు నిచ్ఛానుసారము నామరూపములను గల్పించుకొని భజింపుఁడు. పరమతముల లోపములెన్నఁ బ్రయత్నింపకుఁడు. అది మీమతము సంశయాస్పదమనుట తెలుపును. భగవంతుని సర్వవ్యాపిత్వము నశింపఁజేయును. దానికన్నఁ బాపపుఁగార్యము వేఱొక్కటి కలదా? అట్టిపనికిఁ బూని దుష్పాండిత్యము వెల్లడించుచు శ్రుతులకు లేనిపోనియర్థములు చెప్పి తెలియనివిషయములు తెలిసినట్లు నటించి ముక్తి నిర్ణయింపఁ బూనకుఁడు. భగవంతుఁ డొక్కఁడని, యతఁడు నిర్గుణుఁడని, ప్రకృతి తదధీనయని, తదాజ్ఞంగొని క్షణమాత్రమున సకలబ్రహ్మాండముల సృజించునని సకలప్రాణులు తత్కళావిశిష్టులని నమ్ముఁడు. భగవంతుఁడే ప్రకృతిందాల్చి శ్రీకృష్ణాది రూపముల నిలవెలసి భక్తుల నుద్ధరించుచు దుష్టుల నిర్మూలించుచు నుండుననని, ఆరూపమున కవ్వారూపమని పేరని భావింపుఁడు. ఈమతమును భావించినచో నేమతసిద్ధాంతము నాక్షేపింప పేలుండదు. భక్తజనులారా! ఇఁకఁ బ్రకృతవిషయ మనుసరించెదను. పరాత్పరుఁడు శ్రీకృష్ణమూర్తి నందున కీవిషయ ముపదేశించి మధురాపురమునుండి గోకులమున కరుగుమని హెచ్చరించెను. నందుఁ డీయుపదేశములఁ జక్క నాలకించి పులకాంచిత శరీరుఁ డయ్యెను. ఇఁకఁ దర్వాతికథ నాలకింపుఁడు. మనమున శ్రీహరి నొక్కమాఱు ధ్యానించి పిదపఁ దచ్చరిత్రమును బఠింపుఁడు. దాన నించుక శ్రద్ధ కుదురును. మనస్సు నిర్మల

మగును. ఆధ్యాన మీరూపమునుండు భగవంతునిద్రై యుండనగు.

శ్లో. అతంత్రిత త్రిజగదపి వ్రజాంగనా
నియంత్రితం విపులవిలోచనాజ్ఞయా,
నిరంతరం మమ హృదయే విజృంభతాం
సమంతత స్సరసతరం పరం మహః. ౪
ఘోషయోషిదనుగీతయౌవనం
కోమలస్తనితవేణునిస్వనమ్,
సారభూతమభిరామసంపదాం
ధామ తామరసలోచనం భజే. ౧౩

యస్మిన్నృత్యతి యస్య శేఖరభరైః క్రౌంచద్విషశ్చంద్రకీ
యస్మిన్ దృప్యతి యస్య ఘోషసురభిం జిఘ్రన్ వృషో ధూర్జటేః,
యస్మిన్ సజ్జతి యస్య విభ్రమగతిం వాంఛన్ హరే స్సింధుర
స్తద్బృందావన కల్పకద్రుమవనం తం వా కిశోరం భజే. ౧౬

శ్రీకృష్ణకర్ణామృతము. ౩ ఆశ్వా.

నందునకు శ్రీకృష్ణమూర్తి వరమొసంగుట.

* మరల నందుని గాంచి శ్రీకృష్ణమూర్తి నందమహీపాలకా! గృహమున కరుగుము. గోకులమున కిపుడు పోవందగును. తత్త్వసార మెఱింగితివి. మునులును దేవతలుంగూడ నీజ్ఞానమునకు హర్షించిరి. బహుభంగుల నితిహాసముల వచించితినిగదా. అందలిసారమును గ్రహించుట కడుంగడుం గష్టము. జన్మపాపనికృంతనదక్షం బగుదుర్గాస్తోత్రరాజమును వివరించి

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండమునందు నెనుబది తొమ్మిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని తెలియందగు.

తిని. దాన నీకు హర్షము సుఖము గలుగునని తలంచెదను. తండ్రీ! బాలభావమున నేనేమేని అపరాధ మొనరించియున్న దానిని క్షమింపుము. రాజమందిరమున నావలన మీకేమే సుఖముగల్గియున్న నది స్వర్గసుఖమును మించియుండునని యెఱుంగుము. వినయముననో నయమునో భక్తిభావముననో పరిహాసముననో నే నాడినవాక్యములను బరిగ్రహింపవలయును. యశోదను గూర్చికాని గోపికాగణమును గూర్చికాని నేనాడిన వాక్యములనన్నింటిని క్షమింపందగును. తండ్రీ! నీవు గోకులమునకుం బోయి బాలకులను బాలికలను విశేషించి రాధను యశోదాదిజననులను సకలబంధువులను నామాఱుగా నూఱడించి యిష్టసుఖముల ననుభవించి యవ్వల గోలోకమున కరుగుము. యశోదారోహిణులు గోపికాబృందములు గోపబాలకులు వృషభాను ప్రభృతులు రాధాదేవికిం దల్లియగు కలావతీదేవియు రాధయు నన్నుంగూడి గోలోకమునకు వత్తురుగాక. మీరిలోకమునుండి నిర్గమింపందలంచునపుడు గోలోకమునుండి పెక్కురథములు దివ్యాలంకారభూషితములై హర్షములంగూడి గోకులమున కరుదెంచును. వానిపై సకలబంధువులంగూడి యెక్కి సంతోషాంబుధి నోలలాడుచుం బోవంగలవు. సత్యముగా నిట్లు జరగును. నమ్ముము. నీ వీపార్థివదేహమును వదలి దివ్యదేహమును దాల్చి పొమ్ము. రాధిక యయోనిసంభూత. కలావతియను రాధామాతయు నయోనిసంభూతయే యగు. వారిద్దఱు నీ దేహములంగూడియే గోలోకమున కేతెంచువారు. కలావతీదేవి పితరుల మానసీకన్య. ధన్యురాలు. మాన్యురాలు. సీతామాతయు ధన్యురాలు. దుర్గా

మాతయగు మేనాదేవియు ధన్యురాలు. దుర్గాదేవియు నయోనిసంభూతురాలు. సీతయు నట్టిదే. తండ్రీ! ఈవిషయము నిపుడు బయలుపడనీయకుము. నీ కీవరమును నేను దుర్గయుఁ బ్రసాదించితిమని యెఱుంగుము. కృతకృత్యుఁడవు కమ్ము.

అని శ్రీకృష్ణమూర్తి పలుకఁగా వ్రజేశ్వరుఁ డగునందుఁడు భక్తవత్సలుఁ డగుకృష్ణపరబ్రహ్మమును గాంచి భక్తిభరమున నిట్లు పలికెను. మహాత్మా! కృష్ణా! నాల్గుయుగములందును సనాతనధర్మము లేయేవి సాగుచుండునో క్రమముగా వానిం దెలుపుము. కలియుగశేషభాగమందు గుణదోషము లెట్లుండునో వివరింపుము. అత్తఱి భూతలమునఁ బ్రాణులగతియు ధర్మము స్థితియు నెట్లు? ఈవిషయమును వినం గోరెద ననియె. నందుఁ డిట్లు ప్రశ్నింప నాలకించి భగవంతుఁ డానందపరవశుఁడై యావృత్తాంతమును సాకల్యముగా వచింపఁదలంచెను.

## శ్రీకృష్ణమూర్తి నందునకుఁ జతుర్యుగధర్మములఁ దెలుపుట.

* నందమహారాజా! ప్రశ్నము సముచితము. ఉత్తరము నాలకింపుము. నీమనస్సు సానందంబగు. ఈకథ పురాణములయందుఁ బరిష్కరింపఁబడినది. కృతయుగమున ధర్మము సంపూర్ణమై యుండును. అప్పటిప్రాణులు ధార్మికులు. సత్యము పరిపూర్ణతమము. దయాగుణము సంపూర్ణాకృతిం దాల్చియుండును. వేదములు నాలుగు ప్రజ్వలద్దీపముల వెలయు. వేదాంగములు, వివిధేతిహాసములు, సంహితలు, పురాణములు చక్కఁగా నలరియుండును. ఆగమములు, ధర్మశాస్త్రములు

* ఈకథయుం శ్రీకృష్ణజన్మఖండము తొంబదియవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదనియె తెలియందగు.

మనోహరరీతిం జెలంగు. విప్రులు వేదవేత్తలై వ్రతపరాయణులై తపోనిరతులై యుందురు. వారు నారాయణమూర్తిని దన్మనస్కులై ధ్యానించుచుఁ దన్మంత్రమును జపింతురు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు విష్ణుభక్తులు. అందు శూద్రులును సత్యధర్మపరాయణులయియే యుందురు. రాజులు ధార్మికులును బ్రజాపాలనతత్పరులునై యుందురు. ప్రజలనుండి పదాఱవపాలు పన్నుమాత్రము గ్రహింతురు. బ్రాహ్మణులనుండి పన్ను గ్రహింపరు ఏలన, వారు తపోనిరతులని లోకోపకారమునకై ధర్మము నుపదేశించువారని వారు గ్రహించియే పన్ను గ్రహింపరని తలంపవలయు.

వసుంధర సదా సకల సస్యపరిపూర్ణయై రత్నాధారయగుచు నుండు. శిష్యులు గురుభక్తులు. తనయులు పితృభక్తులు. వనితలు పతిభక్తిపరాయణలు. పతివ్రతపరాయణులు నగుదురు. పతులు ఋతుకాలములయందే భార్యలం గూడుదురు. అంతియే కాని నారీవ్యామోహమును బొందరు. సదా కామాతురులును గారు. దొంగలనుండి భీతి యేకాలమున లేదు. పరదారలంగోరు నీచమతులును లేరు. వృక్షములు సదా పూర్ణఫలభరితములు. ధేనువులు క్షీరమును సమృద్ధిగాఁ బిదుకును. మనుజులు పొడవుగనుండి బలముగలిగి సౌందర్యముగలవారుగ నుందురు. అందుఁ గొందఱుమాత్రము లక్షసంవత్సరము లాయుఃపరిమాణమున నొప్పుచుందురు. వారిదేహముల రోగము లుండవు. విప్రులంబోలి తక్కుంగలజాతులవారు విష్ణుభక్తి నలరుచుందురు. నదీనదములు జలపూర్ణములుగనుండును. నాల్గుజాతులవారు తీర్థస్నానమునఁ బావనాంగులుగ నుందు

రు. ద్విజాతులు తపఃపూతులు. ఎల్లవారిమనస్సులు నిర్మలములు. జగంబంతయు ఖలజనహీనమై యుండును. అందఱును విప్రాన్న భోజనమునే కోరుదురు. ఏలన బ్రాహ్మణముఖము విరోధములేని యనూషరక్షేత్రము. అది సదా ప్రేమరసాలవాలము. నారాయణసంకీర్తనమునఁ బరమపవిత్రము. సదా హర్షసమన్వితము. కావున నందఱు వారిని గౌరవించుచుందురు. వేదద్విజదేవనిందకు లాకాలమున నుండరు. ఆత్మగుణస్తుతిపరాయణు లుండరు. అందఱు పరగుణప్రశంసాదరులు. ఒక్కొక్కరికి ద్వేషము లేదు. అందఱిమేలునే యందఱు కోరుచుందురు. స్త్రీలును బురుషులును మూర్ఖులుగాక పండితులయియే యుందురు. జనులెల్ల దుఃఖితులుగాక ధనధాన్యముల నొప్పుచు సంతోషమున నుందురు. భిక్షాటకులు రోగార్తులు నపుడు లేరు. విశోకులుగనే యుందురు. అందఱును సర్వాలంకారభూషితులయియే యుందురు. కపటవృత్తి యాకాలమున నామమాత్రముగనే యుండును. జరాభారముగానక స్థిరయౌవనమే ప్రాణికోటియందు సాజముగ నుండును. ఆధివ్యాధులు లేవు. తనువికారములును లేవు.

నందరాజా! సత్యయుగ మనఁబడు కృతయుగమునందు సత్యదయాధర్మాదు లేవేవి చెప్పఁబడినవో యవియెల్లఁ ద్రేతాయుగమునఁ బాదహీనములై యనఁగా నాల్గవభాగము తక్కువగా నుండునని యెఱుంగనగును. ద్వాపరయుగమునందు రెండుభాగములు తక్కువగా నవి యుండును. నాల్గవ యుగ మనఁబడు కలియుగమున ధర్మము మూఁడుభాగములు కృతయుగముకంటెఁ దక్కువదై పాదమాత్రము నిలిచియుండును. దుర్బలమై కృశించియుండును. దురాత్ములు జారచోరులు కృత

యుగమున ధర్మాదులుండునట్లు సంపూర్ణవృద్ధి నొందుదురు. కొందఱు ధర్మద్వేషులు. కొంద అధర్మనిరతులు. మఱికొందఱు కపటాచారపరాయణులు. పతివ్రతలు భీతిల్లుచుందురు. కులటలు చెలరేఁగుచుందురు. పరదారనిరతు లసంఖ్యలుగ నుందురు. ఏకపత్నీవ్రతులు నామమాత్రముగ నుందురు. ధర్మిష్ఠులకు సదా భయము పొదలుచుండును. అధర్మనిరతులు విచ్చలవిడిగ నుందురు. రాజు లల్పధర్మనిరతులు. ద్విజులు స్వల్పవేదరతులు. వ్రతధర్మాసక్తులు కొలఁది సంఖ్యాకులే. స్వేచ్ఛాప్రవర్తకులు పెక్కుమంది యుందురు. తీర్థము లెంతకాలము భూమి నిలిచి యుండునో, సాధువు లెంతదనుక నుందురో గ్రామదేవత లెంత కాలము వెలసియుందురో శాస్త్రము లెన్నియేండ్లుండునో అంతదనుకఁ దపస్సు సత్యము మొదలగునవి యించుకగా నిలిచి యుండునని యెఱుంగుము.

తండ్రీ! దోషసాంద్ర మగుకలికాలమున నొక్కసుగుణ మున్నను మహత్తరమే యనఁదగు. మనస్సు దోషభూయిష్ఠ మగునుగాన సుకృతము చేయునూహ యించుకకలిగినను గొప్ప ఫలము నొసంగఁజాలును. తీర్థము లెప్పుడునశించునో ధర్మాంశ మత్తఱి నశించునని భావింపుము. ధర్మము కాలము నాశ్రయించియుండును. కలికాలశేషమున నాధర్మము కుహూతిథియనంబడు నమవసయందుఁ జంద్రుఁడు క్షీణించినట్లు నశించును. అని శ్రీహరిపలుక నందుఁ డామాటలకు భీతిల్లి యిట్లు ప్రశ్నించెను. శ్రీకృష్ణా! కలియుగమునఁ దీర్థరాజము నెంతకాలముండును. సాధువులు గ్రామదేవతలు శాస్త్రములు నెంతకా

లము నిలుచును? అని ప్రశ్నింప శ్రీకృష్ణమూర్తి యిట్లు బదులు చెప్పెను.

### కలియుగశేష భాగవర్ణనము.

కలియుగమునఁ బదివేలసంవత్సరములదాఁక శ్రీహరి వెలయును. కావున నంతదనుకఁ బ్రతిమాపూజనము చేయం దగును. శాస్త్రములు పురాణములు నంతకాలమే యుండును. అనఁగా నంతదనుక వీనిని నమ్మువా రుందురు. భగవంతుఁ డుండును గావుననే గంగాదితీర్థములు మహిమములఁ గూడియుండును. గ్రామదేవతలందును శక్తియుండును. వేదములు సాన వంతములై యుండును. తండ్రీ! పదివేలవత్సరములు దాఁటిన పిదప నధర్మము పరిపూర్ణమై యుండును. నాల్గువర్ణము లొక్క వర్ణముగా మార్పునొందును. మంత్రపవిత్రవివాహము లప్పుడు జరగవు. సత్యమునకు నిలువ నీడయుండదు. క్షమకుఁ దావు లేదు. పురుషులు క్రీడాసక్తులౌట స్త్రీలను బరిగ్రహించుట యందే యాసక్తులయి యుందురు. బ్రాహ్మణులు యజ్ఞతంత్రముల నడపరు. మొగమునఁ దిలకము ధరింపరు. సంధ్యావందనము చేయువారును, శాస్త్రచర్చలఁ జేయువారును సుప్రసిద్ధ పూర్వసదాచారపరాయణులును నుండరు. *అన్నిజాతులవారును గలిసి పంక్తిభేదములేక కూర్చుండి భుజించుట సదాచారమని భావింతురు. భక్షింపఁదగని పదార్థములను భక్షింతురు. నాల్గుజాతులవారు నిట్లే యభక్ష్యభక్షకు లగుదురు. అందఱును వనితాలంపటులు. వనితాకోటియందుఁ బతివ్రత కనఁబడదు.

---

* సర్వైస్సార్ధంచ సర్వేషాం భోజనం నిత్యమచ్యుతః, అభక్ష్య భక్షా లోకాశ్చ చతుర్వర్ణాశ్చ లంపటాః. అని మూలము.

కులటలే ప్రతిగృహమున నుందురు. ఆకాలమునఁ బతివ్రతలన వారే యనఁబడుదురు. ఆస్త్రీలు భర్తను సేవకుని దిరస్కరించి నట్లు తిరస్కరింతురు. పతులు భయమున వడఁకుచుందురు. వని తారత్నములు జారవాంఛలు పెనుఁగొన అట్టివారికే భక్ష్యములనొసంగి చందనచర్చల వారిని గైసేయుదురుగాని భర్తలు దుఃఖితులైనను వారి నాహారాదులచే సత్కరింపరు. కొడుకు తండ్రిని దూఱును. శిష్యుఁడు గురువును దూషించును. ప్రజలు రాజు నవమానింతురు. రాజులు ప్రజల బాధింతురు. శిష్టజనులు చోరులచేతను దుష్టులచేతను సదా బాధింపఁబడుదురు. భూమి సస్యహీనయై యుండు. ధేనువులు పాలీయఁజాలవు. పాల యందు ఘృతముండదు. వెన్న దొరకుట యరుదగు.

జనులు నిజముపలుకుట యలవాటు లేకుందురు. మిథ్యా భాషితముల కలవాటు పడుదురు. శౌచసంధ్యాశాస్త్రహీనులై బ్రాహ్మణులు వృషవాహకులై శూద్రులయిండ్ల సూపకారకులై శూద్రశవదాహకులై శూద్రవనితారతులై యుందురు. శూద్రులు విప్రవధూనిరతు లగుదురు, బ్రాహ్మణునిచే వంటచే యించి భుజింతురు. తల్లికంటె భార్య నెక్కుడు మర్యాదగాఁ జూతురు. స్త్రీలంపటు లయియే వా రుందురు. భృత్యులు రాజులంద్రోసి తమరే ప్రభువులమని ప్రకటించుకొనుదురు. కాంతలు పతిని దెగడి కామాతిరేకమున జారునివరించి యతనివెంట కరుగుదురు. రాజపుత్రులు తండ్రిని ద్రెంచి తమరే పట్టాభిషేకము చేసికొందురు. అందఱు స్వచ్ఛందాచారనిరతులై భోగభుక్తిరతు లగుదురు. ఎల్లరు కులమర్యాదల వీటఁబుచ్చి దురాచారముల నవలంబించి కుత్సితులై కుమతులై యుందురు. మంత్రముల

యందు విశ్వాసము లేకుందురు. మిథ్యాయంత్రప్రచారకు లగుదురు. గురువులు, జాతిహీనులు, వయోహీనులు, పరనింద కులు నగుదురు. యవనమ్లేచ్ఛాదులు రాజులమని చెప్పుకొం దురు. ధర్మముల నిందింతురు. సాధువులకీర్తి నున్మూలింపఁ జేయు దురు. పితృదేవద్విజాత్యతిథులకుఁ బూజచేయునాచార మడం గును. గురువులను దండ్రులను మరియాదచేయుట యరుదగు. స్త్రీలకే గౌరవము సాగును భార్యాబంధువులకే గృహముల సన్మానముగాని పితృబంధువులకుఁ గలుగదు. సదా ప్రతిగృహ మునందును స్త్రీలకే యెక్కుడు మర్యాద గలుగును. దొంగలు సత్కులజాతు లనఁబడుదురు. బ్రాహ్మణుఁడు దేహమమ్ముకొని జీవించును. దేవాలయములు నామమాత్రముగ నుండు. ఎల్ల రేదోయొకభయమునఁ గుందుచుందురు. జగంబెల్ల నరాజకంబై దుర్నీతిగలిగి కలియుగదోషంబున విషమస్థితి నుండు. జనులా కట నకనకంపడుచు వస్త్రములు కుత్సితములై యుండ దరిద్రులై వ్యాధిబాధితులై యుందురు. డాంబికులందఱు రాజులనం బరఁ గుదురు. ముదుసలి యంగుష్ఠసమానముగాఁ గలియుగాంత్య భాగమున మనుజదేహము లుండు. వృక్షములు శాకసమాన ముగా నుండు. తాటిపండ్లు, నాళికేరఫలములు, పనసపండ్లు ఆవ గింజంత ప్రమాణముగాని యించుక యంతకంటె దక్కువగాఁ గాని యుండును. గృహములు సర్వవస్తుసంపూర్ణములు కాక యుండును. గృహశోధనాదులు సాగింపక ప్రజలెట్లో కాపుర ముందురు. దుర్వాసనలతోనిండి దీపహీనములై యంధకారా వృతములై గృహము లుండును. హింసించుజంతువులే చెల రేఁగును గాన వానివలనిభయమున మనుజులు తల్లడిల్లుచుం

దురు పాపాత్ములసంఖ్య యత్యధికమై యుండును. ఎల్లవా
రును స్వలాభప్రియులుగ నుందురు. కలహములు పరస్పరకలహ
ములు పుట్టించి ప్రజల బాధింతురు. కామినులు రూపవతులు
గాక కురూపలయ్యును గర్వించుచుందురు. పురుషులు నష్ట
యుందురు. నదులు నదములు తటాకములు సరోవరములు జల
శూన్యములై పద్మములు లేక యుండును. మేఘములు కా
బడునుగాని నిర్జలములై యుండును.

వనితలు సంతతివిహీనలై కామాంతికోపములుగలిగి శీఘ్ర
ముగా జరాభారము తమ్ముం గ్రమ్ముకొన నుందురు. అశ్వత్థవృక్ష
ములనుగూడ ఛేదించువా రుందురు. వృక్షములు క్రమముగ
నశించును. ఎందేని వృక్షములున్న నవి ఫలహీనములై యుం
డును. బహుశాఖలుగూడ వృక్షములందుం జూడ్కి [illegible].
ఎందో ఫలములుండిన నవి స్వాదువులుగ నుండవు. అన్నము
జలములు నష్టి యగు. మానవులు [illegible]
దయావిహీనులై ధర్మమున నాసక్తి లేకుండును. [illegible]
కలియుగాంతమున ద్వాదశాదిత్యులు [illegible] మానవుల
హింసింతురు. మేఘములు లావిర్భవించి [illegible]
ప్రాణులం బోకార్చు. భూమి యాకాలమునం [illegible]
మిగిలియుండును.

కలియుగ మీరీతిగడువంగా [illegible]
బాగుపడినట్లు సత్యయుగము [illegible]
శోభిల్లు. క్రమక్రమముగా [illegible]
శాకరముగాం బొ[illegible]. సంగ[illegible]! [illegible]
వచించితిని. ఇంక సం[illegible] [illegible].

నేను పాలుత్రాగు బాలుఁడను. నీకుఁ బుత్త్రుఁడను. నీకు వచిం చితిని. తండ్రీ! వెన్న నేయి పాలు పెరుగు మజ్జిగ శుభకర్త్రా ర్హమగుస్వస్తికము, సుధాతుల్య మగు మిష్టాన్నము, మిష్ట పదార్థము, చిన్నతనముచేత నేఁ దినియున్నచో నాయప రాధమును క్షమింపవలయును. బాల్యమున రోదనముచేసి యేమేని మిముఁ గష్టపెట్టియున్నను క్షమింపందగును. బాలుని యపరాధము లెన్నిపర్యాయములైనను సైచుట పితరులకు ధర్మముకదా. నాకు నీవు తండ్రివి. యశోద తల్లి. నా * పరి హాస వాగ్జాలమును యశోదారోహిణులకుం జెప్పుము. తండ్రీ! ముందుముందు నే నెన్నియోవిషయములు కుమారుని ముఖ మునుండి వింటినని భావింపఁ గలవు. ఆభావనకుఁ గార కుఁడను నేనే. గోకులమున నేనొనరించిన కృత్యముల నన్నిం టిని మఱువక తలంపుము. మఱొక్కరహస్యమును వినుము. కాలమే బంధువులతోటి సంసర్గమును బంధువులకుఁ గల్గించును. వారితోటి వియోగమునుగూడఁ గాలమే చేయును. ప్రీతిని విరోధమును గాలమే కల్పించును. కాలమే సృజించును. పరిపాలించును. ఆనందమును బుట్టించును. సంహరించును. కాలమే నాస్వరూపము. సుఖదుఃఖభయశోక జరామృత్యు జన్మములను గర్మానుసారముగాఁ గాలమే కల్గించును. సర్వము కాలకృతమే. దీన విస్మయమునొందఁ బనిలేదు. నందరాజా! గోకులమున కింకఁ బొమ్ము. గోకులమున వైశ్యుఁడ వేలయై తివి? వైశ్యాధిపుఁడు నందుఁడు రాజని పేరెట్లు నీకుం గలిగె? వసుదేవునకేల నేను మధురానగరమునఁబుట్టి కుమారుఁడ

* మదీయం పరిహాసం చ యశోదాం రోహిణీం వద. అని మూలము.

నైతిని? అట్టి నేను గంసభీతుఁ డగుతండ్రిచే నీయింట విడువఁ బడితిని. తండ్రికంటె నెక్కుడగుతండ్రివి నీవైతివి. తల్లికంటె నెక్కుడుతల్లి యశోద యయ్యెను. దుర్గాదేవియు నేను నొసంగిన యీ జ్ఞానముచేత మోహమును వదలి సుఖముగా గోకులమున కరుగుము. అని శ్రీహరి పలుమాఱు నొక్కిచెప్పఁగా నందుఁ డిట్లు పలికెను.

వత్సా! బృందావనమును స్మరింపుము. అందు జరగు రమ్యమహోత్సవమును స్మరింపుము. గోకులమును దలంపుము. వ్రజమును స్మరింపుము. సుందర యమునాతటమును దలంపుము. నీ కతిప్రియమగు రాసోత్సవమును రమణీగణపరివృతమును మఱువకుము. గోపబాలికలను గోపబాలకులను యశోదను రోహిణిని, ప్రాణప్రియ యగు రాధికను స్మరింపకుండఁజాలవని నమ్మెదను. ఒక్కపర్యాయము గోకులమున కరుదెంచి యందొక్కవాసరము గడపుము. అని పలికి నందుఁ డత్యంతప్రీతి పైకొన శ్రీకృష్ణుని దనతొడపై నిడుకొని యానందాశ్రువుల నాతనిం దడుపుచు దుఃఖితుఁడై కపోలద్వయము ముద్దిడుకొని కౌఁగిలించుకొని పరమానందభరితుఁడై యుండెను. శ్రీహరి యానందుని యానందపారవశ్యమును గాంచి యి ట్లనియెను.

మహాభక్తులారా! ఈకథయందును గొన్ని ముఖ్యాంశములు గలవు. వానిని దెలుపక యవ్వలి కథను వ్రాయ మనసొప్పకున్నది. నందునకు శ్రీహరి యుగధర్మములఁ దెల్పెను. ఆవిషయము సకలపురాణప్రతిపాదితము. కలియుగశేషభాగధర్మములు నట్టివే. వానింగుఱించి యిటఁ బెంచివ్రాయుట చర్వితచర్వణమన్నన్యాయమున కుదాహరణము గాఁ గలదు. కాన

మానితిని. యుగధర్మముల నుపదేశించి నందునితో నిఁక గోకు
లమున కరుగుమని హెచ్చరించుచు,

మయా దత్తేన జ్ఞానేన పార్థ్వాత్యాశ్చ ప్రజేశ్వర,
త్యజ మోహం మహాభాగ గచ్ఛ తాత సుఖంగృహమ్.

అని పలికెను. అంతియకాక

సర్వం కర్మానురోధేన కాలఏవ కరోతి చ.

అనియు వచించెను. ఇందలి విషయసారమేమని, యించుక
యూహింతము. ఇంతకుముందు శ్రీహరి యుపదేశించిన యా
ధ్యాత్మిక జ్ఞానము ప్రకృతియుఁ దాను నుపదేశించినట్లు తెల్పెను.
ఏలన సృష్టియందు సాగు కార్యములన్నియుఁ బ్రకృత్యాధీన
ములు కాని వేఱుకావు. కావుననే,

శ్లో. ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి,
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్. ౨౦
కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే,
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే.
పురుషః ప్రకృతిస్థోహి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్,
కారణం గుణసంగోఽస్య సదసద్యోని జన్మసు. ౨౨
య ఏనం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ,
సర్వథా వర్తమానోఽపి నసభూయోఽభిజాయతే.

౧౩. అధ్యాయము.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః,
భూతగ్రామమిమంకృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮
న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ,
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు. ౯

మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం,
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే. ౧౦

అవజానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం,
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్. ౧౧

శ్రీభగవద్గీత. ౯ అధ్యాయము.

అని యిట్లు శ్రీకృష్ణపరమాత్మ నొక్కి వక్కాణించెను. ప్రకృతియు నేనును అనాదిగా నుండువార మనియు వికారములు వివిధగుణములు ప్రకృతివలనఁ గలుగుననియు నేను నిర్వికారుఁడను నిర్గుణుఁడననియు నిట్టి విషయములఁ గనుఁగొనినవాఁడు నన్నెఱుంగుననియు వీని సారము. నా యాజ్ఞఁగొని ప్రకృతి సర్వప్రపంచమును నిర్మించును. తద్వికారములు నన్నరికట్టఁజాలవు. అనియు శ్రీహరియే వచించెను. ఇట్టులుండఁగాఁ బ్రకృతియనఁగా నులికిపడుట పూర్వాచార్యము మంచిది కాదేమో యనుటకన్న నింకొక్కమాట యనఁజాలము కదా. మతాభినివేశము లెంతటి యన్యాయములకైన నొడిగట్టఁ జేయుననుట కింతకంటె నుదాహరణ మేమి కావలయును. మఱియు లోకమున సకలప్రాణులకుఁ గలుగు సుఖదుఃఖములు కర్మానుసారముగాఁ గాలమే కల్పించును. అని భగవంతుఁడు పలికెను. దీని భావమేమి? ఎవ్వరెవ్వరి సుఖదుఃఖములకు వారే కర్తలుగాని భగవంతుఁడు కాఁడు. ఇతరులను బొగడుటో నిందించుటో తగదని హెచ్చరించిన ట్లెంచఁదగును. స్వస్వకర్మాధీనముగా సంభవించు సుఖదుఃఖముల కితరులను బొగడినఁగాని నిందించినఁగాని ఫలము లేదనియే దీనిసారతరార్థము. ప్రపంచ చక్రము కర్మానుసారముగా సాగుచున్నదనియు నెఱుంగు

మాయని నందుని హెచ్చరించెను. కంసాదులు మడియుటకుఁ గారణము వారికర్మమే. నేను సాక్షీమాత్రుఁడనే యని వివరించి చెప్పెను. కావున నన్నింటికంటెఁ గర్మసిద్ధాంతము ప్రబలము. దానిని మించునది వేఱొక్కటి కానరాదు. సత్కర్మముల నాచరించి సద్గోష్ఠిం దవిలి సత్సహవాసమునఁ గాలము పుచ్చుట సుఖమొందుమార్గములనియు, దుష్కర్మముల నాచరించి దుష్టగోష్ఠినొంది దుష్టసహవాసమునఁ గాలము ద్రోయుట దుఃఖమొందుమార్గములనియు నిం దేదియుక్తమో యోజించుకొని తనబ్రదుకు తానే ప్రతిప్రాణియుఁ జూచుకొనవలయు నొకరిసాయమునకై యఱ్ఱుచాపుట యవివేకమనియు దీనినుండి గ్రహింపఁదగువిషయము. ఇంతమాత్ర మాలోచించి మనగతిని దెలిసికొనఁజాలని మనము దేవతల దూషింపఁబూనుట యవివేకము గాక మఱేమిటి? చేయరానికార్యములలో దేవతాదూషణ మొక్కటి. అట్టికార్యమునకుఁ బూనక తరణోపాయ మిదికాదని నిశ్చయించి దేవతాంతరదూషణ మొనరింపక స్వమతసిద్ధాంతములనే నమ్మి భగవంతు నారాధించి మేలు పొందవలయును. ఇంతకంటె మంచిమార్గము వేఱొకటి కానరాదు. దీనికై మనమెల్లఁ బ్రయత్నింపవలయును. ఇంతట దీనిని వదలి ప్రకృత కథాంశమునకు వచ్చెదను.

**శ్రీకృష్ణమూర్తి గోకులమున కుద్ధవునిం బంపుట.**

* నందభూపాలకా! ఏల బాష్పములు వదలెదవు? పరిష్వంగమువలన లాభమేమి? ఇఁకనైన నీమోహమును విడుపు

---

* ఈ కథ శ్రీకృష్ణజన్మఖండమున తొంబదియొకఁడవ యధ్యాయము నుండియు, గర్గసంహిత మధురాఖండము పదుమూఁడవ యధ్యాయమునుం

ము. ఉద్ధవుఁడు మిమ్ముఁ దోడ్కొనిపోయి గోకులవాసుల నూఱడించివచ్చునట్లు కట్టడిచేసెదను. త్వరగా నుద్ధవు నంపెదను. ఆతఁడు పరమకారుణికుఁడు. కావున నాయాదేశంబున గోకులమున కరిగి యశోదారోహిణులను, గోపికలను, గోపకులను, గోపబాలకులను, విశేషించి ప్రాణాధిక యనందగు రాధికను నా మాటలఁ దెల్పి యూఱడించును. అనిపలికి నందుని గోకులగమనోన్ముఖునిగా నొనరించెను.

అత్తఱి వసుదేవుఁడు దేవకిం గూడి కృష్ణునొద్దకు వచ్చెను. బలదేవుఁ డుద్ధవుఁడు, అక్రూరుఁడును వచ్చిరి. వసుదేవుఁడు నందునిఁగాంచి నందరాజా! నీవు బలవంతుఁడవు. జ్ఞానివి, సద్బంధువవు, సఖుఁడవు నైతివి. ఇపుడు పూనిన మోహమును వదలుము. గృహమున కరుగుము. ఈకృష్ణుఁడు నాకెట్లు కుమారుఁడో నీకు నట్లే కుమారుఁడని నిశ్చయింపుము. మాదంపతులయం దెట్టిప్రీతి యీ కుమారకునకుం గలదో మీదంపతులయం దట్టిప్రీతియే యుండును. ఇవి ధ్రువము. నందా! ఏల యశ్రుజలముల విడుచుచు నాయాసపడియెదవు! శోకింప నపపరమేమి? ఈ కుమారుఁడు పదునొకండువత్సరములు నీయింట గడపెఁగదా. ఆసుఖ మనంతమని భావింపుము. అట్టి నీ పీడనమున నేల శోకించెదవు? ఈ మధురానగరమునందే పుత్రుంగూడి కొలఁదిదినము లుండుము. ఈ పూర్ణచంద్రాననుఁ గుమా

---

డియు, శ్రీభాగవతము దశమస్కంధము నలువదైదవ యధ్యాయమునుండియుఁ గ్రహింపఁబడినదని యెఱుంగఁదగు.

రుని గాంచుచు జన్మమును సఫలమైనదిగ భావించుచుండుము. అని యూఱడించెను. (*)

అప్పుడు శ్రీహరి యుద్ధవుంగాంచి భద్రా! నీవు సుఖముగా గోకులమున కరుగుము. అందు నీకు శుభము చేకూరఁగలదు. గోకులమున నా తల్లులు యశోదారోహిణులు కలరు. నాసఖులు గోపబాలకులు శతసంఖ్యలుగలరు. నన్నాశ్రయించిన గోపికాసహస్రములు గలవు. ప్రాణాధికప్రియ రాధిక కలదు. నీ వచ్చటికిం బోయి నాయుపదేశరూపమగు నాధ్యాత్మికవిషయమును మదిఁ బదిలముగా నిడుకొని దుఃఖమును ఛేదింపఁజేయును గావున వారికెల్లఁ దెలిపి వారి యావేగము నడంపుము. నందరాజు సానందుఁడై నా తల్లిదండ్రులగు దేవకీవసుదేవుల యాజ్ఞానుసారము నన్నుంగూడి యుందే కొలఁదికాలముండును గాక. కావున నాతండ్రి యిందుండుననియుఁ దల్లియగు యశోదకు నెఱిఁగించి యామె మనశ్చింతను నివారింపుము. నా ప్రీతియు నాతల్లి కెఱుక పఱుపుము. తక్కుంగలవారికెల్ల నా యుపదేశించిన యీ యధ్యాత్మరహస్యములను దెల్పి వారికింగల మమకారమును వెలార్పుము. దాన వారెల్ల హాయిగా నుండఁగలరు. నీకును మేలు చేకూరును. అని యుద్ధవు

---

*. ఈ ఘట్టమున శ్రీభాగవతమునఁగల కథ సొంపుగా లేదు. శ్లో. యాత యూయం వ్రజం తాత వయం చ స్నేహ దుఃఖితాన్, జ్ఞాతీన్ వో ద్రష్టు మేష్యామో విధాయ సుహృదాం సుఖమ్, ఏవం సాంత్వయ్య భగవాన్నందం సవ్రజమచ్యుతః. అని కనఁబడియెడిని. ఈ విషయమే శ్రీకృష్ణజన్మఖండమునందు సొంపుగా వ్రాయఁబడినందున దానిం బ్రధానముగాఁ జేసికొని కథను వ్రాసితినని గ్రహింపందగును.

నకుం గర్తవ్యమును దెలిపి తల్లిదండ్రులను నందుని బలరామా
క్రూరలనుగూడి యభ్యంతర మందిరమున కరిగెను. ఉద్ధవుఁ
డారేయి మధురానగరమునఁ గడపి ప్రభాతమున నరదమెక్కి
బృందావనమున కరిగెను.

### శ్రీకృష్ణానుమతి నుద్ధవుఁడు గోకులము చేరుట.

* ఇట్లు శ్రీకృష్ణపరమాత్మ యాజ్ఞాపింప నుద్ధవుఁడు పర
మానందభరితుఁడై కృతకృత్యుఁడనైతినని తలంచుచు మధురా
నగరమును వెడలుతఱి గణనాథుని, శ్రీమన్నారాయణమూర్తిని,
శివదుర్గలను, లక్ష్మీసరస్వతులను, గంగాయమునానదులను, మన
సున ధ్యానించుచు దిగీశునకు వందనమాచరించి మహేశ్వరుని
మది నిడుకొని యెడనెడ శుభశకునములఁ గాంచుచుఁ బయ
నము సాగించెను. దుందుభిధ్వనియు, ఘంటానాదము, శంఖని
స్వనము, హరినామనాదము వినవచ్చెను. సంగీత మతిమనోహర
ముగా వినవచ్చెను. మఱెన్నియో మంగళధ్వనులు చెవులఁ
జొచ్చెను. పతియుఁ బుత్త్రులుగల సాధ్వీమణి దర్శనమిచ్చెను.
దీపము కనఁబడియె. పుష్పహారములు దర్పణము తోఁచెను. జల
పూర్ణకుంభము, దధి, లాజలు, ఫలములు, దూర్వాంకురములు,
శుభధాన్యము, రజతకాంచనములు, తేనెయు, బ్రాహ్మణబృందము,
కృష్ణసారము, వృషభము, ఘృతము, సద్యోమాంసము, గజేంద్ర
ము, రాజు, శ్వేతఘోటకము, పతాకయు, నకులము, శుక్లపుష్పము,
పాలపిట్టయు, శ్రీచందనము దృగ్గోచరమయ్యెను. ఇట్టి శుభశకు

---

* ఇదియుఁ శ్రీకృష్ణజన్మఖండము తొంబదిరెండవ యధ్యాయము
నుండి గ్రహింపఁబడినది. ఈ కథయందు శ్రీభాగవతాది విషయములు కలిపి
వ్రాయఁబడునని యెఱుంగుటొప్పు.

నములు గనఁబడఁగానే పరమానందసాగరమున నోలలాడుచు ముందు పరమమంగళము చేకూరనున్నదని భావించుకొనుచు బృందావనము చేరెను.

తొలుదొలుత బృందావనమున నక్షయమగు భాండీర వటతరువును గనుఁగొనియెను. పరిశుద్ధజలముల నిబిడమై తీర్థ రాజమనంబడు సరోవరమును దర్శించెను. సురుచిరవేషముల నున్న బాలకుల గుంపుకనఁబడఁగా హర్షించెను. ఆబాలకులు రక్తభూషణభూషితులై యుండిరి. వారెల్ల బాలకృష్ణా యని పిలుచుచు నంతలోనే రోదనము చేయుచు నాకృష్ణవిరహ మున మోములు వెలవెలఁబాఱి నుండిరి. ఉద్ధవుఁడు వారి నూ ఱడించి నాయన్నలారా! శ్రీకృష్ణమూర్తి కిశోరపరబ్రహ్మము వచ్చును. మీముచ్చటలం దీర్చును. ఊఱడిల్లుఁ డూఱడిల్లుఁ డని యాశ్వాసించి కృష్ణప్రీతికై యానందించుచు నగరమును బ్రవేశించెను. ముం దుద్ధవునకు నందశిబిర మానందకందమై కనఁబడియెను. అది మనుష్యకల్పితము కాక విశ్వకర్మనిర్మితము గాన సాటిలేని రత్నావళిమండితమై యుండెను. రత్నకలశము లద్దానిపై విరాజిల్లుచు నెంతో ముచ్చటగా నుండెను దాని ద్వార మత్యంతవిచిత్రమై కనఁబడఁగా ముదమొదుచు నా యుద్ధవుఁ డందుఁ బ్రవేశించెను. మందిరద్వారముకడ రథము నుండి దిగి ప్రాంగణమున నిలువఁబడెను. అందున్న యశోదా రోహిణు లాయుద్ధవుని రాకనెఱింగి కుశలప్రశ్న మొనరించిరి. కూర్చుండుమని ప్రార్థించి పీఠము పెట్టించిరి. పాద్యము నొసంగి గోవునిచ్చి మధుపర్కమర్పించి యాతిథేయసత్కారములు నాచరించి యలరఁజేసిరి.

* మహాత్మా! ఉద్ధవా! మానందభూపాలుఁ డెందున్న వాఁడు? బలరాముఁడు కృష్ణుఁ డెందున్నారు? సత్యము చెప్పుమా యని ప్రశ్నించిరి. ఉద్ధవుఁ డా మానినీశిరోమణు లొనరించిన యాతిథేయమునకుఁ బ్రీతిపూర్వసంభాషణము నకుఁ బరమానందభరితుఁడై రాజకుటుంబ మింత వినీతమగునే యని యబ్బురపడుచు నిట్టి మందిరోత్తమము కనుకనే పర మాత్మ యిందు వసించెనని యచ్చెరువందుచు మధురానగర మున క్రూరసహితుఁడై బలరాముంగూడి శ్రీగోపాలకృష్ణ మూర్తి ప్రవేశించిన దాదిగాఁ దన్నుఁ బంపినంతదనుక జరగిన చరిత్రము నించుకే వదలకుండ విన్నవించెను. ఇప్పుడు బలరామ శ్రీకృష్ణులంగూడి నందమహీజాని సానందుఁడై యున్నవాఁ డని మరల నొక్కిచెప్పెను. శ్రీకృష్ణుని బిలుచుకొని యించుక యాలస్యముగా నందుఁడు రాఁగలఁడు. మీరు చింతింపవలద నియు నొక్కిచెప్పెను. ఇచ్చట మీ కుశలముల నరసి నేను వెళ్లెదను. అంబా! నేను మధురానగరమునకుఁ బోవవలయు. ఇది శ్రీకృష్ణాజ్ఞ. దాని మీఱరాదు. తల్లీ! ఒక్కమాట యాల కింపుము. అందఱందు సానందముగా నున్నవారు. నిర్విచారము గా మీరుండుఁడు. అని యుద్ధవుఁడు చెవులకింపుగా మనస్సు నకుఁ బరమానందజనకముగాఁ దెలిపిన యావార్త నాలించిన యశోదారోహిణులు పరిమితిలేని సంతసమున నోలలాడిరి. అట్టి శుభవార్తాశ్రవణమున వారిరువురు బ్రాహ్మణులం బిలిచి రత్నాభరణములనొసంగి బాలకులకు స్వస్త్యయనము చేయించిరి. ఉద్ధవునకు మిష్టాన్నమును బెట్టి తృప్తునిం గావించిరి. ౮౩

---

* క్వ నందః క్వ బలః కృష్ణ స్సత్యం తత్కథయోద్ధవ. అని మూలము.

యన్న మమృతోపమానమని యాభక్తవర్యుఁడు భావించెను. తాంబూలాదులను రత్నోపహారముల నాతని యశోదారోహిణులు సంతృప్తుని గావించిరి. బ్రాహ్మణులు మిష్టాన్నభోజనంబుల సంతృప్తులై వేదములఁ బఠించి పరమానంద మాబాలకులకుఁ గలుగుఁగాతమని యాశీర్వదించిరి. * అంత యశోదాదేవి శంకరుని బ్రాహ్మణమూలమున నర్చించెను. నానావిధ మిష్టపదార్థముల నైవేద్యమిచ్చి సకలోపచారముల శంకరుం బ్రీతునిం గావించెను. పిదప భవానీదేవిని బూజించెను. ఆ భవానియే బృందారణ్యదేవత. షోడశోపచారపూజల నాదేవి నర్చించెను. † వివిధబలిప్రదానకృత్యము నెఱవేర్చెను. మఱియుఁ బరిశుద్ధ మహిషశతమును బరిశుద్ధచ్ఛాగముల సహస్రమును, మేషములఁ బదివేలసంఖ్యను దేవి కొసంగెను. బ్రాహ్మణపంచకమును బిలువంబంచి స్వర్ణముద్రికలశతమును, ధేనుశతమును, దక్షిణలను భక్తిమై నిచ్చి శ్రీకృష్ణునకు మేలుగలుగ ననుగ్రహింపుఁడీయని ప్రార్థించెను. పిదప నుద్ధవుని శ్రీకృష్ణకుశలవార్తానయనమున నలరి సాదరముగా మరలమరలఁ బూజించెను.

అంత నుద్ధవుఁడా యశోదారోహిణులను శ్రీకృష్ణకుశలవార్తలను దత్కృత్యవిశేషములను దెల్పి మరలమరల నాశ్వాసించెను. గోపబాలకులు గుంపులుగా శ్రీకృష్ణచరిత్ర

---

* శంకరం పూజయామాస విప్రద్వారా పరం విభుం. అని మూలము.

† షోడశోపచారై ర్ద్రవ్యైశ్చ బలిభిర్వివిధైర్మునే, మహిషాణాం శతం శుద్ధం ఛాగలానాం సహస్రకం, మేషాణామయుతం శుద్ధం యుక్తమాదాయ పంచకం, బ్రాహ్మణేభ్య స్స్వర్ణశతం ధేనూనాంచ శతం తథా, ప్రదదౌ దక్షిణాం తూర్ణం కృష్ణకల్యాణహేతవే. అని మూలము.

శ్రవణాదరుపులై రాఁగా వారి కాభగవంతుని చిత్రచరిత్రములఁ దెల్పి సంతుష్టమతులం జేసి గోపికలు శ్రీకృష్ణకుశలాదు లడుగ వారికిఁ దనివిపుట్ట నన్నియు వచించి వారింగూడి రాసమండలమున కరిగెను. చంద్రమండలమువలె వర్తులాకారమై మనోహరమై వర్ణనాతీతమై యుండెను. కదళీస్తంభములు ఫలభారమున వంగి చాలుగా నిలిపిన ట్లుండెను. శ్రీచందన వృక్షపల్లవములు చూడంజూడ వేడుక గొలుపుచుండెను. వృక్షములకుఁ బట్టములు వ్రేలాడుచుండఁగాఁ జూచువారి కవి యమూల్యవస్త్రములవలెఁ గనఁబడుచుండెను. పరిమళసమ్మిళితమాల్యము లందందు దృగ్గోచర మగుచుండెను. భగవత్పూజాద్రవ్యము లందందుండెను. చందనాగరుకస్తూరీవాసనలమించిన దివ్యానందదాయకవాసనలు గుబులుకొనుచుండెను. ఆ రాసమండలము నసంఖ్య లగుగోపికలు కాపాడుచుండిరి. అందందు భగవత్సేవామందిరము లానందజనకములగున ట్లమర్పఁబడి యుండెను. గోపకు లందందు నిలిచి కాపాడుచుండిరి. వారెల్ల శ్రీకృష్ణాగమనాదరమున నుండిరి.

అందొక్కచోట మాలతీవనము కలదు. అది యమునానదికి నుత్తరభాగమున నున్నది. అందు వకుళవృక్షములు వంజులభూరుహములు కన్నులపండువుగా నుండెను. అశోకతరువులు లెక్కకుమించి యుండెను. పలాశద్రుమములు చూడంజూడ నింపుగా నుండెను. మల్లికాలతలు సుమసౌరభముల వెదఁజల్లుచుండెను. శిరీషవృక్షము లందందుఁ గనఁబడుచుఁ దనపుష్పకోమలత్వమును దెలుపుచుండెను. యూధికావృక్షములు చాలుగానుండెను. మొగలిపొదలు మాధవీ మండప

ములు కన్నులుపండువుగా నుండెను. ఆ వనమున భగవంతుఁడు బాలక్రీడల సల్పుచుఁ బాదపద్మముల నలంకరించి యుండు టెఱింగి యుద్ధవుఁడు ప్రదక్షిణ మొనరించెను. దానింజుట్టి బహువిధ భూరుహసంతతులు కనఁబడఁగాఁ బరమానంద మందెను. లవంగకానన మందుండెను. సాలవనము, తాలవిపినము, హింతాలాటవియు, పనసరసాలగహనము కనఁబడియెను. లవంగీలతామండపము లందం దమర్పఁబడి యుండెను. మందారకాననమును గాంచి యుద్ధవుఁడు దానికి దక్షిణముగాఁ దిరిగి ప్రదక్షిణమొనర్చి "కృతకృత్యోస్మి"యనుకొనియె. కుందగుల్మముల దర్శించియు మధుకాననమును దిలకించియు ధన్యతమునిగాఁ దన్నుఁ దలంచుకొనియెను. పుంస్కోకిలాలాపము లందందు వినఁబడియెను. తుమ్మెదలు కుసుమపరాగములఁ జూరలాడి మధువులాని ఝంకారములు చేయుచుండెను. వనభూరుహములు మాధ్వీకమును గురిపించుపుష్పములు నిండియుండఁ గన్నులకు విందుసేయుచుండెను. వాయువు లల్లనల్లన విసరుచుండ దాన కుసుమముల పరిమళములు గుబులుకొనుచుండ వనమెల్ల సువాసనలకు నిలయమైనట్టు లుండెను.

ఉద్ధవుఁ డందుల కానందపరవశుఁడై యశోదాదేవి చెప్పినమార్గము ననుసరించి శీఘ్రగమనమున నతిరహస్యమగు బదరీవనమున కరిగెను. ఆమార్గము నిరుద్విగ్నమై యుండెను. శ్రీఫలభూరుహములు నింబములు నారింగములు దానియందు నిండియుండెను. అందు సరోవరములు తులసీకాననములు క్రిక్కిరిసియుండెను. సుపక్వఫలభరితములై వృక్షము లుండం జూచి యావనమును వామపార్శ్వముగా నుండునట్లు నడచి

యవ్వలిదగు కదళీవనమును బ్రవేశించెను. అది నిర్జనమై రమ్యమైయుండెను. అందొకచో రాధికాశ్రమము కన్నుల పండువు సేయుచుండెను. దాని ప్రాకారము మణినిర్మితము. దుర్గమపరిఖావేష్టితము. శత్రువుల కేరికే నగమ్యము. సజ్జనులకు సుగమము. అతిగోప్యము. సంకేతమార్గము కలది. రక్షకు లతిజాగరూకులై కాపాడుచుండిరి. విశ్వకర్మయే దాని నిర్మించెను.

ఆ రాధామందిరమును బొగడ బృందారకులకే నశక్యము. గోపికాగోపకులు దాని చుట్టునుండిరి. వేత్రహస్తులై గోలోకమునుండి యవతరించి గోపాలకు లనంబరఁగు పార్షదులు దానిం గాపాడుచుండిరి. ఆసౌధద్వారమును ముందుగఁ దిలకించి యుద్ధవుఁడు భక్తిభరమున వినమ్రుఁడై లోపలఁ బ్రవేశించెను. ద్వితీయద్వారము ప్రథమద్వార సౌందర్యమును మించియుండెను. తృతీయ చతుర్థద్వారము లేకోత్తరవృద్ధిన్యాయమున సౌందర్యనిలయములై యుండెను. అందు నాల్గవద్వారమతివిలక్షణము. ఐదవద్వార మద్దానిని మించియుండెను. ఆఱవది చూపఱకు వేడ్క నింపుచుండెను. అందు రామరావణ యుద్ధవార్తలం దెలుపుచిత్రములు కన్నులకు విందుగొలుపుచుండెను. శ్రీమహావిష్ణు దశావతారముల ప్రతిమ లందుండెను. ఒక్కచో రాసమండల చిత్రము లిఖింపఁబడియుండెను. యమునాప్రవాహచిత్ర మందుఁ జిత్రితమైయుండెను. ఆద్వారమును గోపికలే రక్షించుచుండిరి. దానిని వర్ణింప నవకాశమే లేదు.

ఆద్వారపాలికలయం దధిష్ఠాత్రదేవియగు మాధవి యుద్ధవుని జూచినంతనే యాదృతిఁ గుశలమడిగెను. ఉద్ధవుఁడు కుశలవార్తలనెల్ల నామె కెఱుకపఱచెను. ఆకుశలవార్తల నాత్మ

సఖీబృందమున కెఱింగించి సంతోషమును దెలుపు శుభవాద్యముల మ్రోఁగఁజేసెను. ప్రియవార్తను దెచ్చిన యుద్ధవుని రాధామందిరమునకుఁ బిలుచుకొని పోయెను. ఉద్ధవుఁడా దివ్యమందిరమున నొక్కచో నమావాస్యనాఁటి చంద్రకళవలె నున్న రాధికం గాంచెను. ఆదేవి శోకభారవివశయై శయనించియే యుండెను. ఆమె పంకజనేత్రములు దుఃఖాశ్రుబిందుసంభృతములై యుండెను. రోదనము చేయుచుఁ బరుండినందున నాచిహ్నము లట్లేయుండెను. ముఖ మెఱ్ఱఁబాఱియుండెను. భూషణములు తీసివేయఁబడి యుండెను. ఆహారము వదలుట చూడఁగనే స్పష్టమగుచుండెను. సువర్ణవర్ణకుండలములు మాత్రము కనఁబడుచుండెను. నిశ్వాసములు తీవ్రరూపమును దాల్చియుండెను.

అట్టి రాధికనుగాంచి యుద్ధవుఁడు ప్రదక్షిణక్రమమున నమస్కరించెను. భక్తిభారమున వంగియుండెను. పులకాంచితసర్వాంగుఁ డయ్యెను. భక్తుఁడుగావున ధ్యానమొనరించెను. భక్తిభారమున నా పరదేవిం గాంచి తల్లీ! *నీవు బ్రహ్మాదిసురవందితపాదాంబుజాతవు. నీకీర్తి లేశము స్మరించినంత ముల్లోకములు

---

ఉద్ధవకృతరాధాంబికాస్తుతిః.

శ్లో. వందే రాధాపదాంభోజం బ్రహ్మాదిసురవందితం, యత్కీర్తికీర్తనేనైవ పునాతి భువనత్రయం. ౧. నమో గోకులవాసిన్యై రాధికాయై నమోనమః, శతశృంగనివాసిన్యై చంద్రవత్యై నమో నమః. ౨. తులసీవనవాసిన్యై బృందారణ్యై నమోనమః, రాసమండలవాసిన్యై రాసేశ్వర్యై నమోనమః. ౩. విరజాతీరవాసిన్యై బృందాయై చ నమోనమః, బృందావనవిలాసిన్యై కృష్ణాయై చ నమో నమః. ౪. నమః కృష్ణప్రియాయై చ శాం

పవిత్రములగును. గోలోకమునుండి గోకులమున నవతరించితివి. రాధికానామము నిందును ధరించియే యున్నదానవు. శతశృం

---

తాయై చ నమోనమః, కృష్ణవక్షస్స్థితాయై చ తత్ప్రియాయై నమోనమః. ౫. నమో వైకుంఠవాసిన్యై మహాలక్ష్మ్యై నమోనమః, విద్యాధిష్ఠాతృదేవ్యై చ సరస్వత్యై నమోనమః. ౬. సర్వైశ్వర్యాధిదేవ్యై చ కమలాయై నమోనమః, పద్మనాభప్రియాయై చ పద్మాయై చ నమోనమః. ౭. మహావిష్ణోశ్చ మాత్రే చ పరాద్యాయై నమోనమః, నమస్సింధుసుతాయై చ మర్త్యలక్ష్మ్యై నమోనమః. ౮. నారాయణప్రియాయై చ నారాయణ్యై నమోనమః, నమోఽస్తు విష్ణుమాయాయై వైష్ణవ్యై చ నమోనమః. ౯. మహామాయాస్వరూపాయై సంపదాయై నమోనమః, నమః కల్యాణరూపిణ్యై శుభాయై చ నమోనమః. ౧౦. మాత్రే చతుర్ణాం వేదానాం సావిత్ర్యై చ నమోనమః, నమో దుర్గవినాశిన్యై దుర్గాదేవ్యై నమోనమః. ౧౧. తేజస్సు సర్వదేవానాం పురా కృతయుగే ముదా, అధిష్ఠాన కృతాయై చ ప్రకృత్యై చ నమోనమః. ౧౨. నమస్త్రిపురహారిణ్యై త్రిపురాయై నమోనమః, సుందరీషు చ రమ్యాయై నిర్గుణాయై నమోనమః. ౧౩. నమో నిద్రాస్వరూపాయై నిర్గుణాయై నమోనమః, నమో దక్షసుతాయై చ నమస్సత్యై నమోనమః. ౧౪. నమశ్శైలసుతాయై చ పార్వత్యై చ నమోనమః, నమో నమస్తపస్విన్యై హ్యుమాయై చ నమోనమః. ౧౫. నిరాహారస్వరూపాయై హ్యపర్ణాయై నమోనమః, గౌరీ లోకవిలాసిన్యై నమో గౌర్యై నమోనమః. ౧౬. నమః కైలాసవాసిన్యై మాహేశ్వర్యై నమోనమః, నిద్రాయై చ దయాయై చ శ్రద్ధాయై చ నమోనమః. ౧౭. నమో ధృత్యై క్షమాయై చ లజ్జాయై చ నమోనమః, తృష్ణాయై క్షుత్స్వరూపాయై స్థితికర్త్రై నమోనమః. ౧౮. నమస్సంహారరూపిణ్యై మహామాయై నమోనమః, భయాయై చాభయాయై చ ముక్తిదాయై నమోనమః. ౧౯. నమస్స్వధాయై స్వాహాయై శాంత్యై కాంత్యై

గనివాసినివి. చంద్రవతివి. తులసీవననివాసినివి. బృందావన నివాసప్రమోదవు. రాసమండలవాసినివి. రాసేశ్వరివి. విరజా తీర వాసినివి. బృందానామధారిణివి. బృందావనవిలాసినివి. కృష్ణప్రియనామమున వెలయుదానవు. శ్రీకృష్ణవక్షస్థ్సల నివాస ప్రమోదవు. అని యనేకవిధముల వినుతించెను. ఇది యుద్ధవ కృతస్తోత్రము. ఏమానవుఁడేని భక్తియుక్తుఁడై దీనిం బఠించిన నైహికాముష్మిక ఫలంబుల నొందును. సకల వాంఛితములు సద్యస్కాలముననే ఫలించును.

మహాశయులారా! ఈ కథనుండి యెఱుంగఁదగిన విష యములు పెక్కులు గలవు. వానిలో ముఖ్యతమములగు నొక

---

నమోనమః, నమస్తుష్ట్యై చ పుష్ట్యై చ దయాయై చ నమోనమః. ౨౦. నమో సిద్ధ్యాస్వరూపాయై శ్రద్ధాయై చ నమోనమః, క్షుత్పిపాసా స్వరూపాయై లజ్జాయై చ నమోనమః. ౨౧. నమో ధృత్యై క్షమాయై చ చేతనాయై నమో నమః, సర్వశక్తిస్వరూపిణ్యై సర్వమాత్రే నమోనమః. ౨౨. అగ్నౌదాహస్వరూపాయై భద్రాయై చ నమో నమః, శోభాయై పూర్ణ చంద్రే చ శరత్పద్మే నమోనమః. ౨౩. నాస్తిభేదా యథాదేవి దుగ్ధధా వళ్యయోస్సదా, యథైవగంధభూమ్యోశ్చ యథైవజలశైత్యయోః. ౨౪. యథైవ శబ్దనభసోర్జ్యోతి స్సూర్యకయోర్యథా, లోకే వేదే పురాణే చ రాధా మాధవయోస్తథా. ౨౫. చేతనం కురు కల్యాణి దేహిమా ముత్తరంసతి, ఇత్యుక్త్వా చోద్ధవస్తత్ర ప్రణినామ పునఃపునః. ౨౬. ఇత్యుద్ధవకృతం స్తోత్రం యఃపఠే ద్భక్తిపూర్వకం, ఇహలోకే సుఖం భుక్త్వా యాత్యంతే హరిమంది రమ్. ౨౭. న భవేద్బంధువిచ్ఛేదో రోగశ్శోకస్సుదారుణః, ప్రోషితా స్త్రీలభే త్కాంతం భార్యాభేదీ లభేత్ప్రియాం. ౨౮. అపుత్రో లభతేపుత్రా న్నిర్ధనో లభతేధనమ్, నిర్భూమిర్లభతే భూమిం ప్రజాహీనో లభేత్ప్రజామ్. ౨౯.

ఇత్యుద్ధవకృతం రాధాస్తోత్రం సంపూర్ణమ్.

టి రెండు విషయములమాత్రమే యిట వ్రాసెదను. ఆలకింపుఁడు. భగవంతుఁ డుద్ధవుని గోకులమునకుఁ బంపి తనరాకంగోరి పరితపించు నందలివారి నూఱడింపుమనియె. ఉద్ధవుఁడన్ననో పరమైకాంతికభక్తుఁడు. విశేషించి శ్రీకృష్ణాజ్ఞను శిరసావహించువాఁడు. భగవంతుఁ డిట్లాజ్ఞాపింప నదియే ప్రసాదసారమని భావించి గోకులమునకుఁ జనుచు నందందు శుభశకునములు తోఁప వానిం దిలకించుచుఁ బోయి బృందావనమున గోకులమును గాంచెను. బృందావనమున నొక గోకులమున్నదియా యను సందియమందకుఁడు. గోకులమున ననేకదుర్నిమిత్తములు తోఁపఁగా నందాదులు దానిని వదలి బృందావనమున కరిగిరని ముందే మీరు చదివియున్నవారు. నందాదులా బృందావనమున నివాసములు కావించుకొన్న చోటునకే గోకులమను పేరు గల్గెను. ఆవనమునందే వేఱొకతావున రాసమండలము గలదు. శ్రీకృష్ణభక్తులకు రాసమండలార్చనము నృత్తగీతములు ప్రధానములని యింతకుముందే వ్రాసియుంటిని గదా. మఱొకతావున రాధాదేవి నివసించుమందిరము గలదు. ఆమందిరము రాసమండలమునకు సమీపమున నున్నది. రాసేశ్వరియన్నను రాధయన్న నొక్కటియే యని గ్రహింపుఁడు. ఇవ్విషయములు మదినిడుకొన్నచోఁ గథను వినునప్పుడు శంకలు పొడముకుండు.

ఉద్ధవుఁడు బృందావనము చేరంజని గోకులమునకుం బోయి నందమందిరమునకుం బోయెను. యశోదారోహిణులం దుద్ధవున కాతిథేయసత్కారము లాచరించిరి. కుశలమడిగిరి. ఈపట్టున నాకాలపుటాచారము లెట్లుండునని యించుక విచారించు టధికప్రసంగము కాదు. ఇపుడు నందమందిరమున నున్న

వారు యశోదారోహిణులు. ఏ రిరువురు శ్రీకృష్ణబలరామ మాతలు. పుత్రవియోగమునఁ గుందుచున్నవారే. వారిదృష్టి కీలోకమునఁ బుత్త్రులకంటెఁ బ్రియతమపదార్థము వేఱుగనున్న ట్లగపడదనుట నిక్కము. అట్టిచో వారెట్లు సంభాషించిరో యించుక విమర్శించిన నాకాలమున స్త్రీల యలవాటు లెట్టివో తేటపడఁ గలవు. యశోద యుద్ధవునింగూర్చి యిట్లు పల్కినది. ఇరువు రొక్కసారి మాటలాడుట బాగులేదు కదా!

క్వనందః క్వబలః కృష్ణ స్సత్యం తత్కథయోద్ధవ.

అనునదియే ప్రశ్నము. యశోద సాధ్వీమణి. కావున ముందు భర్తనుగుఱించి ప్రశ్నించెను.

పతిప్రియహితే యుక్తా స్వాచారా విజితేంద్రియా,
సేహకీర్తి మవాప్నోతి ప్రేత్య చానుత్తమాం గతిమ్.

అను యాజ్ఞవల్క్యస్మృతి ననుసరించి పతిప్రియమునే తొలుదొలుతఁ గోరవలసినది పతివ్రతాధర్మము. కావుననే స్త్రీలకు భర్తకంటెఁ బ్రియతమపదార్థము ప్రపంచమున నుండరాదనువిధి నిర్ణయింపఁబడియె. ఆ యాచారము ననుసరించియే యశోద నందుఁ డెందున్నవాఁడని ప్రశ్నించెను. అవల బలరాము నడిగెను. పిదప శ్రీకృష్ణునిఁ బ్రశ్నించెను. బలరాముఁడు రోహిణికుమారుఁడు. కాని యశోదారోహిణులకు బలరామ శ్రీకృష్ణులు తుల్యులు. భేదములేదు. కాఁబట్టి పెద్దకొడుకును దొలుత నడిగెను. తరువాతఁ గృష్ణునడిగెను. దీనింబట్టి యూహింపఁగా నాకాలమున ననఁగా ద్వాపరాంతమున నెంతటిప్రీతి స్త్రీలయం దొకరికొకరికిఁ గలిగియుండెనో భేదబుద్ధియించుకంతయులేక సమబుద్ధి యెట్టులుండెనో తేటపడును. ఈ కా

లమునకు నా కాలమునకుఁ దారతమ్యము పర్వత మశకముల కుండునంత యనవచ్చును గదా. హస్తిమశకన్యాయ మనరాదు. పిదప నుద్ధవుఁడు కుశలములం దెలుప నాలకించి హర్షించి యా యుత్సాహమున నీఁకముందును బతిపుత్రులకు మేలుచేకూరుట కై పరమేశ్వరుఁడగు మహాదేవుని

శంకరం పూజయామాస విప్రద్వారా పరం విభుమ్.

బ్రాహ్మణులద్వారా పూజించెను. తానేల పూజింపరా దనరాదు. స్త్రీలు శివపూజ చేయరాదు. విప్రులద్వారా చేయింపవలయు. విగ్రహములఁ బూజించుటకు స్త్రీల కధికారము గలదు. ఇది భేదబుద్ధిగాదా. మహర్షుల కిట్టినియమములు చేయుట న్యాయమా యని ప్రశ్నింపకుఁడు. స్మృతికర్తలకుఁ బక్షపాతము లేదు.

స్వాం ప్రసూతిం చరిత్రం చ కులమాత్మాన మేవ చ,
స్వంచధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్ హి రక్షతి.
అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్,
శౌచే ధర్మేఽన్నపంక్త్యాం చ పారిణాహ్యస్య వేక్షణే.
అరక్షితా గృహేరుద్ధాః పురుషై రాప్తకారిభిః,
ఆత్మాన మాత్మనా యాస్తు రక్షేయుస్తా స్సురక్షితాః.

మనుస్మృతి. ౯ అధ్యాయము.

అనుపద్ధతుల ననుసరించి స్త్రీలకు గృహశిశుపాలనాది మహాకార్యములు విధించి దేవపూజాదులు పురుషకర్తవ్యము లని శాసించిరి కాని భేదబుద్ధిని గాదు. సర్వభూతసము లగు మహాత్ముల కట్టికుబుద్ధి యెట్లుండును? కొంచమైన నాలోచింపక వారినాక్షేపించుట తెలివితక్కువ కాదా. పురుషులు పాలిచ్చి

తులేయని తేటపఱచును. లక్ష్మి సావిత్రి పార్వతి యనువారు లీదేవియేయని వెల్లడించును.

"నమః కైలాసవాసిన్యై మాహేశ్వర్యై నమోనమః"

అనఁగా నేమి? ఇది రాధాస్తుతియని మాత్రము మఱువకుఁడు. కైలాసమందున్న పార్వతియు నీరాధయే యనఁగా లోకరక్షణార్థమై మూర్తిత్రయమనంబడు బ్రహ్మ విష్ణు శంకరులఁ బుట్టించి వారికిఁ బత్నులఁగా వాణీ లక్ష్మి పార్వతులను గల్పించెనని గదా దీనిసారము. త్రిమూర్తులే యీామె యంశసంభూతులనఁగా నిఁక శివకేశవులలో నొకరు గొప్ప వేఱొకరు తక్కువ యనుభావ మేమూలనున్నదో తెలియకున్నది. అట్టిభావ మజ్ఞానకల్పితముగాక మఱేమిటి? ఇంతమాత్రము కనుఁగొనలేనివారు ముక్తిమార్గమును దెలుపుదుమనుటకంటెఁ బరిహాసపాత్ర మగువిషయము వేఱొకటి యుండునా యని మిమ్మడుగుచున్నాఁడ. మీా రేమనఁగలరు?

ఈస్తుతి సారమేమనఁగా

ప్రకృతియనునది పార్వతి గాదు. లక్ష్మి గాదు. శారద గాదు. పరాత్పరుని యిచ్ఛ. ఇచ్ఛాశబ్దము స్త్రీలింగమని వ్యాకరణకర్తలు శాసించిరి. బ్రహ్మశబ్దము నపుంసకలింగ మనిరి. కళత్రమనఁగా భార్యగదా. ఆకళత్రశబ్దము నపుంసకలింగ మనిరి. ఇది వ్యాకరణనియమము. దీనిని నమ్మి భ్రమించి ప్రకృతియనఁగా నొకస్త్రీయనియు, ఆమెయే పార్వతియనియు భావించి వైష్ణవు లులికిపడుచుందురు. తుదముట్ట శాక్తగ్రంథములు పఠించినఁ బ్రకృతి పార్వతియా కాదా యనుసిద్ధాంతము తేలఁగలదు. ముందే యులికిపడి మొండివాదము చేయఁబూనిన

వారికిఁ దెలుపవలసిన విషయ మేమిగలదు. శాక్తుఁడుకాని వాఁడు లోకమున లేఁడు. లోకమంతయు శక్తికల్పితము. ఏపే రున నామెను గీర్తించినను ఆక్షేపము లేదు. సర్వశబ్దవాచ్యత్వ మే యామెచరిత్రము. ఇందు వైష్ణవులకు శైవులకును మాట లాడ స్థలమే లేదు. భగవంతు నేనామమునఁ బిలిచినను దోషము గాదు. సర్వశబ్దవాచ్యుఁడు భగవంతుఁడు కాఁడనుచో వారితో మనము మాటలాడఁ బనియుండదు. వారి కిదియే తొలిజన్మము. చాల జన్మములకుఁగాని వారికి బుద్ధి మార్పునొందదు. అట్టి మార్పు వారిబుద్ధియందుఁ ద్వరగాఁ గావలయునని మన మా పరాత్పరుని గోరవలయును. మనము చేయఁదగు ప్రథమకృత్య మిదియే. వారితో ద్వేషింపరాదు. వా రేమిచేయుదురు. వారికిఁ దోఁచినంత తెలిపిరి. వారితప్పేమియు నిందుఁ గానరాదు. కావు న మనము వారిని దూషింపరాదని విన్నవించువాఁడను. ఇఁకఁ బ్రకృతము ననుసరించెదను.

రాధాంబికను స్తుతించి యుద్ధవుఁడు ధన్యుఁడయ్యెను. కృతకృత్యుఁ డయ్యె. సఫలమనోరథుఁ డయ్యెను. ఇంతయేల? భగవత్సేవాపాత్రుఁడయ్యెను. మనఃక్లేశము లాతనిమదినుండి తొలఁగెను. ఏలనఁగా,

"తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్."

అనున్యాయము ననుసరింపవలయుఁ గదా. భగవంతుఁడే రాజనుకొందము. మంత్రి ప్రకృతియనుకొనక తప్పదుకదా. మంత్రిద్వారాకదా రాజదర్శనము చేయుట లోకాచారము. అట్లే ప్రకృతినాశ్రయించి తత్కటాక్షపాత్రులమై పిదప భగవం తుని సేవింపవలయును. ఇదియే సాధుమార్గము. అడ్డుత్రోవలం

బోయిన రాజభవనమునకు గన్నము పెట్టి రాజును దర్శించి తత్కటాక్షపాత్రులము కాఁగోరినట్లే యగు. ఇదెట్లు ఫలము నిచ్చునో యదియు నట్లే ఫలమొసంగును. కావున నోమహాశయులారా! శ్రీరాధాంబికయే మూలప్రకృతియని భావించి తత్పాదసేవ చేయుఁడు. దానిచే శ్రీకృష్ణపరబ్రహ్మమును భజింపఁజాలుయోగ్యత కలుగఁగలదు. ఇది సున్నయగుచో నదియు సున్నయే.సంశయము లేదు.రాధామాధవులకు భేదమును గల్పింపకుఁడు. రాధ శ్రీకృష్ణుని యుంపుడుకత్తెయని తెలివితక్కువ ప్రసంగములు చేయువారిమాటల నాలకింపకుఁడు. రాధను భజింపక శ్రీకృష్ణుని భజింప వలనుపడదు. ఇంకనైనను గన్నులు తెఱచి రాధాదేవిని భక్తిమై నారాధింపుఁడు. సర్వదేవతాస్వరూపిణినిగా ధ్యానింపుఁడు. ఆమె చక్కనిమార్గమును గనఁబఱచు. దాన నించుకపయనమును సాగించిన భగవత్సేవ దొరకును. కృతార్థుల మగుదుము. ఇంకను విశేషించి వచించుట కవకాశము లేదు. కాన నింక నీవిషయమునుండి గ్రహింపఁదగిన నీతులను బరిశీలింపుఁడని మిమ్ములనే వేఁడుచు నవ్వలిచరిత్రమును వ్రాయ లేఖినిం బ్రోత్సహించెదను.

పాఠకమహాశయులారా! దీనితర్వాతికథ శ్రీకృష్ణుని కుశలోదంతమును బ్రశ్నించుట, ఉద్ధవుఁడు బదులు చెప్పుట యనునదియై యున్నది. శ్రీభాగవతమునందు గోపిక లుద్ధవునితో మాటలాడుచు నన్యాపదేశముగా శ్రీకృష్ణునిఁ జాకను గోరువిషయము చెప్పఁబడినది. అదియే భ్రమరగీతానామమున వ్యవహరింపఁబడును. దానిని వ్రాయుటకుముందు చోటు గానరా కుండును. కావున ఆవిషయమును వ్రాసి పిదప రాధోద్ధవసంవాద

మును వ్రాసెదను. అనఁగా నిపు డుద్ధవుఁడు గోపికలతో సంభాషించుచున్నవాఁడని యూహింపవలయునని కోరెదను. రాధతో నుద్ధవుఁడు మాటలాడ నింకను బోలేదని భావించి యీకథను జదువుఁడు. ఇదియే యిపుడు మీకుఁ దెలుపఁదగు విషయము. ఈకథప్రకార ముద్ధవుఁడు గోకులమును బ్రవేశించుచుండఁ జూచి గోపికలు మాటలాడుచున్నవారు కదా యని మాత్రము మఱువకుఁడు.

## భ్రమరగీతలు.

* ఉద్ధవుని గోపికలు కాంచిరి. ఆజానుబాహుఁడై నూత్నకమలదళలోచనుఁడై పీతాంబరమును దాల్చి కమలహారమును దాల్చి ముఖారవిందము చూచువారి కద్భుతానందమిసుమడింపఁజేసి కుండలమండిత కర్ణయుగళుఁడై యుద్ధవుఁడొప్పెను. ఆతనిమోమునఁ జిఱునవ్వు కనఁబడుచుండుటయేగాక యద్భుతానందమును బ్రేక్షకులకుఁ గలిగించుచుండెను. అట్టి విచిత్రరూపుని భగవద్భక్తాగ్రేసరుని గనుంగొని గోపికలెవ్వఁడీమహాత్ముఁడు నయనానందమును వెల్లివిరియఁ జేయుచున్నవాఁడు? ఎచ్చటినుండి వచ్చెను? శ్రీకృష్ణవేషమును ధరించినవాఁడు? శ్రీకృష్ణదర్శనజనితానందమే యీతనిం జూడఁ గల్గు

---

* ఈవిషయము శ్రీభాగవతము దశమస్కంధము నలువదియేడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపఁదగు. మఱియు నీవిషయమున నించుక గర్గసంహిత మథురాకాండము పదునేడవయధ్యాయమునఁ గలవిషయము కలిపి వ్రాయఁబడుననియుం నెఱుంగఁదగును. బ్రహ్మ విష్ణు బ్రహ్మవైవర్తపురాణములయం దీవిషయమే లేదు. శ్రీభాగవతకథతో గర్గసంహిత కథను గలుపుచు వ్రాసెదను.

చున్నయది? అని యబ్బురపడుచు నానంద ముప్పొంగుచుండ నుత్తమ యశోధురంధరుఁడైయున్న యా శ్రీకృష్ణభక్తునిం గాంచిరి. వినయముట్టిపడ నమస్కరించిరి. అతిథేయసత్కారముల నలరించిరి. లజ్జయు, నవ్వు, ప్రీతివీక్షణము, సూనృతాద్యలంకారము లాతనియందుండుట దెలిసికొనిరి. పీఠముపైఁ గూరుచుండఁ బ్రార్థించిరి. శ్రీకృష్ణవార్తాహారునిగా భావించిరి. మంద్రస్వరమున నిట్లు ప్రశ్నించిరి.

మహాశయా! యదువంశనాథుఁ డగురమానాథుని పార్షదుఁడవని, యామాన్యుఁడు పంపఁగా నరుదెంచినదూతవని యెఱింగితిమి. తల్లిదండ్రులకుఁ బ్రియమును గోరుజగత్పతి నిన్నుంపినాఁడు. కావుననే యీబృందావనమున కరుదెంచితిరి. * ఆమా శ్రీకృష్ణునకుఁ దలిదండ్రులసేవ మఱయుకార్యము తప్ప నీగోకులమున స్మరింపఁదగినవిషయ మేమియున్నది? ఉన్నట్టు మేము తలంపము. † మునికింగూడ బంధువుల స్నేహానుబంధము

---

* అన్యథా గోవ్రజే తస్య స్మరణీయం న చక్ష్మహే- అని మూలము. తొలుదొలుత జననీజనకు లగునదితి కశ్యపావతారులయిన యశోదానంద భూపతులు స్మరింపఁదగినవారనుట ప్రాచీనధర్మమును మే మెఱుంగుదుమని గోపికలభావము. మానవుఁడు తొలుత జననీజనకుల కుశలమెఱుంగుపని ముఖ్యతమమని తెలిసికొనఁదగునని దీని యుపదేశము.

† స్నేహానుబంధో బంధూనాం మునేరపి సుదుస్త్యజః, అన్యేష్వర్థకృతామైత్రీ యావదర్థవిడంబనా-అని మూలము. మునియనఁగా మననము చేయువాఁడు. అనఁగా నిష్టదైవతరూపము సదా ధ్యానించువాఁడని తాత్పర్యము. అట్టివానికింగూడఁ దలిదండ్రులవిషయ మగుననుబంధము తప్పదు. అంతదనుకఁ గర్మము వాని ననుసరించియే యుండును. సోఽహంభావము

వదల శక్యముగానిది. జననీజనకేతరబంధువులయందుఁ జేయుమైత్రి కార్యార్థమై యుండును. ఆమైత్రి కార్యంబు ముగిసిన వెనుక నది నటించుటకు మాత్రమే పనికివచ్చును. అనఁగా స్నేహముండినట్లు ప్రవర్తించవచ్చునుగాని కార్యము ముగియక మునుపున్నయట్టిది కాదు.

ఆర్యులారా! యిందలి రహస్యవిషయములనుగూడ నిందే వ్రాయుచుందును. కానఁ గథవలె లేదేయని భావింపకుఁడు. ఇపుడు గోపికలచిత్తవృత్తి భగవద్దర్శనాతురమై యున్నది. శ్రీకృష్ణమూర్తి మధురానగరమునుండి రాఁడేమోయని గోపికలు కొందలంపడుచున్నవారు. ఉద్ధవునిఁ గాంచినంతనే శ్రీకృష్ణమూర్తియే యీతనింబంపెనని గుఱుతించిరి. భగవద్విరహము నోర్వని భక్తిపరవశ లగుగోపికలు నర్మగర్భముగాఁ దమభావముల నాతనికిం జెప్పఁదలంచి యిట్లు మాటలాడుచున్నవారు. కావున నిందుఁ బ్రాతీతికార్థమే గాక విశేషార్థము లుండక తప్పదు. కాఁబట్టియే యాశ్లోకముల వ్రాసి విశేషార్థము నించుక వ్రాయుచు గోపికలభక్తిని వెల్లడించెదను. ఈగోడవ యిటి నేలయనిమాత్రము తలంపక యవకాశ మించుకవ్యయపఱచి పఠింపుఁడు. గోపికలభక్తి పరవశత్వము తేటపడును.

ఉద్ధవా! తుమ్మెదలు మకరందమును గ్రోలుతలంపున సుమనస్సులజేరునట్లు పురుషులు స్త్రీరత్నములయందు మైత్రి నునుతురు. కొంతకాలమునకువెనుక వారిం ద్యజింతురు. వేశ్యలు నిర్ధనుఁడగుపురుషుని వదలుదురు. ప్రజలు తమ్ము

---

దృఢముకాఁగా నది నశించును. అప్పు డతఁడు మునియనఁబడఁడు. ముక్తుఁడనఁబడును. అని యిందలిరహస్యము.

రక్షింప సమర్థుఁడు కాని ప్రభువును వదలుదురు. చదువునేర్చిన పిదప శిష్యులు గురువును వదలుదురు. ఋత్విజులు యజ్ఞదక్షిణలం గైకొని యజమానుని వీడుదురు. పక్షులు ఫలము లుండు నంతదనుక వృక్షము నాశ్రయించి ఫలములు ముగిసినపిదప వేఱొండు తావునకుం బోవును. అతిథులు గృహస్థునింటికిం జనుదెంచి సత్కృతులై భుజించి, యావెనుక నాయిల్లును బాయుదురు. మృగములు నీరంధ్రారణ్యమున నివసించి దావాగ్నియాయడవినింగాల్ప వేఱొండు కానకుఁ బరుగిడును. జారుఁడు తాఁ బ్రేమించినకాంతను సుఖానంతరము త్యజించును. ఉద్ధవా! యీ యుదాహరణములు లోకమునఁ గలవుకదా. అని పలికిరి. ఈఘట్టమున నేలొకో మహాకవిపోతన మూలమును వదలియించుక వ్రాసి ముగించెను.

మూ. పుంభిస్త్రీషు కృతా యద్వత్సుమనస్స్వివ షట్పదైః,
నిస్స్వం త్యజంతి గణికా అకల్యం నృపతిం ప్రజాః. ౭
అధీతవిద్యా ఆచార్య మృత్విజో దత్తదక్షిణం.
ఖగా వీతఫలం వృక్షం భుక్త్వా చాతిథయో గృహం.
దగ్ధం మృగా స్తథా రణ్యం జారో భుక్త్వా రతాం స్త్రియం.

ఈమూలమునకు మహాకవి వ్రాసినపద్యమును దిలకింపుఁడు.

క. మునివరులైనను బంధుల
ఘనసఖ్యము విడువలేరు గాక విడువరే
ననిమిత్త సఖ్యమొఁకటి
సనితీఱిన నళులువిరులఁ బాయునొ లేదో.

ఈయొక్క పద్యముతప్ప వేఱుగానరాదు. ఇందుఁ బైశ్లోకముల భావమేగాక వీనికి ముందున్న

మూ. స్నేహానుబంధో బంధూనాం మునేరపి సుదుస్త్యజః,
అన్యైష్వర్థకృతా మైత్రి యావదర్థవిడంబనా. ౬

అనుశ్లోకార్థముగూడ నిమిడియున్న ట్లూహింపక తప్పదు. ఇన్ని శ్లోకముల కొక్కపద్యము వ్రాయ నేమిహేతువో తెలియఁ జాలకున్నాఁడ. భక్తిశృంగారము లిందు లేవని కాఁబోలు. "కాక విడువరే సనిమిత్తసఖ్యము" అనుచో రసము తులకించుట లేదు. చప్పిడిగా నున్నది. వారిభావ మేదియైయుండునా యని యూహించునంతటి ప్రజ్ఞ నాకు లేదని తలంచి యీచర్చమాని నాకుం దోఁచినభావమును వ్రాయఁ బూనెదను. గోపికలభావ మిదియై యుండును. తలిదండ్రులు కాక యితరులగు బంధువులయం దొనరించు మైత్రి కార్యము తీఱిన పిదప నుండదు. అనునది ప్రాతీతికార్థము. శ్రీకృష్ణుఁడు పరాత్పరుఁడు. సృష్టి చేయఁబూనునపు డొక్కకార్యముకొఱకుఁ గొందఱియందు మైత్రిగలుగునట్లు నటించును. ఆపనికాఁగానే వారిని వదలును. ఇది పక్షపాతము కాదు. ఆమహాత్మునకుఁ దలిదండ్రులయం దెక్కువప్రీతియు నితరులయందుఁ దక్కువమైత్రియు నుండదు. సర్వసముఁడు కదా పరమాత్మ. అని వా రెఱింగినవారేయని మన మూహింపఁదగు. ఈభావము క్రిందిశ్లోకములంబట్టి దృఢపఱుపవచ్చును. పురుషులు స్త్రీలయం దునుచు ప్రీతి కార్యానంతరము నిలువదు. అట్లే తుమ్మెదలు విరుల రసమును గ్రోలి వెనుక వాని వదలును. అనునది సామాన్యార్థము. విశేషార్థ మేమనఁగా, పరమపురుషుఁడగు శ్రీకృష్ణమూర్తి సృష్టికార్యమునందుఁ బ్రకృతియందు మైత్రి నునుచును. అనఁగాఁ బ్రకృతికి లోఁబడును. సృష్టి లయముకాఁగాఁ బ్రకృతిని వద.

లును. అనఁగా లోఁబడినట్లు నటింపఁడు. అట్లే సుమనస్సులు, అనఁగా దేవతలు. వారియందును బ్రీతి యితరులకంటె నెక్కుడుగా నునుపఁడు. కావున సర్వభూతసముఁడు శ్రీకృష్ణుండని మే మెఱుంగుదుము. అనుభావముకలిగియే యీయర్థమును దృఢపఱచునెపమున నిన్నియుదాహరణములఁ దెల్పిరి.

ఈయర్థమే శుకమహర్షి చంద్రుఁడు తేటతెల్లముగా నీ క్రిందిశ్లోకమునఁ దెలిపెను.

మూ. ఇతి గోప్యో హి గోవిందగతవాక్కాయమానసాః,
కృష్ణదూతే వ్రజం యాతే ఉద్ధవే త్యక్తలౌకికాః. ౯
గాయంత్యః ప్రియకర్మాణి రుదంత్యశ్చ గతహ్రియః,
తస్యసంస్మృత్య సంస్మృత్య యాని కైశోరబాల్యయోః.

త్యక్తలౌకికాః = త్యక్తలోకవ్యవహారాః. అనివ్యాఖ్య. ఈశ్లోకములకుఁ దెలుగునఁ బద్యమే కానరాదు. ఏలొకో! మహాకవి తెనిఁగించునపుడు తాఁటియాకుల ప్రతిలో నీశ్లోకములు లేవేమో! యనుటయే యిట సరసము.

అని యిట్లు లాగోపికలు పలుకుచు శ్రీగోవిందునిపైఁ ద్రికరణములనంబడు వాఙ్మనఃకాయముల నిలిపి లోకవ్యవహారముల వదలి శ్రీగోపాలబాలకుని బాల్యకైశోరదశలయందుఁ గావించియున్న విలాసచర్యల స్మరించి స్మరించి సిగ్గువదలి పలవించుచు మరల భక్తిభారమున గానముచేయుచు శ్రీకృష్ణదూత యగు నుద్ధవునెదుట నుండిరి. ఇది సామాన్యార్థము. విశేషార్థమేమనఁగా,

వచ్చియున్న భక్తుని భగవద్దూతగా భావించిరి గానఁ బరమానందలహరి మునుఁగుచు భగవద్దర్శనమైనట్లే భావించిరి.

కావుననే మనోవాక్కాయముల నా లీలామానుషవిగ్రహము నిపై నునిచిరి. అంతట శ్రీహరి బాల్యకౌమారచర్యలు స్మృతిగోచరము లయ్యెను. వానింగాంచినంతనే సిగ్గు వదలిపోయెను. అనఁగా దమరుస్త్రీలని పురుషుఁ డెదుట నున్నవాఁడని తమరు శ్రీకృష్ణునింతగా నడిగిన నితఁ డేమనుకొనునో యనుభావము నశించెనని భావము. వారి కత్తరుణమున నెల్లయెడల శ్రీకృష్ణ బాల్యక్రీడలే కనఁబడియెను. అట్టి శ్రీహరినిం దలంచి విలపించిరి. అంత భక్తిభావము దుర్భరమగుట గొంతెత్తి తచ్చరిత్ర గేయములఁ బాడిరి. లోకవ్యవహారముల మానిరి. అనఁగాఁ దమరిపు డొనరింపవలసిన గృహకార్యము లేమనుభావము వారియందుఁ గన్పట్టలేదని భావము. కావున నాపరమేశ్వరుం దలంచుచు స్తుతిపాఠములం జెప్పుచుండిరి.

ఆర్యులారా! ఈవాక్కుల భావమును గాంచిన మీకు గోపికలు వ్యభిచారిణులు కారనియు, శ్రీకృష్ణ పాదారవిందాశ్రితమానసలనియు, మహాభక్తిభరితలనియుఁ దోఁచును గదా. లోకమునఁ గులటల కిట్టివ్యాపారము లుండునా. విటుని చరిత్రములఁ బాడుదురా. లోకమున నిట్టియాచారములు కలవా. మీరు వింటిరా చూడఁ జాలితిరా. లేదుకదా. ఈ శ్లోకముల యర్థము తెలుఁగుభాగవతమున లేకుండుట లోపము. ప్రకృతము గోపికలు భక్తిభరితహృదయలనియు నుద్ధవుని గాంచినంతనే పట్టరాని ప్రీతిచే భగవత్కథల నడుగఁ బ్రయత్నించిరనియు వారిచర్య లమానుషములనియుఁ దలంపుఁడు. వారివలె భగవద్గుణసంకీర్తనము చేయ నభ్యసింపుఁడు. భగవద్దాస్య మలవడును. తరువాతికథ నాలకింపుఁడు.

ఇట్టు లాగోపికలు భగవంతుని వినుతించుచుఁ దద్దర్శనము కాలేదే యను తత్తఱపాటునఁ జిత్తము లుత్తలంపడఁ బలవించుచుఁ దమ రిపు డేమిచేయుచున్నవారో తెలియక యుండిరి. అట్టితఱి నొక్కతుమ్మెద యందొక్క నెలఁతుకకుఁ గానవచ్చెను. దానింజూచి తా నాడఁదలఁచుకొన్న మాటల నన్యాపదేశంబున నుద్ధవునకుఁ దెలుపం దలంచి శ్రీకృష్ణవర్శనమును గోరునది గాన నాతుమ్మెదను శ్రీకృష్ణుఁ డంపినదూతగా భావించి యిట్లు పలికెను. ఈమాట లుద్ధవునకుఁ దెలియవలయునని యు వీనినెల్ల శ్రీహరికిం దెలుపుఁగాక యనియు నాతలోదరి తలంచెను.

ఇందుమూలమున,

"కాచిన్మధుకరం దృష్ట్వా ధ్యాయంతీ కృష్ణసంగమమ్,
ప్రియప్రస్థాపితం దూతం కల్పయిత్వేదమబ్రవీత్." ౧౦

ఇందు ధ్యాయంతీ కృష్ణసంగమమ్ = అను వాక్యమునకు శ్రీహరి పొందుఁగోరినదని కొంద ఱర్థముచెప్పి గోపికలు వ్యభిచారిణులనుదురు. అంతకంటెఁ బాపకార్యము వేఱొకటి గానరాదు. ధ్యాయంతీ అనుపదము వారికిం గనఁబడదేమో. ప్రియుఁడనఁగా విటుఁడనియే యర్థమని వారిభావమై యుండవచ్చు. పాపము శాంతించుఁగాక. లోకప్రియుఁ డగుభగవంతుని నెప్పుడు చూడనగునా యని ధ్యానించుచున్నదనియే యర్థము గ్రహింపఁదగును. లోకమున వ్యభిచారవృత్తిని మననముచేయుచు ననువారుండరని నా భావము. ధ్యానించుట మననము చేయుట యను మొదలగుపదములను సత్కార్యపర మగునర్థము చెప్పునప్పు డుపయోగింతురుగాని దుష్కార్యపర మగు

నర్థము చెప్పుతటి నుపయోగించినట్లు నా చూచినంతదనుక లేదు. వాఁడు వేశ్యను ధ్యానించుచున్నవాఁడు. వీఁడు దొంగతనముచేయ మననము చేయుచున్నాఁడు అను వాడుక లేదు. కావున నిట గోపిక భక్తిపరవశత్వమున శ్రీకృష్ణునిదర్శనమునే కోరి యిట్లు పలుకుచున్నది కాని నికామకామక్షీమసాయకవిదారితచిత్తపద్మయై యిట్లు మాటలాడ లేదని గ్రహింపవలయును. "ధ్యాయంతీ కృష్ణసంగమమ్" అనువాక్యమునకు మహాకవిపోతన యెట్లు తెనిఁగించెనో పరికించి యామహాత్మునిభక్తిపారవశ్యమును గొనియాడుఁడు.

చ. అనియిటు గోపికల్ పలుక నందొకగోపిక కృష్ణపాదచిం
తనమునఁ జొక్కి చేరువను దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్సునిశిత సద్వివేకముఁ బ్రసూన మరందమదాతిరేకము౯
ఘన మృదునాదసంచలిత కాముకలోకముఁ జంచరీకము౯.

కృష్ణపాదచింతనమునఁ జొక్కి అని వ్రాసి తన యపూర్వభక్తి చమత్కృతిని దెలిపి పోతన కృతకృత్యుఁ డయ్యెను. మనమిట్లు విపరీతార్థమును జెప్పి యేల జన్మము నసార్థకముగఁ జేసికొనవలయునో తెలియనేరక యున్నవాఁడ. లోకప్రియుఁ డగుభగవంతుఁడు పంపినదూతయనియే భావించి యిట్లు పలికెను. భృంగమును గాంచి తాఁబలుకుభాషణముల నుద్ధవుఁ డెఱింగి శ్రీకృష్ణమూర్తికిం దెల్పునని యే గోపికల భావము. ఆమాటలేవియో వినుఁడు. అందు మూలము దానిపద్యము దాని విశేషార్థమును దిలకింపుఁడు.

శ్లో. మధుప కితవబంధో మాస్పృశాంఘ్రిం సపత్న్యాః
కుచవిలులితమాలాకుంకుమశ్మశ్రుభిర్నః,

వహతు మధుపతిస్తన్మానినీనాం ప్రసాదం
యదుసదసి విడంబం యస్య దూతస్త్వమీదృక్.

ఓ మధుకరమా! ధూర్తబాంధవము కదా నీవు. సవతుకల వక్షోజములసమ్మర్దమున కలవాటుపడిన వనమాలకు దగిలిన కుంకుమమునవెలయు మీసములతో మాపాదంబు ముట్టవలదు. ఇట్టి నీవెవ్వనికి దూతకృత్యము చేయవచ్చితివో ఆమధుపతి యాదవసభలోఁ బరిహాసాస్పదంబైన యామానినీజనుల ప్రసాదమునే వహించుం గాక.

తుమ్మెదల మీసములు రక్తవర్ణముగా నుండుటంబట్టి వానిని ట్లుత్ప్రేక్షించి యాగోపిక పలికినది. దీనికి మహాకవి పోతన,

మ. భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మాపాదాబ్జముల్
నాగర, ప్రమదాళీకుచకుంకుమాంకితలసత్ప్రాణేశదామ
ప్రసూ, నమరందారుణితాననుండవగుటన్ నాథుండు మ
న్నించుఁగా, క మమున్నేఁపుచుఁ బౌరకాంతలశుభాగారం
బుల న్నిత్యమున్.

శ్రీహరి మధురానగర పౌరకాంతలసంగతిం జొక్కి యిక్కడికి రాకున్నవాఁడు. అట్టివానికి నీవు దూతవు. ఆహరి మధుపతి గదా. యదుసభలోఁ బరిహాసాస్పదంబగు నా మానినులప్రసాదంబే వహించును గాక యని స్వాభిప్రాయమును దెలిపెను. ఇది ప్రాతీతికార్థము. భక్తిభరితస్వాంత యగునొకగోపిక భగవద్విరహమున కోర్వఁజాలక వ్యాజస్తుతిరూపమున నీమాట పల్కినది. మధుపా! యని సంబోధించినది. ఓ కీటమా! నీ వెంత పుణ్యము చేసితివో యెఱుంగఁజాలను. భగవత్పాదారవింద

మరందమును గ్రోలుదువు. నీభాగ్యమే భాగ్యము. నీజన్మము సార్థకము. మహాభక్తులకుంగూడ దొరకని భగవంతుని పాదారవిందములు నీకు సేవింప లభించినవికదా అవి ముక్తిదాయకములు. సనకసనందనాదులాపాదారవిందభజనమునే కోరుదురు. అని సంబోధించినందున మరల మాకెన్నఁడు శ్రీకృష్ణపాదాంభోజములఁ గాంచుభాగ్యము లభించునో యని ప్రశ్నించిన ట్లూహింపనగు. మఱియు ధూర్తబంధూ! అనియు సంబోధించినది. నీవు సాహసముగలవాని చుట్టమవు కదా. అనియు నర్థమగును. ధూర్తుఁడు బంధువుగాఁ గలవాఁడవనియు నర్థమగును. సదా తన్నే నమ్మియున్న మమ్ము విడనాడిపోవుటయే ధూర్తత్వమని గోపికభావము. అట్టి శ్రీకృష్ణునిదూతవుకదా యని హెచ్చరించినది. ఇట్టినీకు మావంటి యదృష్టహీనుల మాటలు వినఁబడునా యని తనదౌర్భాగ్యమును నిందించుకొనుచున్నది. ఇందున్న బాలగోపాలుని దమపురమున నుండునట్లుచేసిన మధురానగరకామినులే మాకు సపత్నులని గోపిక తలంచెను. ఔరా! మధురానగరమున వసించుమానినులెంత పుణ్యముచేసిరో, తమహృదయారవిందముల భగవంతు నిలుపుకొనఁజాలిరి గదా యనిభావము. శ్రీహరి మధురాపురీమానినులఁ గౌఁగిలించుకొనెనని దీనిభావము కాదు. ఒకప్పుడు పౌరకాంతల కుచసమ్మర్దమున నలఁగిన వనమాలాకుంకుమపంకముగల శ్మశ్రువులచే మాపాదముల నంటకుమని యర్థము చెప్పవచ్చునుగాని నలఁగినహారమున మరంద ముండదుగాన నట్టివనమాలపై భ్రమరము వ్రాలుట యసంగతప్రసంగమువంటిదగును. కాఁబట్టి యాయర్థము చెప్పరాదు. కుచశబ్దముచే

లక్షణా ప్రకారము హృదయ మర్థమగును. హృదయ కుంకుమ మనఁగా హృదయారవిందానురాగమని భావము తేలును. అట్టి మీసములచే మాపాదమును ముట్టుదువేమో యట్లు చేయకు మనఁగా భగవంతుని పాదారవిందములను స్పృశించిన నీవు మాపాదముల ముట్టఁగూడదు. మే మదృష్టముగలవారము కామని నిందించుకొనుచున్నది. మాయనుగ్రహమేలగాని వారియనుగ్రహదృష్టులనే కోరనీ యని యీసడించెను. ఆపా రకాంతల యదృష్టము మాకు లేకపోయెనే యను విచారము చేతనే యిట్టులనియె. దీనిచే నుద్ధవా! నీవరిగి శ్రీకృష్ణునితో మధురానగరమున నీవుండుట కుమ్మలించు నీపాదసేవాధురంధర లయార్తిని బాపుమా యని చెప్పి యిచ్చుటి కాపరమేశ్వరుం బంపుమాయని స్వాభిప్రాయము తెలియఁజేసెనని గ్రహింపం దగు. మఱియు,

శ్లో. సకృదధరసుధాం స్వాం మోహినీం పాయయిత్వా
సుమనస ఇవసద్యస్తత్యజేఽస్మాన్ భవాదృక్,
పరిచరతి కథం తత్పాదపద్మం ను పద్మా
అపిబతహృతచేతా హ్యుత్తమశ్లోకజల్పైః.

ఓ భ్రమరమా! ఒకప్పుడు జగముల మోహింపఁజేయఁజాలు తన యధరామృతమును దమిదీఱఁ ద్రాగనిచ్చి నీవు మకరంద మును గ్రోలి పూవులవదలు చాడ్పున నాతఁడు మమ్మువదలెను. అట్టివాని పాదారవిందమును భగవతి మహాలక్ష్మి యెట్లు సేవిం చెడునో. సరిసరి. తెలిసినది. ఉత్తమశ్లోకజల్పములచేఁ దనచిత్త ము మెత్తపడఁగా నాపద్మాలయ యా సుందరాంగుని జేరినది

కాఁబోలు. అని పలికెను. ఇది ప్రాతీతికార్థము. పోతనగారిశ్లోకమునకు

మ. ఒకపువ్వందలి తేనెద్రావి మధుపా! యుత్సాహివై నీవు వే
 ఱొకటిం బొందెడుభంగి మన్మథరపీయూషంబునం దేల్చి మ
 మ్మా, యకలంకోజ్జ్వల యౌవనంబుఁగొని యన్యాసక్తుఁడయ్యెఁ
 విభుం, డకటా! యాతనికెట్లుదక్కె సిరి మిథ్యాకీర్తి నమ్మెంజుమీ.

అని వ్రాసి సర్వతోముఖపాండిత్యమును వెల్లడించెను. ఇందలి విశేషార్థమేదియనఁగా! సకృత్=అనఁగా నొకానొకప్పుడు యోగనిద్రాపరాయణుఁడై కొంతకాలముండి సృష్టిచేయు నూహ కలుగఁగా నాదిశక్తిని బయలుపడంజేసి బ్రహ్మాదులను బుట్టించి వారికి జగన్మోహనకరములగు నుపనిషదర్థములను దెలిపి యని భావము. అధరామృతము వాగమృతమని తాత్పర్యము. క్రిందిపెదవిరసమని కాదు. అమృతమువంటి వాక్కులని సారము. ఇట్లు తెలిపి కొంతకాలముకాఁగా తుమ్మెద మకరందముగ్రోలి యాపువ్వుల వదలునట్లు సుమనసుల ననఁగా దేవతలను వదలును. మరల యోగనిద్రాపరాయణుఁ డగునని భావము. అట్టి నిరంజనుఁడగు భగవంతుని పాదపద్మముల మహాలక్ష్మి యెట్లు సేవించెను? ఓహో! తెలిసికొంటిని. ఉత్తమశ్లోకజల్పైః=మిథ్యాకథలచేత. (మిథ్యాకథాభిః=అనివ్యాఖ్యా) పరిదృశ్యమానప్రపంచము స్థిరముకాదను మొదలగు తత్వవాక్కులచేత హృతచేతాః=హరింపఁబడిన హృదయముగలదై, అనఁగా నీ ప్రపంచము నాచే సృజింపఁబడినది. ఇది భగవత్కారుణచే వెలసినది. కాని యెపుడు నశించునో దీని నమ్మియుండరాదు. నిత్యుఁ

డగు నీపరాత్పరునే సేవింపందగును. అని వాస్తవమెఱింగి సేవించెను. మేమట్లు సేవింపఁజాలక పోతిమని గోపికభావము. భగవత్సేవాపరాయణత్వమున వెంటఁబోవక యుండున్నవార మని యాగోపిక చింతించెను. ఇట్లు చెప్పుటచే నుద్ధవుఁ డీమాటల పొందెఱింగి శ్రీకృష్ణునితో ననన్యపరాయణులై గోపికలున్న వారని తెల్పునని యామె యూహించెనని మన మెఱుంగవల యును.

ఇట్లుపలికి యంతతో సంతృప్తినొందక మఱియు నిట్లనియె.

శ్లో. కిమివబహుషడంఘ్రి గాయసి త్వం యదూనా
మధిపతిమగృహాణా మగ్రతో నః పురాణమ్,
విజయసఖసఖీనాం గీయతాం తత్ప్రసంగః
క్షపితకుచరుజస్తే కల్పయం తీష్టమిష్టాః. ౧౪

ఓ షట్పదమా! పురాతనములగు యదుపతి చరిత్రములను గృహరహితలమైె వనటఁగుందుమాముందు విశేషించి గానము చేయనేల? విజయ సఖుఁడగు నా కృష్ణున కిప్పుడు చెలులు పెక్కుమంది యుందురు. వారిముందు తత్ప్రసంగము పాడుము. ఆ క్రొత్తచెలులు మర్మ మెఱుంగనివారు కావున నీపాటకుఁ దమ కుచాలంకారములు చెడిపోవ మైమఱచి నీకిష్టములగు వాని నొసంగుదురు. అని సామాన్యార్థము. ఈ శ్లోకరత్నమునకు మహాకవిపోతనపద్య మిద్దియే.

శా. భృంగా! కృష్ణుఁడు మంచివాఁడనుచు సంప్రీతిం బ్రశంసించె దీ,సంగీతంబున నేము చొక్కుదుమె తచ్చారిత్రముల్

వింతలే, యంగీకారముగావు మాకుఁ బురకాంతాగ్ర ప్ర
దేశంబులన్, సంగీతంబొనరింపు వారిదుదు రోజస్నీకు ని
ష్టార్థముల్.

ఏలొకో యీపద్యము చప్పిడిగా నున్నది. మూలార్థ మిందుఁ బోషింపఁబడలేదు. మహాకవిభావమేమో తెలిసికొనఁజాలకున్నాఁడను. "అంగీకారము కావు మాకు" అనువాక్యము సర్వథా అసంగతమనక తప్పదు. విజయ సఖసఖీనామ్=అను భాగమునకుఁ బురకాంతాగ్ర ప్రదేశములన్, అని తెనిఁగింపఁబడుట విరసమని నా భావము. ఇందలి విశేషార్థ మేమనఁగా,

యదూనా మధిపతిమ్ = శాపవశమున రాజగౌరవహీనులైయున్న దీనులకధిపతి. అనఁగా దీనజనరక్షకుఁ డనుట దీనిచే నార్తత్రాణపరాయణత్వము భగవద్గుణ మని తేటపడియెడిని. అట్టి దీనమానవ మందారమును విశేషించి గానముచేయుచున్నావే. ఏల ? ఇప్పుడు మాస్థితి యెట్లున్నదనఁగా, అగృహాణాం నః అగ్రతః=గృహములులేక. ఆశ్రయములేక యని భావము. మా కాశ్రయభూతుఁడగు భగవంతుఁ డిటలేకపోఁగా మేము దిక్కులేక యున్నవారము కదా. ఇట్టి దీనలగు మాముందు. పురాణమ్ చరితమ్=బహుతరముగా వేదవేదాంగములు ఘోషించు నితిహాసము ననిసారము. అనఁగా మే మెఱుంగుదుము. కాని దాని నిపుడు నీవు మాయెదుటఁ బాడఁగా మాకుఁ బరితాప మధికమగును. అట్టి మాదైవమిప్పుడు మధురానగరమున నున్నవాఁడు. అందుఁ గ్రొత్తచెలులు పెక్కుమంది సేవించుచుందురు. వారి కీమహాత్ముని చరిత్రము తెలిసియుండదేమో నీవక్కడికిఁబోయి పాడుము. నీ పాటనువిని భగవన్మహిమము

నెఱింగి తమహృదయ సంతాపమును బాపుకొందురు. నీకు నిష్టములొసంగుదురు. అనఁగా నీపాట ఫలించును.

ఇట్లనుటచే భగవన్మహిమముల నెఱుంగక కృష్ణుఁడు మాకుం దక్కె ననుకొందురు కాఁబోలు. మేము నిట్లే నమ్మి యుంటిమి. మానమ్మిక వమ్మైనది. ఒక్కచో నుండువాఁడు కాఁడు. కావున మావలెనే మోసపోకుండఁ దవ్వరపడి భగవంతుని సేవింప నూహ వారికిం బుట్టించుటయే నీపాటకు ఫలమని గోపిక భావము. ఈ భావము తెలిసికొని యుద్ధవుఁడు శ్రీకృష్ణమూర్తితో భక్తిపరవశలై యున్నవారు గోపికలని తెల్పునని గోపికనమ్మెనని మన మెఱుంగఁదగు. ఇట్లుపలికి మరల నాగోపిక యి ట్లనియె.

శ్లో. దివిభువిచరసాయాం కాస్త్రియ స్తద్దురాపా
కపటరుచిరహాస భ్రూవిజృంభస్య యాస్స్యుః,
చరణరజఉపాస్తే యస్య భూతిర్వయంకా
హ్యపిచ కృపణపక్షే హ్యుత్తమ శ్లోకశబ్దః. ౧౫

భృంగమా! శ్రీకృష్ణుని కపటంపు నవ్వులకును, గనుబొమలఁ ద్రిప్పుటలోనగు విలాసములకును నీమూఁడు లోకములలో నుండు నేస్త్రీ లోఁబడకయుండఁగలదు? లక్ష్మీదేవియే తత్పాదరాగముఁగోరి యుపాసించుననఁగా మే మేపాటివారము? ఐనను దీనులయెడఁ గరుణఁజూపునట్టి మహాత్మునకు నుత్తమశ్లోకశబ్ద మన్వయించుననిమాత్రము నీ వాజగన్నాథునితోఁ బల్కుము. ఇదియే యిందలి ప్రాతీతికార్థము. ఈశ్లోకమాణిక్యమునకు మహాకవి పోతన

మ. సమదాళీశ్వర! చూడు ముజ్జ్వలితహాసభ్రూవిజృంభంబు
లన్, రమణీయుండగు శౌరిచేఁ గరఁగరే రామల్ త్రిలో
కంబులం, బ్రమదారత్నము లక్ష్మి యాతనిపదాబ్జాతంబు
సేవింప నిక్కము నేమెవ్వర మాకృపాజలధికిం గారుణ్య
ముం జేయఁగన్.

అనునీపద్యమును వ్రాసిరి. కాని శ్లోకచతుర్థపాదార్థ మిందుఁ
బోషింపఁబడక తికమకగా వ్రాయఁబడిన దనవలసి వచ్చినది.

ఈశ్లోకమునఁగల విశేషమేది యనఁగా, భృంగమా!
శ్రీకృష్ణుని భ్రూభంగ విలాసాదులు హాసములు కపటములు
గాని వాస్తవములు కావు. కార్యార్థము చూపఁబడునవియే
కాని యాతఁడు నిరంజనుఁడగుట నిట్టి వికారములు లేవు.
కావున విలాసార్థము చూపఁబడు నతని తాత్కాలికచర్యలం
గాంచి యవి నిక్కములనియే భావించి ముల్లోకములయందలి
వనితలు లోఁబడుదురు. అనఁగాఁ బ్రకృతియొక్క యపరస్వ
రూపలుగానఁ బరమపురుషునకు లోఁబడియే యుందురు. భగ
వత్తత్వమెఱింగిన యా శ్రీదేవియే తత్పాదపరాగమును గోరి
సేవించెడిని. ఆమె విషయమే యిట్లుండఁగా నీలోకమున నవత
రించిన మాగతి యెట్లుండునో చెప్పవలయునా? ఉత్తమశ్లోకు
లనఁగా దీనుల నుద్ధరించువారని యర్థము. ఈ మాటమాత్ర
ము చెప్పెము. అనఁగా భగవత్తత్వము నెవ్వారే నెఱుంగఁ
జాలరు. అందును బూర్వస్మృతిలేక యీలోకమునఁ గార్యార్థ
మవతరించితిమి. కాన మేమెఱుంగఁజాల మనుట యతిశయో
క్తికాదు. లక్ష్మీదేవియే భగవత్పాదారవింద రజమును గోరి
యుపాసించుచున్నది. దీనులగు నీగోపికాజనముల విషయము

మఱువవలదని చెప్పుము. ఇదియ మాకు నీవు చేయఁదగు మహోపకారమని గోపికభావమైనట్లు మనము గ్రహింపవలయు.

ఇట్లనుటచే నుద్ధవా! మేము శ్రీకృష్ణునిరూపమును గాంచి మోహించిన వారముగాము. శ్రీదేవి యేపాదపద్మరజస్సును బడయఁగోరినదో యావాంఛనే మేమును గలిగియున్న వారము. కావునఁ గపటనాటకసూత్రధారుఁడను మాటను మఱచి తన్నేనమ్మి కృతకృత్యలము కాఁగోరు దీనజనులమగు మాపైఁ గరుణ యునుపవలయునని మామాఱుగాఁ బ్రార్థింపుము. అని యుద్ధవునిగూర్చి యన్యాపదేశముగా గోపికచెప్పెను. ఇట్లు నుడివి యంతతోఁ దృప్తినొందక మఱియు నిట్లు చెప్పుచున్నది.

మూ. విసృజశిరసిపాదం వేద్మ్యహం చాటుకారై
రనునయవిదుషస్తేఽభ్యేత్య దౌత్యైర్ముకుందాత్,
స్వకృతఇహవిసృష్టాపత్యపత్యన్యలోకాః
వ్యసృజదకృతచేతాః కిన్నుసంధేయమస్మిన్. ౧౬

ఓ రోలంబమా! శిరముననునుచుకొన్న పాదమును వదలుము. ముకుందుఁడు పంపఁగాఁ దదీయదూతకృత్యంబు సాగింప నరుదెంచి యనునయోక్తుల మమ్ము బుజ్జగింపనేర్చిన నీనేర్పెల్ల నే నెఱుంగుదును. తనకొఱకై పతులసుతుల నన్యలోకంబులను ద్యజించినవారి నాచంచలస్వాంతుఁడు విడిచెను. ఇందు సంధియేమియున్నది? అని గోపికపలికెను ఇది ప్రాతీతికార్థము. ఈ శ్లోకవర్యమునకు మహాకవిగారి పద్యము.

శా. రోలంబేశ్వర నీకుదౌత్యము మహారూఢంబు నీనేరుపుల్
చాలుఁ మచ్చరణాబ్జముల్ విడుపు మస్మన్నాథ పుత్రాదు

లన్, లీలంబాసి పరంబుడించి తనకున్ లీనత్వముం బొందుమ, మ్మేలా పానె విభుండు ధార్మికులు మున్నీ చందముల్ మెత్తురే.

పద్యమెంత చక్కఁగానున్నదో పరికింపుఁడు. ఇందుఁగల విశేషార్థ మేదనఁగా. ఆ కాలమున నాతుమ్మెద గోపికపాదమూలమునఁ బ్రవేశించుచుండెను. తన్ను క్షమింపుమని యది వేఁడ వచ్చుచున్నదని యీగోపికభావించి యిట్లు పల్కుచున్నదని వ్యాఖ్యాతలభావము. కావుననే మూలమున "విసృజశిరసిపాదమ్" అని చెప్పఁబడినది.

ఓ మధుకరమా! మేము పతులను సుతులను మఱియు సర్వలోకమును నిడియడియని యననేల? సమస్తమును వదలితిమి. భగవంతుఁడిట్టి మమ్మేల వదలి మధురానగరమున నున్నవాఁడో తెలియకున్నది ఇంక నిపుడు సంధిచేయ నేమున్నది? అనఁగా సర్వమును త్యజించి తన్నే నమ్ముకొనియున్నవారము. మమ్మువదలి వేఱొకచోటికిం బోవుట న్యాయముకాదు. ప్రియవచనములతో నిపుడేమిలాభము? మమ్ముద్ధరించినఁగాని యీ తాపము శాంతింపదు. మాకుఁ బ్రత్యక్షదర్శన మొసంగుమని శ్రీకృష్ణునితోఁ బ్రార్థింపుము.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అను తనప్రతిజ్ఞను మఱువవలదని ప్రార్థింపుము. చంచలస్వభావమును వదలి అనఁగా మమ్ముఁ బరీక్షించుపని యికమాని తనపాదారవిందభజనాసక్త చిత్తమునయున్న మమ్మెల్ల రక్షింపఁబూనుమని భగవంతునితో విన్నవింపుమనునదియే గోపికభావము.

అనిపలికి మఱియు నాగోపిక భృంగముం జూచుచు నిట్లుపలికెను.

మూ. మృగయురివకపీంద్రం వివ్యధేలుబ్ధధర్మా
స్త్రియమకృతవిరూపాం స్త్రీజితఃకామయానాం,
బలిమపిబలిమత్వా వేష్టయద్ధ్వాంక్షవద్య
స్తదలమసితసఖ్యై ర్దుస్త్యజ స్తత్కథార్థః. ౧౭

భృంగరాజమా! జగన్నాయకుఁడు పూర్వావతారంబున నొక్కట ధర్మపద్ధతినిమాని బోయవానికరణిఁ గ్రూరుఁడై వానరనాథుఁడగు వాలిని వధించెనఁట. కాంతాపరతంత్రుఁడై తన్నుఁ గోరివచ్చిన వారిని విరూపిణిగా నొనర్చెనఁట. బలిచక్రవర్తిని యాచించి యామహనీయుఁ డాదరించియొసంగిన బలిని గైకొనియుఁ గాకివలె నతని యుపకారం బూహింపక యట్టి మహాదాతను బంధించెనఁట. అట్టి యీ గోపాలుని చెలిమి యిఁకఁ జాలు. చాలు. వినను తదీయకథార్థములు విడువఁగాఁడకయే యున్నవి. ఇదియే దీనిప్రాతీతికార్థము. దీనికిఁ బోతనమహాకవి,

శా. వాలింజంపెను వేఁటకానిపగిదిన్ వంచించి దైత్యానుజన్
లోలంబట్టి విరూపఁజేసెను బలిన్ లోభంబుతోఁగట్టి యీ
త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్ ధర్మజ్ఞుఁడే మాధవుం, డేలాషట్పదయొగ్గుమావలన నీ కెగ్గింపఁగా నేటికిన్.

ఆర్యులారా! భ్రమరగీతలకు నేఁజెప్పిన భావము కాకపోయినచో నాగోపిక కృష్ణుని పూర్వావతారములఁ బేర్కొనియుండునా? కేవల కాముకుఁడగు కృష్ణు నుపాలంభించును గాని వామనావతారమున బలిని బంధించుటయు, రామావతారమున శూర్పణఖ ముక్కు చెవులు గోయుటయు, వాలిని బొంచి

యుండి చంపుటయుఁ బేర్కొనఁజాలునా? గోపికలు జారిణులై కృష్ణుని వలచిరనుమాట దీనివలన నేటఁగలిసెఁగదా. షట్పదమునుగాంచి సంభాషించునెపమున నుద్ధవునకుఁ దెలియునట్లు శ్రీకృష్ణుఁడు భగవంతుఁడనియు, నింతకుముందెన్నియో యవతారములనెత్తి యెన్నియో మహాకార్యముల నొనరించెననియుఁ బలికెను. మధురానగరకాంతామణు లెంతటిధన్యతములో యని వినుతించెను. తమ్మెడఁబాసిపోయె నేయని యుమ్మలించెను. భగవంతునిగా శ్రీకృష్ణునెఱింగిన గోపిక కామపరతంత్రయై మాటలాడెననుటకన్న నవివేకము వేఱేమున్నది? ఆభావమును దూరముచేసి భక్తిపరవశయగు గోపిక శ్రీకృష్ణునిజూడఁ గాంక్షించి తద్గుణగణముల నెట్లు వర్ణించెనో యాలకింపుఁడు. భక్తిభావమెఱుంగని యలసులపలుకులకుఁ జెవియొగ్గకుఁడు. అది మనల నిరయమునకుఁ ద్రోయుపద్ధతి. కావున భగవద్దివ్యకథారత్నముల శ్రవణముల నలంకరింపుఁడు. గోపికామతల్లికభావమును జిత్తగింపుఁడు. ఇందలి విశేషార్థ మేమనఁగా, ఓ షట్పదరాజమా! శ్రీకృష్ణుఁడు వామనావతారమునందును శ్రీరామావతారమునందు నొనరించిన మహాకార్యముల నెఱుంగుదును. వారివారి కర్మానురూపఫలము లనుభవమునకు రాఁగా నన్నియుఁ జేసినట్లు నటించుచు సాక్షిమాత్రుఁడవై యుందువు. ఇట్టి నిన్నాశ్రయించితిని. నాయల్పాపరాధముల సహించి నీపాదదాస్యము నొసంగుము. దయచే నపరాధముల క్షమించువాఁడవు. కావనియుఁ గర్మస్వరూపుఁడవనియు నిరంజనుఁడవనియు సర్వసాక్షివనియు బలి శిక్షణ శూర్పణఖావమాన నకృత్యముల వలనఁ దెల్లమయ్యెను. ఐనను సదా నీదివ్యకథామృతమును

ద్రావుచుఁ దనివిసనకయున్నదానను. నీ చరణదాసికను. నన్నుఁ గృతకృత్యనుగా నొనరింపుమా యని వేఁడెనని మనమూహింపక తప్పదు. అనిపలికి యింకను భక్తియుత్కటముకాఁగా మఱియు నిట్లనియె.

మూ. యదనుచరితలీలాకర్ణపీయూషవిప్రు
ట్సకృదదనవిధూత ద్వంద్వధర్మా వినష్టాః
సపది గృహకుటుంబం దీనముత్సృజ్య దీనా
బహవఇవ విహంగా భిక్షుచర్యాం చరంతి. ౧౮

ఓతుమ్మెదా! శ్రీకృష్ణునికథలు ధర్మార్థకామములఁ దుదముట్ట నిర్మూలించునవి. అయినను వదలఁజాలకయున్నారము. కారణమేమో తెలియదు. ఆవిధమెఱింగించెదను వినుము. త్వరపడి వేఱొకతావునకుం బోనుద్యమింపకుము. ఆ గోపాలకృష్ణచరిత్రమను కర్ణామృతపుఁదుంపురులు ఒక్కసారి చవిచూచినంతనే ద్వంద్వధర్మములన్నియుఁ దొలఁగును. అంతియకాక ప్రపంచమందాసక్తి యెడఁబాయును. మఱియు గృహము కుటుంబమును వీడవలయుననుబుద్ధి పొడమును. ఇట్లుకాఁగా భోగహీనులై పెక్కుమంది మానవులు హంసాదిపక్షులవలె భిక్షువృత్తి నాశ్రయింతురు. వింటివా శ్రీకృష్ణచరితములెట్టివో అనియెను. ఇది ప్రాతీతికార్థము. ఈశ్లోకవతంసమునకు మహాకవి పోతన,

ఉ. పన్నగ వింటిపై కెగసిపాఱు విహంగములైన వీనులం
దన్నొకమాటు విన్న గృహదారసుతాదులఁ బాసి విత్తసం
పన్నతడించి సంసరణపద్ధతిఁ బాపెడువాఁడు నిత్యకాం
క్షన్నెఱినున్న మాబ్రదుకునైచునె యేలమధువ్రతోత్తమా.

అనుపద్యమును వ్రాసెను. ఏలాగా శ్లోకార్థమునకుఁ బదార్థ

మునకుఁ గాశీరామేశ్వరములకుండినంత దూరమున్నది. విహాం
గా ఇవ పక్షులవలె ననఁగా జనులు హంసాదిపక్షులవలెనని
మూలముననుండఁగా నాకాశమునఁబోవు పక్షులైన నొకపర్యా
యము భగవన్నామమునో భగవత్కథనో విన్నంతన యని
వ్రాసిరి. కారణ మెఱుఁగఁజాలకున్నాఁడను. మొత్తముమీఁద
నీపద్యము మూలార్థమును బోధింపఁజాలదనుట నిక్కము. విశే
షార్థ మేమనఁగా, భగవత్కథ యమృతమువంటిది. ఆ యమృత
బిందువు నొక్కసారి క్రోలినంతమాత్రమున శీతోష్ణములు
సుఖదుఃఖములు లోనగుద్వంద్వములు తుదముట్ట నశించును.
గృహమునందును గుటుంబమునందును రోఁత పుట్టును. హంసా
దిపక్షులవలె భిక్షుకు లగుదురు. అనఁగా సర్వమును సన్యసించి
తిరుగుదురు. హంసల నుదాహరణముగా నేల గైకొనఁబడెన
నఁగా సారాసారవివేకము హంసలకుఁ గలదు. కనుక నిస్సార
ముగా నున్న నీభవమునువదలి సారతమమగు ముక్తిమార్గ
మును గనుఁగొందురు. అను నర్థమునకై హంస లుదాహరణ
ముగాఁ గైకొనఁబడినవి. అనఁగా భగవత్కథల నాలకించువా
రికి సంసారబాధ లుండవనియుఁ బరమహంసవృత్తి యలవడున
నియు దీనిసారము. భగవత్కథల నాలకించుట యనఁగా వానిని
విని తదుక్తప్రకారంబునఁ బ్రవర్తించి. యని గ్రహింపవల
యును. ఇదియే గోపికభావము. భగవత్కథాశ్రవణఫలము
వైరాగ్యప్రాప్తియే యని దీనిసారము.

మహాశయులారా! కామాతురయగు గోపికపలుకు
లిట్లు యుండునా? ఇందుఁ గామాతురతఁ గనఁబఱచు పదమొ
కఁటేని కలదా? పరమ జ్ఞానమును సూచించుభావమే యిందుఁ

ప్రతిపదమునందును దేలునుగదా. కావున గోపికలు కామాతు
రలనియు శ్రీకృష్ణుఁడు జారుఁడనియుఁ బలుకు వారిపలుకులు
సాధువుల చెవులకు ములుకులు కావా! అవి సాధువులని నమ్మ
వచ్చునా? వారికి భగవత్కథామృతము చవిగొను యోగ్యత
కలదా. అట్టివారిమాటలు పాటింపక మహాభక్తిపరవశ యగు
గోపిక హృదయావేగము నెఱింగి తద్రీతి మనముకూడ భగవ
త్కథాతత్త్వము నెఱుంగవలయును. అల్పమతులపలుకులఁ జెవిఁ
బెట్టకుండుటయే భక్తులపని. ఇట్టి పరమపవిత్రచరిత్ర యగు
గోపికయందు వేఱుభావ మారోపించుటకంటెఁ బాపకార్యము
వేఱేముండును? అట్టికార్య మొనరింపకుఁడు. తరువాతి విష
యము నాలకింపుఁడు. ఇట్లుపలికి మఱియు నిట్లు చెప్పెను.

మూ. వయమృతమివజిహ్మ వ్యాహృతం శ్రద్ధధానాః
కులికరుతమివాజ్ఞాః కృష్ణవధ్వో హరిణ్యః,
దదృశిమసకృదేతత్తన్నఖస్పర్శతీవ్ర
స్మరరుజఉపమంత్రిన్ భణ్యతా మన్యవార్తా. ౧౯

ఓ ప్రియదూతా! భృంగమా! ఈవార్త యటుండుఁగాక.
బోయవాని కపటకంఠస్వరమును మృగరుతంబె యగు. సత్యము
అని నమ్మి శ్రద్ధయునిచి మృగభార్యలు ఆబోయవాని శరనిహతిం
గాంచి దురంతవేదనంబడునట్లు మేమును గపటమెఱుంగనివా
రమౌట నాకుటిలవాక్కు సత్యమని నమ్మి యతని నఖస్పర్శ
మునఁ దీవ్రమగు స్మరవ్యాధి నొందితిమి. ఇంకం జాలుఁజాలు.
ఆ మాటలవదలి వేఱువార్తయుండినం జెప్పుము. ఇది సామా
న్యార్థము. ఈ శ్లోకశిరోమణికి మహాకవిపోతన,

మ. కమనీయంబగు వేఁటకాని పలుకాకర్ణించి నిక్కంబుగాఁ
దమచిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ తద్బాణనిర్భిన్నలై
యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమాయాలాపముల్
నమ్మి దుఃఖములం జెందితి మంగజాస్త్ర జనితోగ్రశ్రాంతి
నిందిందిరా.

అని వ్రాసి తనయవ్యాజభక్తిభరమును దెలిపి కృతార్థుఁ డయ్యెను. ఇందలి విశేషార్థమేమనఁగా, గోపిక శ్రీకృష్ణదర్శనము కలుగదాయెఁ గదా యనువిచారమునఁ జిత్తము తత్తఱపడుచుండఁగా నీవాక్యము చెప్పుచున్నది. హరిణముభార్యలు దూరమున నుండెను. భర్త వేఱొకతావున నుండెను. వేఁటకాఁడు జింకవంటి కంఠస్వరమున నఱచెను. అది విని తమభర్త తమ్ముఁ బిలుచుచున్నవాఁడని నమ్మి త్వరపడి యచ్చోటికిం బోవ నాబోయ వాడితూపుల వానింగొట్టెను. దాన వేదనలం బొందెను. అట్లే మేమును గపటచరిత్రుఁడగు శ్రీకృష్ణుని మాటలు సత్యములని నమ్మి చెంతకుం బోయి యతని నఖస్పర్శమునఁ బడరాని బాధలం బడితిమి. కావున నామాటల నీకేఁ జాలింపుము. ఇంకేమేని వేఱువార్తలున్నం బలుకుము. అని గోపిక పలికినదని శ్లోకగతభావము. దీనినుండి గ్రహింపఁదగు సారమేమని యూహించు టుచితము. పూర్వశ్లోకమున నట్టిభక్తిని వెల్లడించి యీశ్లోకమున సంభోగమును వర్ణించెననుట యసంగత ప్రసంగముకదా. ఈశ్లోకమున గురువు శిష్యునుద్ధరించుపద్ధతి చెప్పఁబడినది. లోకమునఁ గొందఱువంచకులు గురువులవలె నటించుచు వంచకులై ధనార్జనము చేయుచుందురు. వారి పలుకులు మృదువులై మధురములై యుండును. ఇతరులఁ

జెంతఁ జేర్చుకొనుటయే వారియుద్దేశము అంతియకాని శిష్యుల నుద్ధరించునూహలు వారికి లేవు. కావున నట్టివారిపలుకులు సారవంతములని నమ్మి చెంతఁజేరినచో ద్రవ్యము పోవుటయే గాక పెక్కుకష్టము లొనఁగూడును. అట్లే మేమును శ్రీకృష్ణుని గోకులమున నుండునంతదాఁక సామాన్యరాజపుత్త్రునిగా భావించితిమి. అట్టిమాకు నతఁడు తత్త్వ ముపదేశింపకుండెను. భగవత్సంగతికల్గియు సంసారనివృత్త్యుపాయము తోఁపలేదు. కావునఁ గరుణమెయి మాకు సదుపదేశమును జేయునట్లు చేయుము. ఇపుడు చేసిన యుపదేశమున భవబంధములు విచ్ఛిన్నములు కాలేదు. భవబంధనవిచ్ఛేదమే మేము కోరునది. కావున దాని లభింపఁజేయుమా యని మాప్రార్థనముగా భగవంతునకుం దెలుపుమా యని గోపిక హృదయాభిలాషము. నఖస్పర్శమనుచోట గురువు శిష్యున కుపదేశించుపట్టున హస్తమస్తకసంయోగరూప క్రియయని తెలిసికొనవలయును. ఇదియే సరసము. పోతనమహాకవి యీభావమునే సూచించెను. "హరిమాయాలాపములఁ నమ్మి దుఃఖములం జెందితిమి." అనఁగా హరి తనతత్త్వమును దెలుపక మానుషదేహోచితభాషలనే చెప్పెను. కాన మాదుఃఖములు నశింపలేదని దీనిభావము. స్మరరుజమనఁగా విషయాభిలాషమని యర్థము. దానిఁ బోకార్పయత్నించుట తరణోపాయమని దీని సారము. ఇట్లు పలికి మఱియు నిట్లు పలికెను.

మూ. ప్రియసఖపునరాగాః ప్రేయసాప్రేషితః కిం
వరయ కిమనురుంధే మాననీయోఽసి మేఽంగ,
నయసి కథమిహాస్మాన్ దుస్త్యజ ద్వంద్వపార్శ్వం
సతతమురసి సౌమ్య శ్రీవధూస్సాకమాస్తే. ౨౦

ఇప్పుడు గోపిక భగవత్సమీపగమనమును గోరుచుఁ ద్వరపడుచున్నది. తదనుగుణముగాఁ బల్కుచున్నది. ప్రియుఁడగు శ్రీకృష్ణుని మిత్రమా! భృంగరాజమా! మాప్రియతముఁడగు శ్రీకృష్ణమూర్తి పంపవచ్చినవాఁడవా? నీవుమాకు సమ్మానింప నర్హుఁడవగుదువు నీ కేమికావలయునో కోరుము. మ మ్మిచ్చుటనుండి విడువఁబడని మిథునీభావముగల యాకృష్ణుని చెంతకుం బిలుచుకొని పోవుదువో. ఓ సాధువా! ఆ గోపాలబాలుని వక్షస్థలమున శ్రీదేవియను కాంతామణి యెల్లతఱి నెడఁబాయకుండును. అని పలికెను. ఈశ్లోకరత్నమునకు మహాభక్తుఁడు పోతనకవిచంద్రుఁడు పద్యమును వ్రాయక భక్తిభరమున వేఱొక భంగిన బద్యములను వ్రాసెను. కారణ మిదమిత్థమని యరయ నే నెంతవాఁడను? హృద్యమగు నాపద్యములను బఠింపుఁడు.

ఉ. బంధుల బిడ్డలన్ మగల భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁ జేసి డించి శరణందిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి యిటు చేరకపోవుట పాడిగాదు పు
ష్పంధయ మీయధీశునకుఁ బాదములంబడి యొత్తిచెప్పవే.

సీ. కాంచనరత్న సంఘటితసౌధంబులే,
మాకుటీరంబులు మాధవునకు
వివిధనరేంద్ర సేవిత రాజధానియే,
మాపల్లె యదువంశ మండనునకు
సురభి పాదపలతా శోభితారామమే,
మాయరణ్యము సింహ మధ్యమునకుఁ
గమనీయలక్షణ గజతురంగంబులే,
మాధేనువులు కంస మర్దనునకు.

తే. రూపవిభ్రమ నైపుణ రూఢలైన
మగువలమె మేము మన్మథమన్మథునకు
నేల చింతించు మముఁ గృష్ణుఁ డేలతలఁచుఁ
బృథివినధిపులు నూతన ప్రియులుగారె.

ఈపద్యములకు మూల మామహాత్ముని భక్తిభావమే కాని వేఱొకటియని వచింప నవకాశము లేదు. ఇందు గోపికకుఁగల భగవత్పాదభక్తియుఁ దద్దర్శనాతురము తేటపడుటయే కాక దైన్యము కూడఁ దెల్లమగును. అనాథలమగు మ మ్ముద్ధరింపఁద గునని కోరినదనుటయే యిందుఁగలసారము. ఇందలి విశేషార్థము. ఇపుడు గోపికచిత్తము భక్తిరస భరితమగుట పరవశతం జెందినది. ఆతుమ్మెద మరల వచ్చెనని భ్రాంతినొందినది. కావున నే యనన్యభావమున భగవంతుని వినుతించుచున్నది. భగవంతుని పాదము లరవిందములు. అందు వ్రాలి మకరందము నాస్వాదించుట తుమ్మెదలసహజవ్యాపారము. అట్లే భక్తుఁడు తన మనస్సును సదాభగవత్పాదములయం దునుచును. అందుండి దాని మరల్పనూహింపఁడు. అట్టివానిం గాంచినంతనే పామరులు కృతార్థులగుదురు. కాఁబట్టియే,

దర్శనాదేవసాధవః

అన్నసూక్తి కలిగినది. కావున భగవంతునియందు నిరుపమాన భక్తి గలయుద్ధవుఁడు వచ్చుటెఱింగి పల్కుచున్నది. మహాభక్తుఁడా! మా ప్రాణప్రియుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మము పనుపఁగా వచ్చితివి. నీ వేమిగోరిన నిత్తుము. సంశయింపక కోరుము. ఆర్యా! నీవు మాయాదృతికిఁ బాత్రుఁడవు కదా. భగవద్భక్తుని ంటె మాయాదరణమునకుం బాత్రుఁ డెవ్వఁడు కలఁడు? అట్టి

నీవు మా పుణ్యవశంబున నరుదెంచితివి. మానోములు ఫలించినవి. సకల ద్వంద్వక్షయంకరుఁ డగు శ్రీకృష్ణుపార్శ్వమునకు మమ్ముం దోడ్కొనిపొమ్ము. తద్దర్శనమున శీతోష్ణాదిద్వంద్వములు పాఱిపోవును. ఆమహాత్ముని వక్షస్సీమ శ్రీదేవియున్నది. అనఁగాఁ బ్రకృతింగూడిన యీ సగుణబ్రహ్మమును జూడఁగోరుదుము. ఎవ్వని హృదయపీఠమున స్త్రీదేవికలదో యాతఁడనఁగా సగుణబ్రహ్మమని తాత్పర్యము. నిర్గుణుని చెంతకుం గొనిపోవుట దుర్లభము. కావున నుపాసకుఁడు సగుణబ్రహ్మము నాశ్రయింపవలయు. నిర్గుణబ్రహ్మము చెంత కనఁగా నాతత్వము సర్వవ్యాపకము కాన నుపాస్యము తొలుదొలుత కానేరదు. సోఽహం భావమే యతనివిషయమున నుపాసనాఖ్యగాఁ జెప్పఁబడును. అని సారము.

ఇందు భగవంతుఁడు సకల ద్వంద్వదుఃఖవినాశకుఁ డని చెప్పిన గోపిక పూర్వశ్లోకమున శ్రీకృష్ణుని నఖక్షతములను గోరినదని చెప్పనగునా? సరసమతులు సవ్వకుందురా? కాఁబట్టి గోపిక భక్తిరసప్రపూర్ణహృదయయనియు భగవద్దర్శనాతుర యనియు మనమెఱుంగుట సాధుమార్గము నాశ్రయించుట. అట్టులౌట సాధ్వర్థమును గ్రహింపుఁడు. తరువాతివార్త నాలకింపుఁడు.

మూ. అపిబతమధుపుర్యా మార్యపుత్రోఽధునాస్తే
స్మరతి స పితృగేహాన్ సౌమ్యబంధూంశ్చ గోపాన్,
క్వచిదపినకథానః కిం కరీణాం గృణీతే
భుజమగరు సుగంధిం మూర్ధ్న్యధాస్యత్కదాను.

పుణ్యాత్మ గలమధుకరమా! ఆయార్యపుత్త్రుఁడు మధురా

పత్తనవరమున నిప్పుడున్నవాఁడా? ఇచ్చటి పితృగృహములను బంధువులను గోపకులను స్మరించునా? తనపాదసేవ చేయు చుండు నీదాసికల కుశలము నొకప్పుడైనఁ బ్రస్తావమునకుఁ దెచ్చునా? మనోహరుఁడగు నా శ్రీకృష్ణుఁ డగరుపరిమళము వెలయనొప్పు తనబాహులత నెఁకనెన్నఁడు మాశిరములం బెట్టునో తెలియకున్నవారము. అని దీనియర్థము.

పూర్వము నఖస్పర్శమనుచోటనే వ్రాసినయర్థ మసంగతము కాదని యీశ్లోకము తేటపఱచుచున్నది. శ్రీకృష్ణుఁడు తనహస్తము నెపుడు మాశిరములపై నునుచును? అనికదా గోపిక ప్రశ్నించెను. కామాతుర యగునువిద యిట్లే ప్రశ్నించునా? హృదయరంగమున నెప్పుడు నాప్రియహస్త మునుపఁబడునని ప్రశ్నించునే కాని నన్నెపుడు ముక్తిమార్గమును దెల్పితన్పును? ఎపుడు నాశిరమునఁ దనహస్తము నునుచును? అని ప్రశ్నించునా? కావున శ్రీహరి యెపుడు తత్త్వోపదేశమున మ మ్ముద్ధరించుననియే గోపిక కోరెనని దీనిసారము. ఈభావ మింకముం దుద్ధవునియుత్తరమునఁ దేటపడును.

అని భృంగము నుద్దేశించిపలుకు నా గోపికసల్లాపముల నుద్ధవుఁ డాలకించుచు నచ్చెరువందుచుండెను. * అంతలో నుద్ధవుని దూరమునుండియే కని శ్రీకృష్ణసందేశహరుఁ డనశంకించి చేరవచ్చి గోలోకవాసిను లగుగోపిక లిట్లు పల్కిరి. మహాత్మా! మాకృష్ణుఁడు విదేశవాసి యాయెను. పూర్వప్రియజనుల మగు మమ్ము వదలెను. అందుండి తనకుశలమును దెలిపెనా. ఔరా!

---

* ఈభాగము గర్గసంహిత మధురాఖండము పదునేడవయధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

నిర్మోహాత్తా బలమిట్టిదే కాఁబోలు! అనునంతలో ద్వారపాలిక లరుదెంచి యిట్లు పలికిరి. చకోరములయందుఁ జంద్రుఁడు, కమలములయందు భాస్కరుఁడు, తుమ్మెదలయందుఁ గమలము, చాతకపక్షులయందు మేఘము నెట్టిప్రీతి యునుపఁజాలెనో అట్టిప్రీతిని మాయందు శ్రీహరి యునుపఁడాయెఁ గదా. అనునంతలో శృంగారప్రకారలను గోపికలు వచ్చి యాయుద్ధవుని గాంచి మహాత్మా! చంద్రచకోరములకుఁ గల్గినప్రీతి విధాత్మృలిఖితము. అట్లే శ్రీకృష్ణునకు మాపైఁ బ్రీతి నునుచునట్లు లిఖింపక పోయెను. అని యుల్లసమాడునంతలో శయ్యోపకారికలనుగోపికలు వచ్చి యచ్చెరువందుచు నార్యా! వ్యాధుఁడు కూడ మృగములవధించి మరల స్మరించును. కటాక్షపాతముల మమ్మునలయించి శ్రీకృష్ణుఁడు మరలఁ దలంపక పరదేశమునందున్నవాఁడు కదా! ఎంతటియన్యాయము! అనుచుండునంతఁ ద్వరపడుచుఁ బార్శ్వదాహ్వయముల నలరుగోపికలు వచ్చి మహానుభావా! మాకు శ్రీహరి నెడఁబాయుటవలన దుఃఖము సంభవించినది. ఆశ్రీహరి దీని నెఱుంగఁడుకాఁబోలు. కంటకవిద్ధాంగుని గాంచి విద్వాంసుఁడు తా నవిద్ధకంటకుఁడు గాన వాని బాధ నెఱుంగఁజాలఁడు కదా. అనిరి. బృందావనపాలికలు వచ్చి ప్రేమసౌఖ్య మనిమిత్తము. అట్టిదాని నెఱుంగకుండుట స్వభావమనవచ్చును. మాకుఁ దనయందుఁ గలప్రీతి ననిమిత్తము. దీని నెఱుంగకుండుటయే యాశ్చర్యము. రసము కర్మేంద్రియము నెఱుఁగదుకదా, యనిరి. అంత గోవర్ధనవసతు లగుగోపిక లోపికలుమాని యిట్లనిరి. ఆర్యా! పురంధ్రులపైఁ బ్రీతినునుచు మా శ్రీకృష్ణుఁడిపుడు సైరంధ్రీనాయకుఁ డయ్యెను. శైలముల నివ

సించు మావంటివారితో నీక నాతనికిఁ బని యేమికలదు? పలు మాటలుచెప్పి యేమిలాభము? అని వెక్కసపడి మాటలాడిరి. అంతట వడివడినేతెంచి కుంజవిథాయిక లగుగోపిక లుద్ధవుఁడు వినుచుండ నన్యాపదేశంబుగా మాధవీకుంజపుంజమున ఝంకారమొనరించునో భృంగమా! నీకు నేత్రసౌందర్యమును గలిగించువాఁ డెవ్వఁడో యా గోపాలబాలునికథ యిటుఁ బాడఁబడుచున్నది. విందువుగాని రమ్ము. అనిరి. ఇట్టితఱి నికుంజవాసిను లగుగోపికలు వచ్చి యుద్ధవుఁడు వినుచుండ * బృందావనమునందు మత్తమధుకరములు మూఁగియుండు కళిందజాతీర నికుంజపుంజంబునందు మెలమెల్లన సంచరించుచు బలరామసహితుఁడై గోపాలబాలకులు కూడి యాడుకొనుచుండ గోధనము నలుప్రక్కలఁ జూపట్టుచుండ నలరారు నందనందను సేవింతుము. అని భక్తిభారమునఁ బల్కిరి. అత్తఱి జాహ్నవీయాధిక లిట్లు వచించిరి. బృందావనమున గోపికాబృందములతో రాసక్రీడలం దేలునట్టి యాపవిత్రసమయ మెన్నఁడు మరల నరుదెంచునో. ఓ వ్రజాంగనలారా! శోకింపకుఁడు. మరల నట్టి శుభసమయము రాఁగలదు. అనుచుండ యమునాయాధిక లగుగోపిక లరుదెంచి యాదరంబున విధికి మాపైఁ గరుణ లేదు. భగవంతునితోఁ బొందొనఁగూర్చి మరల వియోగము గల్గించెను. సకలభూతము లాయర్భకునే యిపుడును గోరుచున్నవి. అనిరి.

---

* బృందావనే మత్తమిళిందపుంజే కళిందజాతీరకదంబకుంజే, శనైశ్చలంతం సబలం సగోపం సగోధనం నందసుతం భజామః=అని మూలము. ఇది శ్రుతి మధురముగాఁ బాడ ననువుగానుండుట నిట వ్రాయఁబడియె నని తెలియందగు.

అంత రమాయూధిక యనుగోపాంగన యరుదెంచి యౌరా! మున్ను కుబ్జ నీచకుల జనితయని పేరుపొందెను. వక్రవిగ్రహయు నయ్యెను. ఇపుడామెయే సత్కులప్రసూతయైనది. కురూపిణియయ్యు సురూపిణి యైనది. నాల్గుదినములలో సకలలోక జేగీయమానకీర్తిగల దయ్యెను. ఎంతటిపుణ్యము! ఎంతటియదృష్టము! అనియె. అనునంత మధుమాధవ్య లనుగోపిక లేతెంచి యిట్లు భాషించిరి. ఓ యుద్ధవా! ఇది మాధవునిదోషము కాదు. మధురానగరమునఁ గాపురమున్న కుబ్జ యనునాతి మాశ్రీకృష్ణుని బ్రాణపతినిగాఁ బరిగ్రహించి సంతోషించుచు యోగివరులకే నగపడని శ్రీహరితో యోగమును బొందెను. కావున నామెవలన మాకెల్ల నీయలజడి గలిగినది. అనుచుండ లలితాయూధిక యనుగోపిక వచ్చి యయోధ్యానగరమున మున్ను శ్రీరామచంద్రుని యౌవరాజ్యాభిషేకమునకు విఘ్నమాచరించి కైక ప్రఖ్యాతినొందెను. ఆకైకయే మధురానగరమున నిపుడు కుబ్జగా నవతరించినది. ఇఁక నేమేమియుపకారములు లోకమునకుఁ జేయనున్నదో యెవ్వ రెఱుంగుదురు? అనుచుండ విశాఖాయూధ యనుగోపిక వనములకు గోవులను దోలుకొని గోపాలబాలకులం గూడిపోవుచు నందఱమేలు కొలుపుచు మత్తమాతంగమందగమనంబున నొప్పు నందనందనుముకుందుని మఱువక స్మరింతును అనియెను. మాయాయూధిక లనుగోపిక లచ్చటికి వచ్చి యౌరా! సంకోచవీథులయందుఁ జేలాంచలమును బట్టుకొని బలవంతముగా రెండుచేతులు హృదయమున నొత్తుకొనుచుఁ బరస్పరాకర్షణజనితహర్షమునఁ దేలు శ్రీహరినెపు డిచ్చటికిఁ జేర్పఁగలమో యెఱుంగఁజాలకు

న్నార మనిరి. అష్టసఖు లనుగోపిక లత్తఱిఁ జేడియలకడ కరు దెంచి యో సఖులారా! నందసుతుని సుందరాంగునిఁ గాంచిన మానేత్రము లీప్రపంచమునుగూడ నిపుడుచూడ నేవగించు చున్నవి. ఆ గోపాలబాలుఁ డీనగరమునకు వచ్చినచో నపు డెట్లుండునో కదా. యనిరి. షోడశసఖు లాదరంబున వనమున నందతనయుఁడు వేణునినదము చేయఁ గుసుమములు వికసిల్లును. మాశ్రోత్రద్వంద్వమాభువనమోహను వేణునాదము నెపుడు విననోచునో ఆ యశోగీతికల నెపుడు వినునో తెలియనేరక యున్నా మనిరి. ద్వాత్రింశత్సఖు లిట్లు మాటలాడిరి. లోకమున మిత్రునిఁ బ్రీతిచేతను శత్రువును నయముచేతను లుబ్ధుని ధన ముచేతను, ద్విజు నాదరణముచేతను, గురువు నమస్కారముల చేతను, రసికుని రసముచేతను వశీకరించుకొనన నగును. నిర్మో హనుఁ డగుశ్రీకృష్ణు నేయుపమచేత స్వాధీనము చేసికొననగు ను? అనిరి. శ్రుతిరూప లగుగోపిక లిట్లు సంభాషించిరి. జాగ్ర త్స్వప్నసుషుప్తుల కెవఁడు హేతుభూతుఁడో గణములకెల్ల నెవ్వఁ డాధారమో, యింద్రియవ్యాపారము లెవని నంటఁజా లవో యెవనితేజస్సు సర్వత్ర వ్యాపించునో యట్టి మహత్తరతే జోరాశికి నమస్కరింతుమని మ్రొక్కిరి. అంత ఋషిరూప లగు గోపిక లిట్లు నుడివిరి. శ్రీకృష్ణుఁడు శిక్షింపఁబడఁడు, బలవంతు లలో బలవంతుఁడు, మాయాతీతుఁడు, శబ్దాతీతుఁడు, మనకుఁ గనఁబడుచుఁ గనఁబడకుండువాఁడు, పూర్ణుఁడు, పరబ్రహ్మము, అమృతము,పరమము, ప్రశాంతము, శుద్ధము, పరాత్పరతరము. అట్టి యీశ్రీకృష్ణపరబ్రహ్మమును భజింతుమని ప్రార్థించిరి. దేవాం గన లిట్లు వేఁడిరి. ఏ పురాణపురుషుని కలాసహస్రాంశములు

స్వర్గాదిలోకజాలముల నిర్మించుచుండునో అట్టిపరిపూర్ణుని బరాత్పరతముని శ్రీకృష్ణపరబ్రహ్మమును నమస్కరించి ప్రార్థింతుమని మ్రొక్కిరి. యజ్ఞసీతాఖ్య గోపిక లాతరుణముననే యచ్చటికి వచ్చి యీ శ్రీకృష్ణుఁడు నికుంజలతికాకుసుమాకరుఁడు. శ్రీరాధికాహృదయ కంఠవిభూషణుఁడు. రాసమండలపతి. వ్రజమండలేశ్వరుఁడు. బ్రహ్మాండమండల పరిపాలకుఁడు. అట్టివానిం బ్రార్థింతుమని కేలుమోడ్చిరి. రమావైకుంఠవాసిను లనఁబడు గోపికలు మహానందమున నోలలాడుచునే గోపాలబాలకుఁడు గోపికాసకలయూథమును స్వగుణములచే నలంకరించెనో తన పాదపంకజరజస్సున బృందావనము నలంకరించెనో గోవర్ధనాద్రి నెవఁడు సంకటించెనో సర్వలోకముల సౌభాగ్యము కొఱకు నెవఁడు భూలోకమున నవతరించెనో శేషభుజుండగు నా లీలామానుష విగ్రహుని భజింతుమని పులకాంచితతనులతికలై పలికిరి. శ్వేతద్వీపసఖిజను లిట్లు వాక్రుచ్చిరి. గజశిశువు శిలీంధ్రము నవలీలఁ దొండమున నెత్తునట్లు తనహస్తకమలమున గోవర్ధమును ధరించెను. అట్టి వ్రజరాజనందనుఁడు కృపాకరుండయ్యును మమ్ము మఱచిపోయెనా యనిరి. ఊర్ధ్వవైకుంఠవాసిను లగుగోపిక లిట్లు వక్కాణించిరి. శ్యామవర్ణమయ మగునేత్రమున జగత్తును శ్యామముగాఁ జూచుచున్న మనకు రెండవపదార్థమే కనఁబడకున్నది కదా. మన కిఁక యోగాభ్యాస మెందులకో తెలియఁ జాలకున్నవారము. అనుచుండునంత నజితపదాశ్రితలగు గోపాంగనలాదరంబున స్నేహపాశము దృఢమైనవి. ఛేదింప శక్యము కాదు. దానినిం ద్రెంప హరికి శక్యమగును. అట్టి స్నేహపాశము నవలీలం ద్రెంచి మధురానగరమున

కరిగి హాయిగా శ్రీకృష్ణుఁ డున్నవాఁడు. నాగపాశముల గరుడుఁడు ఛేదించున ట్లున్నదే. ఏమి యింతయన్యాయమని వెక్కసపడిరి. లోకాచలవాసిను లగుగోపిక లాతురంబున మానేత్రములు శ్రీకృష్ణలగ్నములై దశదిశలఁ బరుగిడుచున్నవి. మఱే పదార్థమందును సంసక్తములు కావు. తుమ్మెదలు తామరపుష్పములందే లగ్నము లగునుగదా. అట్టి మానేత్రములకు విందొనర్పకయుండుట న్యాయమా యనిరి. ఇట్లనుచుండ శ్రీదేవిసఖు లరుదెంచి లోకులు కార్పణ్యముచేత యశస్సును, క్రోధమున సద్గుణగణమును, వ్యసనములచే ధనంబులను గపటమున మైత్రిని బోఁగొట్టుకొందురు. అని పలుకుచుండునంతలోనే మైథిలాఖ్య గోపికాగణము వచ్చి ధనమునొసఁగి తనువును గాపాడుదురు.తనువునొసంగి సిగ్గును గాపాడుకొందురు. మిత్రకార్యార్థము తనువు ధనము సిగ్గును నొసంగవలయునని నర్మగర్భంబుగాఁ బలికిరి. కౌశల లనుగోపిక లత్తరుణమున వియోగవ్యథ నేపురుషుఁడు తెలిసికొనఁ జాలఁడు. జీవములను వదలుటెంతకష్టమో యిదియు నంతకష్టము. ఉరమునఁ గ్రుచ్చుకొను బాణమునకంటె వియోగవ్యథ కష్టమును గల్గించును. ప్రియవిప్రయోగము నిట్టిదనివర్ణింపఁ దరమా యనిరి. అయోధ్యాపురవాసిను లగుగోపిక లపుడు మాకృష్ణమూర్తి మాకు నిరాశనుగల్పించి యించుక యాశనుగూడఁ బ్రసాదించి మధురానగరాశను జేరెను. ఐనను మాకుఁగల ప్రీతి యాతనినుండి మరలకున్నది. నిర్మోహులచరిత్ర మతివిచిత్రము కదా. అనిరి. పుళిందక లిట్లు పల్కిరి. గోపికలారా! మనము విచారించిన ఫలమేమి? పూర్వము తన్నుఁగోరివచ్చినయబలను శూర్పణఖను సౌమిత్రిచే

విరూపిణినిగాఁ జేయించెను. అట్టి కఠినాత్మునకు మనపైఁ గరుణ యుండునే? యనిరి. సుతలవాసిను లగుగోపిక లత్యంతవ్యథాతురలై మహాదాతయై తనకుఁగోరిన భూమినొసంగిన బలిచక్రవర్తిని గార్పణ్యమూని బంధించెను. వామనరూపధారియై యలరు నా మాయావటువునకు సేవచేయుటెట్లొకో తెలియకున్నది. జాలంధరిగోపిక లాతురలై పూర్వము హిరణ్యకశిపుఁడెన్నియోకష్టములఁ బెట్టుచుండఁగా దాళఁజాలక ప్రహ్లాదుఁడెన్నియోసారులు మొఱ్ఱపెట్టగా నృసింహరూపమున వానికి సాయ మొనరించెను. ఈకృష్ణునికృప యెంతనిష్ఠురమైనదో తెలియఁబడదుకదా యనిరి. భూమి గోపిక లిట్లుల్లసమాడిరి. * నిర్మోహిజనులచరిత్ర మత్యంతవిచిత్రము. దానినివర్ణించుట న్యాయమైన పనిగాదు. వారు నోట నొకవిధముగా మాటలాడుదురు. హృదయమున వేఱొకవిధముగా నాలోచింతురు. కావున వారిచరిత్రమును భగవంతుఁడే యెఱుఁగఁడన నిఁక మనుష్యు లెఱుఁగుదురా యనిరి. వారివాక్యములను వినుచు నుద్ధవుఁ డాశ్చర్యావిష్టమానసుఁడై యుండెను.

ఆర్యమహాశయులారా! గోపిక లుద్ధవుని రాకెఱింగి వచ్చి యతఁడు వినుచుండ సంభాషించుకొనిన మాటలుగల యీ కథను బఠించితిరి. ఇందేమేని విశేషము కలదాయని విమర్శింతము. విశేషార్థము లిందేమియు లేవనితోఁచును గాని యించుక యవకాశమిచ్చి మనసు నేకాగ్రముచేసి యూ

---

* అహో ఽతినిర్మోహి జనస్యచిత్రం పరంచరిత్రం గదితుం న యోగ్యం, ముఖేన చాన్యద్ధృతిభావ్యమన్య ద్దేవో నజానాతి కుతో మనుష్యాః-అని మూలము. ఇది యుదాహరణముగాఁ జెప్పఁదగినదని వ్రాయఁబడినది.

హించిన విచిత్రమగు నొకభావము పొడకట్టును. గోపికల చరిత్రమునుండియేకదా శ్రీకృష్ణమూర్తి దివ్యచరితము మిగుల నపవిత్ర మైనది. కావున నట్టి గోపికలచిత్తవృత్తు లెట్టివని యీసంభాషణమునుండి తేలcగలదు. జారిణు లగు గోపికల సంభాషణవాక్యము లెట్లుండునో వచింప నక్కఱలేదు. ఇచ్చట గోపికలు సంభాషించినవిషయ మెట్టిదనియు విమర్శింతము. శ్రీకృష్ణదర్శనము పరమాత్మసందర్శనముగా భావించి నట్లే స్పష్టమగును. మఱియు శ్రీకృష్ణమూర్తియే పూర్వము నృసింహ వామన రామరూపములc దాల్చెనని వారు వచించిరి. కామాతురలగు కామినులపలుకు లిట్లేయుండునా అని యూహింపుcడు. తమమనోభావముల దాcచి పరపురుషునిచెంత న్యాయసమ్మత మగునట్లు మాటలాడుట లోకధర్మము గాన వీరు నట్లే మాటలాడియుందురనుకొనcగూడదా యని మీరు ప్రశ్నింపవచ్చును. అదియు సత్యమే యని నేను నంగీకరింపవచ్చును. కాని యట్టివారి సంభాషణము వేఱుగా నుండును. పరబ్రహ్మమనియు, నా తోcబుట్టువనియు, నన్నుc గన్నతండ్రియనియు నుపపతిని భావించి నలుగురితో నట్టిమాటలcబల్కుట జారిణులపద్ధతి యని నే నంగీకరింపc జాలను. ఎవ్వరుగాని సత్యము నెదుట నునుచుకొని మాటలాడువా రంగీకరింపcజాలరని నా నమ్మకము. ఎంతమోసముగా మాటలాడినను వానియర్థము లిట్లుండవు. అవి వేఱు. ఇప్పలుకులు భక్తిరసభరితములు. వేదాంతసారములు. శ్రీకృష్ణుని వారెల్ల భగవంతునిగా భావించిరని స్పష్టముగా నగపడుచున్నది.ఇట్టివారిని జారిణులనుట పాపహేతువనక తప్పకున్నది. వ్యర్థముగాc బాపమును సంపాదించుకొనc

ప్రయత్నింపనేల? అట్టిప్రయత్నమును మానుకొనుఁడని మి మ్మభ్యర్థించుచున్నాఁడను. గోపికలు భగవత్స్వార్థ మెల్లలోక ములనుండి యవతరించి రనువిశ్వాసము మీకు నుండుఁగాక. భక్తులచరిత్రముల నపవిత్రముఁగాఁ జేయఁ బ్రయత్నింపరనియు భావించెదను. శ్రీకృష్ణభక్తి చతుర్విధపురుషార్థప్రదమైనది. దాని నేల మలినముగాఁజేయ సాహసించెదరు? కొందఱు సాహ సించినను ఫలముగల్గునను దురూహ నాకు లేదు. ఎందఱో దానినివదలక తరించువా రుందురు. కావున నట్టి దుష్ప్రయ త్నమునుజేయక భగవత్స్వార్థము మహర్షులుగూడ గోపికా రూపమున నవతరించిరని నమ్మి వారివలె శ్రీకృష్ణపరబ్రహ్మమును సేవింపుఁడు. కృతకృత్యుల రగుదురు. ఇదియ యీకథనుండి తెలిసికొనఁ దగువిషయము. ఇంక దీనినుండివిరమించి భాగవత కథా శేషభాగమును వ్రాసెదను.

* ఇట్లు గోపికలు భాషించుకొనుచుండ నుద్ధవుఁ డాలించి వారిభావముల నెఱింగి సంతోషాంబుధి నోలలాడెను. వారికి శ్రీ కృష్ణసందేశమును దెల్పి యూఱడింపఁ దలంచెను తడవుసేయుట పాడిగాదని యూహించెను. అట్లూహించి ప్రియభాషణముల

---

* ఇవి శ్రీభాగవతమునుండి లోపలికథ కనుబంధముగా వ్రాయఁబ డును. కాని యీ కథనుమాత్రమే యితరపురాణములనుండి విశేషించి ముందు వ్రాసెదను. భాగవతకథనుండి, యుద్ధవునిసంభాషణము ముగిసిన ట్లగ పడినను ముగిసినదని భావింపక యితరపురాణస్థ కథలనుగూడఁ బఠింపవలయు నని తలంపవలయును. రాధాప్రస్తావము మరల నిందుఁగలదు. అది యత్య ద్భుతమైనది. ఆమె సాక్షాత్పరదేవియని యెఱుంగవచ్చును. కావున నిచట భాగవతమునఁ గలకథనుమాత్రమే వ్రాయఁ బ్రయత్నించితిని.

## ఉద్ధవుఁడు గోపికలకు శ్రీకృష్ణసందేశముఁ దెలుపుట.

వారికిట్లు తెల్పెను. [1] ఓ గోపికలారా! పరాత్పరుఁడగు శ్రీవాసుదేవునిపై మీరు భక్తిభారమున మనసుల నిట్టు లర్పించితిరి. కాన మీ వికృతార్థజన్మములని తలంతును. మీమనసులు తదేకాయత్తము లనుట స్పష్టమాయెను. కావున మీరు కృతార్థులైతిరనుట నిక్కువము. అంతియగాక లోకపూజితులైతిరి. [2] ధ్యానముచేతను వ్రతములనాచరించు పద్ధతిచేతను, దేహమును శోషింపఁజేయఁజాలు తపస్సుచేతను, హోమముల చేతను, జపములొనరించి మంత్రసిద్ధులఁ గాంచుటచేతను, వేదపాఠమొనరించి పాపముల నడంచుటచేతను, నియమముల మనశ్శుద్ధిని గల్గించుటచేతను ఇంతియకాక యింక ననేకప్రకారములగు పూజాదులచే మీరు కాలమునుబుచ్చుచు శ్రీకృష్ణపరమాత్మపై భక్తి నలవరించుకొనఁ జాలితిరి. ఇది సామాన్యులకు సాధ్యము కాదు. దుర్లభమని యెఱుంగుఁడు. మహర్షులకును దుర్లభమని శాస్త్రములు ఘోషించుచున్నవి. అట్టి యీభక్తిని మీరు పూర్వపుణ్యవశమునఁ బడయఁజాలితిరి. ఇది మిగులఁ బ్రశంసనార్హము. మీరు పతులను సుతులను, బంధువులను, దివ్యహర్మ్యములను తృణప్రాయములుగా భావించి వదలి శ్రీకృష్ణమూర్తిని బరమపురుషుఁడు పరాత్పరుఁడు, నిరంజనుఁ డద్వితీయుఁడు నగుపరబ్రహ్మముగా భావించి యీమహా

---

[1] అహోయూయంస్మ పూర్ణార్థా భవత్యో లోకపూజితాః = అని మూలము.

[2] ధ్యానవ్రత తపోహోమ జపస్వాధ్యాయ సంయమైః, శ్రేయోవిధిభిరన్యైశ్చ కృష్ణేభక్తిర్హి సాధ్యతే=అనిమూలము.

త్మునిపై నేకాంతభక్తి నునిచితిరి. ఇంతకంటె నత్యుత్తమకార్య మీలోకమునఁ గా దేలోకముననైనఁ గలదా. సత్యముగా లేదని నేను భావించుచున్నాఁడను. అందఱు నిట్లే భావింతురని నమ్మె దను. * విరహనిమిత్తమున మీకెల్ల నా పరాత్పరునిపైఁ గల్గి నప్రేమము నిట్టిదని తెలుపుటకు శక్తి చాలదు. మీప్రేమ మిట్టి దని తెలుపుటయన నన్ననుగ్రహించుటయే యని భావించు చున్నవాఁడను. మఱియు సంభావించుచున్నవాఁడను. నేను [1] శ్రీకృష్ణమూర్తికి రహస్యకార్యమును దీర్చు పరిచరుఁడను. ఆమహాత్ముఁడు మీకుఁ జెప్పవలయునని నా కాజ్ఞాపించినమా టలు వినుఁడు. అవి సుఖావహములయి యుండును. చెప్పుటకు నాకును మహానందము. వినుటకు మీకునుగూడ నింపుగ నుండును. ఆ కారణము వినుఁడు. ఈఘట్టమున నిన్నిశ్లోకముల యర్థముంగలిపి పోతనగా రొక్కపద్యమును వ్రాసిరి.

మ. జపదాన వ్రతహోమ సంయమ తపస్స్వాధ్యాయముఖ్యం
బులన్, నిపుణుల్ కోరియు నేవిధుఁ గనముల న్నిల్పంగ
లేరట్టి స, ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై
మీకజ, స్రపటుధ్యానము లిట్లు నిల్చునె భవచ్చారిత్ర
ముల్ చిత్రముల్.

ఇది చాల సంగ్రహముగ నున్నది. ఏలాగో తెలియఁజాలకు న్నాఁడను. పైఁగథ నాలకింపుఁడు.

---

* విరహేణ మహాభాగా మహాన్మేఽనుగ్రహః కృతః=అని మూలము.

[1] యహూదా యాగతోభద్రా హ్యహం భర్తూరహస్కరః = అని మూలము.

[1] చరాచరప్రపంచమునందుఁ బంచభూతముల తెఱంగున ననుగతుఁడనై మనోబుద్ధీంద్రియములకు నాశ్రయుఁడనై సర్వాత్మకుఁడనై వర్తించుచున్నవాఁడను. ఇట్టి నాయెడఁబాటు మీకు నెప్పుడైనఁ గలుగునా కలుగనే కలుగదు. [2] నేను నన్నే యాత్మేచ్ఛచే నాత్మమాయాప్రభావమున భూతేంద్రియ గుణరూపమున సృజింతును. అట్లే పరిపాలింతును. మరల నుపసంహరింతును. ఆత్మ శుద్ధుఁడు, గుణాన్వయుఁడు, వ్యతిరిక్తుఁడునయ్యు మాయాకార్యము లగుస్వప్నాది మనోవృత్తుల విశ్వతైజసప్రాజ్ఞరూపములఁ దోఁచును. మేలుకొనినపిదప స్వప్నమెట్లో యట్లే మిథ్యాభూతంబునై బాధితంబులయియున్నయింద్రియార్థవిషయములఁ జింతించుచుఁ బురుషు నింద్రియములకుం బోనుపుమనస్సును బ్రథమమున నిరోధింపఁదగు. సముద్రమునను నదులు సమాప్తినొందునట్లు ఈ మనోనిరోధంబునందే సాంఖ్యయోగసన్న్యాసములు, తపోదమములు, సూనృతంబులను సమామ్నాయంబు పర్యవసన్నం బగు. * ప్రియుండైన నేను మీదృష్టికి దూరమున నివసించుట మదనుధ్యానవాంఛతో మనస్సునకు సన్నిధిసముత్కర్షంబుఁ గావిం

---

[1] భవతీనాం వియోగో మే నహిసర్వాత్మనా క్వచిత్, యథా భూతాని భూతేషు ఖం వాయ్వగ్నిర్జలం మహీ, తథాహం చ మనఃప్రాణ బుద్ధీంద్రియ గుణాశ్రయః=అని మూలము.

[2] ఆత్మన్యేవాత్మ నాత్మానం సృజేహ న్మ్యనుపాలయే, ఆత్మమాయానుభావేన భూతేంద్రియ గుణాత్మనా=అని మూలము.

* యత్త్వహం భవతీనాంవై దూరేవర్తే ప్రియోదృశాం, మనసస్సన్నికర్షార్థం మదనుధ్యాన కారణాత్=అని మూలము.

చు తదర్థంబే కాని వేఱొండు లేదు. దూరతరవర్తియగు ప్రియతమునిపై నెట్టులో అట్టులు స్త్రీచిత్తము సన్నిహితునియెడఁ బ్రసరింపదు. [1] సర్వవృత్తులను వదలిపెట్టి నాయందే మానసమును నిలిపి నన్నే చింతించుచుండుటచేత మీరు వేగంబ నన్నుం బడయఁగలరు. [2] ఆనాఁటిరాత్రి నన్నుంజూడ రాఁగోరి ప్రయత్నించియుఁ బతులువారింపఁగా నేమియుఁ జేయఁజాలక యింట నిలిచినవారెల్ల సమాహితధ్యానమున నన్నే పొందిరి.

అని యిట్టు హరి మీకుం జెప్పఁ బుత్తెంచెను. అని యుద్ధవుండు పలికిన నాలకించి యా మధురాలాపముల శ్రుతులు తృప్తినొంద మనంబు లానందసాగరంబున నోలలాడఁగా నిట్టులనిరి. ఆర్యా! యాదవులకుం గీడు సదా వెదకుచుండు పాపచిత్తుఁ డగుకంసుఁడు మాయదృష్టవశమునఁ దనబంధుమిత్రులతో మృతిం గాంచెను. భాగ్యవశమున సర్వార్థసిద్ధులంబడసిన యాపుర్యలంగూడిన శ్రీకృష్ణుఁ డిప్పుడు కుశలంబున నున్నవాఁడు. లజ్జచేతను స్నేహహాసోదారేక్షణములచేతను, మేము పూజించిన యా యచ్యుతుం డిపుడు మధురానగరంబునఁ బౌరకాంతలకుఁ బ్రీతిఁ గూర్చుచున్నాఁడా? రతివిశేషముల నెఱింగిన యాప్రియుఁడు పౌరనారీమణుల ప్రియవచనములచేతను వారి విలాసములచేతను ఎట్లు బంధింపఁబడక యుండును? ఉద్ధవా! మహాశయా! ఆపౌరకాంతామణుల గోష్ఠీవిశేషములఁ దేలు

---

[1] మయ్యావేశ్య మనః కృత్స్నం విముక్తాశేషవృత్తయః, అనుస్మరంత్యో మాం నిత్యమచిరా న్మాముపైష్యథ = అని మూలము.

[2] యా మయా క్రీడతా రాత్ర్యాం వనేఽస్మిన్ వ్రజ ఆస్థితాః, అలబ్ధరాసాః కల్యాణ్యో మాపుర్మద్వీర్యచింతయా = అని మూలము.

చున్న గోవిందుఁడు కథాప్రస్తావముననైన గ్రామ్యవనితలమగు మమ్మెప్పుడైనను దలంచునా? చల్లనివెన్నెల వెల్లివిరియుచుండ నుల్లసిల్లు బృందావనమున మేము సల్లాపము లాడఁగా వానికి బదులుచెప్పిన యమ్మానసీయుఁ డావిషయము నెప్పుడైన స్మరించునా? అట్టి తరుణమున మాయాలాపముల నాలకించుచు మాపాదములయందు ధ్వనించుచున్న యందెలమ్రోఁతలు తాళములుగా ముచ్చట రాసక్రీడసల్పిన యారాత్రులవృత్తాంత మెన్నఁడేని దలంచునా? పర్జన్యుఁడు పయోధరములచే వనముల బ్రదికించునట్లు తనవియోగమున మిగులువగలఁబొగులు మమ్మెల్ల నిజాంగస్పర్శమున బ్రదుకునట్లుచేయ నాదాశార్హుఁ డిచ్చట దయచేయనెంచెనా? అయ్యో! ఉద్ధవా! భక్తాగ్రగణ్యా! మాకెంతవెఱ్ఱి? శత్రువులఁ బరిమార్చి రాజ్యమును బూజ్యభంగిని బడసిన యావీరాగ్రేసరుఁడు శ్రీనిధి యందున్న రాజకన్యలం బెండ్లియాడి సుహృదయులగు నెచ్చెలికాండ్రతో నటహాయిగాఁ గాలమునుపుచ్చుచు సుఖాంబుధి నోలలాడుం గాని యిచ్చటికేల వేంచేయును? పూర్వము పింగళ నిరాశత్వమే పరమసౌఖ్యంబని వచించెను. ఆమె స్వైరిణి. అట్టి యాపింగళ వాక్కుల నాలకించియు మాకింకను శ్రీకృష్ణునిమీఁద వాంఛ విడువక బాధించుచున్నది. తాఁ గోరకయున్నను శ్రీదేవి తనంతన వలచివచ్చి యేమహాపురుషుని యంగమును బాయకుండునో ఆ యుత్తమశ్లోకుని సువార్త నెవ్వఁడు పరిత్యజింపఁ గలఁడు? బలరామునితోఁ గూడి శ్రీగోపాలబాలకుఁడు తన పాదారవిందములచేఁ బవిత్రములుగా నొనరించిన యీ నదీ మహీధర కాననప్రదేశములును, ఆతనిమన్ననలకుఁ బాత్రము

లగు గోవులును, ఆతరుణమున శ్రుతిమనోహరముగా నొనరించిన వేణునాదమును, శ్రీమన్నందనందనుని సదా స్మరింపఁ జేయుచుండును. మహాలక్ష్మీకాటపట్టులగు నా శ్యామసుందరుని పాదపద్మములచేఁ జిహ్నితములగు నా భూభాగములను గాంచి మేమెల్ల నాపరమపురుషుని విస్మరింపఁజాలుదుమా? మందమందగమనమునను, సులలితమందహాసమునను, ప్రీతికి స్థానము లగు చూపులను, మధురసంభాషణములను మాచిత్తములు శ్రీహరియందే తగిలియుండఁగా నితర మేమియు నెఱుంగని మేమాతని నెట్లు మఱవఁగలము?

అని పలుకుచు నంతలో నంతరంగమునుండి యంతకంత కుప్పొంగుసంతోషరసంబున దేహములు పరవశములు కాఁగా నుద్ధవుని మఱచి శ్రీకృష్ణుని హృదయములఁజూచుచు నో జగన్నాథా! వ్యసనార్ణవమున మునిఁగియున్న గోకులము నుద్ధరింపుమా! రమానాథా! మమ్ముఁ గరుణంజూడుము. వ్రజనాథా! యార్తిధ్వంసకా! గోవిందా! పరమపురుషా! మమ్మాదరింపుము.

అని యీరీతిం బ్రార్థించి గోపికలు శ్రీకృష్ణుఁ డుద్ధవుని వలనఁ దమకుంబంపిన కుశలవార్తాశ్రవణంబున వియోగవేదనలంబాసి మరల నుద్ధవునిం జూచి శ్రీకృష్ణునిగా నాతనిని భావించి పూజించిరి. * ఆయుద్ధవుఁడు వారిభక్తి కానందించుచు నాగోపికలకు సంతోషమును గలిగించుచుఁ గొన్ని మాసములు

---

* ఉవాస కతిచిన్మాసాన్ గోపీనాం వినుదన్ శుచః, కృష్ణలీలాకథాగాయన్ రమయామాస గోకులమ్ = అని మూలము.

గోకులమున నివసించెను. శ్రీకృష్ణచరితామృతమును దనివితీఱఁ గ్రోలుచు నావినోదమునం జేసి, యాభక్తాగ్రేసరుఁ డుండినదినములు సుదివసములని భావించుచుండఁగా నాగోపాలకులకు గోపికలకు నాకాలము క్షణకాలతుల్యముగాఁ గడచెను. భగవంతుఁడగు శ్రీకృష్ణునియం దాయత్తమగు చిత్తముగల యాగోపికాతతిని గాంచి యాయుద్ధవుండు పరమసంతుష్టుఁడై వారికి శ్రీకృష్ణవియోగమునఁ గలిగినవ్యథనెఱింగి యిట్టులుండు నే వీరి ప్రేమమని మరలమరల సంస్మరించుచు [1]వారికి నమస్కరించుచు నిట్లు తలంచెను. [2]సంసారసాగరభీతులైనమహర్షులును, భక్తులమగు మేమును ఏదాసిం గోరుదుమో ఆ గోవిందపాదారవిందసాంద్రభక్తి నన్నివిధములను బడసిన యీగోపికల జన్మమే సార్థకము. అనంతునికథలపై గాఢానురాగము గలవారలకు శౌక్లమనియు, సావిత్రమనియు, యాజ్ఞికమనియు విఖ్యాతినొందిన విప్రజన్మములు గలిగిన నేమి? కలుగకయుండిన నేమి? గొప్పఁదనమునకు నీశ్వరప్రసాదమే కారణము. అట్టివానికి జాతియు, నాచారము, జ్ఞానము, కారణములు గావు. కేవల భగవద్భజనమే వానికి ముఖ్యము. అరణ్యములలో సంచరించుచుఁ జంచలస్వభావముగల యీ వనిత లెక్కడ? పరమేశ్వరుఁడగు శ్రీకృష్ణునిపై నింతటి గాఢభక్తి

---

[1] ఉద్ధవః పరమప్రీత స్తాన్నమస్యన్నిదం జగౌ = అని మూలము.

[2] ఏతాః పరం తనుభృతో భువి గోపవధ్వో, గోవింద ఏవ మఖిలాత్మని రూఢభావాః, వాంఛంతి యద్భవభియో మునయో వయం చ, కిం బ్రహ్మజన్మభిరనంతకథారసస్య=అని మూలము. బ్రహ్మజన్మభిః = విప్రసంబంధిభిః, శౌక్ల సావిత్ర యాజ్ఞికై స్త్రిభిర్జన్మభిః. అని వ్యాఖ్య.

యెక్కడ? అజ్ఞానుఁడైనను దన్ను సేవించినమాత్రమున నమృతమని తెలియక త్రాగినను అమృత మాతనికి జరామరణబాధలు లేకయుండఁజేయురీతిఁ బరమాత్మ వానికి మేలుచేయును.

రాసక్రీడాసమయమునఁ బరాత్పరుండగు శ్రీవాసుదేవుని కోమలబాహులతల నాశ్రయించి కంఠాలింగనసుఖమును మిగులఁగాంచిన యీగోపికలకు సంభవించిన మహాప్రసాదము నిత్యానుసంధాయిని యనపాయినియు నగు శ్రీదేవికిని గమలగంధకాంతిఁ జెలువారు నిర్జరనారీమణులకును గలుగదని నా నమ్మకము. ఇట్టులుండ నింకఁ దక్కినవారిని బరిగణింపనేల? * ఎట్టులైనను వదలఁజాలని స్వజనమును ధర్మమును బరిత్యజించి శ్రుతివితతులకుం గూడ మృగ్యంబైన ముకుందపదవిని గనుఁగొన్న యీగోపికామణుల పాదపరాగమును బడయుచున్న యీబృందావనతరు లతాగుల్మములలోఁగాని, యిందలి యోషధులలోఁగాని నొక్కటిగా నేను బుట్టుదును. ఆప్తకాములగు యోగీశ్వరులు, బ్రహ్మాదిదేవవర్యులు, శ్రీదేవియు నాత్మలో సదా పూజించుచుండ నొప్పారు శ్రీముకుందదివ్యచరణారవిందమును రాసక్రీడయందుఁ గుచములఁ గౌఁగిలించుకొని తాపమును బాసి శ్రీమద్గోవిందమనోహరకథాగానముచే మూఁడుజగములను బవిత్రములు గావించు నీగోపికల పాద

---

* ఆసా మహో చరణరేణుజుషామహం స్యాం బృందావనే కిమపి గుల్మలతౌషధీనాం, యాదుస్త్యజం స్వజన మార్యపథం చ హిత్వా భేజుర్ముకుందపదవీం శ్రుతిభిర్విమృగ్యామ్. యావై శ్రియార్చిత మజాదిభిరాప్తకామై ర్యోగీశ్వరై రపి యదాత్మని రాసగోష్ఠ్యాం కృష్ణస్య తద్భగవత శ్చరణారవిందం న్యస్తం స్తనేషు విజహుః పరిరభ్య తాపమ్=అని మూలము.

ధూళికి నమస్కరింతును. అని తనలో ధ్యానించి యాయుద్ధవుఁడు గోపికాజనములను యశోదానందులను వీడ్కొని మధురాపురమున కరుగఁ బయనమై తేరెక్కెను.

ఆసమయమున నందాదులు పలువిధములగు కానికలు పెట్టి మహానురాగమున నశ్రుపూరంబులు కన్నులఁ గ్రమ్మఁ దేర నిట్లనిరి. * మహాత్మా! మనోవృత్తులన్నియు శ్రీకృష్ణపాదాంబుజముల నాశ్రయించెను. వాగ్వృత్తులు శ్రీకృష్ణనామధేయకీర్తనమును జేసెడు. దేహవృత్తులు తన్నమస్కారాదులఁ బ్రవర్తించుచున్నవి. కర్మానుబంధముల నీసంసారమునఁ బరిభ్రమించు మాకు నే జన్మమునందైనను ఈశ్వరానుగ్రహము చేత మంగళాచారములచేతను, దానములచేతను శ్రీకృష్ణుని పైని రతి గల్గుఁగాక. అని పలుకుచు శ్రీకృష్ణునియందున్న భక్తి పరత్వమున నాతనిం బూజించిరి. ఉద్ధవుం డాపూజలం గైకొనుచు మధురానగరంబునకుం జనుదెంచి గోపాలబాలకుని దర్శించి నమస్కరించి గోకులముననున్న యందఱకుంగలభక్త్యతిశయమును జక్కఁగా వివరించి వా రొసంగిన కానుకలను శ్రీరామకృష్ణులకు సమర్పించెను.

ఆర్యులారా! సత్యాన్వేషణసమాదృతచిత్తులారా! భాగవతమునఁగల భ్రమరగీతలను, గోపికలతో నుద్ధవుఁడు శ్రీకృష్ణవార్తను జెప్పుటయు, వా రాతనితో బదులుచెప్పుటయు, నాపిదప నుద్ధవుఁడు వారిచిత్తవృత్తులం బరికించి వందనము

---

* నందాదయోఽనురాగేణ ప్రావోచన్నశ్రులోచనాః, మనసో వృత్తయో నస్స్యుః కృష్ణపాదాంబుజాశ్రయాః, వాచోభిధాయినీర్నామ్నాం కాయస్తత్ప్రహ్వణాదిషు=అని మూలము.

లాచరించి భక్తిభరితస్వాంతలనుగా వారిని భావించుటయు, నందాదు లుద్ధవుని సన్మానించుటయుఁ, దమభావముల నాతనికిం దెల్పుటయు లోనుగాఁగల విషయములను బఠించితిరి. విశేషించి శ్రీకృష్ణుఁడు గోపికలకుం దెలుపుమని యుద్ధవునితోఁ బల్కినపల్కులను జదివితిరి. దీని నించుక చర్చించి వ్రాయకతప్పదు. గోపికలవృత్తి యెట్టిది? అనువిషయమే ప్రధానము. అది యేకదా శ్రీకృష్ణచరిత్రమునకుఁ దీఱనికళంకము నాపాదించినది. నందాదులు శ్రీకృష్ణునియం దెట్టిభావము కలవారు? అనునది కూడఁ దెలిసికొనుట ముఖ్యము. ఈకథనుండి యనేకనీతులు బయలువెడలును. ఈ కథనుబట్టి నందాదులు గోకులముననే యున్నవారనియు శ్రీకృష్ణుఁడు కంసవధానంతరము నందునకుపదేశింపలేదనియు నెఱుంగుఁడు. ఇది యొక్కభాగవతము నుండియే వ్రాయఁబడిన కథయనియు మఱువకుఁడు.

గర్గసంహితనుండియుఁ గొంతభాగ మిట వ్రాయఁబడినది కదా. దానిం బట్టి యోజింప నెందఱుగోపికలు శ్రీకృష్ణసేవార్థమవతరించిరో తేటపడును. వా రుద్ధవుని శ్రీకృష్ణకుశలమును బ్రశ్నించినవిషయ మూహించినచోఁ వారిభావము లెట్టివియో తోఁచును. కామాతుర లగువారిపలుకు లెట్లుండుననియు నించుకయైన లోకజ్ఞానముగలవా రెఱుఁగఁజాలుదురు. ఎట్టి చమత్కారిణిగాని యెంతనర్మగర్భముగా మాటలాడినను బ్రేమాతిశయమును దెల్పువాక్కులే వినఁబడును గాని తమరు వలచినకాంతుని, పరమేశ్వరునిగను, సాక్షాద్విష్ణువుగను, అద్వితీయునిగను, సంసారార్ణవతారకునిగను, దమకారాధ్యునిగను భావించినట్లు వారిమాటలనుండి తేలుననుట కవకాశము లేదు.

గోపికలంద ఱుద్ధవుని సాక్షాచ్ఛ్రీకృష్ణునిగనే భావించి పూజించిరఁట. ఇదేమివింత! అట్టివారిభావము లెట్టివని యూహించు టుచితమో ఇంచుక పరికించిన స్పష్టమగును. ఇంతియగాక మమ్ముద్ధరించునాపరాత్పరుని సదా ధ్యానింతుమనిరి. భగవంతుని ధ్యానించుట, కాముకునిస్మరించుట లోకధర్మములు తావలచినప్రియుని దండ్రిగాను జగదుద్ధారణముని గాను భావించువా రుందురని యింతవఱుక నేగ్రంథమునందును జూచియుండలేదు. కాఁబట్టి గోపిక లా శ్రీకృష్ణుని బరమేశ్వరుగా భావించిరనియే యంగీకరింపక తప్పదు.

ఆగోపికలంగాంచి వారిపలుకు లాలించి యుద్ధవుఁ డా భక్తాగ్రగణ్యుఁడు వారితో నెట్లుసంభాషించెనో యించుక స్మరింతము. దాన మనకుఁగల యసంగతశంకలు పటాపంచలగు. వారి మాటలు మోహపూరితములే యైనచో నుద్ధవునిసంభాషణలు వేఱురూపమును దాల్చియుండును ఆమాటల నించుక చర్చించు టధికప్రసంగము కాదు.

"అహో! యూయం స్మ పూర్ణార్థా భవత్యో లోకపూజితాః." అనునిది యుద్ధవుని తొలివాక్యము. మాకృష్ణునితో వ్యభిచరించితిరి గావున మీరు లోకపూజితలైతిరని భావించునవకాశ మెవ్వరికైన నుండునాయని ప్రశ్నించెదను. బదులుగా వీలు లేదని నే నెఱుంగుదును. వారి భక్త్యతిశయము నెఱింగి యాయుద్ధవుఁ డానందపరవశుఁడై గోపికలారా! మీ రెల్ల భక్తిభరితస్వాంతలుగానఁ గృతార్థలనియెను. మీరే లోకపూజితలైతిరనియు ననియెను. పరమైకాంతికభక్తిగలవారే జగత్పూ

జితులు కావున నట్టి శ్రీకృష్ణభక్తి మీకు లభించినది కావున మీరే లోకమునఁ బూజింపఁదగినవా రనియె.

"యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే. ౬
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్,
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్." ౭

భగవద్గీత. భక్తియోగము.

"అవిద్యమాన మన్యదాలంబనం విశ్వరూపం దేవమాత్మానంముక్త్వా యస్య సోఽనన్యః తేన అనన్యేనైవ. కేన? యోగేన సమాధినా మాం ధ్యాయంత శ్చింతయంత ఉపాసతే." శంకరభాష్యము. "న విద్యతేఽన్యో భజనీయో యస్మింస్తేన ఏకాంత భక్తియోగేనోపాసత ఇత్యర్థః." శ్రీధరీ వ్యాఖ్య.

ఈ భగవద్గీతావాక్యమునుబట్టి యితరదేవతలను గాంచాపూర్త్యర్థము నమ్మక యొక్కభగవంతునందే యెవరు మన నుంచి యుపాసింతురో అనఁగా ధ్యానింతురో వారే పరమ భక్తులు. వారిని మృత్యుసంసారసాగరమునుండి నే నుద్ధరింతు నని శ్రీకృష్ణమూర్తి యుపదేశించెను.

ఇట్లు పలికి యుద్ధవుఁ డంతతో నూరకుండక గోపికలతో నింకను సంభాషించెనుగదా. ఆవాక్కులనించుక విమర్శింతము. ధ్యానవ్రతతపోహోమ జపస్వాధ్యాయములచేతను సంయమముచేతను భక్తి సాధింపఁబడుననియె ఇందు నీగోపిక లేమియొనరించి భక్తిని సాధించిరను ప్రశ్నము రావచ్చును. పై చెప్పినవి మాత్రమే కాక 'శ్రేయోవిధిభిరన్యైశ్చ' యన్నందునఁ బూర్వోక్తపద్ధతులు గాక తమకుఁది కనుకూలమగు మతేపద్ధతిచేనైనను

భక్తిని సాధింపవచ్చునని యుద్ధవుఁడు చెప్పినందున గోపికలన న్యపరాయణలై తమమనస్సుల సదా శ్రీకృష్ణపాదాంబుజముల నునిచిరి. ఇంతయేల? ఆత్మార్పణ మొనరించిరి. ఇంతకంటె నేమి కావలయును? అంతియకాక,

"విరహేణ మహాభాగా మహాన్మేఽనుగ్రహః కృతః."

అనిచెప్పిన యుద్ధవునియాశయ మేమి? భగవద్దర్శనము లేమి మీకాతనిపైఁ గల్గినప్రేమము నిట్టిదని వర్ణింపఁజాలను. మీకుఁ గలప్రేమమును దెలిసికొనుట కవకాశమును భగవంతుఁడు కల్పించెను. అదియే నాయందలి భగవంతునకుంగల యనుగ్రహ మని నమ్మెదను. అనఁగా మీకు శ్రీకృష్ణపరబ్రహ్మముపైఁ గల ప్రీతి యవ్యాజమైనది. దాని నెఱింగితిని. ఇదియే నేఁ గడతేఱు మార్గము. అనుమాటచే మీవంటిభక్తి నాకు భగవంతునిపైఁ గుదిరిన నీసంసారసాగరమును దాఁటుట యద్భుతమా యని కదా గ్రహింపందగువిషయము తేలినది. అంతియగాక గోపిక లతో నుద్ధవుఁడు,

"భగవత్యుత్తమశ్లోకే భవతీభి రనుత్తమా,
భక్తిః ప్రవర్తితా దిష్ట్యా మునీనా మపి దుర్లభా."

అనియెను. వ్యభిచారవృత్తిగల గోపికలతో నీరీతి మహాభక్తుఁడు పల్కునా? పరమయశస్సుగల భగవంతునియందు సత్యోత్తమ భక్తి మీకుఁ గుదిరినది. అది మీపూర్వపుణ్యముచేతనే యని యెఱుంగవలయు. మహర్షులకైన నిట్టి యనన్యభక్తి దుర్లభము. ప్రాయశః కుదురునది కాదు. అనఁగాఁ దాత్పర్య మేమి? మును లకుంగూడ మీకు శ్రీకృష్ణునిపై నిట్లుకుదిరిన నిశ్చలభక్తి కుదు రుట దుర్లభము. ఇంతకంటె గోపికల సత్ప్రవర్తనమును గుఱించి

విశేషించి వచింపవలసిన దేమున్నది ? మునులకు సామాన్యముగా నలవడనిభక్తి గోపికలకుఁ గుదిరినదని యుద్ధవుఁ డనియె. ఇది చాలదా? ఇంకను వారిని నిందింపఁ బూనఁదగునా? వారికిం గల భక్తియందు సహస్రాంశముగూడ మనకు లేదేయని దుఃఖింపవలయుననుటకంటె నెక్కువ వ్రాయసుంకింపను. మఱొక్క మాట.

"దిష్ట్యా పుత్రాన్ పతీన్ దేహాన్ స్వజనం చ గృహాం స్తథా,
హిత్వావృణీత యూయం యత్కృష్ణాఖ్యం పురుషం పరమ్."

అని యుద్ధవుఁడు పలికెను. "దీనిభావ మేమి తిరుమలేశా" అని యూహింపుఁడు. మీరు సమస్తము కృష్ణార్పణము చేసితిరని దీనిసారము. కృష్ణాఖ్యం పురుషం పరమ్=అనఁగా రూపనామక్రియాశూన్యుఁ డగుపరాత్పరుఁడు భగవదుద్ధరణార్థము శ్రీకృష్ణనామమును ధరించి రూపమును గాంచెను. ప్రకృతిని స్వీకరించెనని దీనిభావము. సగుణబ్రహ్మమని దీని సారతరార్థము. అట్టిపరబ్రహ్మమునకు నాత్మార్పణము చేసితిరి. మీయదృష్టమే యదృష్టమనియె. ఔరా! గోపిక లెంతటియదృష్టము కలవారలని యుద్ధవుఁడు వర్ణించెను.

ఆర్యమహాశయావతంసములారా! ఉద్ధవుఁడు పలికినపలుకులవలన గోపికలు శ్రీకృష్ణభక్తి భరితహృదయలనియు,మహర్షులకంటె నధికశక్తిసంపన్నలనియుఁ, గాముకురాండ్రు గారనియు స్పష్టమయ్యెను. ఇంక శ్రీహరి గోపికలకుఁ జెప్పుటకు నుద్ధవుని వలనఁ బంపినవార్త యెట్టిదని యించుక విమర్శింతము. దానియం దించుకంతయైనఁ గామవికారము కనఁబడునేమో పరికింపుఁడు. నేను సర్వాంతర్యామిని. కావున బుద్ధీంద్రియముల

భక్తిని సాధింపవచ్చునని యుద్ధవుఁడు చెప్పినందున గోపికలనన్యపరాయణలై తమమనస్సుల సదా శ్రీకృష్ణపాదాంబుజములయునిచిరి. ఇంతయేల? ఆత్మార్పణ మొనరించిరి. ఇంతకంటె నేమి కావలయును? అంతియకాక,

"విరహేణ మహాభాగా మహాన్మేఽనుగ్రహః కృతః."

అనిచెప్పిన యుద్ధవునియాశయ మేమి? భగవద్దర్శనము లేమి మీకాతనిపైఁ గల్గినప్రేమము నిట్టిదని వర్ణింపఁజాలను. మీకుఁ గలప్రేమమును దెలిసికొనుట కవకాశమును భగవంతుఁడు కల్పించెను. అదియే నాయందలి భగవంతునకుంగల యనుగ్రహమని నమ్మెదను. అనఁగా మీకు శ్రీకృష్ణపరబ్రహ్మముపైఁ గల ప్రీతి యవ్యాజమైనది. దాని నెఱింగితిని. ఇదియే నేఁ గడతేఱు మార్గము. అనుమాటచే మీవంటిభక్తి నాకు భగవంతునిపైఁ గుదిరిన నీసంసారసాగరమును దాఁటుట యద్భుతమా యని కదా గ్రహింపందగువిషయము తేలినది. అంతియగాక గోపికలతో నుద్ధవుఁడు,

"భగవత్యుత్తమశ్లోకే భవతీభి రనుత్తమా,
భక్తిః ప్రవర్తితా దిష్ట్యా మునీనా మపి దుర్లభా."

అనియెను. వ్యభిచారవృత్తిగల గోపికలతో నీరీతి మహాభక్తుఁడు పల్కునా? పరమయశస్సుగల భగవంతునియందు నత్యుత్తమ భక్తి మీకుఁ గుదిరినది. అది మీపూర్వపుణ్యముచేతనే యని యెఱుంగవలయు. మహర్షులకైన నిట్టి యనన్యభక్తి దుర్లభము. ప్రాయశః కుదురునది కాదు. అనఁగాఁ దాత్పర్య మేమి? మునులకుంగూడ మీకు శ్రీకృష్ణునిపై నిట్లుకుదిరిన నిశ్చలభక్తి కుదురుట దుర్లభము. ఇంతకంటె గోపికలసత్ప్రవర్తనమును గుఱించి

విశేషించి వచింపవలసిన దేమున్నది ? మునులకు సామాన్యముగా నలవడనిభక్తి గోపికలకుఁ గుదిరినదని యుద్ధవుఁ డనియె. ఇది చాలదా? ఇంకను వారిని నిందింపఁ బూనఁదగునా? వారికిం గల భక్తియందు సహస్రాంశముగూడ మనకు లేదేయని దుఃఖింపవలయుననుటకంటె నెక్కువ వ్రాయనుంకింపను. మఱియొక్క మాట.

"దిష్ట్యా పుత్రా& పతీ& దేహా& స్వజనం చ గృహాం స్తథా,
హిత్వావృణీత యూయం యత్కృష్ణాఖ్యం పురుషం పరమ్."

అని యుద్ధవుఁడు పలికెను. "దీనిభావ మేమి తిరుమలేశా" అని యూహింపుఁడు. మీరు సమస్తము కృష్ణార్పణము చేసితిరని దీనిసారము. కృష్ణాఖ్యం పురుషం పరమ్=అనఁగా రూపనామ క్రియాశూన్యుఁ డగుపరాత్పరుఁడు భగవదుద్ధరణార్థము శ్రీకృష్ణనామమును ధరించి రూపమును గాంచెను. ప్రకృతిని స్వీకరించెనని దీనిభావము. సగుణబ్రహ్మమని దీని సారతరార్థము. అట్టిపరబ్రహ్మమునకు నాత్మార్పణము చేసితిరి. మీయదృష్టమే యదృష్టమనియె. ఔరా! గోపిక లెంతటియదృష్టము కలవారలని యుద్ధవుఁడు వర్ణించెను.

ఆర్యమహాశయావతంసములారా! ఉద్ధవుఁడు పలికినపలుకులవలన గోపికలు శ్రీకృష్ణభక్తి భరితహృదయలనియు,మహర్షులకంటె నధికశక్తిసంపన్నలనియుఁ, గాముకురాండ్రు గారనియు స్పష్టమయ్యెను. ఇంక శ్రీహరి గోపికలకుఁ జెప్పుటకు నుద్ధవుని వలనఁ బంపినవార్త యెట్టిదని యించుక విమర్శింతము. దాని యం దించుకంతయైనఁ గామవికారము కనఁబడునేమో పరికింపుఁడు. నేను సర్వాంతర్యామిని. కావున బుద్ధీంద్రియముల

న్నాశ్రయుఁడను. సర్వాత్మకుఁడను. ఇట్లువర్తించు నాకు నెవరితోడ నెడఁబాటు సంభవింపదు. నాకు జనకుఁడు లేఁడు. జననియును లేదు. నన్ను నేనే సృజించుకొందును. నా మాయాప్రభావమున భూతేంద్రియరూపమున సృజింతును. పరిపాలింతును. సంహరింతును. మీ మేలుగోరి నేను మీకు దూరమునను న్నట్లు భ్రాంతిని మీకుఁ గల్పించుట మీమనోవృత్తుల దృఢపఱచుటకే కాని వేఱుగాదు. స్త్రీలస్వభావము దూరమందున్న ప్రియునియం దధికవాంఛయునుచుట. కావున దూరమందు న్నట్లు నన్ను భావించు మీకు నాపై నవ్యాజానురాగము దృఢతమ మగు. నన్నే సదా ధ్యానించుచుందురుగావున వేగంబ నన్ను సేవింపఁగలరు. ఇదియ శ్రీకృష్ణప్రేషిత వార్తాసారము. దీనిం బట్టిచూడఁగా శ్రీకృష్ణుఁడు దూరమందున్నవాఁ డను భ్రాంతి వారికిం గలుగకుండఁజేయుటయే కృష్ణునిపనిగాఁ దోఁచునే కాని వారి నింకను గాముకలనుగాఁ జేయుటగాదని స్పష్టము గాఁగలదు. ఇట్టియుపదేశమే మహర్షులకుంగూడఁ జేయఁబడును. ఈయుపదేశమున మహర్షులకును గోపికలకును భేదము గానరాదు. కావున గోపికలు కామపరవశలని యెట్లును నిర్ణయింప వీలులేదు. ఈ పవిత్రచరిత్రమునుండి గోపికల పరిశుద్ధమనోవృత్తి తెల్లమయ్యెను. కావున నింకనైన గోపికలు జారిణులని దూషించువారిపల్కులఁ జెవిఁ జొరనీయకుఁడు. భగవద్దర్శనమునకు గోపిక లెంత త్వరపడిరో యట్లు మనమును ద్వరపడవలయునని యెఱుంగుఁడు. భక్తియే దీనికిఁ బరమ సాధనము.

శ్రీకృష్ణవార్తలఁ దెలిపి యుద్ధవుఁడు గోపికలకు నమస్కరించెను. వారియం దెట్టిసుగుణములు లేకున్న నతఁ డట్టిసత్కారమును జూపునా? మరలి మధురానగరమున కరుగునపుడు నందాదులు కృష్ణునకు నమస్కరించితిమని చెప్పుమనిరి. ఏమి యీయద్భుతము! శ్రీకృష్ణుఁడు తనకుమారుఁడని యెఱుంగక నందుఁడు నమస్కరించెఁగా! పరమపురుషుఁడని యతఁ డెఱింగిన ట్లూహింపవచ్చును గదా. ఎంతటియోగ్యత కలిగియున్నను గొడుకునకుఁ దండ్రి నమస్కరించుట గానము. పరమపురుషుఁడు తనకుఁ బుత్త్రుఁడుగా జన్మించినను లోకాచారము నాతనియెడఁ గనఁబఱచుట వివేకమని యతఁ డెఱుఁగును. లోకాచారములు భగవంతునియందుఁ గనఁబఱచుట న్యాయముకాదు కదా. ఈ వృత్తాంతమువలన శ్రీకృష్ణమూర్తి సనాతనుఁడనియు, గోపికలు తత్సేవార్థము గోలోకమునుండియు వైకుంఠాదిలోకముల నుండియు నవతరించిరనియు, వారిచరిత్రము మహర్షులకే నను ష్ఠానార్హమనియు మనమెఱుంగవలయు. గోపికలవలె శ్రీకృష్ణ భక్తి నలవఱచుకొనవలయు. దానిచేఁ గృతకృత్యులము కావల యు. ఈకలికాలమున భక్తికిమించిన మంచి సులభోపాయము వేఱొకటి కానరాదు. దానిని వీడకుండుటయే మనకు విధి. లేకున్న యవిధియే. ఇంకఁ బెంచిబ్రాయక తర్వాతి వృత్తాంతమును వ్రాసెదను. భక్తులారా! ఈపవిత్రచరిత్రమును జదివితిరి. దీనికి ఫలముగా శ్రీకృష్ణునిస్తుతిని బఠింపుఁడు. నిరతిశయానందము ననుభవింపఁగలరు. పఠించునపుడు మీమనసును భగవత్పాదారవిందద్వంద్వమునఁ గొలఁదివిఘటికలు నిల్పుఁడు. అది

యే యోగము. అది సిద్ధించినఁ గాని మనస్సు నిశ్చంచలతఁ గాంచదు. కావున సమాహితచిత్తులరై పఠింపవలయు.

బర్హం నామ విభూషణం బహుమతం వేషాయ శేషైరలం
వక్త్రం ద్విత్రవిశేషకాంతిలహరీవిన్యాసధన్యాధరమ్,
శీలైరల్పధియా మగమ్య విభవై శృంగారభంగీమయం
చిత్రంచిత్రమహో!విచిత్రమహహో! చిత్రం విచిత్రంమహః.

మఱియొక్కమాట. ఈకథ చదువుటకుముం దుద్ధవుఁడు రాధామందిరమున కరిగెననిమాత్రము లోపలికథను స్మరింపవలయును. కృష్ణజన్మఖండము ననుసరించి వ్రాసినకథ కనుబంధమనియుఁ దలంపంజను. నడుమ మండూకప్లుతిన్యాయము ననుసరించి భ్రమరగీతలను వ్రాసితి. వానికవకాశము ముందు దొరకదని యటు వ్రాయఁబడినదని తలంపుఁడు. ఇది స్మృతిగోచరముగా నొనరించి చదివిన కథ తాఱుమాఱుగాక యుండును. ఇపుడుద్ధవుఁడు రాధామందిరమును బ్రవేశించి యందు సత్కృతుఁడై రాధను బరదేవిగా వినుతించినవాఁడు. తర్వాత జరగిన కథయే యిట వ్రాయఁబడునదియనియు స్మరింపుఁడు. ఇఁకఁ గథ వినుఁడు.

## రాధోద్ధవసంవాదము.

* నారదమహర్షికి శ్రీకృష్ణచరిత్రమును జెప్పుచు నారాయణుఁ డిట్టులనియె. మునివర్యా! తరువాతివృత్తాంతమును

---

* ఇది శ్రీకృష్ణజన్మఖండము తొంబదిమూఁడవయధ్యాయమునుండి వ్రాయఁబడినది. గర్గసంహిత మధురాఖండము పదునైదవయధ్యాయమునఁ గలకథయుఁ నిందుఁగలిపి వ్రాయఁబడును. ఆస్థలమున నిందలి దీకథయనిమాత్రము మరల దెల్పెదను. భాగవతమున నీభాగము కానరాదు.

వినుము. ఉద్ధవుఁ డిట్లు రాధను భక్తిపూర్వకముగా వినుతించి కరయుగము జోడించి నిలుచుండఁ గాంచి రాధిక చేతనను బొంది యుద్ధవునియందు శ్రీకృష్ణునాకారచిహ్నము లుంటం దిలకించి దుఃఖాతురయై యిట్టు లనియె. వత్సా! నీ పే రెయ్యది? ఎవరు పంప వచ్చితివి? యెందుండి వచ్చితివి? న న్నేల నుతించితివి? విస్తరించి వచింపుము. నీసర్వావయవము లందును గృష్ణాంగచిహ్నము లగపడుచున్నవి. కావున నిన్నుఁ గృష్ణపార్షదునిగాఁ దలంచెదను. శ్రీకృష్ణకుశలమును దొలుత వచింపుము. బలదేవునికుశలమును వినిపింపుము. నందుఁ డామ ధురానగరముననే యున్నవాఁడే. ఏల? మనోహరమగు నీబృం దావనమును జూడ శ్రీగోవిందుఁ డెప్పుడు రాగలఁడు? మరల నీ బృందావనసుందరభూభాగములఁ బూర్ణశీతాంశుప్రతీకాశమగు నా పరమపురుషునిమోమును జూడఁ గోరెదను. రాసమండల మున మరల నాభగవంతుంగూడి క్రీడింతును. సఖిబృందముం గూడి నిర్మలయమునాశైవలినీజలంబుల విహరింపఁ గోరుచున్న దానను. శ్రీమన్నందనందను దివ్యాంగమున సురుచిరసురభిచం దనమలంద నాకాంక్షింతును. అన విని యుద్ధవుఁ డిట్లు బదులు చెప్పెను. నాపే రుద్ధవుఁడని. శుభాంగి! నేను క్షత్రియుఁడను, పరమాత్మయగు శ్రీకృష్ణునిచేఁ గుశలవార్త మీకుం దెల్పఁ బంపఁబడినవాఁడను. ఆ శుభవార్తంగొని మీసన్నిధి కరుదెం చితిని. హరిపార్షదుఁడనే యగుదును. శ్రీకృష్ణునకు బలదేవు నకు నందునకుఁ గుశలమే యలరారెనని విశ్వసింపుము. అన విని రాధాదేవి యిట్లు పలికెను.

పార్షదవర్యా! ఉద్ధవా! యమునాతీర మిందుఁ గలదు. అందు మందశీతలమారుతము లున్నవి. శ్రీకృష్ణునితో విహరించిన యానదీకూలమే సుమీ యిది. ఆపవమానుఁడే యిపుడున్నాఁడు. కదంబకానన మప్పటిదే యిపుడున్నది. ఆతరుమూలముల విహరించిన యాచోటు లిపుడు కనంబడును. పరమపవిత్రమగు నాబృందావనమే యిదియు నగు. సకలవాంఛలనొసఁగు నా వనవర్య మిదియే. అప్పటి పుంస్కోకిలవిరుతము లిప్పుడును వినఁబడును. చందనచర్చిత మగునప్పటి తల్పమిప్పుడునున్నది. చతుర్విధ భోజ్యపదార్థము లున్నవి. సుందరమధువును గ్రోల దొరకును. కరుణావిహీనుఁడు పాపిష్ఠుఁడు నగుమన్మథుఁడప్పటివాఁడే యిప్పుడును గలఁడు. అప్పటి రత్నప్రదీపము లున్నవి. రాసమండలమున వెలుఁగుచున్నవి. అప్పటిమణీంద్రసారనిర్మిత క్రీడామందిర మిప్పటికి నేత్రగోచర మగుచున్నది. గోపాంగనాబృందము నిండియున్నది. పూర్ణనిశాకరుఁ డప్పుడుంబోలె నిప్పుడును బ్రకాశించుచున్నాఁడు. సుగంధిప్రసవ విసరవిరచితము చందనచర్చితమగు నప్పటిశయ్యయు నట్లేయున్నది. కర్పూరాదుల సుసంస్కృతంబగు తాంబూలము గలదు. పరిమళభాసుర మాలతీమాల్యములు గలవు. శ్వేతచామరములు, సురుచిరమణిదర్పణము నట్లే యున్నవి. సకలచిరత్న రత్నహారములు గలవు. నానావిధారామములు గలవు. క్రీడాసరోవరము కలదు. పుష్పోద్యానము లభినవామోదముల వెదఁజల్లుచున్నవి. అప్పటి సర్వవిభవములు గలవు. కాని నా ప్రాణనాథుఁడుమాత్ర మిపుడిటఁ గానరాఁడు. అని పలుకుచు హా! శ్రీకృష్ణా! హా శ్రీహరీ! హా! ప్రాణవల్లభా! ఎందున్న

వాఁడవు? నాయం దేమియపరాధ మున్నది? దాసికను గదా. దాసీదోషము పలుమాఱులు క్షమింపఁ దగునుగదా. అని పలుకుచు స్మృతితప్పఁగా మూర్ఛమునిం గెను. ఉద్ధవుఁ డామెకు భగవంతునిపైఁ గలప్రేమాతిశయమును దెలిసికొని శిశిరోప చారములఁ దెప్పిఱిల్లఁ జేసెను. మూర్ఛనుండి తెలివినొందిన యా రాధికం జూచి యా క్షత్రియకుమారుఁడు పరమాశ్చర్య మందెను.

అత్తఱి నాదేవిని శ్వేతచామరహస్తలై నెచ్చెలు లేడు గురు సేవించుచుండిరి. గోపీసహస్రము లామెకు నుపచారము లుచేయ సిద్ధముగా నుండిరి. అసంఖ్యాలగు గోపిక లాదేవిని దివానిశములు సేవింపఁ గాచియుండిరి. అందొక్కవనితామణి కజ్జలహస్తయై యుండెను. వేఱొకతుక మాలతీమాల్యము చేఁబూనియుండెను. ఇంకొక్కగోపిక సిందూరహస్తయై కాచి యుండెను. మఱొకతరుణీమణి గోరోచనము కరతలమునధ రించియుండెను. ఇంక నొక్కగోపిక చందనపాత్రము దాల్చి నిలువఁబడి కనఁబడెను. దర్పణము చేఁబూని యొకతుకయుఁ గుంకుమపట్టుకొని మఱొక కాంతామణియుఁ గస్తూరికాపాత్ర మునుదాల్చి మఱియు నొక లలనాతిలకమును, జంపక కుసుమ పాత్రమును జేఁబూని యింకొక్కపురంధ్రియు, మధురమధురస పూర్ణకలశధారిణియై యింకొక్కరామయు, సుగంధితైలము నింపిన పాత్రమును ధరించి వేఱొక్క కోపనయుఁ, దాంబూల కరండముచేఁ గ్రాలుచుండ నొక్క భామినీమణియు, సువాస నల గుబాళించు జలముగల రత్నపాత్రము కరలతికఁ గన్పడ నింకొక సుందరీరత్నమును, విచిత్రముగఁ గన్పట్టు క్రీడాపుత్త

7—9

ళికను బట్టుకొని వేఱొక్కసాధ్వియుఁ, గందుకమునందిన యొక యబలయు, రత్నభూషణములఁ జేఁబూనిన యొకానొక రమణియు, నమూల్యపరిపూతలసదంశుకమును గరయుగమునఁ బూని యొక్క యోషారత్నమును, భక్ష్యోపహారముల నందిన యొక నారీతిలకమును, గేశాలంకరణదామశోభికబాహులతికయై యింకొక్క మచ్చెకంటియుఁ, గంకతికను గేలఁ బూని వేఱొక్కయన్నులమిన్నయు, యావకపంకపాత్రవిభూషిక కరసరసీరుహయై యింక నొక మీననేత్రయు నా దేవి యెదుట నుండిరి.

ఒక్క మత్తకాశిని భీతిచే వడంకుచు నేమి కావలయు నని యాజ్ఞయిడునోయని వేచియుండెను. మఱొక్క వధూమణి శోకమునఁ గన్నీరువిడుచుచుండెను. విరహాతురయగు నా దేవి నొక్కలేమ యోదార్చుచుండెను. ఇంకొక్కతుక యుత్తాపతప్తయగు నాతప్తభర్మదేహలతికను గోమలకమలదళకల్పితశయ్యఁ బరుండఁబెట్టఁ గాచియుండెను. ఇట్టి సఖీమణుల సహస్రములు సేవింప నలరు నామహాలక్ష్మిని గాంచి యుద్ధవుఁడు పరమాశ్చర్యమగ్నమానసుఁడై యిట్టులనియెను. ఆ వాక్సుధారసము సుప్రియమై కర్ణామృతమై వినయభూషితమై యుండెను. ఆయుద్ధవుఁ డుత్తరణమున భీతికంపితదేహుఁడై యుండెను.

తల్లీ ! నిన్ను దేవదేవేశినిగను, సిద్ధయోగినిగను దెలిసికొంటిని. నీవు శక్తిస్వరూపవు. మూలప్రకృతివి. ఈశ్వరివి. శ్రీదామశాపకారణమున గోలోకమునుండి ధరణి కవతరించిన పరదేవతవు ; శ్రీకృష్ణ ప్రాణాధికవు. శ్రీహరి వక్షస్థ్సల నివా

సినివి. సర్వశక్తిస్వరూపిణివి. తల్లీ! శుభవార్త నాలకింపుము. వాంఛాఫలమై యది యొప్పును. హృదయస్నిగ్ధకారక మది యగును. సుస్థిరమనస్కవు కమ్ము. సఖీపరివృతవై దాని నించుక యాలకింపుము. నా చెప్పఁబోవు నా సువార్త దుఃఖదావాగ్నిదగ్ధులకు సుధావర్షమువంటిది. విరహవ్యాధియుక్తలగు వనితామణులకు రసాయనమువంటిది. శుభమును గల్గించునది. నందుఁడామధురానగరంబున సానందుఁడై యున్నవాఁడు. వసుదేవుఁడు శ్రీకృష్ణున కుపనయనము చేయుదనుక నుండవలయునని నంద భూపతిని బ్రార్థించెను. బలరాముని శ్రీకృష్ణుని గారవించుచుం దోడుకొని గోకులమునకు నందుఁడు రాఁగలఁడు. వ్రజమునకుం జనుదెంచి గోపాలబాలుఁడు తల్లికి నమస్కరించి మహానందము ననాగాత్రికే పరమ పావనమగు బృందావనమునకు రాఁగలఁడు. సాధ్వీమణీ! శీఘ్రముగా శ్రీకృష్ణముఖపంకజమును జూడఁగలవు. ఈ వియోగవ్యథ నిన్నుఁబాసి పోవఁగలదు. తల్లీ! సుస్థిరవు కమ్ము. దారుణశోకమును వదలుము. నిర్మలయోగ్య వస్త్రమును ధరింపుము. అమూల్య రత్నాభరణములఁ బరిగ్రహింపుము. చందనపంక మంగీకరింపుము. యథాపూర్వముగ సంతోషమున నోలలాడుచుండుము. చింతాలేశమైనను మది నునుపకుము.

* తల్లీ! శ్రీకృష్ణమూర్తి పరిపూర్ణదేవుఁడు. నీవు పరిపూర్ణదేవివి. శ్రీకృష్ణచంద్రుఁడు కృతనిత్యలీలుఁడు. దేవీ! నీవు కృతనిత్యలీలలుగల లీలావతివి. భగవంతుఁడు భూభారహరణార్థ మవతరించెను. అనపాయినివి గావున నీవు నిందిరాదేవివిగా

* ఈభాగము గర్గసంహితనుండి వ్రాయఁబడినదని యెఱుంగవలయును.

నవతరించితివి. హరి పరబ్రహ్మము. నీవు స్వరరూపిణివి. శ్రీహరియే శివుఁడు. నీవే పార్వతివి. కృష్ణుఁడే విష్ణువు. నీవు వైష్ణవి యనఁబరఁగు మాయవు. ఆదిదేవత శ్రీగోపాలబాలుఁడు. నీవో జ్ఞానమయియగు స్మృతివి. * ప్రళయకాలసముద్రజలములఁ గ్రీడింప శ్రీహరి యజ్ఞవరాహరూప మెత్తెను. నీవపుడు వసుధారూపమును దాల్చితివి. హరి దేవర్షివర్యుఁడగు నారదుఁడు. అత్తటి నీవు మహతినాఁబడు వీణాస్వరూపిణివి. విష్ణువు ధర్మసుతుఁడై నారాయణుఁ డనునామమున నరుంగూడి యవతరించెను. నీవు జనుల కష్టములఁదొలఁగింప శాంతిస్వరూపిణి యనం బరఁగితివి. కృష్ణుఁడు మహాప్రభువగు కపిలమహర్షి. నీవు సిద్ధసేవితవై సిద్ధియన నవతరించితివి. హరియే మహామునీశ్వరుండగు దత్తాత్రేయుఁ డయ్యెను. నీవు తత్సమయమున జ్ఞానమయి యన నలరితివి. భగవంతుఁడు యజ్ఞరూపుఁడు కాఁగా నీవు దక్షిణ యన నొప్పితివి. హరి వామనాకారమును దాల్ప నాతనికి నీవు జయస్వరూపిణివై సాయపడితివి. హరియే సర్వనృపేశ్వరుఁ డగు పృథునామమున నవతరించెను. నీవు తత్తరుణమున నృపపట్టకామినివగు నర్చిస్స్వరూపమును దాల్చితివి. శంఖాసురుంజంప శ్రీహరి యెపుడు మత్స్యావతారమును ధరించెనో యపుడు నీవు శ్రుతిరూపిణి వైతివి. విష్ణువు మందరసింధుమంథనమునఁ గూర్మమై యవతరింపఁగా నపుడు నీవు వాసుకియందు నేత్రీకృత వైతివి. ఆర్తిహరుఁడగు హరి ధన్వంతరిరూపమున నలరారుతరుణమున నీవు దివ్యసుధాస్వరూపిణివై యోషధి యను

---

* లయాంభసా క్రీడనతత్పరో హరి ర్యజ్ఞో వరాహో వసుధాత్వమేవహి=అని మూలము.

పేరుఁ దాల్చితివి. శ్రీకృష్ణచంద్రుఁడు మోహినీరూపమును దాల్పఁగా నీవు జగద్విమోహిని యగుమాయవై యతనికార్యమును గొనసాగించితివి. నరసింహలీలలం జూప నేకాలమున భగవంతుఁడు నృసింహాకృతిం దాల్చెనో నీవా కాలమున నిజభక్తవత్సలత్వమున లీలాదేవి వైతివి. మరల నా శ్రీహరి వామనుఁడై కశ్యపునినుండి ప్రభవమయ్యెనో నీనాకాలమునఁ గీర్తి వైతివి. నిన్ను సర్వలోకములు కీర్తించెను గదా. హరి భార్గవరూపము నెపుడు తాల్చెనో నీవు కుఠారధారవైతివి. ఆదినారాయణుఁడు రఘువంశమున శ్రీరామచంద్రుఁడై యవతరింప నీవు జానకి యనుపేర నవతరించితివి. శార్ఙ్గి బాదరాయణుఁడు కాఁగా నీవు దేవలక్షణములుగల వేదాంతరూపిణివై పుట్టితివి. శ్రీవిష్ణువు సంకర్షణనామమునఁ బుట్టఁగా నీవు రేవతివైతివి. జ్ఞానరూపిణివన నీవే. * కౌణపమోహకారకుఁ డగుబుద్ధుఁడై హరి యవతరింపఁగా జనమోహకారిణి వగుబుద్ధివై నీ వవతరించితివి. ధర్మదేవత యగుభగవంతుఁడు కల్కిరూపమున నవతరింపఁగా నీవు కృతియనఁ బరఁగుదువు.

చంద్రమండలమున శ్రీకృష్ణుఁ డాత్మకళ నిలుప నపుడు నీవు చంద్రిక వగుదువు. శ్రీకృష్ణుఁడు సూర్యమండలముననుండ నీవు ప్రభాదేవి వగుదువు. యాదవేంద్రుఁ డింద్రుఁడై స్వర్గముననుండ నీవు శచీదేవి వగుదువు. హరి హిరణ్యరేతోనామమున నొప్పఁగా నీవు హిరణ్మయీనామమును ధరింతువు. విష్ణువు

* బుద్ధో యదా కౌణపమోహకారకో బుద్ధిస్తదా త్వం జనమోహకారిణీ=అని మూలము.

రాజరాజనఁబడు కుబేరుఁడుకాఁగా నీవు నిధీశ్వరి వగుదువు. హరి క్షీరాబ్ధిరూపమున వెలయఁగా నీవు తరంగితక్షౌమసితాం తరంగిణి వగుదువు. * జననీ! సర్వలోకాధిపతి యేయేసమయ ముల ధరించునో నీవు నాయాయిసమయములఁ దత్కార్యము ను గొనసాగింపఁ దదనురూపములఁ దాల్చుచుందువు. హరి సర్వ జగన్మయుఁడు బ్రహ్మమయుఁడు. నీవు జగన్మయివి. బ్రహ్మమయివి. ఇపుడా శ్రీహరి వ్రజరాజనందనుఁడుకాఁగా నీవు వృషభాను పుత్త్రికవై రాధయనఁ బరఁగుచున్నదానవు. మీ యిరువురచరి త్రములే యత్యద్భుతములు. జగన్మోహనకారకములు. † శ్రీకృ ష్ణుఁడు బ్రహ్మము. పురాణపూరుషుఁడు. నీవు తదిచ్ఛారూపిణి వగుప్రకృతివి. మీ రిరువురు లీలాస్వరూపములఁ దాల్చితిరి. అందును మీకేమాత్రము భేదము లేదు. అట్టి శ్రీరాధాకృష్ణు లగు మీకు నమస్కరించుచున్నవాఁడను.

తల్లీ! నీప్రాణనాథుఁ డాభగవంతుఁ డనుగ్రహించిన పత్త్రమిదిగో పరిగ్రహింపుము. మిగుల శోకమును బొందకుము రాధికాంబా! ఊఱడిల్లుము. ఊఱడిల్లుము. కొలఁదికాలమున నిచ్చటికృత్యముల నిర్వర్తించి నీచెంతకు రాఁగలనని భగవం తుఁడు నీతోఁజెప్పుమని నా కనుజ్ఞ నొసంగెను. అనేకపత్త్రిక లివిగో శ్రీకృష్ణమూర్తి యనుగ్రహించి యిచ్చెను. అంగీకరిం

---

* బిభ్రద్వపుస్సర్వపతి ర్యదా యదా తదా తదా త్వం విదితాను రూపిణీ=అని మూలము.

† కృష్ణస్స్వయం బ్రహ్మపరం పురాణో లీలా తదిచ్ఛాప్రకృతి స్త్వ మేవ, పరస్పరం సంధితవిగ్రహాభ్యాం నమో యువాభ్యాం హరిరాధికా భ్యామ్=అని మూలము.

పుము. వ్రజసుందరీమణుల కనేకవాక్యములు చెప్పుమనియె. వారు న న్నాదరించిరి. అనేకపారితోషికముల నొసంగిరి. మధురావృత్తాంతమును విన్నవించితిని. శ్రీహరియొసంగిన పత్త్రికావితతి నర్పించితిని: ఇదియ నావిన్నవింపఁదగినవిషయము. నందాదు లామధురానగరంబున నానందాంబుధి నోలలాడుచున్నవారు. శ్రీకృష్ణమూర్తి సదా నిన్నే స్మరించుచుండును. కార్యములు కొనసాగినవి. దుష్టనృపాలుఁ డగుకంసుఁడు మృతినొందెను. దుర్మార్గులగు తదనుచరులు మరణించిరి. దుర్వృత్తుల బాధలఁ బొరయకుండ సజ్జనుల శ్రీహరి రక్షించెను. ఇదియె కదా మీయవతారఫల మని పలికి భక్తిభావమున నుద్ధవుఁడు తత్పాదాంబుజముల ధ్యానించుచుండెను.

* ఇట్లుద్ధవుఁడు శ్రీకృష్ణకుశలవార్తలం దెలుపఁగా నాలకించి పత్త్రమును బరిగ్రహించి చిఱునవ్వునవ్వి సాధ్వీమణియగు రాధిక యుద్ధవునకు బహుమానముగా నవరత్నసారాంగుళీయకమునిచ్చెను. ఆయంగుళీయకము విశ్వకర్మనిర్మించినది. దాని ప్రకాశము ప్రదీపమువలె నుండెను. ఆయంగుళీయకము శ్రీకృష్ణునికొఱకు వహ్నియొసంగెను. రాసక్రీడాసమయమున దేవాదిదేవునకు దేవతాప్రోత్సాహమున నగ్నిదేవుఁడొసంగెను. అది సర్వభూషణభూషణము, అత్యుత్తమము. అనుపమానము. మఱియు నారాధాదేవి నిర్మలమగు నంశుకద్వయము నిచ్చెను. హీరమణినిర్మాణమగు మనోహరహారము నొసంగెను. ఆహారము మున్ను వరుణదేవుఁడు శ్రీకృష్ణమూర్తికొఱ కర్పించెను. శ్రీభా

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండమునుండి లోపలికథ కనుబంధముగా వ్రాయఁబడినదని యెఱుంగునది.

స్కరుఁడు స్యమంతకమణి నిచ్చియుండఁగా నాపరమపురుషుఁడు రాధ కొసంగియుండెను. అట్టిరత్నము నామె యుద్ధవున కొసంగెను. మహేంద్రుఁడు రత్నసింహాసనమును గోపాలబాలకున కర్పించియుండెను. దానినే మహాప్రీతిచే రాధాంబ కిచ్చియుండెను. ఆయాసనమునఁ గూరుచుండ నియోగించెను. చంద్రదత్తమగు నొకభూషణమును చంద్రావళియను రాధాపరిచారిక యుద్ధవునకుఁ గానుకగా నొసంగెను. మధుపర్కాదు లొసంగి గారవించెను. యోగ్యభోజనమును బెట్టి తత్పరిచారిక లుద్ధవుని గారవించిరి. కర్పూరావాసిత తాంబూలము నిచ్చిరి. రాధాంబ యాతని నాశీర్వదించెను. గోలోకమున రాసమండలమున శ్రీహరి యుపదేశించిన జ్ఞానసారమును, గమలహారమును, శుద్ధవిద్యను నుద్ధవున కొసంగి యుద్ధవా! నీకు శ్రీహరిదాస్యలాభము కలుగుఁ గాక. హరిభక్తి నిశ్చలముగ నమరుచుండుఁగాక. అని వరమొసంగి మఱియు నిట్లు పలికెను.

ఉద్ధవా! భక్తమణీ! సత్యముగా శ్రీహరి యిచ్చటికి వచ్చునా నిష్కపటముగాఁ జెప్పుము. భయము వదలి యున్నదున్నట్లు వచింపుము. శ్రీకృష్ణమూర్తి వేగముగా నిచ్చటికేతెంచుఁ గదా. కూపశతములకంటె నొకవాపిక మేలు. వాపీశతములకంటె యజ్ఞముత్తమము. క్రతుశతములకన్న సుతుఁడుత్తముఁడు. పుత్రశతమునకంటె సత్యముత్తమోత్తమము. సత్యమునకుమించిన పుణ్యము లేదు. అనృతమునకు మిన్నయగు పాతకము లేదు. కావున నోయుద్ధవా! సత్యమునాశ్రయించి వచింపుము. శ్రీహరి ననుఁజూడఁగోరి వచ్చునుగదా. పలుకుమన

నుద్ధవుఁ డాదరమున నిట్లు పలికెను. తల్లీ! సత్యముగా శ్రీహరి యిచ్చటికి రాఁగలఁడు. సూనృతముగా నిన్నుఁ జూడఁగలఁడు. సత్యముగా నీసంతాపము తొలఁగును శ్రీహరిదగు నాపూర్ణ చంద్రబింబాననమును దర్శించినంతనే నీవంత లంతమొందు. అవంతయు శంక లీవిషయమున లేవు. నేను మధురాపురి కరిగినవెంటనే శ్రీకృష్ణమూర్తిని బ్రయాణముచేయఁ బ్రార్థించెదను. నాప్రార్థన మంగీకరించి శ్రీహరి రాఁగలఁడు. సత్యము. నన్నిటనుండి పయనముసేయ ననుమతింపుము. తల్లీ! నన్నాశీర్వదించి పంపుము. ఇచ్చటివృత్తాంత మించుకంతయు వదలకుండ శ్రీహరిసన్నిధిని విన్నవింతును అని ప్రార్థించుటయు రాధిక యిట్లు బదులుచెప్పెను. వత్సా! మనోహరమధురాపురవగమున కరుగుదువు కాని త్వరపడకుము. ఒక్కదుఃఖకథ నాలకింపుము. స్థిరమనస్కుఁడవై యాలకింపుము. నన్ను మఱచిపోవువాఁడవు కావేని విరహజ్వరకాతరనగు నేను నా ప్రాణనాథునితో విన్నవింపఁదగు నాకథను జెప్పెదను. నారీమణుల మనోవార్త నీవండితుఁ దెలియఁగఁగలఁడు? పాండిత్యమున నించుక యిట్లుండును గదా యని యూహింపఁగలఁడని నేఁ దలంతును. వేదములే వచింపఁజాలవన నిఁక శాస్త్రములు చెప్పఁగలవా? పుత్రకా! సంతాపకరమగు నావార్త నీకుం దెల్పెద. విని నీవట విన్నవింతువు గాక.

ఉద్ధవా! గృహమునందును వనమునందును నివాసము చేసినవో రెండింటియందును భేదము నాకుం గనఁబడలేదు. తిర్యగ్జంతువు లనఁబడు పశ్వాదులందును మనుష్యులయందును భేదము చూడఁజాలక యున్నదానను. జలమునకు స్వాప్నము

నకు భేదము గానరాదు. దివానిశము నజ్ఞానావృతముగ నున్నది. నన్ను నేఁ దెలిసికొనఁ జాలకున్న దానను. చంద్రసూర్యులయు దయము నెఱుంగఁజాలను. శ్రీహరి కుశలవార్తాశ్రవణమున క్షణకాలము ప్రాణములు కుదుటఁబడినవి. సదా కృష్ణాకృతినే చూచుచున్న దానను. మురళీమృదునాదమును వినుచున్నాను. కులమును లజ్జను భయమును వదలి శ్రీహరిపదద్వంద్వము నే చింతించుచున్నాను. సర్వజగదీశ్వరుని బొందితిని. ఆతఁడు ప్రకృత్యతీతుఁడు. ఆతనిమాయచే జ్ఞానము కప్పఁబడినది. ఎవ్వని పాదాంభోజమును వేదములు యోగీశ్వరులు బ్రహ్మాదిదేవవర్యులు ధ్యానించుచుందురో అపరాత్పరుఁడు నాచేఁ గోపవశంబునఁ దిరస్కరింపఁబడియెను. ఇదియే నామదిని శల్యమై బాధించుచున్నది. ఆమహనీయుని పదాంభోరుహసేవనమువలనను గుణప్రస్తావమువలనను, తద్భక్తివలనను ఏక్షణము గడపఁబడునో, ధ్యానమునఁ బూజచేత నేసమయము గడపఁబడునో ఆక్షణమందు సర్వమంగళము లుండినట్లగు. హర్షసమయ మదియే. ఆయుష్కాలమనఁగా నదియే. అది యొదవనికాలము సంతాపజనకము. అప్పటి క్రీడాసమయము మరల నాకుఁ గలుగునా? అట్టి యిష్టసిద్ధి నా కొదవునా? అట్టి ప్రేమసౌభాగ్యము నాకు దొరకునా? నిర్జనముగ నున్నతావున నట్టిసంగతి నాకు మరల నొడఁగూడదని తలంచెద.

బృందావనమునకుం బోనొల్లను. ఆమహాపురుషుని సంగతిలేనిచో నావనరాజము నాకానందము నీయఁజాలదు కదా. నందనందనువక్షమున మరలఁ జందనపంక మలందను గదా. మాలిక నాతనిహృదయభాగమున నలంకరింపను గదా. ముఖ

పంకజమును మరలఁ జూడనుగదా. మాలతీకేతకీచంపకకానన ముల కా శ్రీకృష్ణుని గలసి యింకఁ బోఁజాలను గదా. సుందర రాసమండలమును జూడ నప్పటివలెఁ బో శక్తురాలను గాదు కదా. శ్రీహరింగూడి సురుచిరచందనకాననమున కేగఁజాలను గదా. మలయపర్వతరత్నమందిరమునకు మరలఁ బ్రయాణము సేయఁగలనను నూహ లేదు కదా. మాధవీకాననమందును, రహస్యమగు మధుకాననమునందును, శ్రీఖండకాననమందును, హరిం గూడుభాగ్యము మరల నాకు దొరకదు కదా. స్వచ్ఛమగు చంద్రసరోవరమును దర్శింపఁజాలను గదా. విస్పందకమును సురవనమును నందనమును బుష్పభద్రకమును భద్రకమును శ్రీహరింగూడి మరలమరలఁ బోవు భాగ్య మింకను గలుగునా. రమ్యమై వికసించిన మాలతీలతచెంత మాధవుఁ డెట్లుండెనో తలంచినఁ గన్నీరు వచ్చుచున్నది. మాధవీరాత్రి యెట్లు పోయెను? మధుసమయ మెచ్చటి కేగెను? మాధవుఁ డేల రాఁడాయెను? అని యిట్లు పలికి రాధాదేవి శ్రీకృష్ణపదాంబుజముల ధ్యానించుచు నల్లే మూర్ఛమునింగెను. పులకాంచితసర్వాంగియయ్యెను. శోకించెను. గాఢమూర్ఛ మునైను

మహామతులారా! ఉద్ధవుఁడు రాధంగాంచుటయు నామె యపుడున్నవిధము, మూర్ఛమునింగియున్న యారాధ యుద్ధవునిం గొంత తెప్పిఱిల్లి చూచి సంతోషభరమున శ్రీహరికుశలవార్తల నడుగుటయు, నుద్ధవుఁడు మధురావార్తలం దెలుపుటయు లోనగువిషయములు గల యీభాగమును జదివితిరి కదా. ఉద్ధవుఁడు రాధికం బ్రశంసించినభాగ మీకథకు

ముఖ్యాలంకార మనందగు. ఆభాగమునుండియే యనేకవిః యములు గ్రహింపవలసి యుండును. కాన నించుక దీనిసాః మును జర్చించి వ్రాసెదను. రాధ శ్రీకృష్ణునిహ్లాదయేశ్వరి యః పెక్కుతావులఁ బెక్కుపురాణములనుండి యుదాహరించియే యున్నవాఁడఁ గదా. ఉద్ధవుఁడు రాఁగా రాధిక శ్రీహరికుశల మడిగినఘట్టమును మరలఁ బఠింపుఁడు. వారిరువురకుఁ గల సంబంధము తేటపడును. ఆదేవిని గాంచి మహాభక్తుఁ డగు నుద్ధవుఁడు

"జానే త్వాం దేవదేవేశీం సుస్నిగ్ధాం సిద్ధయోగినీం,
సర్వశక్తిస్వరూపాం చ మూలప్రకృతి మీశ్వరీం,
శ్రీదామశాపోద్ధరణీం ప్రాప్తాం గోలోకవాసినీం."

అను మొదలగువిధములఁ బ్రశంసించెను.

లోకమున భక్తుఁడు కులట నిట్లు పొగడునా? రాధ యుంపుడుకత్తె యనువాద మజ్ఞానమూలమని దేలెను గదా. రాధయే మూలప్రకృతియని యుద్ధవుఁడు భావించెను గదా. భూభారహరణార్థ మీలోకమున నవతరించితివని యామెకుం దెల్పెను. అనఁగా శ్రీకృష్ణావతారమున రాధయే మహాలక్ష్మియై యవతరించెనని దీనిసారము.రుక్మిణి మొదలగువారికంటె రాధా దేవి శ్రీకృష్ణప్రీతికిం బాత్రురాలనియు దీనినుండి స్పష్టమా యెను. మూలప్రకృతియన్నను శక్తియన్నను బార్వతియే కాద నియు రాధయే యనియుఁ దేలుటయే గాక ప్రకృతి నేయేనా మముల నెవ్వరెవ్వ రెట్లెట్లు పూజించినను వరములిచ్చుననియు దీనినుండి యెఱుంగనగు సద్విషయము.

ఇన్ని విధముల రాధాంబికను బురాణము లభివర్ణించుటకుం గల హేతువును విమర్శింతము. శ్రీభాగవతమునందు రుక్మిణి యెందే నిట్లు వర్ణింపఁబడినదా యనియుఁ బరికింతము.

"రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని."

అనునది ప్రమాణమేయని భావింతము. ఏపురాణమునం దేవిషయమున్నను బ్రమాణమేయని యంగీకరింపవలయును. ఒక్కటి ప్రమాణమని యింకొక్కటి ప్రమాణముకాదని మన మనరాదు. అది మనోహైన్యమును వెలిఁబుచ్చును. ప్రతిపురాణము తత్త్వమునే తెలుపును. రీతిభేదమేకాని తత్త్వమున భేదము దానియందుఁ గానరాదు. మనస్సులలోనున్న నీచత్వమే యిన్ని బాములఁ బెట్టుచున్నది. ప్రకృతవిషయమును వినుఁడు. రాధ పరదేవియని పురాణములు ఘోషించుచున్నవి. ఎన్నియో స్తోత్రము లీవిషయమునే తెల్పుచున్నవి. కావున రాధ శ్రీహరికి మేనత్తయని భ్రమింపకుఁడు. అది యవివేకులు చెప్పుమార్గము. దానినాశ్రయించిన నది మనల సంసారసాగరమున ముంచును. రుక్మిణి లక్ష్మ్యంశసంభూతురాలుకాదని నాభావము కాదు. ఇది సత్యము. నాయభిప్రాయ మీయిర్వురు భగవతియగు శ్రీదేవీకలాసంభూతలే యనియే. ఇం దేయేభక్తునకే దేవియందు భక్తి కుదురునో వాఁడా దేవినే మహాలక్ష్మి యని భావించి యుపాసింపవచ్చు. తత్ఫల మొక్కటియేకాని హెచ్చుతగ్గులందు లేవు. రాధయందు లోపము నారోపింపరాదని తెల్పుటకే యీగొడవ పెక్కుసారులు వ్రాయవలసివచ్చినది. క్షమింతురు గాక.

రాధ భగవంతు నెడఁబాయఁజాలక ప్రశ్నించినవిషయము, ఆమె పరితాపము గాంచిన యా యిర్వుర కవినాభావ సంబంధము స్పష్టమగును. ఉద్ధవుఁ డామె నూఱడించుమాటలఁ బరికించినచో శ్రీహరి పరమపురుషుఁ డనియు రాధ యాభగవంతునియాజ్ఞఁ దలఁదాల్చి కార్యనిర్వహణమున కాతురపడుచుండు నిచ్ఛాశక్తియనియుఁ దేటపడును శ్రీకృష్ణుఁడు రాధకుం దెలుపవలయునని యుద్ధవునకుం దెల్పినవిషయము నాలోచింపఁ బైయర్థమే స్పష్టమగు. బృందావనము పరమేశ్వరీపరమేశ్వరుల కేకాంతస్థానమని యెఱుంగనగు. రాసమండలమాయిర్వుర నారాధించుచక్రమని నిర్ణయించును. కావున నాయపూర్వదంపతుల నారాధించుభక్తుఁడు రాసమండలమును దొలుత ధ్యానించవలయును. ఆరాసమండలాంతర్భాగమే బిందుస్థానము. అందు వెలయు నాయాదిమదంపతుల నారాధించుటయే పరమపురుషార్థము లభించుమార్గము. అనన్యమతితో వారి నారాధింపందగుననునదియే యీకథనుండి యెఱుంగఁదగు సారము. ఒక్కతత్త్వమే మత్స్యాద్యవతారముల నాయాకాలానుసారము ధరించి యాయాయికార్యముల నిర్వర్తించుననియు నాతత్త్వము నిచ్ఛాశక్తియే కార్యములఁ గొనసాగించుచుండుననియు దీని భావము. ఇట్టిభావమును మదిఁ బదిలపఱచుకొని యేభక్తుఁడు వారి నారాధించునో యాతఁడే ముక్తుఁడగును. ఏనిశ్చయ మంతఃకరణమున లేక భేదబుద్ధితో నారాధించిన ఫల మత్యల్ప మగునైహికమే కలుగును. ఇది సత్యము. సత్యము. సత్యము. ఇంక నీవిషయమును బెంచివ్రాయక యవ్వలి వృత్తాంతమువ్రాయ లేఖినిం ద్రిప్పెదను. సావధానులరై యాల

ఱింపుఁడు. కథమాత్రమే ప్రధానము కాదనియు నందుఁ బ్రతిపాదింపఁబడు శ్రీకృష్ణపరమాత్మ నెఱుంగుటయే ప్రధానమనియు నెఱుంగఁదగు.

## ఉద్ధవుఁడు రాధాంబ నూఱడిల్లం జేయుట.

* రాధ శ్రీహరిం దలంచితలంచి తదేకతానమనస్కయై మూర్ఛిల్లెను. ఆమె దుస్థ్సితినిగాంచి యుద్ధవుఁడు విస్మితుఁడయ్యెను. అతని మనమున భయమునకుఁగూడఁ జోటుగలదు. మృతకళేబరమాయని తోఁపఁజేయు నా జగదంబను గాంచి శిశిరోపచారసదృశములగు మధురవాక్కుల నూఱడిల్లం జేయుచు నామెకు శ్రీహరియందుగల భక్తిభావము నెఱింగి తనభక్తి చాలఁ దుచ్ఛమైనదని తలంచెను. జగత్తంతయు నట్టిదేయని నిశ్చయించెను. ఆ రాధాంబయే భాగ్యవతియన్న భావ మాయుద్ధవుని మదిఁ బాదుకొనియెను. అత్తఱి నుద్ధవుఁ డిట్లు పలికెను. కల్యాణీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. జగజ్జననీ! నీకు నమస్కరించెదను. జగత్తంతయు భవత్స్వరూపమే యగు. మరల నచిరకాలమున శ్రీహరిని సందర్శింపఁగలవు. నీవలన నీజగము పవిత్రము కావలయును. నీపాదధూళిచే నీభూమి పవిత్రయగును. నీముఖమే పవిత్రము. నిన్ను సేవించు నీగోపికలే పుణ్యము చేసికొన్నవారలని నానమ్మకము. లోకములెల్ల మంగళకరస్తవముల చేతను సంగీతవిశేషముల చేతను నిన్నే గానము చేయుచున్నవి. నీపవిత్రయశస్సును శతక్రతు ప్రభృతిదేవతలు సనకాది మహర్షులు వినుతించి కృతార్థులైరి. నీపూజయే పాపములఁ బోఁగొ

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము తొంబదినాల్గవ యధ్యాయమునుండి వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

ట్టునది. పరమపవిత్రతను గూర్చునది. సకల తీర్థయాత్రాఫలము నొసంగునది. నిర్మలత నొసంగునది. హరిభక్తిని గల్గించునది. సకలమంగళముల నొసంగునది. సర్వవిఘ్నములఁ బోకార్చునది. నీవే రాధవు. నీవే కృష్ణుఁడవు. పురుషరూపమునఁ గృష్ణుఁడనియు, స్త్రీరూపమునఁ బ్రకృతియనియుఁ గీర్తింపఁ బడుదువు. * రాధామాధవులకు భేద మేపురాణములందు, నే వేదములందును గానరాదు. అని పలికెను.

మూర్ఛిల్లిన రాధను, ఆమెనూఱడించు నుద్ధవునింగాంచి రాధాపరిచారికయగు మాధవియను గోపిక రాధముంగల నిలువంబడి యిట్లు పలికెను. తల్లీ! చోరుఁడగు శ్రీకృష్ణునిరూపమును దలంచుకొని యేల పరితపించెదవు? ఆతనియుత్తమవేషము నేల కొనియాడెదవు? సుఖము, విభవము, గౌరవము నాతనికిఁ గావలసియున్నచో నిన్ను వదలి వెడలునా? అతని వీర్యప్రముఖగుణములు దురతిక్రమములు. అతని నారాధించిన నేసిద్ధియుఁ బ్రసిద్ధియుఁ గలుగదు. ఇచ్చటికేలవచ్చెనో ఏల మఱొకతావునకుం బోయెనో యెవ్వ రెఱుంగఁ గల్గుదురు? బాలకుఁడు. గోపాలవేషధారి. రాజాత్మజుఁడు కాఁడు. గోపాలుఁడగు నందనందను నేల రాధాంబికా పలుమాఱు స్మరించెదవు? ప్రయత్నపూర్వకముగా నిన్ను రక్షించుకొనుము. దేహమునకంటెఁ బరమైనది లోకమున నేదియు లేదు కదా. అని పలుకుచుండునంత మాలతియను గోపిక మాట కడ్డమువచ్చి యిట్లు రాధిక నూఱడించెను. రాధాంబా! లజ్జ వదలి యిటులాడఁదగునా? ఇసీ! ఇంతటి వెఱ్ఱిదానవా? నీజీవనము వ్యర్థము.

---

* రాధామాధవయోర్భేదో న పురాణే శ్రుతౌ తథా=అని మూలము.

లోకమునఁగల యాఁడువారందఱకు నపకీర్తిని దెచ్చుచున్న దానవు. నారీమణుల మానస మెరుఁగకుండ నుండవలయు. దానిని వెలిఁబుచ్చిన నపకీర్తియే కాని కీర్తిరాదు. ప్రయత్నమునఁ గన్నులు విప్పి చూడుము. లోక మెట్లున్నదియుఁ దెలియఁబడును. మదిని బతిభావము నునిచికొనుము. ప్రేమమును బహిర్గతముగా నొనరింపకుము. అది నారీధర్మము కాదు. శత్రుమిత్రులకు జాతితోఁ బనిలేదు. సురేశ్వరి! కార్యవశముననే శత్రువులు మిత్రులు దొరకుదురు. ప్రాజ్ఞుఁడు స్వకార్యమును సాధింపవలయును. మూర్ఖత కార్యధ్వంస మొనరించును. రాధా! ఎవ్వఁడెవతుకకు భర్త? ఎవ్వఁడెవతుక కప్రియుఁడు? సమయానుసారము నివి యగుచుండును. సత్పురుషులు కార్యమును సమయమును లక్షించి ప్రవర్తింతురు. శత్రువు ధనము నపహరించుటయే కాక ప్రాణములనుగూడ హరించును. పరుషములాడును. దుఃఖము నొనఁగూర్చు. ఇవియే శత్రువుల లక్షణములు. సత్కులప్రసూతవగు నిన్నుఁ బరిత్యజించి యంతియగాక శోకసాగరమున ముంచి నీచేతనమును బ్రాణములను గ్రహించి దారుణచిత్తుఁడై యాకృష్ణుఁ డెచటికో పోయెను. మాహాత్మ్యగల యోరాధా! ఇంకేల యాతని స్మరించెదవు? దారుణమగు నీ శోకమును వదలుము. ప్రయత్నమున నాత్మను గాపాడుకొనుము. ఆత్మాతిరిక్తప్రియపదార్థము లోకమున లేదు కదా!

అని యూఱడించునంతఁ బద్మావతియను గోపిక యిట్లు భాషించెను. ఆనాఁడు శ్రీహరితో యమునాతరంగిణీ పావనసలిలాంతరమున నీభావమెల్ల నెఱిఁగించితివి. వినియు నెఱింగి

యు నిన్ను వదలిపోయెను. అట్టి యరసికునిపొందు దూరము చేయుము. నారీమణుల కరసునితోడిపొందు సుఖకరముకాదు. మెఱుపుందీగె జ్వాలయు, జలమునగీచిన రేఖయు, ఖలులప్రీతియు సమానములు. స్థిరముగా నిలుచునవికావు. నీతిశాస్త్రములయందు ఖలులయం దించుకంతయు నీతిలేదని చెప్పఁబడినది. మున్ను నీవు యమునాకూలమున శ్రీహరిముఖమును జూచి రహస్యముగాఁ బలికినపలుకుల నాతఁడు వినలేదా? సస్మితముగా మాటలాడలేదా? నీకటాక్షవీక్షణములకు శ్రీహరి పాత్రుఁడు కాలేదా? అట్టులయ్యు నేల దూరభూమికిం బోయెనో యెఱుంగను. మరలమరల నాదారుణాత్ముని స్మరించి స్మరించి యేల పరితపించెదవు? మూర్ఛనేల మునింగెదవు? భీతిని బరితాపమును వదలి సఖీజనుల వాక్యముల నాలకింపుము. నీవు సంతతమా శ్రీకృష్ణుని ధ్యానించుచున్నదానవు. ఆహారము నొల్లవు. జీవితము నేయొల్లవు. శ్రీకృష్ణుఁడు మధురానగరమున నున్నవాఁడు. నీవు కదళీకాననమున నున్నదానవు. నీ విపుడిచట నసువులవదలినను శ్రీహరిమాత్రము రాఁడు. ఇపుడు నీవు ప్రాణములఁ గాపాడుకొంటివేని యెప్పుడో చూడఁగలవు. కానఁ బరితాపము డిగి ప్రాణముల రక్షించుకొనుము.

అని పలుకుచుండఁగాఁ జంద్రముఖియను గోపిక వచ్చి యిట్లు సంభాషించెను. తల్లీ! ప్రాక్తనకర్మవశమున సుఖమో దుఃఖమో కలుగుచుండును. విభవమో దరిద్రమో యొనఁగూడుచుండును. విపత్సంపత్తులు నశ్వ్లే. ఇది భారతవర్షధర్మము. సనాతనమని యెఱుంగుము. తపోమహాత్వమునఁ బ్రకృతికంటెఁ బరుండగు భగవంతుని భర్తను మరలఁ గాంచఁగలవు. అట్టు లయ్యును

మన్మథబాధ యిపుడు బాధించెడిని. నీకు శత్రువు చంద్రుఁడా మధుమాధవులా? మన్మథుని శంకరుఁడు కాల్చెను గదా. మరల నాతఁ డుదయించెనో యేమో? రాహువు శశాంకుని భక్షించుఁగాక. అయినను మరల నాతని రాహువు గ్రక్కును. మధువు మిత్రశోకమునఁ బ్రాణముల భరింపఁజాలక యడవుల పాలయ్యెను. సుధాసింధువు శీతాంశుఁడు నాపాలిటికి విషసింధువుగను విషాంశువుగను దోఁచెడిని. జ్వలద్వహ్ని సువేషుఁడనియే తలంతు. ఏలన నాతనికాహుతి ఘృతముకదా. పరిమళగంధవాయువు సదా ప్రాణములఁ గాల్చుచుండును. ఏలాగో? నాయీసఖి యాహారమును మాని నిట్టూర్పులు పుచ్చుచున్నయది. ఓ యుద్ధవా! శ్రీకృష్ణసంకీర్తన మొనరింపుము. ఆమహనీయుని నామస్మరణము తద్గుణవర్ణనశ్రవణము తత్కుశలవార్తాసంశ్రవణము వేగమ రాధకుఁ బ్రాణముల నిలుపఁగలవు.

అని యుద్ధవుని వేఁడుచుండ శశికలయను గోపిక యిట్టులనియె. ఓమాధవీ! నీ వేమెఱుంగుదువు? శ్రీకృష్ణుని జీవితేశ్వరుని మాహాత్మ్యము నీకుఁ దెలియునని నే సంభావింపను. ఏ శ్రీకృష్ణుని బ్రహ్మాదిదేవతలు చతుర్వేదములు తెలియఁజాలకున్నారో, ఎఱుంగజాలకున్నవో, ఆపరమాత్మనే సత్పురుషులు ధ్యానింతురు. తదీయపావనపాదపద్మముల నారాధింతురు. పద్మయు సరస్వతియు దుర్గయు ననంతుఁడును మహేశ్వరుఁడును శ్రీహరి నెఱుంగలేకయున్నారో, సిద్ధేంద్రులు మునీంద్రులు మనువులు తెలిసికొనలేక చింతించుచున్నారో ఆకృష్ణుని విధమిదియని నిర్ణయింపఁదరమా? * సర్వాత్మయగు నిర్గుణునకు

* సర్వాత్మనః కుతో రూపం నిర్గుణస్య కుతో గుణాః=అని మూలము.

రూపగుణము లెక్కడివి? ఇది సత్యము. సత్యమునకు ఫలమన నిదియే. శ్రీకృష్ణుఁడు పృథ్వీభారావతరణార్థము మానవరూపమును ధరించెను. ఆరూపము సుఖము, ఆహ్లాదజనకము, రమ్యము,భక్తానుగ్రహము నగును. జనమనోహరమగు నారూప మనిర్వాచ్యము. కోటికందర్పలావణ్యముగలది. లీలాధామము, శుభాశ్రయము నగు ఏభగవంతుని పాదారవిందమధుబిందు వేకదా గంగాప్రవాహమయ్యెను. సర్వేశ్వరుఁడు శంకరుఁడు శిరమునఁ దజ్జలమునే ధరించెడిని.అంతియకాక యాశంకరుఁడు వైరాగ్యభాగ్య సంపన్నుఁడై పవిత్రభగవత్కీర్తిని వినుతించుచుండును. క్షణకాలము భక్త్యుత్కర్షమున నాట్యమొనరించును. క్షణము పంచవక్త్రముల నాపరమేశ్వరుం బాడును. ఆపరమానందమున నాహారమును వస్త్రమునుగూడ వదలి దిగంబరుఁడయ్యెను. బ్రహ్మము జ్యోతిస్స్వరూపము నిర్మలమునగు హరిరూపమును ధ్యానించి తన్మయత నొందుచుండును. చతురాననుండును దపమునఁ దదనుగ్రహమును బడసి మరల జన్మమెత్తక యజుఁడనఁ బరఁగెను. ఆకృష్ణసేవ యెంతటిమహిమము గలదో శేష సనత్కుమారులు సిద్ధవర్యులు యోగమెఱింగిన విజ్ఞులు భగవత్సేవనే పరమపురుషార్థమని కోరుచుందురు.

అనవిని సుశీలయను గోపిక యిట్లు వాక్రుచ్చెను. చెలీ! శ్రీకృష్ణునిరూపము వర్ణనార్హము కాదు. చంద్రుఁ డశ్వికుమారులు రూపసంపద నాతనికి నీడు సేయఁ జాలుదురా? * ప్రపంచము లనేకములు. బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనేకులు గలరు. మునులు మనువులు పెక్కండ్రు గలరు. సిద్ధులు భక్తు లసంఖ్యా

* ఆసంఖ్యేషు చ విశ్వేషు బ్రహ్మవిష్ణుశివాదయః = అని మూలము.

లుగలరు. వారెల్ల నాపరతత్త్వము నెఱుంగఁ జాలకున్నారు. నిర్గుణుని సగుణునిగా భావించి ధ్యానించి తత్పాదపంకజరేణువును శిరముల ధరించుచున్నారు. వేదములు వినుతింపఁజాలక తికమక పడుచున్నవి. సరస్వతియు నీశ్వరు నాతనెఱుంగఁజాలకున్నయది. అంతియకాక భీతయై స్తుతించుచుఁ దన యశక్తతను వెలిఁబుచ్చుచున్నది. సహస్రవక్త్రములుగల శేషుఁ డాతని వినుతింపఁ జాలక వణఁకుచున్నవాఁడు. వేదజనకుఁడగు బ్రహ్మయు వినుతుల నలరించి తత్త్వమెఱుంగక సిగ్గుపడుచున్నాఁడు. అట్టి నిత్యుని సత్యరూపుని జగదీశుని మాధవి యజ్ఞానమున నిందించుచున్నది. దీనిచే గోపికాసభ యపవిత్రయనం బరఁగె. గోపికలజీవనము వ్యర్థము. ఈ గోపికావితతియందు మహావిభవసంపన్నయగు రాధిక శ్రీహరిని ధ్యానించుచున్నది. దివానిశములు తదేకతానచిత్తయై యున్నది. ఏ శ్రీకృష్ణమూర్తినామస్మరణమునఁ గోటిజన్మార్జితపాపరాశి పటాపంచలగునో శోకము నశించునో అట్టి మహానుభావుని స్మరించుచు రాధ పవిత్రచరిత్రయయ్యెను.

అనుచుండ రత్నమాల యనఁ బరఁగు గోపికామణి యిట్లు నుడివెను. సఖీ! శ్రీకృష్ణుఁడు గోవర్ధనాద్రిని వామహస్తతలమున ధరించెను. దాన జగజ్జనకుఁడగు నాతనిప్రతాపము చరిత్రము యశస్సు వర్ణనాతీతము కాలేదా? దేవరాట్టగు నింద్రుఁడు శైలసహస్రముల భేదింపఁజాలును. భగవంతుఁడు లీలామాత్రమున నాపర్వత లక్షసంఖ్యల భేదింపఁజాలును. ఏమహానీయాంశకలచే యజ్ఞవరాహ ముదయించి దంతాగ్రమున వసుధను ధరించెనో వసుధాతలమున ననేకపర్వతము లాసమయమున

సుస్థిరవిభూతి నుండెనో ఆపరమేశ్వరుని శౌర్యమును వర్ణింప నెవ్వరితరము?

అని భాషించుచుండఁగాఁ బారిజాత యనంబడు గోపిక యరుదెంచి యిట్టులనియెను. వసుధ సప్తద్వీపములు కలది. శైలకాననాదులం దుండు. సాగరములూ పృథ్వియందే యుండును. కాంచనీభూసహితమై సర్వాధారమై భూమి యొప్పును. సప్తస్వర్గములు కలవు. బ్రహ్మలోకములు బహువిధములు. పాతాళలోకము లేడును విచిత్రములుగను సుందరములుగను వెలయుచుండు. వీని నన్నింటితోఁగూడినది బ్రహ్మాండము. అది బ్రహ్మనిర్మితము. ఆబ్రహ్మాండము విష్ణులోకమున నణుమాత్రముగఁ దోఁచును. బ్రహ్మాండము లసంఖ్యాకములు. ఆబ్రహ్మాండములన్నియు శ్రీకృష్ణుని షోడశాంశమునకు సరిరావు. అట్టి సర్వలోకాధిపతి యశము శౌర్యమహిమము లిట్టివని వర్ణింప లెక్కింప నెవ్వరికిఁ దరమగును? గోపకన్య యెట్లు తెలియఁగలదు? మాధవిని దూఱిన లాభమేమి?

అనుచుండ మాధవి యిట్లు పలికెను. ఓసీ! నేనేమి చెప్పితినో దాని యర్థమెఱుంగక మూఢలగు నీగోపికలు వదరుచున్నారు. అని యుద్ధవునిం గాంచి యో యుద్ధవా! నాపలుకాలకింపుము. నేఁబల్కిన శుభవాక్యార్థమును దలంపుము. విష్ణువు స్వేచ్ఛచే సగుణుండగు. నిర్గుణుఁడునగు. భూభారహరణముసేయఁగోరి గోపవేషమూని శిశువువలె మహాప్రభువుండును. వేదములు బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు పురాణములు నెఱుంగని యాపరమేశ్వరు మూఢనగు నే నెఱుఁగఁగలనా? అయినను నావచించినది సత్యము. వత్సా! తదర్థము నాలకిం

పుము. కార్యార్థము రూపము నామము వేషమును ధరించి కార్యాంతమున వానివదలు నాపరమాత్మకు నిర్గుణునకు రూప నామవేషములతోఁ బనియేమి? ఈమాట పల్కినందులకు న న్నే మూఢురాలగు గోపిక నిందించుచున్నది. కాని యింతదనుక నామాట కేమియర్థమో యెఱుంగఁజాలకున్నది. పాప మీ మూఢగోపిక ప్రకృతిపరుండగు భగవంతుని తత్త్వమెఱుంగును గాఁబోలు? భగవంతుఁడు జ్యోతిస్స్వరూపుఁడు, పరమాత్మ, ఈశ్వరుఁడు, భక్తానుగ్రహవిగ్రహుఁడు. త్రైలోక్యజననియగు మహాలక్ష్మి యాతని పాదపద్మరజస్సును గోరుచుండును. దాసి కవలె సదా యాపరదైవమును సేవించుచుండును. భీతిచేఁగుండి పూజించుచుండును. సరస్వతియు నట్లే సేవించుచుండును. అనియె.

ఇట్లు గోపికలు భాషించుచుండఁగా నాలకించి యుద్ధ వుఁడు పులకాంచితసర్వాంగుఁ డయ్యెను. రోదనము చేసెను. క్రిందఁ బడియెను. మూర్ఛమునింగెను భక్తిభావమున నాపర మేశ్వరుని హృదయమున నిలిపి ధ్యానించెను. గోపికల భక్తిం గాంచి తనను దుచ్ఛునిగా భావించుకొనియె. ఎట్టో స్మృతిగలిగి యిట్లుపలికెను. సకల ద్వీపములలో జంబూద్వీప ముత్తమోత్త మము మనోహరమునగు. దానియందే భారతవర్షమలరారు. అది పుణ్యప్రదము శుభదమునగు. ఇందు గొప్పసుకృతకర్మముల నొనరించి మఱొక్కతావునఁ దత్ఫల మనుభవింపఁదగు. కాన నీద్వీపము ధన్యతమము. గోపికాపదాంబుజరజస్స్పర్శమునఁ బావన మయ్యెను. పరమనిర్మలము. అట్టి యీ భారతవర్షమున కంటె గోపిక ధన్యురాలు. స్త్రీబృందమందు మాన్యురాలగు.

ఈగోపిక సదా పరమపవిత్రమగు శ్రీరాధాదేవీపాదారవిందముసు దర్శించెడిని. అఱువదివేలసంవత్సరములు బ్రహ్మ తపఁబొనరించి రాధాపాదాంబుజరజస్సుఁ బొందెను. ఈరాధ గోలోకవాసిని. కృష్ణప్రాణాధికప్రియ యనంబడు. శ్రీదామశాపకారణమున నీలోకమున వృషభానుపుత్రిక యయ్యెను. శ్రీకృష్ణభక్తులగు బ్రహ్మాదిదేవతలందఱు నీరాధయొక్కయు గోపికలయొక్కయుఁ బుణ్యమునఁ బదాఱవభాగమునకు సమానులు గారు. శ్రీకృష్ణభక్తిని యోగీంద్రశంకరు లెఱుంగఁజాలరు. రాధయు గోపికలు గోపాలురు మఱియు గోలోకవాసులందఱు నెఱుంగుదురు. సనత్కుమారుఁ డించుక యెఱుంగుననవచ్చు. బ్రహ్మయు నట్టివాఁడే. సిద్ధులు లోనగుభక్తులును గొంచెమే తెలియుదురు.

నేను ధన్యుఁడను. కృతకృత్యుఁడను. కావుననే గోకులమున కరుదెంచితిని. ఈగోపికలే నాకు నుపదేశించువారు. వీరినుండి యించుక యెఱింగెదను. నే నిఁక మధురానగరమున కరుగను. పరిశుద్ధకీర్తి గలహరిని గీర్తించుచు నిందే యుందును. ఈగోపికలకుఁ బ్రతిజన్మమందును గింకరుండనై భక్తిమార్గము వినుచుందును. గోపికలకంటె శ్రీహరికి వేఱొకభక్తుఁ డిట్టివారితోఁ బోల్పఁదగువాఁడు లేఁడు. ఈ గోపికలెఱింగిన భక్తిమార్గము నింకెవ్వరు నెఱుంగరు. అని తలంచుచుండఁగాఁ గలావతి యరుదెంచి యిట్లు పల్కెను. కలావతి పితృదేవతల మానసీకన్యయగు మాన్యురాలు. మేనకయుఁ గలావతియు రాధకియు నను నీముగ్వురు పూజార్హులు. ఈముగ్వురు సోదరీమణులు. అందు నాపేరు కలావతి యనఁబడు. పృథ్వియందుఁ

దిరుగుచుందుము. అందు సీతాదేవి పరమధన్యురాలు. జగన్మాత. పతివ్రతాతిలకము నగు. అయోనిసంభవయగు నీరాధయుఁ బూజ్యురాలు. నేను నయోనిసంభవనే యగుదును. రాధ శ్రీదామశాపవశమున నీలోకమున వృషభానునకుం బుత్రియయ్యెను. సనత్కుమారునిశాపమున మేము నిందే యవతరించితిమి. మేనకయు నేనును రాధయు నొకానొకతరుణమున మనోహరమగు శ్వేతద్వీపమున నలరారు విష్ణుమూర్తిని దర్శింపఁజనితిమి. అందు సనత్కుమారుఁడుండుట మే మెఱుంగము. మే మట నుండఁగనే యాముని యరుదేర మే మెదురుపోక నమస్కరింపక యుంటిమి. కోపమూని యామౌని మమ్ము శపించెను. ఆముని యోగీంద్రులకునెల్ల గురూత్తముఁడగు. ఆమౌనితల్లజుఁడు మమ్ముం జూచి యిట్లుపలికెను. మూఢలారా! మీరు భూమియందే నివసింపుఁడు. స్వర్గమునకు మరల రాఁ దగరు. దురహంకారవిశిష్టలు గాన మర్త్యులకుఁ బ్రాణప్రియలై యుండుఁడు. అనిశపించిన మే మతిభక్తి నామహాముని నాశ్రయించితిమి. అంతఁ బ్రసన్నుఁడై యాసనత్కుమారుఁడు మువ్వురకును వేర్వేఱ నొక్కొక్కవర మొసంగెను. మొదటిదగు మేనాదేవి హిమవంతునకుఁ బత్ని గాఁగలదు. ఆమెకుఁ దొలికూఁతురు పార్వతి పుట్టును. ధన్యయను రెండవకాంత యోగివర్యుఁడగు జనకభూపతికిఁ బత్నియగు. ఆమెకు మహాలక్ష్మి సీతానామమునఁ బుట్టును. వృషభానుఁ డనువైశ్యునకు దుర్వాసుఁ డనుముని శాపకారణమునఁ గనిష్ఠపత్ని కలావతి యగును. వృషభానుఁడు యోగవేత్తలలో నుత్తముఁడు. ఆతఁడు గోకులవాసి. ద్వాపరాంతమున నాతనికిఁ గడపటిభార్య

కలావతి యగును. ఆకలావతికి రాధ కూఁతురగును. రాధాదేవి గోలోకవాసిని. శ్రీదాముఁ డనుగోపకుఁడు శపించినకతమున భూలోకమున, శ్రీరాధాంబ కలావతికిఁ బుత్త్రికయై పుట్టును. భగవంతుఁడు దేవాదిదేవుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మము భూభారహరణార్థము పుణ్యక్షేత్రమగు భారతవర్షమున నవతరించును. అపుడాకృష్ణున కీరాధ భార్యయగు. ఆపుణ్యమునఁ గలావతిం గూడి వృషభానుఁడు జీవన్ముక్తుఁడై గోలోకమునకుఁ బోవఁగలఁడు. ధన్యయు సీతానిమిత్తమున వైకుంఠమునకుఁ బోఁగలదు. మేనయుఁ బార్వతీదత్తవరమునఁ గల్పాంతమందు వైకుంఠమునకుఁ బోయి లక్ష్మీవలె సంతోషాంతరంగమున నుండఁగలదు. ఇదియ మావృత్తాంతము.

ఉద్ధవా! విపత్తుగలుగక సంపద యెవ్వరికి నెందు నేకాలమునందును లభింపలేదు. కర్మవశమున దుఃఖముకలుగ నదియనుభవమున నశింపఁగా సుఖము కష్టముపై లభించును. మున్ను పితృకన్యకలు సర్వభోగవిలాసికలై లక్ష్మీసమానరూపముల నలరుచు నొక బ్రాహ్మణునివరమునను, శ్రీవిష్ణుదర్శనమునను గర్మక్షయము కాఁగా నిరుపమానానందము నొందిరి. మేమును గుమారరూపధారియగు శ్రీమహావిష్ణుదర్శనమునఁ బాపము క్షయింప నుత్తమలోకములకుం బోఁగలము. శ్రీకృష్ణుఁడు పరమాత్మయనియుఁ బ్రకృతికంటెఁ బరుఁడనియు, సర్వదేవాధిపతియనియు నే నెఱుంగుదును. నిర్గుణుఁడనియు నిరీహుఁడనియు స్వేచ్ఛామయుఁడనియుఁ బరాత్పరుఁడనియు నే నెఱుంగుదును. ఉద్ధవా! నీవు భక్తాగ్రేసరుఁడవు. కృతకృత్యుఁడవు. నీజన్మము పరమపవి

త్రము. భగవద్భక్తి నీకు దృఢముగ నెలకొనియెను. కాన ధన్యుఁడవనియె.

* ఇట్లు కలావతి భాషించుచుండఁ దులసి యచ్చటి కరుగుదెంచి యిట్లు పలికెను. ఉద్ధవా! సర్వప్రాణులయందును వేఱు వేఱ దేవతలుందురు. ప్రాణము విష్ణుస్వరూపము మనస్సు. బ్రహ్మమయము. చేతన ప్రకృతిస్వరూపిణి. ప్రకృతి బుద్ధిరూపయు సర్వశక్త్యధిదేవతయు నగు. జ్ఞానము శంభుస్వరూపము. పురుషుఁడు ధర్మస్వరూపుఁడు. నిర్గుణబ్రహ్మము ప్రకృతికిఁ బరము. పరమాత్మయు నాతత్త్వమే. ఆపరమాత్మయే యీకృష్ణుఁడు. సర్వకర్మసాక్షి, సకలప్రాణిసాక్షి, సుఖదుఃఖభోక్తయు నగు. జీవుఁడు తత్ప్రతిబింబకుఁడు. నేత్రములు చంద్రసూర్యాంశములు. జిహ్వ సరస్వతీవికారిణి. చర్మము భూతత్త్వమయము. బాహువులు దిక్పాలకాంశములు. ఇవన్నియు నాత్మకుఁ బరిచారకరూపములు. ఆత్మకుఁ బ్రియములుగ నుండును. కావుననే మహానుభావులు పరమాత్మను సేవింతురు. యోగులు నిరుపమాన భక్తిచే భగవంతుని ధ్యానింతురు. కర్మములకుఁ గర్మాచరణపరాయణులకును సాక్షి పరమాత్మయే. అట్టి భగవంతునికడ రహస్యవిషయ మేమి గలదు? శ్రీకృష్ణుఁ డంతర్వర్తియై ప్రచారము సలుపుచుండును. కావున నామహానుభావుఁ డెఱుంగని దింకే మున్నది? అనియెను.

అత్తఱిఁ గాళికయను గోపికవచ్చి యుద్ధవునితో నిట్లు ముచ్చటించెను. ఆర్యా! బాలతరుణవృద్ధులని మనుజులు ముప్పై

* సర్వప్రాణిషు దేవాశ్చ తిష్ఠంత్యేవ పృథక్పృథక్, ప్రాణో విష్ణుశ్చ విషయీ మనో బ్రహ్మ చ చేతనా=అని మూలము.

ధములుగ నున్నవారు. దేవతలు సిద్ధులు లోనగువా రాపరా త్పరు నెఱుంగుదురు. మానవులు భగవంతు నెఱుంగఁగోరు దురు కదా. ఇపు డీరాధికను మూర్ఛనుండి మేలుకొనఁజేయఁ దగు పనికిఁబూను టందఱకు ధర్మము. ఇకార్యమునకు నుపా యమేదియో యుద్ధవా సంబోధింపుమా, అని ప్రార్థించెను. ఆ మాటలాలించి యుద్ధవుం డిట్లు చెప్పందొడంగెను. ఓ రాధికా! కల్యాణీ! స్మృతిని దెచ్చుకొనుము. జగజ్జననీ! నాకు జ్ఞానము నుపదేశింపుము. ఈనన్ను శ్రీకృష్ణభక్త కింకరకింకరునిగాఁ దలం పుము. నాయం దనుగ్రహ మునుపుము. ఆనతియిమ్ము. మధురా పురమున కరిగెదను. నేను స్వతంత్రుఁడను గాను. పరాధీనుఁ డను. దారునిర్మితకాంత యెట్టిదో వశీభూతమగు వృషభ మెట్టి దో అట్లే నేను శ్రీకృష్ణమూర్తికిఁ గింకరుఁడను. కావున నాకు బుద్ధిచెప్పి యనుమతి నొసంగి పంపుము. అని భక్తియుక్తుఁడై రాధాంబను బ్రార్థించెను.

మహాశయులారా! ఉద్ధవునకు గోపికలకు జరగినవాద మును వింటిరి. ఇది మనకేవిషయమును దెలుపునని యూహింపఁ దగినది? ప్రధానకార్య మిదియేకదా. ఇందుఁ బ్రధానము భగ వన్మహిమము. రెండవది గోపికలచిత్తవృత్తి యెట్టిదనునది. మూఁడవది రాధ పూర్వవృత్తాంతము. నాల్గవది కలావతి పూ ర్వజన్మవృత్తాంతము. ఈవిషయములలోఁ గల సారము మనము గ్రహింపందగును. గోపికలు శ్రీకృష్ణుని పరంధామునిగా భా వించిరేకాని తమకుఁబతిగా భావింపలేదనుట యీవఱకే స్పష్ట ముగాఁ దెలిసియున్నను నీకథనుండి కేవల భక్తిపరవశలనుటయే గాక జ్ఞానసంపన్నలనియు స్పష్టమయ్యెఁ గదా. రాధను బ్రకృ

తిగా శ్రీకృష్ణుని బరమపురుషునిగా భావించి యాబుద్ధితోనే వారిని సేవించువారని తెలిసెను. ఇది యెఱుంగుటయే మనకుఁ దరణోపాయము. భగవత్తత్త్వమిట్టిదని తెలియఁజాలినంత తెలియుటకంటెఁ బురుషార్థ మింకొక్కటి లేదని నాభావము. విచారమనఁగా నిదియే. ఈవిచారమున రూఢజ్ఞాన మలవడకయే యెందఱో పెనఁగులాడుచున్నారు. తపస్సులను జేయుచున్నారు. వేదాంతగ్రంథముల నోపికంగొని త్రిప్పుచున్నారు. ఎన్ని పుస్తకములఁ ద్రిప్పినను బ్రాప్తనసత్కర్మము సమ్ముఖము కాకున్నచో నది తెలియదు. ఇది యెఱింగినవారు సుఖపడుదురు. లేకయున్నఁ బుస్తకములు వెదకివెదకి వేసారుదురు. కాని ఫలము శూన్యమే. వారియోపికం గాంచి భగవంతుఁ డనుగ్రహించినచో నించుకలాభము గలుగునేమోగాని లేకయున్న నీకష్టము వ్యర్థాయనవలసినదే. పుస్తకపఠనము నిష్ఫలమన వలనుపడదుగాని యంతతోనిల్చినచో నిష్ఫలమనక తప్పదు. చదివిచదివి యందించుకంతయు ననుష్ఠానమునందుఁ జేర్పకయున్న లాభ మిసుమంతయు లేదు. భక్తిబోధకగ్రంథములఁ బఠించిన నేమిఫలము? దాని నభ్యసింపవలయుఁ గదా. అభ్యాసమే ప్రధానము గాన దానికిం బ్రయత్నింపవలయు. దానికి సర్వభూతసమత్వము మొదటి సోపానము. భూతదయయు నట్టిదే. ఇవి రెండో దవక యున్న భగవత్సేవాభాగ్యము లభింపదు. చేసినకర్మఫలముల శ్రీకృష్ణపాదార్పణము చేయకున్న నామహాపురుషుఁ డనుగ్రహింపఁడనుట నిక్కము.

> "న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
> న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి. ౪

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే
యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే. 7

తస్మాదసక్త స్సతతం కార్యం కర్మ సమాచర
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. 19

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః. 30

యేమేమత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేపి కిల్బిషైః."

భగవద్గీత, కర్మయోగము.

అను నీ భగవద్గీతావాక్యములు పై సూచించిన భావమునే దృఢపఱచుచున్నవి. కావున గోపికలెట్టి దృఢభావము గలవారై భగవంతుని సేవించిరో అట్లు సేవింపఁ బ్రయత్నించుట మనకుఁ బ్రధానకృత్యము. ఇప్పటికైన రాధయన నెవతయో తెలిసియుండవచ్చునని నమ్మి సంతోషించుచున్నాఁడను. వృథగా రాధాంబను దూషించి యేమోపురుషార్థమును సంపాదింపవలయునను నూహగలవార లట్టి దుష్ప్రయత్నమును మానుకొందురని విశ్వసించుచున్నాఁడను. మఱొక్కవిషయము.

"సర్వప్రాణిషు దేవాశ్చ తిష్ఠంత్యేవ పృథక్పృథక్."

అను ప్రమాణము కనఁబడియెడిని. దీనినిగూర్చి నాలుగుమాటలు వ్రాసెదను. బ్రహ్మాండము లనేకములు. తత్పరిపాలకు లనేకులు. బ్రహ్మ విష్ణు శంకరు లొక్కొక్క బ్రహ్మాండమునకును

గలరు. దిక్పాలకాదులు గలరు. నామధేయభేదములే గాని కృత్యము లొక్కటియే. ఇందఱికిని మూలసూత్ర మొక్కటియే. ఆమూలసూత్రమే పరాత్పరుఁడనియు నిర్గుణుఁడనియుఁ బిలువంబడును. త్రిమూర్తు లాపరమపురుషుని యాజ్ఞనుబూని తమకృత్యములగు సృష్టిపాలనసంహారములఁ జేయుచుందురు. ఇంద్రాదులు వారియాజ్ఞ ననుసరించి కొలఁదిలోకములకుఁ బాలకులై తమపని నిర్వహించుచుందురు. ఇందఱికి నిన్నిపనుల నియమించిన తత్త్వమొక్కటియే యగును. అదియే సర్వసాక్షి యని పిలువఁబడును. ఆపరతత్త్వమే పుంలింగశబ్దములఁ బురాణపురుషుఁడు లోనగునామములఁ బిలువఁబడును. లింగభేదముల శబ్దములు భేదించుటయే గాని తత్త్వమునందు భేదము లేదు. ఆ పరమపురుషుని యిచ్ఛయే ప్రకృతి. భగవదిచ్ఛ యెట్లో అట్లు ప్రపంచప్రవర్తనము సాగుచుండును. ఇట్లుండ లోకమునఁగల మానవులు త్రిమూర్తులలో న్యూనాతిశయముల లెక్కించి పెనఁగులాడుట హాస్యాస్పదమనక తప్పునా? భగవంతు నిచ్ఛానుసారము ప్రవర్తించువారికి స్వతంత్ర మెక్కడిది? భగవత్తత్త్వము విష్ణువుగనే యవతరించి యిన్నికార్యములు చేయుచున్నాఁడన్నను దక్కిననామరూపము లాభగవంతునకు లేవన్నచో దానిమహిమమును నాశనము చేయఁ బూనినట్లు కాలేదా? అది చేయఁదగు మహాకార్యమా? సర్వాంతర్యామియై సర్వజగదాధారమై నిరంజనమై యద్వితీయమగు నా పరతత్త్వమున కొకరూపమే కలదనుటకంటె దుర్వాద మేదియుండును? ఏభక్తుఁ డేభక్తురా లేరూపమున నాపరతత్త్వమును ధ్యానించునో ఆరూపమున వారిం గృతకృ

త్ప్యులనుగాఁ జేయుట యా తత్త్వస్వభావము. అంతియగాని యీరూపమునే ధ్యానింపఁదగు. వేఱురూపము లాపరమా త్మకు నాదృతిపాత్రములు కావనుట యా తత్త్వమెట్టిదో యె ఱుంగకయుండుటేగాని వే ఱేమున్నది? ప్రాక్తనకర్మానురూపము గాఁ బ్రాణులబుద్ధి ప్రసరించుచుండును. తదనుగుణముగా దేవ తారాధనమొనరింప నాలోచన మొనఁగూడును. దానికనువగు ఫలమే కల్గును. భక్తి ప్రధానము గాని రూపము నామము ప్రధానము కాదు. కావున నెవ్వరుగాని భక్తిలేశముకలవారు పరదైవముల దూషింపకయుండు టుత్తమము. ఇదియే జన్మాం తమువఱకు మనముదోలుత నభ్యసింపఁదగు నుత్తమవిషయము. ఇంక నీవిషయమునువదలి యవ్వలివృత్తాంతమును వ్రాసెదను.

❀ రాధిక శ్రీకృష్ణునకు నుద్ధవునిద్వారా మనోభావమును జెప్పిపుచ్చుట. ❀

* ఇట్లుద్ధవుండు భక్తిపురస్సరముగాఁ బ్రార్థింప నాపలు కులకు నించుక కలంతతేఱి రాధిక చేతనమునొంది మెల్ల మెల్లన లేచి కూరుచుండి నిట్టూర్పులు పుచ్చి సఖులు శీతలోపచారము లొనరింపఁగా నించుకహాయిచెంది మందమందమధురోక్తుల నుద్ధ వున కిట్లు బదులుచెప్పెను. కాని యామెహృదయమున శ్రీహరి విరహావ్యథ బాధించుచునే యుండెను. గోపికలేడ్వురు శ్వేతచా మరము లూని యాజననిని సేవించుచుండిరి. ఉద్ధవుఁడేమి రాధ పలుకునో యని వేచియుండెను. రాధయు నించుక యూఱటం గాంచి వత్సా! మధురానగరమున కరుగుము. సంపదాంధ్యమున

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము తొంబదైదవ యధ్యాయమునుండి వ్రాయఁబడినది. ఇందు గర్గసంహిత మధురాఖండము పదునైనిమిదవయధ్యా యకథయుఁ గలుపఁబడును.

నన్ను మఱువకుము.నన్ను మఱచితివా యింతకంటెఁ బాపము వే ఱొకటి యుండదు. నా వచించిన మాటలన్నియు వదలక శ్రీ హరికడ విన్నవింపుము. మత్ప్రభువై పరమానందస్వరూపుఁడగు శ్రీకృష్ణుని శీఘ్రింబ తోడ్కొని రమ్ము. స్త్రీజన్మమునందు, నం దును స్త్రీలనడుమ తగినప్రాణనాయకుం బడసి ఖేదమునుగాం చినది కలదా? అట్టి దౌర్భాగ్యస్థితి నాకేగలిగినది. నాకేమి యు పదేశింతువు? నాకు నుచితబోధముచేయ నేమికలదు? ఆత్మ లేక యున్న దేహులదేహములు నిష్ఫలములు. సంప్రీతితోఁ గూడి నసౌభాగ్యము గౌరవము. నిత్యము నూతనమే యగు రహస్య మగు నవసంగమజనితప్రేమ మత్యంత దుర్లభము. మనసున సదా శ్రీకృష్ణునే స్మరించుదానను. మఱొకపదార్థము నామదికిం దగులదు. రాత్రులయందు నిద్రనుమాని స్మరించుట శోకవృద్ధికి హేతువగు. వత్సా! శోకసాగరనిమగ్నురాల నగు నన్నుద్ధ రింపుము. అభయప్రదానము చేయుము. అది సర్వతీర్థస్నాన ఫలముల నొసంగును. దుర్నివారమగు మానసమును బ్రబో ధింపఁ జాలకున్నదానను, శ్రీకృష్ణపరమాత్మ చరణాంభోజద్వం ద్వమును స్మరించుదానను, తద్గుణములఁ గీర్తించుదానను, తన్మ హిమమును వినుతించుదానను, ప్రేమసాగరమగు నాతనిహృద యమును స్మరించుదానను, తత్సౌభాగ్యమును స్మరించిస్మరించి నామనస్సు నిలుకడ గాంచకున్నయది. జగమున నేకాంతలకైన నాకుఁగల్గిన యిట్టిదుఃఖము కలదా? శ్రీకృష్ణవిరహదుఃఖమును నేనుదప్ప నితరు లెవ్వరెఱుంగుదురు? సీత యించుకయెఱుం గును. జగత్త్రయమున నేనుదప్ప దుఃఖినిలేదనియే నేను భావిం చెదను. నాయీయవస్థను విని యేస్త్రీ నాసాదృశ్యము నభిల

షించును? స్త్రీల మనోదుఃఖమునుదీర్ప నెవరు ప్రయత్నింతురు? స్త్రీలయందు రాధికవంటిస్త్రీ పుట్టలేదు. పుట్టఁబోదు. పుట్టినది లేదు. దుఃఖినినై విరహాతప్తనై సుఖసౌభాగ్యవర్జితనై యున్నదానను. కల్పవృక్షప్రాయుఁడై జగత్పతియై తగుహరిని బతినిగాఁ బడసియు విధిచే వంచింపఁబడితిని. విధి నిర్దయము. పాపచిత్తము. తత్పాదపద్మములను, దదీయవక్త్రచంద్రుని దద్రూపమును దర్శించు ప్రాప్తముకలిగినచో జన్మ సఫలమగును. నేత్రములు ధన్యములగు. మనస్సు సానందమగు. ఏమహానీయుని నామధేయశ్రవణమాత్రముఁ బంచప్రాణములు హర్షాంబుధి నోలలాడునో ఆపరమేశ్వరు దర్శించుటయే జన్మఫలము కదా. స్మృతిమాత్రముననే మనఃపద్మము వికసించును. ఏవిషయమున నా కవమతిగల్గెనని యాతనిమఱవఁగలనో చెప్పుము? రూపమా త్రైలోక్యమోహజనకము. గుణజాలమా నిరుపమానము. కరుణారసమయము. విధి యతని నిర్మింపలేదు. విధినే శ్రీహరి నిర్మించెను. విధికి విధియగు నాశ్రీహరిని సర్వసంపత్ప్రదాతను, గల్పవృక్షాధికప్రదాతను, శాంతమూర్తిని, లక్ష్మీకాంతుని, మనోహరుని, సర్వేశ్వరుని, సర్వజగద్బీజుని, బరమాత్మ నీశ్వరుని, శ్రీకృష్ణుని నేనైశ్వర్యమదమున మఱచిపోవుదును? ఆ మనోహరాకారమునకు సరిపోల్పఁదగినవా రుందురా? ఇందు మన్మథాశ్వికుమారులు తగుదురా? బ్రహ్మాదులు మురారిపాద జలజముల ధ్యానింతురు కదా. అట్టి జగన్నివాసుని మఱచుట శక్యమా? స్వప్నమునఁ దద్రూపమునుదర్శించి యంత సర్వసంగపరిత్యాగులై నిరంతర మాతనినే ధ్యానింతురు కదా. తద్గుణాకర్ణనమున శైలముద్రవించి జలమగును. శుష్కకాష్ఠము చిగు

రించును. మృతవృక్షము ముకుళబహుళంబగు. సమీరుఁడు కదలకుండును. సూర్యుఁడు సముద్రుఁడు స్వస్థత నొందుదురు. అట్టిపరమేశ్వరు నేభాగ్యముచే గర్వించి మఱతును? ఏభగవంతునిభయమున వాయువు వీచుచున్నదో, సూర్యుఁడు తపింపఁజేయుచున్నాఁడో, యింద్రుఁడు వర్షించుచున్నాఁడో, అగ్ని కాల్చుచున్నాఁడో, మృత్యువు జంతువులయందుఁ దిరుగుచున్నాఁడో, వృక్షములు ఫలించునో, పుష్పించునో, సముద్రములుప్పొంగక నిలిచియుండునో, గ్రహములు మునులు దేవతలు తమతమకార్యములయం దేమఱుపాటు లేకయున్నారో, అట్టి భగవంతుఁడు శ్రీకృష్ణుఁడువచ్చి యెపుడు దర్శనమిచ్చునో తెలియఁజాల కున్నదానను.

కాలునకుఁ గాలుఁడు. సంహర్తకు సంహర్త. సృష్టికర్తకు సృష్టికర్త. స్వతంత్రులకు స్వతంత్రుఁడు. అట్టి భగవంతు నేయైశ్వర్యమదమున మఱచిపోవుదును? నాకీదుఃఖము పోవునట్లు చేయఁగలవా రెవ్వరును లేరు. సావిత్రియు, సరస్వతియు, వేదములు, వేదాంగములు, సత్పురుషులు, దేవతలు, సహస్రవక్త్రుఁడగు ననంతుఁడు, వేదజనకుఁ డగు బ్రహ్మ, శంభుగణనాయకులు, యోగీంద్రులును సమర్థులుకారు. స్థితికి గతి విచారింపఁదగినది. మార్గశూన్యమందు గతివిచార మేటికి? సర్వసుఖదుఃఖశుభాశుభాదులు కాలసాధ్యములు. ఆకాలము దుర్నివారము. జగములు కాలసాధ్యములు. వత్సా! ఉద్ధవా లెమ్ము. మధురానగరమునకుం బొమ్ము. ఈవ్రజవాసమును బరిత్యజింపుము. ప్రయాణము సాగింపుము. చిరకాలము కృష్ణవిరహము దుఃఖము కొఱకగును. సుఖలేశముకూడ నపుడుండదు. మధురాపురికరిగి

జన్మమృత్యుజరయాపహంబగు తన్ముఖచంద్రుని వీక్షింపుము.
అని రాధాంబిక పలుకఁగా విని యుద్ధవుఁడు రోదనము చేసెను.
రాధయు రోదనమొనరించెను బంధుజనవియోగము దుర్భరము
కదా! ఇట్టు లాయిరువురు శోకసాగరమున మునింగిరి. పదంపడి
రాధయు నుద్ధవుఁడొసంగిన శ్రీకృష్ణదత్తపత్త్రమును బలుసా
రులు చదువుచు శిరమున దాని నునుచుకొని శ్రీకృష్ణునింబోలె
సత్కరించుచు శ్రీకృష్ణతుల్యముగా భావించుచు మరల నుద్ధ
వుఁడరుగుట వెతలఁబడుచు నుద్ధవుఁ డరిగినఁగాని శ్రీహరి
రాఁడన్న తలంపు తోఁపఁగా నాతనిఁ బయనంబుచేయఁ ద్వర
పడుచు నిట్లు వచింపరాని కష్టములపాలగుచుండెను ఉద్ధవుఁ
డా మహాలక్ష్మి విరహబాధను జూచుచు నామెప్రీతికి మెచ్చు
కొనుచు శీఘ్రింబపోయి యీవృత్తాంతమెల్ల శ్రీకృష్ణునకుం
దెలిపి మధురానగరమునుండి గోకులమునకుం బోవలయునని
ప్రార్థింప నిశ్చయించుకొనియెను.

రాధ యుద్ధవునకు జ్ఞానోపదేశము చేయుట.

* ఉద్ధవుం డిట్లు మధురానగరగమనోన్ముఖుండై యానతి
వేఁడిన నాతనిమహాధృతి మెయిఁగాంచి రాధిక యిట్లు పలికెను.
ఉద్ధవా! శ్రీకృష్ణమూర్తితో నామనోవ్యథ దెలుపుదువు కదా.
నన్ను మఱచిపోవని నమ్మెదను. ఇంకఁ జిరకాలము నీవిటనుం
డుట నాకు లాభకారి కాదు. కావునఁ బయనము చేయుము.

---

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము తొంబదియాఱవయధ్యాయ
మునుండి కైకొనఁబడినది. ఇతరపురాణములలో నీకథ గానరాదు. గర్గసంహి
తయందు దీనిసార మించుకకలదు. కాన నదియుం నిం దిమిడియున్నదని
యెఱుంగవలయును.

అని నాభక్తవర్యుఁడు వినీతుఁడై రాధాపాదారవిందములకు వందనమాచరించి లేవకుండెను. అప్పుడు మాధవియను గోపిక ప్రేమవిహ్వాలయై భక్తుఁడై వదలిపోవఁ గాళ్లురాక యేడ్చును ద్ధవు నూఱడించుచు నో భక్తవర్యా! వగపుడుగుము. క్షణము నిలువుము. రహస్యమై నిరుపమానమై తనరుజ్ఞానసారమును వచింతు. ఆలకింపుము. ఇది శ్రుతులయందును బురాణముల యందు నించుకగాఁ దెలుపఁబడును. కావున నతిరహస్య మన వలయును. త్రిలోకజననియగు శ్రీరాధాదేవిని బ్రశ్నింపుము. ఆమె నీకుపదేశింపఁగలదని యూరకుండెను.

ఆమాటల కానందపరవశుఁడై యుద్ధవుఁడు రాధాపదక మలములవదలి లేచి కరయుగళము ముకుళించి మహాదేవీ! నాసంశయములఁ బోకార్పుము. కరుణచే నన్నుద్ధరింపుము. ప్రాణి యేకాకియై జన్మించును. ఏకాకియై పోవును. ఇట్లే మర లమరలఁ జేయుచుండును. కర్మానురోధముచేత స్వకర్మఫల మును దా ననుభవించుచుండును. జంతువు కర్మముచేతనే పుట్టును. కర్మముచేతనే విలయమొందును. సుఖదుఃఖములు భయశోకములు. కర్మముచేతనే గలుగుచున్నవి. ప్రతిప్రాణియుఁ బ్రతిజన్మమందును భోగావశేషముచేతనే భోగమును భుజిం చుచున్నవాఁడు. మరలఁ గర్మముచేతనేపుట్టి మరల లయమందు చున్నాఁడు. సాధ్వీమణీ! నాకు బహుమానపురస్సరముగా రత్నాదులిప్పించితివి. అవి నాతోఁగూడి రావుకదా. వానితో నాకేమి ఫలము? భవసాగరమును దరించుటకు నీవే దృఢమగు నౌకవు. కర్ణధారుఁడు శ్రీకృష్ణపరబ్రహ్మమే. సర్వజనులఁ బరతీ రమునకుఁ గొనిపోవువాఁడు కదా. తల్లీ! నాకొక దానమిమ్ము.

ఆదానము భవజలధిసంతరణక్షమ మగును. నీప్రసాదమును బరిగ్రహించి మధురానగరమునకు శ్రీకృష్ణచరణసరసిజసేవాపరతంత్రుఁడనై యరిగెదను. దేవతలకు మనుజులకుఁ గాలగతి యెట్టిదో, పితరులకు బ్రహ్మలోకవాసులకుఁ, దదూర్ధ్వలోకవాసులకు నాకాలగతి యెట్టిదో వచింపుము. దుస్తరమై భయంకరమై కనఁబడుదానిని దాఁటి హరిపదమును బొందెదను. మహాలక్ష్మీ! ఇట్టియుపాయమును దెలుపు మార్గదానము చేయుము. దూరమువనుండియు మహాత్ములా శ్రీకృష్ణపాదారవిందములనే కదా ధ్యానింతురు. బ్రహ్మాదులా పదనళినములఁ బూజింపనే దివానిశము లర్థించుచుందురు.

అని యిట్లుద్ధవుండు పలుక నాకమలాలయ పక్కున నవ్వెను. ఆనందవశమున వెడలుకన్నీటిని జేలాంచలమున దుడుచుకొని యిట్టు ప్రత్యుత్తరిచ్చెఁ బలికెను. వత్సా! మాధవి పురి కొలుపఁ బ్రశ్నించితివి కదా. లోకమున స్త్రీల నబలలని పిలుతురు. ఆజాతి నించుకతక్కువచూపుతోఁ జూతురు. అట్టి స్త్రీ జాతినగు నేను నీకేమి బోధింతును? శుద్ధమగుకాలగతి శ్రీహరియే యెఱుంగును. బ్రహ్మయు మహాదేవుఁడు శేషధర్మాదులు వేదచతుష్టయము తెలియఁజాలు. వేదములననుసరించి సాధువులించుక యెఱుంగుదురు. గోలోకమున రాసమండలమున శ్రీకృష్ణుఁ డెఱింగించినదానిం దెలిపెదను. గోలోక వైకుంఠ బ్రహ్మలోకాదులయం దేకాలగతి కనఁబడునో దానిం దెల్పెదాన. ఆలకింపుము. మనుజులకు దేవపితృగణములకు బ్రహ్మాదిలోకములకుఁ బాతాళాద్యధోలోకములకును దురత్యయము

కాలగతియని నమ్ముము. అయినను దానిని బండితు లేయుపా యమునఁ దరింతురో తత్పద్ధతి నెఱింగించెదను.

సజ్జనులు, కాలకాలుఁడు, జగద్గురువు, నిర్గుణుఁడు, నిరీహుఁడు, పరమాత్మ, యీశ్వరుఁడు నగుపరాత్పరు సేవింతురు. ఆపరమాత్మ వదలునేని యీదేహ మప్పుడేపడును. ఆపరమాత్మనుసేవించి కాలగతిని దరింతురు. రవియే సర్వప్రాణులయాయువును హరించును. కాని శ్రీహరియందుఁ బరిశుద్ధభక్తిగల పుణ్యాత్ములజోలికిం బోఁడు. వత్సా! ఉద్ధవా! బ్రహ్మమానస పుత్రులగు నల్వురను జూడుము. వారు సనకసనందన సనత్కుమార సనత్సుజాతులనువారు. పరమభాగవతులు. వారికి స్థిరవయస్సు కలదు. మఱియు రుద్రాదులనుమించి గురువులకు గురువులై బాలకులై యనుపనీతులై పంచవర్షప్రాయులై శిశువులై వారుందురు. వా రంతరంగమున సాంద్రవయస్స్ఫురితులు. సదా సస్మితామలవక్త్రులు. దిగంబరులు నగుదురు. శ్రీకృష్ణధ్యానపూతులు. తీర్థములవలెఁ బావనులు. విష్ణుభక్తులు. వేదవేదాంగముల శంకలను దీర్చువారు. సంతుష్టమానసులు, సర్వకాల సర్వావస్థలయందును శ్రీహరినే భావించుచుండువారు. * బాహ్యపూజావిహీనులు. మానసిక పూజానిరతపూతులు. మృత్యుంజయునిమించిన శక్తిసంపన్నులు. కాలసర్పమును జయించినవారు. అట్టి సనకసనందనసనాతనసనత్సుజాతుల నిట్టి మహనీయులని యెవరు స్మరింతురో వారు తీర్థస్నానఫలమును బొంది పాతకముక్తు లగుదురు. అంతియగాక హరిభక్తియు

---

* బాహ్యపూజా విహీనాంశ్చ పూతాన్ మానసికాం స్తథా = అని మూలము.

దాస్యము లభించును. వత్సా! ఉద్ధవా! మృకండుతనయునిం గనుము. బాలకుఁడయ్యును సత్కర్మమున నెంతటియాయుష్యము గాంచెనో యాలోచింపుము. పదివేలవత్సరములు పదింతలగు కాలము తపమొనరించి సప్త బ్రహ్మకల్పాంతాయుర్దాయమును బడసెను. పంచశిఖుఁడని బాలకుని, లోమశుని, ఆసురిని దిలకింపుము. హరిసేవాతత్పరులై యితరవాంఛలు లేక పెక్కువత్సరములు హరిధ్యానతత్పరులైరి. హరికరుణకుఁ బాత్రులైరి. హరిపదమును బొందిరి. జమదగ్నిపుత్రుఁ డగు రాముఁడు శ్రీహరిసేవించి చిరంజీవి యయ్యెఁగదా. హనుమంతుని, బలిని, వ్యాసుని, నశ్వత్థామను, విభీషణుని, కృపుని, జాంబవంతుని బరికింపుము. వీరెల్ల హరిధ్యానముచేతనే పరిశుద్ధాంతరంగులై చిరకాలము జీవించునదృష్టమును బడయం గల్గిరి. సిద్ధులయందును మునీంద్రులయందును నరేంద్రులయందును జిరకాలజీవితమును గాంచినవారెల్ల హరిదాసులనియే నమ్మవలయును. హరినిభావించి పూజించి వినుతించి చిరకాలము జీవింపఁగల్గిరి. దైత్యులలోఁ బ్రహ్లాదుని బరికింపుము. హిరణ్యకశిపుతనయుఁడు. తండ్రి హరివైరి. తనయుఁడో హరిభక్తితత్పరుఁడు. కావున సర్వవాంఛలు పొందఁజాలెను. హరిభక్తుని గానివాని నిట్టివాని నొక్కనింజెప్పుము. * ఇతరఖండములలో నెన్నియో జన్మములెత్తి యనేకపుణ్యకార్యములొనరించినఁగాని భారతవర్షమున జన్మము లభింపదు. అట్లు జన్మించికూడ నేజనులు హరినిసేవింపరో వారే మూర్ఖులు.

---

* అనేకజన్మతపసా లబ్ధ్వా జన్మ చ భారతే, యోహరిం తం న సేవంతే తే మూఢాః కృతపాపినః = అని మూలము.

పాపమతులు. అర్థిజనకల్పతరువగు వాసుదేవునివదలి యే నరుఁడు విషయసుఖలోలుపుఁడగునో వాఁడు అమృతమును వదలి విషము భుజించుమూఢునకు సమానుఁ డగును ఎవ్వని కెవఁడు పుత్త్రుఁడు ? ఎవ్వనికెవ్వతుక పుత్త్రిక ? ఎవ్వరికెవ్వారు బాంధవులు ? భగవంతుఁడుతప్ప నాపత్తునం దేబంధు వేవాని నుద్ధరించును ? కావుననే సాధువులు దివానిశములు శ్రీకృష్ణుని భజింతురు. శ్రీకృష్ణపరబ్రహ్మము జన్మమృత్యుజరావ్యాధిహర్త. సర్వపాపసంహర్త. పరాత్పరుఁడు.

కాలమును దరించునుపాయము పరమాత్మసేవనమే. ఆనందనందనుఁడు పరిపూర్ణుఁడు. ఉద్ధవా! వత్సా! మదీయజ్ఞానగోచర మగుకాలగమనము నించుకవినుము. నరులు మొదలుకొని బ్రహ్మలోకపర్యంతము లోకములనుండు జీవులకీకాలగతి యవసరము. దీని నెఱింగినఁగాని కృతకృత్యులు కాఁజాలరు. సావధానముగా నాలకింపుము. సకలమునకుఁ బరస్థానము సర్వాధారము విరాట్టువే. మహావిరాట్టువనియుఁ గొందఱం దురు. ఆమహాత్ముని లోమజాలమునుండియే యసంఖ్యవిశ్వము లుద్భవిల్లెను. అన్నింటికంటె గొప్పదియు నన్నింటికంటె స్వల్పమునగునది యాతత్త్వమే. కాలారంభాత్మక మదియే. దాని తత్వ మిట్టిదని యూహింపఁ దరముకాదు. సిద్ధాదులకంటె నా విరాట్టు వుత్తముఁడు. పరమాణుస్వరూపుఁడు. ఆకారణముచే తనే మనుష్యుల కైకశ్యభ్రాంతి జనించెను. రెండుపరమాణువులొక్కయణు వగును. ఆయణువులు మూఁడైన నొకత్రస రేణు వనంబడు. త్రసరేణువులు మూఁడుకలిపిన నది త్రుటియ నంబడు. ఆత్రుటులు నూఱుకలిసిన వేధమనఁజెల్లు. ఆవేధములు

మూఁడుకలిసిన లవసంజ్ఞకంబగు. అవిమూఁడైన నిమేషమయ్యె. నిమేషత్రయము క్షణమనందగు. అయిదుక్షణములైనఁ గాష్ఠ యనంబడియె. అవి పదియైన లఘువయ్యె. ఆలఘువులు పదు నైదు దండమనందగు. దండప్రమాణము నాలకింపుము.

నాలుగంగుళముల స్వర్ణమాషములచే వివరముచేయఁ బడినప్రస్థమును నీటిలోవైచిన నెంతకాలమునకు మునుఁగునో యది దండప్రమాణకాల మనంబడు. దండద్వయము ముహూ ర్త మనంబడును. అఱువదిదండములకాలము తిథియనంబడును. తిథియం దెనిమిదవభాగము ప్రహార మనందగు. ప్రహారములు నాలుగైన దినమనియు రాత్రియనియుఁ జెప్పంబడు. పదునైదు తిథు లొక్కపక్షమనం బ్రసిద్ధిం గాంచును. రెండుపక్షము లొక్కమాసమగు. ఆరెండుపక్షములు వరుసఁగా శుక్లకృష్ణసం జ్ఞలం బరఁగు. రెండుమాసము లొక్కఋతువనంబడు. ఋతువు లాఱు చెల్లినంతకాలము సంవత్సరము నాఁబడు. వసంతగ్రీష్మవ ర్షాశరద్ధేమంత శిశిరనామకములు ఋతువులు. సంవత్సరములను గాలవేత్తలు పంచధా విభజించిరి. సంవత్సరము, ప్రవత్సరము, ఇలావత్సరము, అనువత్సరము, వత్సరము అని వానిపేరులు.

అబ్దము పండ్రెండుమాసములంతకాలము గలది. మాస ములు వైశాఖజ్యేష్ఠాషాఢశ్రావణభాద్రపదాశ్వినకార్తికమార్గ పౌషమాఘఫాల్గుణచైత్రములని పేరులు గలవి. చైత్రము చర మమాసము వర్షశేషమనియుఁ జెప్పంబడును. చైత్రవైశాఖమా సములు వసంతకాలమనియు, జ్యేష్ఠాషాఢమాసద్వయపరిమిత కాలము గ్రీష్మర్తువనియు, శ్రావణభాద్రపదమాసములు రెండు నుగలిసి వర్షర్తువనియు, ఆశ్వయుజ కార్తికమాసముల పరిమిత

కాలము శరదృతువనియు, మార్గపౌషములు హేమంతర్తువ నియు, మాఘఫాల్గుణములు శిశిరర్తువనియుఁ గీర్తింపఁబడును. సంవత్సరమును రెండుగ విభజించినకాల మయన మనంబడు. ఉత్తరాయణమనియు దక్షిణాయనమనియు వానిపేరులు. మాఘాదిమాసషట్క మ్ముత్తరాయణము. శ్రావణాదిమాసము లారును దక్షిణాయనము. శ్రావణము మొదలు పౌషమాసాంతము రాత్రి వృద్ధియగుకాలము. ప్రతిపత్తు మొదలు పూర్ణిమాంతము శుక్లపక్షమనియు, పూర్ణిమానంతర ప్రతిపత్తు మొదలమావాస్యదనుకఁ గృష్ణపక్షమనియుఁ జెప్పంబడును. ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, నవమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, చతుర్దశి,కుహూ, అని ప్రతిపదనంతరము వరుసగాఁ దిథులపేరులు చెల్లును. అశ్విని, భరణి, కృత్తిక,రోహిణి, మృగశీర్షము,ఆర్ద్ర,పునర్వసు,పుష్యమి,ఆశ్రేష,మఘ,పూర్వోత్తర ఫల్గునులు, హస్త,చిత్ర,స్వాతి,విశాఖ,అనూరాధ,జ్యేష్ఠ, మూల, పూర్వోత్తరాషాఢలు, శ్రవణము, అభిజిద్ధనిష్ఠలు, శతభిషము, పూర్వోత్తరాభాద్రలు, రేవతి యను నీ యిరువదెనిమిదితారలు ప్రసిద్ధిం గాంచి కర్మమున కుపయోగించును. ఈతారాధిదేవతలే చంద్రునిభార్యలు. వరుసగా వారినిగూడి చంద్రుఁ డలరారుచుండును. ఇరువదేడుతారకలే చంద్రునిభార్యలని శ్రుతిసిద్ధము. శ్రవణచ్ఛాయయే యభిజిత్తనంబడు. దానింగూడి యిరువదెనిమిదితారలయ్యెనని యెఱుంగఁదగు.

ఒకానొక సమయమున శీతాంశుఁడు సుందరాంగియగు రోహిణింగూడి సల్లాపము లాడుచుండెను. శ్రవణాఖ్యతారాదేవి యవ్విధమెఱింగి క్రోధావిష్టహృదయయై తనయం దాతని

కెక్కువమక్కువ లేదని తెలిసికొని తనఛాయనునిచి తాఁ దండ్రియింటికిం బోయెను. కొంతకాలమునకుఁ దండ్రి నిబిలుచు కొని భర్తృగృహమున కరుదెంచెను. ఇరువురు నొక్కరూపు గానున్నందున నభిజిత్తు భార్యయేయని నిశ్చితమయ్యెను. ఈ విషయము గోలోకమున నొకప్పుడు శతశృంగపర్వతమున శ్రీకృష్ణుఁడు నాకెఱింగించెను. ఒక్కతిథియం దొక్క నక్షత్ర ముంగూడి చంద్రుఁడుండును. ఇంక యోగకరణముల పద్ధతి నెఱింగించెద. సావధానుఁడవై వినుము.

విష్కంభము, ప్రీతి, ఆయుష్మత్సౌభాగ్య శోభనములు, అతిగండము, సుకర్మధృతిశూలగండ, వృద్ధిధ్రువ, వ్యాఘాత హర్షణ వజ్రసిద్ధి వ్యతీపాతవరీయ త్పరిఘ శివ సిద్ధి సాధ్యశుభ శుక్ల బ్రహ్మైంద్రవైధృతులను నవియోగము లనఁబడు.బవబాల వకౌలవ తైతులగరవణిజ విష్టిశకుని చతుష్పాన్నాగవ కింస్తుఘ్న ములను నివి కరణములని పేరొ్కనంబడు. మనుష్యమానమున నొకమాసపరిమితకాలము పితృమానమున నొక యహోరాత్ర మగు. శుక్లపక్షము పగలు కృష్ణపక్షము రాత్రియునని వ్యవహ రింపఁబడును. మనుష్యమానమున నొక్కవత్సరమంత కాలము దేవమానమున నొక యహోరాత్ర మగును. ఉత్తరాయణ కాలము పగలు దక్షిణాయనము రాత్రియు నగు.

దేవమానమున డెబ్బదొక యుగములయిన నొక్క మన్వంతరంబు చెల్లు. మనువునకెంత యాయువో యింద్రున కంతియ యాయువగు. ఇరువదేను సహస్రములు నైదుశత ములు ననియార్యులు నిర్ణయించిరి. శక్రపాతానుసారముగా నందు సూర్యగతి లేదు. బ్రహ్మలోకనివాసులు దివానిశము నె

ఱుంగుః ద్ధతియు నిట్లే. దండద్వయము నరపలమగు శక్రాయు ర్దాయ మంత కాలము బ్రహ్మమానమున నొక పలమగు. ఇట్టి పరి మితిని ముప్పదిదినములైన బ్రహ్మలోకమున నొక్క మాసమగు. పండ్రెండు నెలల కొక్క వత్సరంబని యందును లెక్కింపఁబడు. ఆయుస్సు ధాతకు నూఱువత్సరములే. బ్రహ్మ నూఱువత్సర ములు జీవించి మృతినొందఁగా నాతని యాయుఃకాలము శ్రీహరికొక నిమేషమగు. వైకుంఠమున నిట్లే కాలమానమని యెఱుంగనగు. అందు సూర్యగతిలేదు. గోలోకమునఁ గాల మితి యిట్లేయని యెఱుంగునది. వైకుంఠవాసులకు దివారాత్రి భేదములేదు. అందుఁ జంద్రాదిగ్రహగతులు కానరావు. శింశు మారచక్రమందుఁ బరిభ్రమింపదనియు నెఱుంగవలయును. శ్రీ కృష్ణమూర్తితేజస్సునఁ బగలుగలుగు. వారు శయనింప రాత్రి యగు. ఇట్లు భగవల్లోకమునఁ గాలగతి సాగుచుండును. భగ వంతుఁడు కాలస్వరూపుఁడు, నిరాకారుఁడు నగు. సప్తపాతాళ లోకములందును జంద్రసూర్యగతులు లేవు. అందుండు జీవులు దివారాత్రిభేదమున సంశయింపరు. పగలు నాగేంద్రభోగి విల సన్మాణిక్యదీప్తిచేఁ గలుగును. సంధ్యాకాలమున నగ్నిజ్వాల యగపడు. తమోవృతమై రాత్రియుండును. అందుండువారు కాలము తామ్రప్రమాణమున నెఱుంగుదురు. భూలోకమం దెట్లో యధోలోకసప్తకంబునఁ గాలపరిమాణ మట్లేయని తెలియందగు.

కృత త్రేతా ద్వాపర కలి నామకములు నాల్గుయుగము లని కీర్తితములు. పండ్రెండువేల దివ్యవర్షములపైన నాలుగు వేలు ఎనిమిదివందలు కృతయుగప్రమాణమని పరిగణింపఁబడి

యెను. మనుష్యమానమునఁ బదునేడులక్షలపై నిరువదెనిమిది వేలని తెలియుము. వరుసగా నిట్టి కాలమానము యుగముల కెఱుంగఁదగు. బహుధా ప్రపంచితముకదా. వత్సా! కాల సంఖ్యానిరూపణమిదియని వచించితిని. దీని నెఱింగి కర్తవ్యమెద్దియో యాలోచించుకొమ్ము. జ్ఞానివై శ్రీహరిదర్శింప నరుగుము. అనిపలికి రాధాదేవి యూరకుండెను.

ఆర్యులారా! కాలపరిమాణమేల రాధ యుద్ధవున కుపదేశించెనో యించుక యోజింపఁదగినదే. ఇందేమిరహస్యము కలదు? అనియును దోఁచును. ఈయుపదేశ మారాధచేయ దానివలన నుద్ధవుఁ డేమిలాభమును బొందెను? అనియుఁ బ్రశ్నింప మనస్సు త్వరపడును. కాని వ్యర్థముగా నీవిషయము నాజగజ్జనని యుపదేశించియుండునా యని యూహింపవలదా? దానిసారము నాలకింపుఁడు. కాల మఖండము. లోకవ్యవహారార్థ మది ఖండముగా నొనరింపఁబడినది. కాలవశమునఁ బ్రపంచము సాగుచున్నది. అనఁగాఁ గాలరూపుఁడగు భగవంతునకంతయు లోఁబడియున్నదని భావము.

లోకానామంతకృత్కాలః కాలోఽన్యః కలనాత్మకః.

అని సౌరోపనిషత్తు తెల్పుచున్నది.

కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః,
ఋతేపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.

భగవద్గీత. ౧౧ అ. ౩౨ శ్లోకము.

అనాదిరేష భగవాన్ కాలోఽనంతోఽజరః పరః,
సర్వగత్వాత్స్వతంత్రత్వాత్సర్వాత్మత్వాన్మహేశ్వరః.
బ్రహ్మాణో బహవో రుద్రా అన్యే నారాయణాదయః,
ఏకోహి భగవానీశః కాలః కవిరితిస్మృతః.
బ్రహ్మనారాయణేశానాం త్రయాణాం ప్రకృతౌ లయః,
ప్రోచ్యతే కాలయోగేన పునరేవచ సంభవః.
పరబ్రహ్మచ భూతాని వాసుదేవోఽపి శంకరః,
కాలేనైవచ సృజ్యంతే స ఏవ గ్రసతే పునః,
తస్మాత్కాలాత్మకం విశ్వం స ఏవ పరమేశ్వరః.

కూర్మపురాణము.

దీనిచేఁ గాలరూపుఁడు పరాత్పరుఁడనియు నెందఱో బ్రహ్మవిష్ణురుద్రులు గతించిరనియు వీరెల్ల ననఁగా నీ త్రిమూర్తులు ప్రకృతియందే లయింతురనఁగా వీరిని బ్రకృతియే సృజించెననియు స్పష్టమయ్యెడిని. ప్రకృతియనఁగాఁ దృణమాత్రమని చిటికెలువేయువారలీ ప్రమాణములను జూచిన నేమనుటకు వీలులేకుండఁగలరు. నామరూపములుగలవారెల్లఁ బ్రకృతికి లోఁబడినవారే యనియుఁ బ్రకృత్యతీతుఁడు భగవంతుఁడే యనియుఁ బెక్కుసారులు వ్రాసియేయున్నాఁడనుగదా. మఱి వక దానిని మదినునుచుకొనిన మతభేదములు రూపుమాయునని నాకుఁగల గట్టినమ్మకము.

అనాదినిధనః కాలో రుద్రస్సంకర్షణస్స్మృతః,
కలనాత్సర్వభూతానాం సకాలః పరికీర్తితః.
సర్వభూత సమత్వాచ్చ స రుద్రః పరికీర్తితః,

కర్షణాత్సర్వభూతానాం సతు సంకర్షణస్స్మృతః,
అనాదిని ధనత్వేన స మహాన్ పరమేశ్వరః.

విష్ణుధర్మోత్తరము.

భగవంతుఁడెట్లు సర్వవ్యాపకుఁడో పరిగణింప నశక్యుఁడో కాల మట్లేయని యెఱుంగవలయును. ఆపరమేశ్వరు నరూపరూపమున నెట్లు మనము నామరూపవంతునిగా నొనరించుకొని అనఁగాఁ గల్పించుకొని పూజింతుమో అట్లే యఖండమగు కాలమును లోకవ్యవహారము నిమిత్తము తగినరీతిని ఖండముగాఁ గావించుకొని యుగవర్షమాసాదిభేదముల వ్యవహరించుచున్నారము. ఈవిభాగమెట్లు వాస్తవముకాదో భగవంతునకు మనము కల్పించినరూపములు సత్యములుకావు. కావుననే ప్రాచీనులు బాహ్యపూజకంటె మానసికపూజ యత్యుత్తమ మనిరి. పెద్దలు జ్ఞానరూపుఁడని తేజస్స్వరూపుఁడని భగవంతుని భావింతురు. కాఁబట్టియే మహాకవి భర్తృహరి,

ధన్యానాంగిరికందరేనివసతాం జ్యోతిఃపరంధ్యాయతామ్.

అని వచించి కృతార్థుఁడయ్యెను.

సూ. క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేషఈశ్వరః.

పాతంజలియోగసూత్రము. సమాధిపాదము.

అవిద్యాదయః క్లేశాః. కుశలాకుశలాని కర్మాణి. తత్ఫలం విపాకః. తదనుగుణావాసనా ఆశయాః. తే చ మనసి వర్తమానాః పురుషే వ్యపదిశ్యంతే. స హి తత్ఫలస్యభోక్తేతి. యథా జయఃపరాజయోవా యోద్ధృషు వర్తమానః స్వామిని వ్యపది

శ్యతే, యోఽహ్యనేన భోగేనాపరామృష్టః స పురుషవిశేష ఈశ్వరః.”

వ్యాసభాష్యము.

“సూ. తస్య వాచకః ప్రణవః” ౨౭

భగవంతుని నామధేయ మోంకారమని దీనిభావము. అనఁగాఁ బరమేశ్వరు నేకర్మవికారము లంటవు. రూపములేదు. ప్రణవమే యతని నామధేయము. “దీనిభావమేమి తిరుమలేశా” అన్నట్లు దీని సారమేమి? సర్వాంతర్యామియై సర్వసాక్షియై రూపనామములులేక కాలమూర్తియై వెలుంగువాఁ డెవఁడో ఆమహానీయుఁడే పరమేశ్వరుఁడని సిద్ధాంతము. ఇది కదల్పఁబడనిమతము. సత్యమత మిదియే. రూపాదులు భక్తులచే యథారుచి కల్పితములు. ఇట్టులుండ నాదేవునిరూపము శుభము. నాదేవుఁ డెక్కుడని బొడ్డున యజ్ఞోపవీతము దిట్టపఱచి కలహమునకుఁ బూను టవివేకమని యిందువలనఁ దేలును. ఏభక్తుఁ డేరూపమున నాపరాత్పరుని ధ్యానించినను, ఆరూపమునఁ బ్రత్యక్షమగు. కావుననే జ్ఞానులు

“విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః.”

గీత. ౫ అ. ౧౮ శ్లోకము.

అను గీతావాక్యము ప్రకారము భగవంతుని సర్వభూతస్థునిగా భావించి చూతురు. అందువలననే వారిదృష్టికి జాతిభేదములు కానరావు. ఒక్క భగవంతుఁడే కానవచ్చును. అట్టి జ్ఞానములేని పామరులు జాతిభేదములు పాటించుట కంటె నెక్కుడుగా దేవతాభేదములను బాటించి యీర్ష్యాపరవశులై

దేవతలను బరకీయులను నజ్ఞానావేశమున దూషింతురు. వారికిని ముక్తికిని గడుదూరము.

ప్రకృత మాలోచింతము. కాలరూపమే భగవత్స్వరూపమనియు, భగవత్తత్త్వ మెఱుంగ శక్యము కాదనియు ముందువెనుక లాలోచింపక త్వరపడి భగవత్సేవ చేయవలయుననియు రాధ యుద్ధవునకు బోధించెను. భగవంతుం డనంతమహిమాన్వితుండని తెల్పుటయే యిక్కథాసారము. కావున మనము పరాత్పరుని సర్వభూతస్థునిగాఁ గనుంగొనుటకుఁ బ్రయత్నమొనరింప వలయును. ఇఁకఁ దర్వాతిగాథ నాలకింపుఁడు.

### రాధ యుద్ధవుఁడు మధురానగరమున కరుగుచుండ దుఃఖించుట.

ఇట్లు రాధిక యనుమతి నీయ దానిని శిరసావహించి ప్రయాణము సేయఁబూను నుద్ధవునింగాంచి గోపికలెల్ల విహ్వలచిత్తలై వగలఁబొగులసాగిరి. అంతట రాధికయుఁ దనపీఠము నుండి లేచి యార్తలగు గోపికలంగూడి శుభాశిషముల నొసంగి తలపైఁ దనకరమునిడి దీవించెను. శ్వేతదూర్వలు, అక్షతలు, శుక్లధాన్యము, పుష్పములు, లాజలును, ఫలములును, శుభపత్రములును నొసంగెను. వానింగొని యతఁడు ప్రయాణము సాగించునంత నతనికి శుభశకునములయ్యెను. వానింగని పరమప్రమోదమునొంది యతఁ డరుగఁ దలఁచెను. అంత రాధిక హితము సత్యము శుభకరమునగు వాక్కు నిట్లు వినిపించెను. అత్తటి నామెనయనములు బాష్పపూరితములై యుండెను. హృదయము దుఃఖవేగమున వణఁకుచుండెను.

* "ఉద్ధవా! నీకు మార్గము శుభప్రదమగుం గాక. సదా నీకు శుభములే కలుగుచుండుఁ గాక. జ్ఞానివికమ్ము. శ్రీహరిభక్తాగ్రేసరుఁడవు కమ్ము. శ్రీహరి కతిశయప్రీతిప్రదుఁడవు కమ్ము. శ్రీకృష్ణభక్తిదాస్యములను నివి రెండును శ్రేష్ఠములలో శ్రేష్ఠములు. ముక్తి పంచవిధములు. అందు భక్తి పరమము. బ్రహ్మత్వ దేవత్వ సురపతిత్వములకంటె శ్రీకృష్ణభక్తిదాస్యములు దుర్లభములు. అనేకజన్మపుణ్యాకర్మపరిపాకమున భారతవర్షమున జన్మించు భాగ్యముకల్గును. అందును హరిభక్తి యొదవెనా వానిజన్మము సార్థకము. కర్మఫలము లభించినట్లే. పాపము లాతని గనుఁగొనఁజాలవు. భగవత్సమర్పణముగాఁ గర్మ మొనరించుభాగ్యము దొరకుట కడిఁది. శ్రీకృష్ణుఁ డానందించు కర్మమొనరించు మానవునకు నీడుచేయఁజాలువాఁడును గలఁడా? సంప్రీతితో విధిపూర్వకముగా సంకల్పముచేసి సాధించు కర్మమే మంగళము. ధన్యము పరిణామసుఖావహము. వ్రతము తపము సత్యము భక్తియుఁ బూజనము తదుద్దేశముగా నుపవసించుటయు నను నివియన్నియు భగవద్దాస్య మొసంగియే తీఱును. సకలపృథ్వీదానము, భూప్రదక్షిణము, సమస్తతీర్థస్నానము, సమస్తవ్రతాచరణము, తపోనియతియు, సకల యజ్ఞములుచేయుట, సర్వదానములుచేయుట, సకల వేదవేదాంగపఠనము, తత్పాఠనము, అభయదానము, జ్ఞానదానము, అతిథిపూజయు, శరణాగతరక్షణము, సర్వదేవార్చనము, తద్వందనజపములు, విప్రవర్య దేవతల భుజింపఁ జేయుటయు, మంత్రపురశ్చరణము,

---

* ఇది శ్రీకృష్ణజన్మఖండను డెంబదియేడవ యధ్యాయమునుండి సంగృహీతము.

గురుశుశ్రూషయుఁ బితృభక్తినిరతి, తత్పోషణము నను నివి యన్నియు శ్రీకృష్ణదాస్యమునఁ బదాఱవభాగమునకుం బోలవు. కావున నోయుద్ధవా! ప్రయత్నపూర్వకముగా శ్రీకృష్ణుని బరాత్పరుని భజింపుము. కర్మరతులకును, గర్మములకును సాక్షిగ నుండువాఁడు, నిర్లిప్తుఁడు, జ్యోతిస్స్వరూపుఁడు, కారణకారణుఁడు, సర్వస్వరూపుఁడు, సర్వసంపత్ప్రదుఁడు, భక్తిదాస్యప్రదుఁడు, సర్వస్వసంపదల నిచ్చువాఁడు. బంధుభావము నాతనియెడ విడనాడుము. అశుభప్రదమగు మాత్సర్యమును విడువుము. పరమానందుని నందనందనుని సేవింపుము. వేదమునఁ గౌథుమిశాఖయందు భగవన్నామ సహస్రములు చెప్పఁబడినది. నందనందననామసహస్రము పరమదుర్లభము.''

ఆభాషణములు విని పరమవిస్మయమునొంది యుద్ధవుఁడు సంపూర్ణజ్ఞానమునొంది పరిపూర్ణుఁ డయ్యెను. వస్త్రమును గంఠమునకుఁ జుట్టుకొనుచు దండమువలె నమస్కరించెను. శిరస్సు రాధాపాదారవిందములు సోఁకునట్లుండెను. పులకాంచితసర్వాంగుఁ డయ్యెను. బాష్పము లానందమునఁ గనుల నోలలాడుచుండెను. ఆరాధిక నెడఁబాసి పోవలసివచ్చెఁగదా యని దుఃఖమునను బ్రీతిని గట్టిగా శోకించెను. రాధయు నాతని నెడఁబాయుటకు దీనయై దుఃఖించెను. గోపికలెల్ల నుచ్చైస్స్వనమున విలపించిరి. ఉద్ధవునికంఠమును బట్టుకొని బలవంతముగ నిలిపిరి. అంతలో నాతఁడు మూర్ఛమునింగెను. చేతనమే లేనట్లుండెను. రాధిక యాతనిస్థితిం గాంచి కరుణచే నాతనికి శీతలోపచారములొనరించి లేవఁజేసెను. ఆమె చల్లిన శీతలజలముల నాయుద్ధవుఁడు నేడదేటి చూడ శుభాశిషము లొసంగి గారవించెను.

"వత్సా! జీవింపు మా"యని యాశిషముల నాతనిఖేదము వాపెను. అంత నుద్ధవుఁడా రాధికం గాంచి యాసభామధ్యభాగ మందుఁ దనవలె దుఃఖించు గోపికలకు మనశ్శాంతి కలుగునట్టు లిట్లు పల్కెను.

"ధన్యము యశస్కరము నగు భూఖండకాండమునందు జంబూద్వీప ముత్తమోత్తమము. అందు జన్మము లభించుట దుర్లభము. ఆభారతవర్షమున నేకోరికలఁ గోరి యేకర్మముల నాచరించినను ఫలము గలుగును. ఆభారతవర్షమున బృందావన ముత్తమోత్తమము. ఏలయన నీ బృందావనము రాధికా పాదారవిందరజస్స్పర్శమున నతిపవిత్ర మైనది. దీనియందు నివాసమును దేవతలు కోరుదురు. ఈ భూమితలము ధన్యము. మాన్యము. త్రిలోక దుర్లభము. సర్వవిశ్వసంపూజ్యము. శ్రీరాధాపరమపావనపాదాబ్జముల దర్శనము పూర్వపుణ్య ఫలము. మున్ను అఱువదివేలవత్సరములు పుష్కరతీర్థతటమున నతినిష్ఠ తనర విధాత వేదోక్తప్రకారము భక్తిపూర్వకముగాఁ దపంబొనరించెను. ఆతపఃఫలముగా గోలోకమున శ్రీరాధాకృష్ణ దర్శనమును గోరెను. కాని యది ఫలింపలేదు. స్వప్నమునను రాధామాధవ దర్శనము కాలేదు. దానికి ఖేదపడుచుండు నంత నాకాశవాణి సత్యమై యత్యద్భుతముగా వినఁబడియెను. పరమేష్ఠీ! వారాహకల్పమునందుఁ బరమపవిత్రమగు భారత వర్షమునందు నత్యుత్తమమగు బృందావనమునందు మహారమ్య మగు రాసోత్సవసమయమున నందును రాసమండలమునందు సర్వదేవతా మధ్యభాగమునందు రాధామాధవుల దర్శించు భాగ్యము నీకుఁ గలుగఁగలదు. సంశయము లేదు. చింతింప

కుము. అని వినఁబడఁగనే యానలువ తపోనియతి మాని తన పదమున కరిగెను. ఆకాశవాణి వినఁబడినట్లే పరిపూర్ణరూపమున నలరారు గోపాలబాలుఁడు రాధాదేవీసహితుఁడై కనఁబడియెను. కాఁబట్టి యట్టి బృందావనమున నివసించు పరమసౌభాగ్యము మీకుంగల్గెను. గోపికలు గోపకులు పవిత్రజన్మము గలవారనుట నిస్సంశయము. బ్రహ్మాదులకే లభింపని యీ రాధాపాదపద్మద్వంద్వము ననవరతము దర్శించుచున్నవారు కదా! మహానుభావులు నిత్యము శ్రీరాధాంబికను ధ్యానింతురు. యోగీంద్రులు మునీంద్రులు సిద్ధేంద్రులు విష్ణుభక్తులును సాధ్వీశిరోమణియై పుణ్యస్వరూపిణియై తీర్థరూపిణియై బ్రహ్మాదిదుర్లభయై సదా శుద్ధచిత్తయై తనరు రాధికనుదర్శింతురు. అట్టి రాధిక మీకు సులభముగా దర్శనమిచ్చుచున్నది. బ్రహ్మాదులకు దుర్లభము. ఈ రాధాపాదపద్మముల కతిప్రీతితో సర్వేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు లాక్షారసమలందును. శ్రీకృష్ణమూర్తి శతశృంగపర్వతశిఖరమునఁ దానే రాధాపూజకుఁ దగు కల్పమొనరించి స్తోత్రరాజమును నిర్మించెను. పారిజాతప్రసూనాంజలి సమర్పించెను. దూర్వాక్షతలం గూర్చి పూజించెను. రాధాదేవి త్రింశత్సహస్రకోటి గోపికల కధీశ్వరి. ఈ రాధికను గోలోకమున నసంఖ్యలగు చెలికత్తియలు సేవించుచుందురు. శ్రీకృష్ణప్రాణాధికురాలగు నీరాధ నెవరు ద్వేషబుద్ధిమాని నిందింతురో పరిహసింతురో వారికి బ్రహ్మహత్యాశతపాపము లభించును. ఆపాపమున రౌరవకుంభీపాక నరకములందుఁ బడిపొరలుదురు." అనిపలికి పయనముచేయఁబూని తనను వదలి పోవఁజాలక భక్తి

భారమునఁ గన్నీరు విడుచుచున్న యుద్ధవునింగాంచి రాధాంబ యిట్లనియె.

"వత్సా! చింతిల్లకుము. మధురానగరమున కరుగుము. శ్రీమాధవునితో నిక్కడివార్తల నన్నింటి నెఱిఁగింపుము. గోవిందు దర్శించుభాగ్యము నాకుఁగల్గఁజేయుము. దానికై ప్రయత్న మొనరింపుము. నాజన్మము నిష్ఫలము. కాలము గడచుచున్నది. మిథ్యాదురాశలు పొదలుచున్నవి. ఆశయే పరమ దుఃఖములఁ గల్పించును. నైరాశ్యమే పరమసుఖము." అనిపలికి స్మృతికిందగిలిన శ్రీకృష్ణరూపమును దిలకించి తద్వియోగమును భరింపఁజాలక రోదనము చేసెను. ఉద్ధవుఁ డమ్మానినిం జూచి తానును భృశదుఃఖితుఁడై యనుమతింగోరి యశోదామందిరంబున కరిగెను. ఉద్ధవుఁ డాచోటువాసి పోవఁగా రాధిక మూర్ఛిల్లెను. చేతనను బరిత్యజించి నట్లుండెను. ధ్యానతత్పరయయ్యెను. కమలదళముల శయ్యయందును జలమునందును, ప్రవాళశయ్యయందును రాధికఁ బరుండఁజేసి చేడియలు శీతలోపచారము లొనరించిరి. కన్నీరుగార్చుచు నుండిరి. ఆమె తనుస్పర్శచేత శయ్య భస్మమగుచుండెను. మరల నట్టిపానుపే యమర్పఁబడుచుండెను. చందనము నలందుచుండిరి. ఆచందన పంకము ధూళి యగుచుండెను. ఆమహావిరహజ్వరార్తినిగాంచి యాచేడియలు విస్మయం పడుచుండిరి. ఉద్ధవు నెడఁబాసిన క్షణ మొక్కయుగముగా రాధికమదికిఁ దోఁచెను. ఓహో యుద్ధవా! త్వరగా మధురాపురికరిగి హరిని బంపుమాయని వారనిరి. నా ప్రాణేశ్వరుఁ డ్వరగాఁబనుపుమా యని రాధ మదిలోఁ బలుకుచుండెను. పలవరించుచు నామాటనే రాధిక పలుకుచుంట

సఖీజనము వినియెను. ఆమె యునికిం గాంచి వారెల్ల నార్తనాదము లొనరించిరి. రాధను కౌఁగిలించుకొనిరి. స్మృతిని గల్గించిరి. పెక్కుభంగుల నూఱడించిరి. శ్రీహరి రాకతప్పఁడని నమ్మఁబలికిరి. ఉద్ధవునిమాట శ్రీహరి జవదాఁటఁడని హెచ్చరించిరి. కరుణాశరధికదా శ్రీహరి. నీవేల పరితపింతువని యామెకు బోధించిరి.

ఉద్ధవుఁడు రాధామందిరమునుండి వెడలిపోవునపుడు గోపికలు శ్రీహరికిం జెప్పుమని యతనిఁ బ్రార్థించినట్లు మహాకవి వ్రాసిన పద్యముల నిట వ్రాయుచున్నాఁడను. శ్రీభాగవతమున నీభాగమున కాధారము గానరాదుగాని పోతనగారి భక్త్యతిశయమే యాధారమని మనము తలంపవచ్చును.

"సీ. తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీఁద
నేలపై మేనులు నిలువవనుము
నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబు లొక్కట తలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగినపిమ్మటఁ
జిత్తంబు లిక్కడఁ జిక్కవనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ
బ్రాణంబు లుండక పాయు ననుము
తే. ప్రాణములుపోక మఱి వచ్చి ప్రాణవిభుఁడు
ప్రాణిరక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్లఁ
జేరి దూఱంగ మఱి యేమి చేయువాఁడు
వేగ విన్నప మొనరింపవే మహాత్మ !

సీ. విభుఁడు మా వ్రేపల్లెవీథుల నేతేరఁ
జూతుమే యొకనాఁడు చూడ్కు లలరఁ
బ్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప
విందుమే యొకనాఁడు వీనులలరఁ
దనువులు పులకింప దయితుండు డాసినఁ
గలుగునే యొకనాఁడు కౌఁగిలింపఁ
బ్రాణేశ మమ్మేల వాసితివని దూఱి
దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ
తే. వచ్చునే హరి మేమున్నవనముఁ జూడఁ
దలఁచునే భర్త మాతోడి తగులు తెఱఁగుఁ
దెచ్చునే విధి మన్నాథుఁ దిట్టుపడక
యెఱుఁగఁ బలుకు మహాత్మ నీకెఱుఁగవచ్చు."

ఈపద్యము లెంత హృద్యములో నేఁజెప్పకముందే మీ రెఱింగి యుందురని నమ్మెదను. గోపికభావము దీనిం బట్టిచూడఁగా విరహాతురముగాక భక్త్యతిశయమున నలరారుచున్నదని స్పష్టమగును. కౌఁగిలించుట కామమునఁ గాదని భక్తులజీవితమే తెల్పును. పండరిపురమున శ్రీపాండురంగని నేటికిని భక్తిభరమునఁ దరుణులు కౌఁగిలించి దుఃఖింతురు. అది కామముచేతనే యనుటకంటెఁ బాపము వేఱుగనుండునా? "ప్రాణరక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్ల" అను పదము గోపికలభావమును దెల్పక మానునా? ప్రాణరక్షకుఁ డెవఁడు! పరాత్పరుఁడుగాక వేఱొక్కఁ డనవచ్చునా? మొండిపట్టుదలతో నన్నేమోకాని యితరభావముతో నెవ్వరనరని నావిశ్వాసము. ఇఁక నవ్వలివృత్తాంతము నవధరింపుఁడు.

## * ఉద్ధవుఁడు మధురానగరమున కరుగుట.

ఉద్ధవుఁ డా రాధామందిరంబు నెట్లో వదలి యశోదా మందిరమున కరిగి యాజననిని దర్శించి తనప్రయాణవృత్తాంత మంతయుం దెలిపి తలసోఁకఁ దత్పాదముల కభివందనమాచ

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండము తొంబదెనిమిదవయధ్యాయము నుండి సంగృహీతము. ఇందు శ్రీకృష్ణుఁడు స్వప్నమున నందాదులకుఁ దోఁచి రాధాదికాంతలకు జ్ఞానోపదేశమొనరించి మధుర కరిగెదనని వారికిం దెల్పి వారి నూఱడిల్లఁ జేసి వచ్చినట్లు కనఁబడియెడిని. ఈవిషయమే గర్గసంహిత యందు మధురాఖండమునఁ బందొమ్మిదివయధ్యాయము మొద లిఱువదినాల్గవ యధ్యాయమువఱకు నాఱధ్యాయములయందు శ్రీకృష్ణుఁడు మధురానగరము నుండి గోకులమున కరిగి యశోదాదుల నూఱడించి రాధాదేవింయింట కొలఁది దినములు నివసించి మహాసంతోషము నామెకుం గల్పించి రాసమండలమునఁ గ్రీడ సల్పి యచ్చటివారిమనముల కానందమును గల్పించి తదనుజ్ఞఁ బడసి మధురకు వచ్చినట్లు వర్ణింపఁబడినది. రాధాచరిత్రమును వదల వలనుపడని నామనము కగను దీనిని వదలఁజాలదు కాన నీ రెండువిధములను వ్రాయఁ బ్రయత్నించెడిని. ఇం దనేకవిషయము లెఱుఁగవలసి యుండును. సావధానులరై యాలకింపుఁడు. ఈవిషయ మింకఁ జిరకాలమునకుఁగాని మరలఁ జదువ వలనుపడదు. శ్రీకృష్ణనిర్యాణమునకు నించుకముందే కనఁబడును. మహాభక్తు లెందఱో రాధా రాసమండలవిహారము నుపనిషదర్థతుల్యముగా గ్రహించిరి. అట్టిమహాదేవీపరమచరిత్రము శాపవశమున శతవత్సరములు చదువ నవకాశ మీయదు. అంతకాల మూరకుండుట శక్యమా! కాఁబట్టి యిచ్చట మరల వ్రాయ నావిలేఖిని యాశించుచున్నది. మన్నింతురు గాక. పరమభక్తిభావమును వదలక దీనిని మీరు పఠింపవలయునని ప్రార్థించుటకంటె విశేషించి విన్నవింప నశక్తుఁడను.

రించి యామె యెట్టకేలకు పోయిరమ్ము. మా కృష్ణునిం బంపు మని యనుమతినిడఁగాఁ దానిం దలఁదాల్చి రథమెక్కి ఖర్జూర కాననము వామభాగమున నుండునట్లు రథముసాగఁగా యమునాతరంగిణీతటమునకుం బోయెను. ఆమహానదీనిర్మలజలంబుల స్నానమొనరించి యందా దినముండి భుజించి రాత్రి సుఖనిద్ర నేసి మఱునాఁ డరుణోదయమున మరల స్నానాదివిధుల నాపావనశైవలినియందే జరపి ప్రయాణము సాగించెను. ఆమార్గమాతనిమది కచ్చెరువు గూర్చుచుండెను. గోపికాలాపము లాతని కర్ణకుహరములందుఁ బ్రతిధ్వనించుచునే యుండెను. రాధాదేవికిఁ గలప్రీతి యచ్చెరువును గూర్చుచుండెను. బృందావనమే యాతనిదృష్టికి గోలోకము క్షేత్రస్థానముగాఁ గనఁబడుచుండెను. దారిఁ బోవునపుడంతయు నాతనిచూపులకు బృందావనముగనే దోఁచెను. వేయేల? "సర్వం బృందావనం జగత్" అను భావముతప్ప వేఱేదియు నాతనికిఁ దోఁపలేదు.

కతిపయప్రయాణములకు నుద్ధవుఁడు మధురానగరమును జేరెను. భగవంతుఁ డాతనిరాక నెఱింగెను. నగరోపకంఠమున నొక్కతావున వటవిటపియుండ దానిమూలమునఁ గూరుచుండెను. అది యేకాంతస్థలము. అందుఁగూరుచుండి తనకై శ్రమంపడు రాధాదుల కుశలవార్తలడుగుట మేలనియు, నుద్ధవుఁడు దాఁపక చెప్పుననియు నామహానుభావుఁడు భావించియే యొరు లెఱుంగకయుండ నందు వేంచేసియుండెను. శ్రీకృష్ణుఁ డింట లేకయుండ నెవ్వరేని వెదుకరా లేదా యనిమాత్రము ప్రశ్నింపరాదు. గృహమునను వనమున నుండఁగలమహాత్ముఁడు హరి యనుమాట మఱువకుఁడు. ఇట్టిప్రశ్నముల కవకాశము దొర

కదు. మానవమాత్రునిగా శ్రీగోవిందుని భావించువారి కీకథయే రుచింపదనుట నిక్కము. భగవంతుఁడే శ్రీకృష్ణరూపమునఁ బ్రపంచోద్ధరణార్థ మవతరించెనన్న వారికే యిది తృప్తి నొసంగును గదా. కావున నిట్టివారికొఱకే యీప్రయత్నముకాన నట్టివారు నిట్టితావుల నిట్టిప్రశ్నములువేయ మదిని బురికొల్పకయుందురని నా ప్రార్థనము.

వటమూలముననున్న శ్రీకృష్ణు నుద్ధవుఁడు చూచెను. భక్తిభావమున వేగంబ రథావతరణము చేసెను. హరిచెంత కరుగుదెంచెను. ఉద్ధవుని యాతురమును హరియెఱింగి ముందే తనచిత్తవృత్తి నాతనికిం దెలిపినఁ జాలమంచిదగునని తలంచి మోముదమ్మి వికసింపఁ జిఱునవ్వు పెదవులఁ జిందులాడఁగా, విలపించుచు శోకాగ్నిదగ్ధహృదయుఁడై సాశ్రుపూర్ణనయనుఁడై భయాక్రాంతుఁడై యున్న యుద్ధవునిం గాంచి యిట్లు పలికెను. "ఉద్ధవా! కల్యాణమానసా! రమ్ము. రమ్ము. రాధిక జీవించియే యున్నదికదా. రాధిక బ్రదికియే యున్నది కదా. గోపికలెల్లఁ గుశలముగ నున్నవారే కాదా. విరహజ్వరమున బడలియు నింతదనుక జీవించియున్నవారే కదా. ఉద్ధవా! గోపశిశువులకుఁ గుశలంబ కదా. గోవత్సము లాడుకొనుచు వ్యాధులు లేకున్నవికదా. పుత్త్రవిరహాతురయై మాతల్లి యశోద యెట్లున్నది! బంధూ! యథార్థము వచింపుము. మాతల్లి నీతో నేమి చెప్పినది? జననితో నీ వేమిచెప్పితివి? అందుల కామెమ ప్రతిభాషణము లేవి తెల్పెను? యమునాతీరమందలి బృందావనము దర్శించితివా? అది పరమపావనము సుమీ. నిర్జనోపవనసంవృత రాసమండల మందుఁగలదు. దాని దర్శించితివా? అందు మనో

హారకుంజకుటీరపటలము గలదు. మఱియు నతిమనోజ్ఞసరోవర నికురుంబము గలదు. వానిం గాంచితివా? వికసించి భ్రమర సముదయసంకులమై పుష్పోద్యాన మందే కలదు. కనుఁగొంటివా? ఊడలతోఁ జూడఁదగి మహత్తరాకృతి వెలసియున్న పరమపావనభాండీరవటమహీరుహ మందే యున్నదే. దానిం జూచుభాగ్యము నీకుం గల్గెనా? గోవుల కునికిపట్టులై చూడం జూడఁ గడునింపుఁ బెంచుచు నున్న గోష్ఠములు, నందు ధేనువులును నేత్రగోచరము లయ్యెనా? అందు సుందరమందిరవరమున రాధాదేవి గలదు. బ్రదికియున్నదియా. నీవా నా ప్రాణప్రియను సందర్శింపఁ జాలితివా? ఆమె నాతో నేమి చెప్పుమని యెను? ప్రియబంధూ! ఉద్ధవా! ఆవిషయమెల్ల యథార్థముగా వివరింపుము. నామనం బాతురపడుచున్నది. గోపిక లేమిఁ పల్కిరి? గోపకుమారులు నన్నుంగూర్చి యేమి సంభాషించిరి? వృద్ధగోపకులు కుశలముగ నున్నవారుకదా. వారెల్ల నాతండ్రికి మిత్రులు. వారు నాతో నేమి చెప్పుమనిరి? బలదేవునితల్లి సాధ్వీమణి రోహిణి యేమేని చెప్పుమనియెనా? బంధువులకు బంధువులు వారిభార్యలును నాకుం జెప్పుమన్న మాట లేవి? నీ వందేమి భుజించితివి? మాతల్లిగాని రాధికకాని నీ కేమిచ్చిరి? వారు నీతో నెట్లు మాటలాడిరి? మీసల్లాపము లెట్లు చెల్లెను? గోపగోపికానికరముయొక్కయు, వారిశిశువులయు, నాజననియు, రాధికయు సంభాషణము లెట్టివి? మాతల్లి నన్ను స్మరించునా? రోహిణియు నన్నుఁ దలంచునా? రాధాదేవి నన్ను మదిమఱువక యున్నదియా? మత్ప్రేమవిరహాకులయై యున్నదియా? గోపికలు నన్ను స్మృతితప్పక యనుకొనుచుందురా? గోపబాల

కులు నన్నుం గూర్చి మాటలాడుకొందురా? నన్ను వదలి భాండీ రవటవిటపిమూలమున బాలకు లాడుకొందురా! మాకెల్ల నాడుకొనునప్పుడు బ్రాహ్మణపత్ను లాదరించి యాచెట్టుక్రిందనే యన్నము పెట్టిరి; ఆయన్న మమృతోపమము సుమీ. అందే నాతోడిబాలకు లోకకప్రమదామణిం గాంచిరి. ఉద్ధవా! ఇంద్రయాగస్థలమును జూచితివా. గోవర్ధనాద్రి నీకంటంబడి నదా. దానిచెంతనే బ్రహ్మచే గోవు లపహరింపఁబడియెను? ఆయుత్తమస్థలము నీకనులకు విందుఁ గూర్చెనా?

అని యిట్లు శ్రీకృష్ణుఁడు శోకపూర్వకముగను మధురా ఊర సమన్వితముగను బల్కిన యాసుధారసము నతిశయించు వాగ్వితతి విని యుద్ధవుఁడు సనాతనుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మ మును జూచుచు నిట్లు విన్నవించెను.

## ఉద్ధవుఁడు గోకులవార్తను హరికిం దెల్పుట.

"జగన్నాథా! త్వత్ప్రతిపాదితస్థలరాజి యథేచ్ఛముగా దర్శింపఁ గల్గితిని. నాజీవనము సఫలము. నాజన్మము సఫలము. భారతవర్షసారతమంబనం బ్రఖ్యాతంబగు పావనబృందావనము గాంచగల్గితిని. ఆబృందావనసారభూత మై మనోహరమునగు రాసమండలమును దర్శించుభాగ్యము నా కలవడియెను. తత్సా రభూతలగు గోలోకవాసిగోపికలు నాకు దర్శనమిచ్చిరి. వీనిక న్నింటికి సారభూతయగు రాసేశ్వరి రాధాదేవి నాకు దర్శన మిచ్చెను. ఆజనని నిర్జనమగు కదళీవనమునడుమ మనస్సునకానం దమును బెంచుతావున లలితచందనపంకసమ్మిళితకోమల తామ రసదళకల్పితశయ్యయందు నతివిషణ్ణయై రత్నభూషణ భూషిత యేగాక మిగుల మలినమగు నంగమొప్పఁ జిక్కిపోయి తెల్లని

వస్త్రము గప్పుకొని శ్వేతచామరము లూని సఖీజనము సేవిం పఁగా నిరాహారయై కృశోదరియై క్షణకాలము నిట్టూర్పులు పుచ్చుచు క్షణకాలము విలపించుచు క్షణకాలము విహ్వాలిం చుచు విరహాజ్వరము సదా తన్ను నేఁచుచుండఁగాఁ బరుం డియుండెను. దివారాత్రభేదమే యెఱుంగదు. జలస్థలభేద మూహింపదు. నరులకుఁ బశువులకుఁ గలభేద మరయఁజాలదు. ఆమెకు బంధువు లెవ్వరు? బాహ్యజ్ఞాన మారాధికకు లేదు. దాస భవద్ధ్యానమునే స్మరించుచుండును. త్రిలోకములయం దా జననికీర్తి వ్యాపించినది. అట్టియామెకు మృత్యు వెట్లు కల్గును? జ్ఞానహీనులగు దస్యువులుకూడ స్త్రీహత్యను వాంఛిం పరు. తండ్రీ! ఇఁక నాలస్యముచేయక గోకులమున కరుగుము. జగన్నాయకా! తొలుదొలుతఁ గదళీవనమునకే పొమ్ము. సకల లోకముల కారాధ్యాంబ బహిఃప్రాణ మనఁదగినది. భవత్ప రాయణయై సదా స్మరించుచున్నది. ప్రభూ! మిగులభక్తిగల యామెనువదలుట వ్యర్థగల్గజేయుట న్యాయముకాదు. రాధను మించిన భక్తికలవా రుండరు. ఉండబో కుండలేదు. ముందుండఁ బోరు. మన్మథుఁడు శంకరభీతి నిన్నాశ్రయించెను. భవద్విధ ప్రాణనాథునిబడసియు రాధిక కామదగ్ధ యగుచున్నది. కావున నామెను రక్షించుటొప్పు. ఆఘోరకష్టమును నిలుపఁగలవాఁడ వీవెకదా. వసంతుఁడు తాపము కల్గించుచుండ శీతకరుఁడు కిర ణములద్వారా దహించుచున్నవాఁడు. మలయమారుత మా మెకు మహార్తిని గల్గించెడిని. ఇపు డనాథవలె సర్వవిధపీడల ననుభవించుచున్నది. తప్తకాంచనవర్ణాభమగు నామెదేహ మింతరుణమునఁ గాటుకవంటి ఛాయగలిగి యున్నది. కేశ

ములు సువర్ణవర్ణము గలిగియున్నవి. వాసోవేషవిభూషణముల నామె వర్జించినది. సకలలోకనిర్మాత యగువిధాత నీకు భక్తుఁడు. యోగీంద్రప్రవరుఁ డగుశంకరుఁడు నీభక్తుఁడు. సనత్కుమారుఁడు నీభక్తుఁడు. జ్ఞానిప్రవరుఁ డగుగణేశుఁడు,మఱియు మహా మునులు భూతలమున నెందఱో భక్తులు నీకుం గలరు. కాని రాధవంటిభక్తులు లేరు. రాధిక యెట్లు ధ్యానించునో లక్ష్మియు నట్లు ధ్యానింపఁజాలదు. ఆమెయెదుట శ్రీహరి రాఁగలఁడని సమయముచేసితిని కావున శీఘ్రంబ దయచేయుము. నామాటను సార్థకముచేయుము."

అని యుద్ధవుఁడు పలుక మాధవుఁడు నవ్వి వేదోక్తమగు సత్యసువ్రతము నిట్లు పల్కెను. "ఉద్ధవా! చక్కఁగా నాలకింపుము.*స్త్రీలయందును, నర్మవివాహములందును, వృత్త్యర్థమందును, ప్రాణసంకటమునందును, గోవిషయమందును, బ్రాహ్మణకార్యమందును అనృతము నిందింపఁదగదు. అనఁగా నన్ృతము దోషదాయకము గాదు. స్వీకారవిహీనముచే నీవెక్కడ? నరక మెక్కడ? నాభక్తుఁడు గోలోకమున కేగును. నరకమును జూడనైనఁ జూడఁడు. ఐనను నీయంగీకారమును సఫలత నొందఁజేసెదను. స్వప్నమున వారికి దర్శనమిచ్చెదను. గోపికలకు మాతకుంగూడఁ గనఁబడియెద." అని పలుకఁగా నుద్ధవుఁడు మహాప్రసాదంబని సెలవంది తనయింటికిం బోయెను. శ్రీకృష్ణుఁడు విరహాకులమగు గోకులమునకుం బోయెను.

---

* స్త్రీషు నర్మవివాహేషు వృత్త్యర్థే ప్రాణసంకటే, గవామర్థే బ్రాహ్మణార్థే నానృతం స్యాజ్జుగుప్సితమ్—అని మూలము.

## గోకులముననుండువారికి హరి స్వప్నమున దర్శనమిచ్చుట.

స్వప్నమున నెల్లర కొక్కపర్యాయమే దర్శనమిచ్చెను. రాధ నూఱడించెను. సుదుర్లభ మగుజ్ఞానము నుపదేశించెను. క్రీడచే నా రాధికను సంతోషపఱచెను. యథోచితముగా గోపికల నానందపరవశలను జేసెను. యశోదనూఱడించి స్తన్యము ద్రావెను. గోపకులను గోపశిశువులను బోధించి విజ్ఞానవంతుల నుగా నొనరించెను. వారికిట్లు జ్ఞానమునుపదేశించి మరల వారి కట్టియార్తి కలుగకయుండఁజేసి మధురానగరమున కరిగెను. తెల్లవాఱె వారెల్ల రాత్రివృత్తాంతమును దలంచుకొనుచు శ్రీకృష్ణునిలీలల కానందపరవశ లగుచుఁ దద్దర్శనము సదా తమ కగుచున్నట్లె తదుపదేశమున నూహించి పూర్వమువలె దుఃఖింపక సర్వాంతర్యామి లేనిచోటును గలదాయని నెమ్మదినుండిరి. శ్రీహరియు వారినూరార్చి తనపని సఫలమాయెనని యూహించుచుఁ దా నవతరించినదెందులకో యాకృత్యముల నొనరింపఁ దలంపుఁగొనియెను.

మహామతులారా! ఈకథను బఠించితిరి. దీనియందు విశేష మేమేని కలదా యనుప్రశ్నమునకు సమాధానము వ్రాయక తప్పదుకదా. ఇందొక్క గొప్పవిషయమున్న అదియే యిద్దానినుండి గ్రహింపఁదగువిషయము. దాని నాలకింపుఁడు.

ఉద్ధవుఁడు పరమభక్తుఁడు. ఏకాంతసేవను గోరుచుండు వాఁడు. వెడలునప్పుడు రాధ యనన్యగతిక కావున మా శ్రీకృష్ణునింబంపుమీయని యూరకుండెను. యశోదామందిరమున కరిగి యామెకు నచ్చఁజెప్పి సెలవంది యమునాతీరమునకుం బోయెను. నదియందు స్నానముచేసి భగవంతుని ధ్యానించెను.

మధురాపురి కరిగెను. మధురానగరమున నుద్ధవుఁ డుపదేంచుట శ్రీహరి తనమది నెఱింగెను. కాననే పురమునకించుకదూరమున నొకవటమూలతలమునఁ గూరుచుండియుండెను. అది నగరము నకుఁ బోవుమార్గము. ఒంటరిగాఁ గూరుచున్న కృష్ణు నుద్ధవుఁడు, గాంచి నమస్కరించి నిలువఁబడియెను. హరి యుద్ధవురాక నెఱిఁగి యందుండ నేల? అనఁగా నుద్ధవుఁడు గోకులమున రాధా దికాంతల యార్తవాక్కుల నాలకించి మృదుమనస్కుఁడయ్యెనని హరి యెఱుంగఁడా? సర్వజ్ఞుఁడుకదా శ్రీహరి. వారియందుఁ దనకుఁగల ప్రీతిని దెలుపుటకై యుద్ధవునిమది స్వస్థతనొందింపఁ గలందులకై యేకాంతమున దారిలో నుండెను. శ్రీకృష్ణుని కుశలప్రశ్నములఁ బరికింపుఁడు. తొలుదొలుత తనకనపాయిని యగు రాధికను బ్రశ్నించెను. రాధ యందెట్లు పరితపించుచుం డెనో అట్లు తానుగూడఁ బరితపించుచున్న ట్లుద్ధవుఁ డెఱుంగ వలయుననియే యిట్లు ప్రశ్నించెను. లేకయున్న నుద్ధవునిరాక తనమది నెఱింగిన హరి రాధ జీవించియున్నదో లేదో యెఱుం గకయుండునా? గోపులు గోవత్సములను బ్రశ్నించెను గదా. ఏల? భగవద్ధామపము పరోపకారమే. అట్లు పరోపకారమొన ర్చునవన్నియుఁ దనకుం బ్రియము లైనట్లు తెలుపుటకే యని యెఱుంగునది. గోపూజ భగవత్పూజయే యని లోకమెఱుంగ వలయుననియు నామహాత్ముని భావము. సత్యముగుఱించిన మఱొ క్కవిషయము కలదు. అనృతము కొన్నిచోట్ల దూష్యము కాదని భగవంతుఁ డనియెఁగదా. ఆతావులు తఱచుగాఁ బ్ర పంచమున సర్వకార్యములను దెలుపునవియే. దీనింబట్టిచూడ నెపుడవసరమో అపుడెల్ల ననృతమాడవచ్చునని యర్థమగు.

సత్యస్వరూపుఁడగు భగవంతునిభావ మదియానా? కాదు కదా. మతేమనఁగా, స్త్రీలయందు వృథాపవాదములు కల్పించి దూషించునపు డా స్త్రీలమర్యాద రక్షించుపొంటె సజ్జనుఁ డిది యసత్యము, వృథాకల్పితము అని తా నెలుఁగఁజెప్పిన వారి కది రక్షణ మగునుగాన నపు డసత్యదోషము లేదని యెఱుంగఁ దగు. నర్మోక్తు లనఁగాఁ జమత్కారపుఁబలుకులు. అవి పరస్పరానురాగమును వెలిబుచ్చునవి. వానినే స్త్రీపురుషుల సరసాలాపము లందురు. అందేమాత్రము దోషము లేదని భావము. అనఁగా నామాట లెవ్వారికిని బాధగల్గించునవి కావు. కనుక దోషమావహిల్లదని యెఱుంగునది. వివాహముల యందు నసత్యదోషము లేదనఁగా భావమేమి? వధూవరులకుఁ గల దోషములు దాఁచిపెట్టి యసత్యములైనఁ బలికి వారి జత గూర్చిన నసత్యము లేదని కొందఱర్థము చెప్పుదురు. అట్లైనచో

"శ్లో. యస్తు దోషవతీం కన్యామనాఖ్యాయోపదాపయేత్,
తస్య తద్వితథం కుర్యాత్కన్యాదాతు ర్దురాత్మనః."

మనుస్మృతి ౯ అధ్యా. ౭౪ శ్లో.

అను నీప్రమాణము వ్యర్థమగును. కావున వివాహోద్యత్సవ సమయములయందు వేళాకోళములు చేసికొనుతఱి ననృత దోషము లేదనియే గ్రహింపవలయును. వృత్త్యర్థమై యసత్యములాడినఁ బాపము లేదనఁగా సంసారవృత్తి యెట్లని ప్రశ్నించినపు డున్నదున్నట్లు చెప్పక దాఁచినను బాపము లేదని యూహింపం దగును. ప్రాణసంకటముతఱిఁ దద్రక్షణార్థమై యనృతము పల్కినను బాపమంటదు. గోబ్రాహ్మణుల కొఱకనఁగాఁ బ్రాణాపాయము నిర్నిమిత్తముగాఁ గలుగుచున్నపుడనియే.

యంగీకరింపవలయును. ఈపద్ధతు లన్నియు సామాన్యులకని భగవదుపదేశము. హరిశ్చంద్రాదులవంటివారికిం గాదనునది సిద్ధాంతమే కదా.

మఱియు స్వప్నమున శ్రీహరి గోకులమున కరుగుటయే సర్వగతత్వమును సర్వజ్ఞత్వమును గనఁబఱచును. స్వప్నమునఁ దోఁచి వారి కాకాలము పగటికాలముగనే తోఁపఁజేసి వారికింగల్గిన యజ్ఞానమును దొలఁగించి మానసికసంశయములఁ బాఱఁదోలి తన మధురానివాసమున వారికిఁ గల్గుకష్టములఁ బోఁద్రోలుటయే భగవచ్ఛక్తిని దేటపఱచును. మధురానగరముననే యుండి గోకులమున నెల్లరకొక్కపర్యాయమే సాక్షాత్కరించుట యొకటి చాలదా. పెక్కుకార్యము లేల? అన్ని కథలను నమ్మి యీకథను నమ్మమన్న వారిమాట యిట నేటికి? కావున శ్రీహరి కృత్యవితతియందు నేదియైనను సర్వేశ్వరుఁడని స్పష్టపఱచును కావున భక్తు లా గాథలయం దేదో లోపముగలదని నెమకి పాప మొడిగట్టుకొనక భగవత్కృతులను బాగుగా నెఱింగి వానిం బఠించి తదర్థమును గ్రహించి వానినించుకయే ననుసరించి ప్రవర్తించి తరణోపాయసాధన మదియే యని నమ్మవలయును. భక్తలక్షణ మిదియే. ఇంక నీ విషయమును మాని తర్వాతికథను వ్రాయఁబూనెదను.

శ్రీకృష్ణుఁడు మధురనుండి గోకులమున కరుదెంచుట.

* శ్లో. వత్సపాలచరః కోఽపి వత్స శ్శ్రీవత్సలాంఛనః,
ఉత్సవాయ కదా భావీ త్యౌత్సుకే మమ లోచనే.

శ్రీకృష్ణకర్ణామృతము 3 ఆ. ౨౮.

* ఈవిషయము గర్గసంహిత మధురాఖండము పందొమ్మిదవయధ్యా

పాఠకమహాశయులారా! లోపలికథను మఱచి మధుర లోనేయున్నట్లు శ్రీకృష్ణుని భావించి కథఁ జదువుఁడు. పురాణ భేదములనుబట్టి కథ మార్పునొందును. కాని ఫలమొక్కటియే. దీనివ్రాయుటకు హేతువు లేకపోలేదు. రాసక్రీడ మరల సాగును. చిరకాలము రాధామాధవులకు వియోగము సంభ వించును. కాన నడుమ వారికూడికను దెలుపుట మహాలాభము. భక్త్యుద్దీపకము. కాన నోపికమైఁ బఠింపుఁడు. దానివిధ మీరీతి యని తలంపుఁడు.

ఉద్ధవునిమాట లాలకించి శ్రీహరి భక్తవత్సలుఁడు కావునఁ దాను వారికడఁ జేసియున్న శపథము స్మరించి గోకుల మున కరుగ మదినెంచెను. మధురానగరమునఁ గలకార్యభార మును దీర్ప బలభద్రునినిచిపోవుట మేలని నిశ్చయించెను. కార్యజాలముల నన్నకుం దెల్పి దివ్యస్యందనం బెక్కి యుద్ధవా! మరల నాతోటి గోకులమునకు రమ్మాయని పిలిచి యతఁడు మహాప్రసాదంబని తోనరుదేరఁ బ్రయాణమయ్యెను. భక్త మనోరథముల నీడేర్ప నూహించెను. స్యందనమతివేగంబ చను చుండఁగాఁ దొలుతొలుత గోవర్ధనాద్రియు నాపిదప గోకుల మును గనఁబడఁగా వానిం గాంచుచు బృందావనమునకుం బోయెను. యమునాతీరము మనోహరమై యుండునది గాన

---

యమునుండి సంగ్రహింపఁబడినది. దీనిప్రకారము శ్రీహరి మధురనుండి గోకులమున కరుగుదెంచునని తలంపఁజను. కావున నీపురాణము ననుసరించిన యీకథను జదువునపుడు లోపలికథను మఱువవలసి యుండును. స్వప్నదర్శన మిచ్చెనన్నకథ యిట మఱచి మధురనుండి వచ్చి గోకులమును చేరెనని చదువుఁడు.

శ్రీకృష్ణమూర్తి యాగమనమున మఱింతయింపుగా నుండెను. గోపులు గుంపులుగుంపులుగాఁ గూడి వ్రజాధిపుఁడయి యలరారు శ్రీకృష్ణునిం బొడఁగాంచి మహానందమునఁ బరుగెత్తసాగెను. ఎపుడెపుడు శ్రీకృష్ణుని జేరుదుమా యనునూహాలఁ దోఁకలు పైకెత్తి యంబారవంబులఁ గావించుచు నవి పరుగువాఱి శ్రీహరిం జేరవచ్చెను. వానిపొదుగులనుండి క్షీరములు ధారలుగాఁ బ్రవహింపసాగెను. చెవులనిక్కించి యవి వచ్చుచుండ వత్సవ్యూహము వానివెంటఁ బరుగిడుచుండెను. ధేనువులు సగము నమలుచున్నగడ్డి గంటలతోఁ గన్నీరుపాఱుచుండఁగా నంబాయనుధ్వనులు వెలయించుచుఁ దమకష్టములు గట్టెక్కెనని నిశ్చయించి పరుగెత్తెను. అరుణకాంతులు ప్రజ్వరిల్ల సరథుఁడైవచ్చు శరత్కాలఖరకిరణుని మేఘము లావరించినట్లు శ్రీకృష్ణుని జుట్టుకొని నిల్చెను. నలుప్రక్కలఁ జుట్టుకొని యాధేనువులును వత్ససముదాయమును శ్రీకృష్ణరథమును గదలకయుండఁ జేసెను. గుఱ్ఱములు నిలువఁబడియె. ఉద్ధవుఁ డాచిత్రవృత్తమెఱింగి యచ్చెరుపడి చూచుచుండెను. శ్రీహరి యానందమునఁ దన్నుంజూచు నాధేనువ్రాతమును జూచుచు వానిపేరులు వేఱువేఱ నుచ్చరించుచు వానిం బిల్చుచుఁ జెంతకుం బోయి బుజ్జగించుచు దువ్వుచు ముద్దిడుకొనుచు శ్రీకరమగు తనహస్తపద్మమున వానిందడిపి కుశలమును విచారించుచుఁ జూచువారి కచ్చెరువు కల్గించుచుండెను. ఉద్ధవుఁ డాభగవద్విచిత్రచరిత్రమును దిలకించి బ్రహ్మానందసుఖమనుభవించుచుండెను.

గోసహస్రము లాగోపాలబాలు నావరించి కదలకుండఁ జేయువిధమునెఱింగి గోపాలబాలకులు శ్రీదామప్రభృతులం గూడివచ్చుచుఁ దమలోఁ దమరిట్లు సంభాషింపఁ జొచ్చిరి. మిత్రులారా! భగవంతునిరథ మతివేగమున వచ్చుచుండెను. చెంతకుఁబోవనైన శక్యముగాదు కదా. అనేకాశ్వములు గిట్టలచప్పుడుచే భూమిని బ్రద్దలుచేయుచుండఁగా భయములేక యీగోవు లెట్లు నిలిపినవి? ఇంతకంటె విచిత్రముకలదా? ఈ రథము శ్రీకృష్ణునిది గాదా? ఆలోచింపఁగా నిది శ్రీకృష్ణరథమే. మఱొక్కఁడైన నీగోబృందధ్వనులతో వచ్చునా? గోసంతతి యెదురేగునా? కావున నీతఁడు వ్రజరాజనందనుఁడే. సంశయము లేదు. అనఁగా విని యందొక్క గోపడింభకుఁడు నిశ్చయముగా నీతఁడు మనకృష్ణుఁడే. కాఁబట్టియే నాదక్షిణకరపాద భాగము లదరుచున్నవి. అంతియగాదు. అల్లదిగో చూడుఁడు. మయూరము తనపింఛమును దోరణాకృతిగ నమర్చినది అని పలుకుచుండ నాతురమున నందఱు వడివడినడచుచు శ్రీకృష్ణుని చెంత కరుదెంచిరి. పెన్నిధిని బోఁగొట్టుకొని మరలఁ దానిం గాంచుజనులపోల్కి శ్రీహరిని గన్నులారఁ గాంచిరి. చెంతకుం బోయిరి. ప్రేమాశ్రుకణముల విడిచిరి. వారిం గాంచినంతనే హరియుఁ బ్రేమాపూర్ణహృదయుఁడై యానందబాష్పములు కన్నుల నిండఁగాఁ గౌఁగిలించి యుచితరీతి నెల్లర నాదరించెను. పరిపూర్ణుఁడగు నాపరమేశ్వరుకరస్పర్శమున వారెల్ల నానందాబ్ధి నోలలాడిరి. ఆసమయమున శ్రీహరిని దర్శింపఁగలవారే కృతకృత్యులని యుద్ధవునిమదికిం దోఁచెను. ఆబాలకులా శ్రీ

కృష్ణుని వేలువేలఁ గన్నీరుమున్నీరుగాఁ బ్రవహింపఁ గౌఁగిలిం
చుకొని తమ మనస్సంతోషమును దెలిపిరి.

ఔరా! భక్తిమాహాత్మ్యము నిట్టిదనికొనియాడ నెవ్వ
రితరము? అట్టితఱి నాగోపబాలకులు రోదనముచేయుచు
నేమో మాటలాడిరి. ఆ యానందపారవశ్యమున మాటలాడఁ
జాలకపోయిరి. ఇంతకాలము తమ్మెడఁబాసిపోయి మరల వచ్చి
నందులకుఁ దమమనసులు విహ్వాలములుకాఁగా నిదితగునా
మిత్రమా యని కొంద ఱాక్షేపించిరి. వారికిం దనయందుఁగల
ప్రీతికి నానందించి యాపరిపూర్ణతత్వరూపుఁ డాబాలకుల
మృదుమధురవాక్కుల నాదరించి యూఱడించెను. ఉద్ధవుని
మనరాకకుఁ గలకారణమును దెల్పుమా యని శ్రీహరి యాన
తియిడి తా మాటలాడఁజాలక పోయెను. ప్రేమమహిమ మా
పరమేశ్వరు నట్లు మూకఁజేసినదన నింక సామాన్యుల నెట్లు
చేయునో! ఉద్ధవుఁడు మధురానగరమున నింతకాలము నివసిం
చుటకు నిపుడు వచ్చుటకుం గలకారణమెల్ల వారికిం దెలియఁ
జెప్పెను.

అత్తఱి మధురానగరమునుండి పరమేశ్వరుఁడు గోకుల
మున కరుదెంచుచున్నాఁడనువార్త గోపాలకు లాలకించి యా
మహాత్మునిం దోడితేర నందఱు పయనమై మన మనోరథములు
ఫలించెనన్న యూహాలుగలవారు గావున భేరీమృదంగపటహాది
వాద్యధ్వనులు దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచుండఁ బూర్ణకుం
భము లెత్తుకొని చేడియలు రాఁగా ద్విజవర్యులు వేదనాదము
లుచేయుచు వెంట నడువ గంధాక్షతపుష్పమాల్యములం
గైకొని కొందఱు వచ్చుచుండ నందరాజును మున్నిడుకొని

యరిగిరి. యశోదయు నందనుఁ జూచుకౌతుకమున నింటనుండఁ జాలక వారివెంటఁ దాను నరిగెను. పూర్ణకలశము కుంభస్థలమున నమరించి సిందూరము ముఖమున నలంకరించి సువర్ణాభరణములఁ గైచేసి భద్రదంతావళమును ముందుఁబోవుట కాజ్ఞాపించి నందభూపతి దానివెంటఁ దానును, దన్నుంగూడి తక్కిన వారును నడుచుచుండఁగా వడివడి నరిగెను. వృషభానుఁడు కలావతింగూడి తాను నందునిపరిసరమున నే పోయెను. నందుఁడు, సుపనందుఁడు, వృషభానుఁడు, వృద్ధగోపకులు, తరుణగోపకులు, నర్భకులు, పూలహారములు, వేణువులు, గుంజాహారములు గైకొని మహానందసాగరమున నోలలాడుచుఁ బోయిరి. గోపకులు కొందఱు సంతోషమున నొడలెఱుంగక శ్రీకృష్ణబాలక్రీడల గేయములుగా నొనరించి పాడఁ జొచ్చిరి. కొందఱు నాట్యమొనరించుచుఁ బాడిరి. చేలాంచలము లెగురవైచుచుఁ గొంద ఱెగురసాగిరి. తక్కినగోపబాలకులు వేణువులూదుచు ఢక్కానాదములఁ జేయుచు శ్రీకృష్ణునకుఁ దమరాక నెఱింగించుచు నెప్పుడెప్పుడు కృష్ణునిం జూడఁగల్గుదుమా యనువాంఛలఁ బోయిరి.

ఈ కోలాహలము సఖీముఖమున నాలకించి శ్రీరాధిక యెట్లో శయనమునుండి లేచెను. ఆకుశలవార్త తనకుం దెల్పినందులకుఁ దనవిభూషణముల నొసంగి గారవించెను. నవపద్మిని తనపరిమళమును వాయువున కొసంగినట్లు తనయాభరణములన్నియు నొసంగి మఱిమఱి యావృత్తాంతము నడిగెను. క్షణమైననుండఁజాలక శిబిక నారోహించి బయలుదేఱెను. మైథిలగోపికలసంఖ్యలుగా నామెను బరివేష్టించి పోయిరి. శ్రీధర

సందర్శన మెపుడగునాయని యారాధాచిత్త ముర్విళ్లూరుచుం డెను. ఆశిబిక ప్రయాణము సాగించుచుండఁగా నందువసించు గోపికలెల్లఁ దమరొనరించు గృహకృత్యముల మాని శ్రీకృష్ణ దర్శనోత్సుకలై పయనము సాగించిరి. వారిమనస్సులు ప్రేమరస భరితములౌట వ్యత్యయముగ నాభరణములధరించి నడచిరి. దేహాభిమానము వారికత్తఱి లేదనవచ్చును. అత్తఱి నావే డుకం జూడఁగాఁ బరమేశ్వరు దర్శింప బృందావనమునఁగల పాదపమృగములతో నన్నివస్తువులు నందఱును బ్రయాణమై పోవుచున్నట్లే యుండెను.

పట్టరానితమకంబున నెట్లో యందఱు శ్రీకృష్ణునిరథ మును సమీపించిరి. హరియు యశోదాదేవిని నందునిం జూచి యెదురేగి విధివిహితముగా వారికి నమస్కరించెను. లేచి కృతాంజలియై నిలువంబడియెను. చిరకాలమునకు నరుదెంచిన కుమారునిం గాంచి నందుఁ డానందపారవశ్యమున రెండు చేతులం దిగిచి కౌఁగిలించుకొనియెను. వక్షమునఁ జేర్చెను. ఆనందబాష్పముల స్నానముచేయించెను. యశోదయుఁ జిరకా లాగతబాలకుని ముద్దిడుకొని మాటలాడఁజాలక పోయెను. జననీజనకులకుఁ దనరాకఁ దెలిపి యుపనంద వృషభాను ప్రభృతు లకు వరుసగా నమస్కరించి వారి యాశీర్వచనములనంది వయ స్యులను వయఃపరిణామము ననుసరించి మర్యాదలంజరపి వారి నానందసాగరతరంగముల నోలలాడించి యించుకతడవు తన గమనవృత్తాంతము మధురావృత్తాంతము మరలివచ్చుటకుఁ గలకారణములను వారికిం దెలియఁజెప్పి వారిసంశయములఁ దొలఁగించెను. పిదప భద్రగజముపై యశోదను నందుని

నెక్కించి తాను నరదమెక్కి తక్కినవా రుచితరీతి యానముల
నధిరోహింపఁగా గోబృందములు తనస్యందనము వెనుకొని
వచ్చుచుండఁగా నందనగరమును బ్రవేశించెను. ఆ పురప్రవేశ
సమయమునుగాంచి దేవత లంబరమునుండి హరిపైఁ బుష్పవృ
ష్టిని గురియించిరి. పురగోపికలు సేసలు చల్లిరి. గోపకులు జయ
జయ నాదములు సేసిరి. ఆ యుత్సవమునుసందర్శించు మహాభా
గ్యముగల యుద్ధవుఁడు ధన్యుఁడు. సాక్షాత్సందర్శన మట్లబ్బుట
పూర్వపుణ్యముచేతనే కదా. అపుడు గోపకులెల్ల శ్రీకృష్ణా!
గోకులమునకు జీవనము నీవే. అని గద్గదస్వరములఁ బల్కిరి.
తమయదృష్టమునకుఁ బారములేదని వారెల్ల భావించిరి.

మహాశయులారా! ఈ కథాసారము నించుక వినుఁడు.
కథ భేదముగానున్నదను విషయమునుగూర్చి విచారింపకుఁడు.
గోకులమున నున్నవారికెల్ల దర్శనమిచ్చి వారల చింతదీర్చు
టయే యిట ప్రధానముగాని వేఱుకాదు. భగవంతుఁడు
ప్రయాణమై యంతకుముందు గోకులమున కరిగివచ్చిన యుద్ధ
వుని మరల రమ్మని శ్రీహరి కోరెను. ఏల? ఉద్ధవునకుఁ గల
మోహావేశమును దొలఁగించుటకే. తనమహిమము నాతనికిఁ
దెలిపి యాతని భక్తిభావమును దృఢపఱచుటకు మరల రమ్మ
నియె. బోధచేయుటచేతఁగాక భక్తి దృష్టాంతములచే మిగుల
దృఢత్వమందును. భగవంతుఁడనిర్వచనీయమహిముఁడు, సర్వాం
తర్యామి యనువిషయము పుస్తకములలోఁ జదువుటకంటెఁ
గన్నులారగాంచిన మఱింతమేలు. ఈవిషయము దీనినుండియే
మనకు స్పష్టమగును. శ్రీకృష్ణుఁ డుద్ధవుఁడును రథమున నొక్క
చోటఁ గూరుచుండి గోకులమున కరిగిరి. బృందావనమును

ప్రవేశింపఁగనే రథధ్యానమునాలకించి తమయిష్టదేవ మరుదెం చెనని గోవులు తెలిసికొనియెను. నమలుచున్న కబళము సగము నోటిలోను సగము వెలుపలనుండఁగా నాకార్యమునైన ముగిం పక వడివడి నంబారవములు గావించుచు భగవద్దర్శనమున కరు దెంచినవి. వానిదూడలుగూడఁ బరుగెత్తినవి. ఇతరధ్యానము వానికిలేదు. తమకిష్టదైవము శ్రీకృష్ణుఁడని యవి యెఱింగెను. రథమును జుట్టుకొనియెను. కన్నీరు ధారలుగాఁ బ్రవహింపఁ జేసెను. దీనత్వము మోమునఁ గన్పడ నిలువంబడియెను. నోట మాటరాక నంబాయని యార్వసాగెను. భగవంతుఁడు సర్వ గతుఁడు. కావుననే వానిభావ మెఱింగెను. చిరకాలమునకు దర్శనమిచ్చితివి కదా. మాగతి యేమి? అని యవి మొఱ్ఱయిడు చున్నట్లు తెలిసికొనియెను. గోవిందుఁడు కదా. వానిభక్తి కానందించెను. వేలువేలుపేరులతో వానిం బిలిచెను. మేను నిమిరెను. అనఁగా భయంపడకుఁడు. నేనెందును బోలేదు. మీహృదయములయందే యున్నాఁడను. ఎఱుంగఁజాలకున్న వారనుభావమును దెలిపెను. ఆ భగవత్కరస్పర్శముచే నవి యూఱడిల్లెను. చుట్టుకొని రథమును గదలనీయకుండెను. ఏల? మమ్ము విడనాడనని వాగ్దానము చేయుము. మీదర్శనముకా కున్న మేము నిల్వఁజాలమని యవి పట్టుపట్టినవని దీనిచే మన మెఱుంగవలయును. పట్టుదలకే శ్రద్ధయనియుఁ బరాకాష్ఠయ నియు నామములు కలవు. శ్రద్ధగలవానికే భగవంతుఁడు ప్రత్య క్షమగును. శ్రద్ధయే తరణోపాయమును జూపును. అది మొండి తనము కాదా యని ప్రశ్నింపరాదు. నీవుమాకు మార్గముచూప కున్న నిన్ను వదలమని భగవంతుని నిల్పుట మొండితనము కాదు.

అది మూర్ఖత్వముగాదా యనుటయే మోఱకుఁదనము. అది దృఢభక్తిని సూచించును. భక్తులందఱు నీమార్గము నే యవలంబించిరి. కాంచీపురవాసియగు శ్యామకృష్ణభక్తుఁడు,

"నినువినాగా మఱి దిక్కెవ్వరున్నారు."

అని పట్టుపట్టెను. ఆపరాకాష్ఠయే యాతనికి దేవీసాక్షాత్కారమును గల్గించెను. అది పట్టుదలమాత్రమే గాక భగవంతునిపైఁ గలవిశ్వాసమును దెల్పును. అట్టివిశ్వాసము సదా నిలుకడఁ గాంచినచోఁ గృతకృత్యులమగుట కేశంక లుండవు. ఈవిషయమే ప్రకృతగోచరిత్రమునుండి తెలిసికొనవచ్చును. నందాదులచరిత్రమును గూర్చి యీవఱకే వ్రాసితిని గదా. దీనిచే నుద్ధవునకొక గుణపాఠమును భగవంతుఁడు నేర్పెను.

"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున,
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః."

భగవద్గీత. ౬ అధ్యా.

ఈ వాక్యములసారమే గుణపాఠము. ఉద్ధవా! ఈగోవులచరిత్రమును దిలకింపుము. గోవులయాత్మ నేనే. నాయందే

యిదియున్నది. నీయాత్మయందు నే నున్నాఁడను. సమదర్శనుఁడవు కమ్ము. నన్ను సర్వభూతాంతరాత్మనుగా నెఱుంగుము. నాయందే యన్నియు నున్నవి. ఈరహస్యము నెఱింగి సమాహితాంతఃకరణుఁడవు కమ్ము. దానఁ దరింతువు. అనుభావముదాహరణపూర్వకముగా నెఱింగించుటకే యాతనిం బిల్చుకొని వచ్చెనని మన మెఱుంగుట న్యాయము. గోవులయాత్మయందున్న నేనే వాని నిటకువచ్చునట్లు చేసితిని. నాకళయే యందు లేకున్నవి నిర్జీవములగుభావ మందిమిడియున్నది. మనమిట్లు తెలిసికొని గోవులకున్న పరాకాష్ఠగలవారమై భగవంతుని భజియించినఁ దదనుగ్రహమునకుఁ బాత్రులమగు టొకవింత కాదు. వేఱుమార్గము శూన్యమే. ఏవిధముననైన సర్వభూతాంతర్యామిగా భగవంతునెఱింగి భజింప నలవాటుపడినఁగాని ముక్తి దొరకదనుట సర్వసమ్మతసిద్ధాంతము. నిర్వివాదముగానున్న యీసిద్ధాంతమును నమ్మకున్న లాభము లేదు. ఏరూపము నేనామమును గల్పించుకొన్నను బాధలేదుగాని భగవత్తత్త్వము నెఱుంగకున్నఁ బూర్ణలాభము దొరకదు. ఇది నిక్కము. దీనిని జక్కఁగా నెఱింగి దేవతాదూషణమును మాని యభీష్టదేవతను సర్వభూతాంతర్యామిగా సమాహితాంతఃకరణుఁడై యుపాసించుభక్తునకు ముక్తిదొరకుట సులభము. కావున నామార్గమునకుఁ బ్రయత్నించుట కడుమేలు. ఇఁక నవ్వలివృత్తాంతము నాలకింపుఁడు. వృత్తాంతమును దెలిసికొనుటయందుమాత్రమే కాక దానినుండి మన మెఱుంగఁదగు నీతియేదియని విచారించుచుండవలయును. లేనిచోఁ గాలక్షేపమే ఫలమగును. అట్టి పని భక్తులు చేయరనువిశ్వాస మింకను నాకుఁ గలదు.

## రాధికను శ్రీహరి యూఱడించుట.

* శ్రీహరి గోకులమును బ్రవేశించి యాదినము గడపెను. అందఱతో సంభాషించెను. ఎల్లవారికిఁ దనవృత్తాంతమును దెలిపెను. మథురానగరమున జరిగిన వార్తలెల్లఁ దెలియఁబఱిచెను. వారు తద్వియోగమున ననుభవించిన కష్టముల నెల్లఁ దెలిపిరి. భగవంతుని యుపదేశమున నూఱడిల్లిరి. శ్రీహరి యొనరించిన యద్భుతకార్యముల కానందపరవశులైరి. భగవంతుఁడే శ్రీకృష్ణుఁ డని నమ్మిరి. ఎందున్నను మనల రక్షించుచునే యుండునన్న విశ్వాసము గలవారైరి. సాయంకాలము దనుక శ్రీకృష్ణు నెడఁబాయకయుండిరి. సాయం సమయమున రాధిక శ్రీకృష్ణుని దోడ్కొనిరా దూతిక నంపెను. తదాహూతుఁడై శ్రీహరి రాధామందిరమున కరిగి యామె మనోవ్యథను దీర్పనెంచెను. ఒక్కఁడే శీతలచ్ఛాయగలిగి మనమున కానందమును గల్గించు కదళీవనమునకుం జనియెను. అవన మెట్టి సంతాపము నైనఁ దొలఁగించునట్టిది. అందలి తరువరములు శీతలచ్ఛాయల నామోదము నింపుచుండునవియే. వాయు వందుఁ బ్రవేశించిన వారి మనఃపరితాపమును స్పర్శమాత్రమునడంచునది. శుకకోకిలాలాపములు శ్రవణసుఖకరములు. ఏవిషయము నాలోచించినను సంతాపమును బోఁగొట్టునదియే. అట్టిదయ్యును రాధికను శ్రీకృష్ణవియోగమునఁ గల్గిన పెనుతాపమున నావన మెల్ల భస్మీభూతమయి యుండెను. రాధిక శ్రీకృష్ణుఁడువచ్చి తన్ను రక్షించునన్న యాశచేతనే జీవించినది. లేకున్న నెన్నఁడో భస్మ

---

* ఈవిషయమును గర్గసంహిత మధురాఖండము ఇరువదవ యధ్యాయమునుండి సంగృహీతము.

రాశియై పోవలసినదియే. ఆశాసుధారసమే యామె జీవములకాధారము ఆమె నహర్నిశములు గోపికాయూధములు గాపాడుచుండెను. కడుజాగరూకతతోఁ గాపాడఁబడుటచేత నే యించుక స్మృతి గలిగి యారాధిక కాలమును బుచ్చు చుండెను.

శ్రీకృష్ణమూర్తి కదళీవనమును బ్రవేశింపఁగనే యా మహాత్ముని రాకంగాంచి పరుగిడి గోపికలెందఱో రాధికకుం జెల్పిరి. ఇంతకుముందే శ్రీకృష్ణాగమనము నెఱింగి శిబికనెక్కి వెళ్లినపు డాజనసముదాయమున హరిదర్శన మామెకుం గలుగ దయ్యెను. ఇపుడు తదాగమనవార్త చల్లఁగాఁ జెవులఁబడఁగనే యాఱిల్లి యతివేగంబ శయ్యనుండి లేచి యావృషభాను ప్రియపుత్త్రిక సఖీబృందముం గూడి ప్రాణనాథునిఁ దోడితేరఁ బరుగిడెను. మందయానలు స్త్రీలనుమాట యాసమయమున వారియం దన్వర్థము కాకపోయెను. ఇంతలో శ్రీహరి రాధా సుందరమందిరాంతికమున కరుదెంచెను. ఎదురుగాఁబోయిన రాధిక యాపరమపురుషునకు మర్యాదలొనరించి యుపచార విధుల సల్పి మాటలాడ నేర్చిన యారాధిక కుశలవార్తను యుక్తియుక్తముగాఁ బ్రశ్నించెను. ఆమన్మథమన్మథుని మనో హరాకారము నవనవోన్మేషయుక్తముగాఁ గన్పడియెను. కన్నులారఁగాంచు భాగ్యము కల్గెఁగదా యని యామె యానందించెను. తనోవ్యథ తద్దర్శనమునఁ దీఱెనని యామె తలంచెను. ఉచితరీతిని బ్రశ్నించెను. తన హృదయేశ్వరుని రాకయే తన దుఃఖవిముక్తికారణమని నిశ్చయించుకొనెను. అపు డారాధికకు శృంగారము ప్రసన్నతయే. కృష్ణుఁడు గ్రామాంతరము

నకుఁ బోయియున్నందున శృంగారము చేసికొనకుండెను గదా. చందనానులేపము తాంబూలము వదలియుండెను. మిష్టాన్న మునుగూడ వదలియే యుండెను. దివ్యశయ్యపైఁ బరుండు టయు మానెను. నవ్వుగాని వేడుకమాటలుగాని వదలియుం డెను. శ్రీకృష్ణుఁడు పరిపూర్ణుఁడు. రాధిక పరిపూర్ణ ప్రియు రాలు. అట్టి వారికి వియోగము సంఘటిల్లినపుడు వారి చిత్త వృత్తు లెట్లుండునో యెవ్వ రెఱుంగరు. ఆ రాధ కుశలప్రశ్నా నంతరము గద్గదకంఠియై మాటలు తొట్రుపడుచుండఁగా నిట్లు పల్కెను.

ప్రాణేశా! ఎంతదూరమున మధురానగరమున్నది? ఎప్పుడువచ్చితివి? అందేమి చేయుచుందువు? అశేషసాక్షివగు నీ వియోగమువలనఁ గల్గిన రహోదుఃఖము నేమని వచింపఁ జాలుదు? దమయంతియు మైథిలియుఁ బడిన కష్టములకంటె నీ కష్టమెక్కుడా యన్న వారికి శత్రువుండెను. నే నేశత్రువు వలన నీవియోగదుఃఖము గల్గెనని వచియింతును? గోపికలు చెప్పగూడదా యందువేమో? వారును నావలెనే వెతలఁ గుందుచున్నవారు కాన శ్రమములను బలుకఁజాలరు. శర త్కాలచంద్రచకోరములకు నవజలధరమయూరికలకు నెట్టి సం బంధమో శ్రీబృందావన చంద్రుఁడవగు ఘనశ్యాముని నిన్నుఁ జూడ నుత్సహించుచుందును. మరల నిన్నినాళ్లకు నీమిత్రుఁ డగు నుద్ధవుఁడు ధన్యుఁడు కావున నిన్నిటకుఁ దోడితెచ్చెను. ఈగోకులమున నీప్రేమమునకు నట్టి పాత్రుఁడు లేఁడు. కావు ననే యీమహాకార్యమునకు నుద్ధవుఁడే హేతువు.

అని యిట్లు పలుకుచున్న రాధికఁ జూచెను. ఆ తరుణి యిట్లు మాటలాడుచు విలపించుచు నుండెను. ఇట్లు మాట లాడు నిరుపమానప్రియను జూచి కరుణారసభరితాంతఃకర ణుఁడై నీతి ననుసరించి యప్పుడే యూఱడిల్లఁ జేసెను. రెండు చేతులతో నామెను బట్టుకొని ప్రేమాశ్రువుల నిరంతరధార లుగా పదలెను. ఓ రాధాదేవీ! వగవకుము. నీప్రీతికొఱకే వచ్చితిని. మన యిరువురకు భేదరహితమగు తేజ మొక్కఁడే కలదు. అది రెండుగా విభక్తమని జనులు పలుకుదురు. కాని భేదము లేనేలేదు. క్షీరములకు శ్వేతవర్ణమున కెట్లభేదమో మనకు నంతియే యని యెఱుంగుము. * నేనెక్కడనున్న నీ వక్కడనుండఁదగు. మనకు వియోగము కలుగదు. పరిపూర్ణపర బ్రహ్మమును నేను. నీవు తటస్థురాలివగు ప్రకృతివి. మృషా జ్ఞానముచేఁ జూచువారికి మనకు వియోగము కలిగిన ట్లగ పడును. ఆకాశవసతిగల వాయువు సర్వత్ర వ్యాపించుచున్నది. జలము తేజస్సు నట్లే వ్యాపించుచున్నవి. పృథగ్భూతయగు పృథ్వి బహిరంతర్భాగములయందు వ్యాపించి యున్నది. మలమువంటి గుణత్రయముచే వికారరహితుఁడ నగు నేను వికారవంతుఁడనుగాఁ జూడఁబడుదును. నీవు నట్లే నన్ను భావింపుము. నేను నాకు నను భేదభావము మదిఁ గల్గినపుడు రెండవది కనంబడును. అరణ్యము నడుమనున్న ప్రాణిదృక్కు దట్టమగు చెట్లనీడనుండి రవిని జూడఁజాలదు. ఇంచుక యవకా శము దొరకినఁ జూడఁగలదు. అట్లే ప్రాణి ప్రధానగుణసమా

---

* యత్రాహం త్వం సదా తత్ర విశ్లేషో నహి చావయోః, పూర్ణం బ్రహ్మ పరం చాహం తటస్థా త్వం జగత్ప్రభుః=అని మూలము.

వేశము గల్గుటచేఁ బరమాత్మను జూడఁజాలదు. ఆయావర
ణము పోఁగాఁ గాంచఁగల్గును. సంసర్గము వదలగా బంధములు
వదలును. అదియే ముక్తిమార్గము. ఈ రెండును మనఃకారణ
ములు. మనోజయమున సర్వవిజయము గల్గును. అసంగుఁడై
నేనుతప్ప నింకెవ్వరుండఁగలరు? పరాత్పరమును గుఱించిన
మనోభావము ఏకాంతస్థితిని గల్గును. కావున నాయందుఁ బ్రేమ
యే ప్రధానముగా నుంచఁదగును. ప్రేమముతో సమానమై
నది నాదయకుఁ బాత్రమైనది వేఱొకటి కానరాదు.

అని శ్రీకృష్ణుఁడుపలుక నాలకించి యారాధాదేవి సుప్ర
సన్నయై గోపికలంగూడి శ్రీహరిని భక్త్యతిశయమునఁ బూజిం
చెను. వివిధభంగుల నలరించెను. సాక్షాత్పరమేశ్వరునిగా
ధ్యానించెను. తాను బ్రకృతియే యన్న పూర్వవృత్తాంతమును
స్మరించెను. రాత్రియందించుక గడచెను. శ్రీకృష్ణపరబ్రహ్మము
రాసమండలవిహారమున రాధిక నలరింప నెంచెను. రాధను
గోపికలంగూడి రాసమండలమున కరిగెను. అందు మురళీనాద
మొనరించెను. ఆ యమునాతీరమున మనోహరమగు నారాస
మండలమున మనోజ్ఞవేణునినాదము చేయఁగా రాసగోపికలభ్య
ర్థింపఁగా నానందమందుచు రాధికంగూడి యథోచితవిహార
ముల నొనరించెను. గోపికలెల్ల శ్రీకృష్ణుంగూడి రాసక్రీడను
గావించిరి. * ఆసమయమున నారాసమండలమున నెందఱుగో
పికలుండిరో యన్నిరూపములఁ దాల్చి కృష్ణుఁడు రాసనృత్యము
గావించెను. బృందావనపతి కదా శ్రీగోపాలుఁడు. క్షణమ్మా

---

* యావతీర్గోపికా రాసే తావద్రూపధరో హరిః, రేమే బృందావనే దివ్యే హరిర్బృందావనేశ్వరః=అని మూలము.

పురమంజీరుఁడై వనమాలాలంకృతవక్షుఁడై పీతాంబరమును దాల్చి పద్మహారము మెఱయఁగాఁ బ్రభాతార్కకిరీటమును ధరించి మెఱపుఁదీఁగెల నపహసించునట్టు లలరారురత్నకుండలములు తమ కాంత్యంకురముల గండస్థలములపై నర్తనము చేయించుచుండఁగా మనస్సునకుఁ బరమానందమును గల్గించు మురళి నూఁదుచు నటవేషమును దాల్చి కౌస్తుభరత్నము హృదయభాగమున వింతకాంతుల వెలయించుచుండ మన్మథ మన్మథుఁడై రాధికంగూడి నాట్యకేళిం దేలెను. శచీదేవీ సహితుఁడై యింద్రుఁడు స్వర్గమున నున్నయట్లు విద్యుల్లతికం గూడిన మేఘము గగనమున నలరుచందముననుం, బృందాదేవిం గూడి బృందావనేశ్వరుఁడగు నాగోపాలబాలుఁడు రాసమండలమునఁ బ్రకాశించెను. రాసమండలనాట్యవిహారము కాఁగా బృందావనమునెల్లఁ గాంచుచు యమునాపులినతలంబులం గనుఁగొనుచు నుద్యానవిశేషములను వనములను బ్రీతిమైఁ దిలకించుచు నాదరమున గోపికలం గూడి రాధాంబిక వెంటరాఁగా గోవర్ధనాచలమునకుం బోయెను. ఆ హరివెంట గోపికాశతయూథములు పోవుచుండెను. వారింగాంచి వారిరాకముందు చేయఁదగు కార్యమున కంతరాయమని తలంచి రాధతో నదృశ్యుండయ్యెను. వారెల్ల నందందుఁ దిరుగుచు శ్రీహరి ధ్యానించుచు నుండిరి.

గోవర్ధనాచలమున కించుకదూరమున యోజనత్రయ విస్తృతిగలిగి శ్రీఖండగంధయుతమై తనరారు రోహితాద్రికి రాధంగూడి పోయెను. అందలి లతాకుంజనికుంజములఁ గనుఁగొనుచు సుందరీమణికిం జూపుచు మధురోక్తులు పలుకుచు

రాధిక యానందపరవశయై వెంటవచ్చుచుండఁగాఁ గాంచనల తికావృతమగు నాపర్వతమున విహరించెను. అందొకసరోవరము కలదు. అది బదరీనాథునిచేఁ బూర్వము నిర్మింపఁబడినది. దాని యంద మున్నదున్నట్లు పలుక నెరికే నశక్యము. అందుఁ బెళుకుచేఁపలు నడయాడుచుండును. కూర్మములు మందగతులఁ గ్రీడించుచుండును. మొసళ్లు లోలోనం దిరుగుచుండును. హంస సారసాదిపత్త్రివర్యములు సుందరమందగమనములఁ గనుఁగొనఁదగినట్లు విహరించుచుండును. వేయిదళములుగల కమలము లందు సదా వికసించియే యుండును. భ్రమరములు ఝుంకారముల దిక్కులఁ బిక్కటిల్లఁ జేయుచుండును. పుంస్కోకిలాలాపములు శ్రవణపర్వ మొనర్చుచుండును. మనోహరసారస పరిమళము ఘ్రాణరంధ్రముల విందునకుఁ బిల్చుచుండును. మందమారుత మెల్లర కాతిథేయ సత్కారముల నొనరించుచుండును. అట్టి దేవసరోవరమున మహాలక్ష్మియగు రాధికం గూడి నందనందనుఁ డానందించుచుండెను.

## ఋభుమునికి హరి ముక్తి నొసంగుట.

ఆదేవసరోవరతీరమున నొక్కచోట నొంటికాలిపై నిలు వంబడి నియతిదప్పక యొకముని తప మొనరించు చుండెను. ఆతనిని ఋభుఁడని యందురు. మహాముని యే యని యంద ఱామహాత్మునిఁ గీర్తింతురు. సదా శ్రీకృష్ణధ్యానతత్పరుఁడై యమ్ముని ప్రపంచమును మఱచియుండెను. అఱువదియాఱు వేల దివ్యసంవత్సరములు నిరాహారుఁడై జలపానము నైనఁ జేయక యమ్ముని యుండెను. ఆమహామునిని శ్రీకృష్ణమూర్తి యందుఁ గనుఁగొనెను. రాధిక యాతనిం జూచి ప్రహాసము మోమున

నడయాడఁ బ్రాణనాయకుం గాంచి యిట్లు ప్రశ్నించెను. ఈ మునినియతి యచ్చెరువు గూర్చెడు. ఈతనియం దనుగ్రహ మునుపుము. ఈముని భక్తిం బరికింపుము. నా విని శ్రీకృష్ణుఁ డట్లేయని యో ఋభుమునీ! యని యుచ్చైస్స్వరమునఁ బిలిచెను. ఆమాట యమ్మునిమది కెక్కదయ్యెను. ధ్యాననిరతి బాహ్యప్రపంచజ్ఞాన మామునికి లేక యుండెను. ఆవిషయ మెఱింగి శ్రీహరి సూక్ష్మరూపమున మనమున గోచరించెను. ధ్యానమున నాపరాత్పరుంగాంచి యామునివిస్మితుఁడై కన్నులు విప్పి శ్రీరాధామాధవుల దర్శించెను. చంచలాన్విత ఘనము వలె దశదిశల వెలుంగంజేయు నారాధామాధవుల దర్శించి వేగముగలేచి భక్తితత్పరుఁడై ప్రదక్షిణ మొనరించి శిరస్సు వారిపాదపద్మములు సోఁక వందన మొనరించి మిగుల గద్గదాక్షరములతోఁ గూడిన వాక్కు లొప్పఁగా నిట్లు వినుతించెను. శ్రీరాధాకృష్ణుల కివె వందనము లాచరించెదను. పరిపూర్ణతమ యగు రాధాదేవిని బరిపూర్ణతముఁడగు శ్రీకృష్ణుని సేవించు చున్నాఁడను. నీవు ఘనశ్యాముఁడవు. రాధ ఘనశ్యామలాంగి. ఇట్టి మీ యిరువురను గొల్చువాఁడను. శ్రీకృష్ణా! నీవు రాసేశ్వరుఁడవు. ఈరాధ రాసేశ్వరి. ఇట్టిమిమ్ము వినుతింతును. గోలోకవిహారివి. ఈమె గోలోక లీలావతి. ఈదేవి యనేక బ్రహ్మాండ నాయిక. నీ వనేక బ్రహ్మాండనాయకుఁడవు. ఇట్టి మీపాదపద్మముల భజింతును. భూభారహరణార్థము భూలోకమున నవతరించినట్టియు, నా తపఃఫలము నొసంగ నిచ్చట సాక్షాత్కరించినట్టియు నితరేతరాధారరూపములు గలట్టియు, హరిరాధికల నంబరఁగు నపూర్వదంపతులగు మీకుఁ గైమోడ్పులర్పింతును.

అని వినుతించి శ్రీకృష్ణపాదారవిందద్వంద్వమునందు నానందబాష్పములు ప్రవహించుచుండఁ బ్రేమానందసమాయుక్తుఁడై ప్రాణముల వదలెను. వెంటనే యాతనిదేహమునుండి యొకజ్యోతి బయలువెడలి దశసూర్యప్రకాశమును గ్రిందుపఱచుచు దశదిశల వెలుంగఁజేయుచు శ్రీకృష్ణునియందుఁ జొచ్చి మఱుగుపడియెను. ఆమహాభక్తునిభక్తిని బ్రేమలక్షణమును దలంచి యానందాశ్రుకణముల వదలుచుఁ బ్రేమాతిశయమున మరల నామునిచంద్రుని బిలిచెను. వెంటనే శ్రీహరిపాదారవిందములనుండి శ్రీకృష్ణసారూప్యముగల యాముని కోటికందర్పలావణ్యము మెఱయ శిరస్సువంచి చేతులుజోడించి భగవంతుని హృదంతరాళమున నిలిపి వెడలి భగవంతునెదుట నిలిచెను. రాధామాధవులకు ప్రదక్షిణక్రమమున వందనములాచరించెను. దివ్యస్యందనము తోఁప నందెక్కి శ్రీహరి యనుమతింబడసి గోలోకమునకుం బోయెను. శ్రీరాధికయు విస్మయావిష్టహృదయయై యామహామునికి లభించిన ముక్తినెఱింగి యానందబాష్పముల విడుచుచు భగవంతుని జూచుచుండెను.

మహామతివిభవులారా! ధన్యులారా! రాధాదేవిని భగవంతుఁ డోదార్చుఘట్టమును జదివితిరి. వియోగమనునది మనకుం గల్గుననుట కల్లయని రాధకు హరి యెఱింగించి నీవృత్తాంతమును దలంచుకొమ్మని హెచ్చరించెను. అనఁగా శాపవశమున మానవలోకమున నవతరించిన పరదేవినని యొకమాఱు తలంచుకొనుమా అనికదా దీనిభావము. పరాశక్తినని యెఱింగినచో నాతోటివియోగము నీకుం గల్గునన్న మూఢవిశ్వాసము పటాపంచలగునని హరి హెచ్చరించెను. దీనిచే రాధయని గో

లోకమున శ్రీకృష్ణుని కర్ధాంగలక్ష్మియని యెఱుకపడును. రాసక్రీడ మరల రాధికకుం గల్పించినఘట్టమున శ్రీహరివిశ్వరూపము స్పష్టమగు. ఎందఱుగోపికలో యందఱుకృష్ణరూపము లుండునట్లు వర్ణింపఁబడినది కదా. అదొక్కటియే రాసక్రీడ వ్యభిచారమనరాదనియు,భగవంతునిమహిమమును దెల్పునదనియు,నదియే పరమేశ్వరార్చనమనియు దీని నెఱింగి శ్రీకృష్ణుని రాసక్రీడాభిరతునిగా ధ్యానింపవలయు. దానిచే భగవత్కరుణ లభించుననియు స్పష్టపఱుపఁజాలును. ఈభాగమును ద్రోసివైచి గోపికలతో శ్రీహరి వ్యభిచరించెనని పలుకుట వెఱ్ఱితనముగాక మఱేమిటిది? కథయంతయుఁ బఠించి తత్సారమేమని సాధువులు ప్రయత్నింతురు. అందొక్కభాగమును జూపుచు నిదిగో శ్రీకృష్ణుఁడు వ్యభిచరించుచున్నాఁడని కుమతులు ప్రకటింప యత్నింతురు. ఇంతియ భేదముగా నీయిరుదెగలవారు లోకమున వర్తింతురు. భక్తిగలవారు భగవద్దివ్యచరిత్రమును వేదతుల్యముగా భావించి పఠించి యానందింతురు. దూషించువారికి దోష మొక్కఁడుమాత్రమే దక్కునుగాని యితరలాభము లుండఁబోవనుట నిక్కము. ఇంక ఋభునిచరిత్రమును బరికింపుఁడు. అఱువదియాఱువేల దివ్యసంవత్సరములు నిరాహారుఁడై జలమును గొనక శ్రీకృష్ణునింగూర్చి తపమొనరించెనన్నమాట విచిత్రముగాఁ దోఁపకమానదు. ఇంతకాలము జీవించుటయే యరుదుగదా. ఒకప్పుడు బ్రదికిరనుకొందము. ఆహారముగొనక తుదకు జలమునైనఁ గ్రోలకయుండుట శక్యమా. ఇది శుద్ధాబద్ధమని యాక్షేపించువా రుండకపోరు. కాని వారికి యోగశాస్త్రవాసనయు లేదనవలసి వచ్చినది. పాపము శాంతిం

చుఁగాక. యోగాభ్యాసము చేయువారి కిట్టిశక్తులలవడుట కడు సులభము. అదిలేనివారి కింతకంటెఁ గష్టమేదియు నుండదు. ప్రమాణము కలదాయన్న వినుండు.

"సూ. కంఠకూపే క్షుత్పిపాసానివృత్తిః." ౩౦

పాతంజలయోగశాస్త్రము, విభూతిపాదము.

"జిహ్వాయా అధస్తాత్తంతుస్తంతో రధస్తాత్కంఠః తతో ఽధస్తాత్కూపః. తత్ర సంయమాత్క్షుత్పిపాసే న బాధేతే." అని వ్యాసభాష్యము.

"కంఠే గళే కూపః కంఠకూపః. జిహ్వామూలే జిహ్వాతంతో రధస్తాత్కూపఇవ కూపో గర్తాకారః ప్రదేశః ప్రాణాదేర్యత్సంస్పర్శాత్పిపాసాదయః ప్రాదుర్భవంతి తస్మిన్ కృతసంయమస్య యోగినః క్షుత్పిపాసాదయో నివర్తంతే. ఘంటికాధస్తాత్స్రోతసా ధార్యమాణే తస్మిన్ భావితే భవత్యేవంవిధా సిద్ధిః." అని భోజరాజవృత్తిః.

తా. కంఠము లోపలిభాగమునఁ బ్రాణాదులస్పర్శముచేత నాఁకలిదప్పులను గలుగఁజేయు గర్తము, అనఁగా లోఁతుగానుండు భాగమునందు సంయమనము చేసినచోఁ బ్రాణాదుల స్పర్శము తప్పిపోయి క్షుత్పిపాసానివృత్తి యగును.

పైప్రమాణమును బరికించితిరి గదా. క్షుత్పిపాసలను జయించుట యోగాభ్యాసరతున కతిసులభము. అంతియగాక చిరకాలము జీవించుటయు లంబికాది యోగబలమున నని యెఱుంగదగు. మనకు యోగశాస్త్రాభ్యాసము లేనికారణమున నిన్నిశంకలు గలుగుచున్నవి కాని రవంతయే నదియుండిన నిట్టిశంకలు గలుగవు. అతీతానాగతజ్ఞానము పరకాయప్రవే

శాదులు యోగికి సులభకార్యములు గాని దుర్లభకార్యములు కావు. సర్వసాధారణమగు ప్రాణాయామమే సిద్ధింపని మనకు యోగసిద్ధి యెట్లు కలుగును? ఇట్టి శంక లేల కలుగకయుండును? కావున సామాన్యమగు ప్రాణాయామమను యోగమునైన నభ్యసించుట ముఖ్యకర్మము. కాఁబట్టియే సంధ్యావందనమం దును దొలుతఁ బ్రాణాయామయోగమే చెప్పఁబడినది కాని వాక్యము లుచ్చరించుచు వాయునిరోధకృత్యము మానుచు న్నారము. ఎంతటి యవివేకము? ఆవిషయము నించుకవినుఁడు.

"శ్లో. శీతాంశుమార్గేణ శనైస్సమీర
మాపూరయే త్స్వోదరమాదరేణ,
వికారమాత్రాభి రపేతతంద్రః
కాలాగ్నిమూలార్పితచిత్తవృత్తిః. ౨౪

తతోధారయేన్మారుతం శుద్ధచేతా
శ్చతుష్షష్టిమాత్రా స్సమాపూరితం తత్,
బహిర్ద్వాత్రింశతా రేచ యేన్మందమేనం
తదర్ధాభిరంత ర్నిరుద్ధం తు తాభిః. ౨౫

విపరీతమతో విదధీతబుధః
పునరప్యథత ద్విపరీతమితి,
అమునా విధినా సుమనా స్సతతం
మరుతో విదధీత సుసంయమనం. ౨౬

ప్రస్వేదం జనయతి యః
ప్రాణాయామేషు సోఽధమః ప్రోక్తః,
కల్పోమధ్యః పుంసాం
భూమిత్యాగం తనో స్తతోతిపరః. ౨౭

తావద్విదధీత బుధః
ప్రాణాయామం సమాహితో విధివత్,
యావత్సంభవతి భువి
ప్రాణాయామస్యోత్తమస్య గుణః. ౨౮
అయం ప్రాణాయామస్సకలదురితధ్వంసనకరో
విగర్భః ప్రోక్తోఽసౌ శతగుణఫలో గర్భకలితః,
జపధ్యానాపేతస్సతు నిగదితో గర్భరహిత
స్సగర్భస్తూన్ముక్తో మునిపరివృతై ర్యోగనిరతైః. ౨౯
శుచిః ప్రాణాయామాన్ ప్రణవసహితాన్ షోడశవశీ
ప్రభాతే సాయం చ ప్రతిదివసమేవం వితనుతే,
ద్విజో యస్తం భ్రూణప్రహరణకృతాంహోఽభికలితం
పునంత్యేతే మాజాదిహ దురితతూలౌఘదహనః. ౩౦
త్రాయంత్యమీ షడ్భిరపీహ మాసై
ర్జన్మాంతరోపార్జితపాపపుంజాత్,
సంవత్సరాద్బ్రహ్మపదం తదేకం
ప్రకాశయంత్యేవ యదచ్యుతాఖ్యమ్. ౩౧
ఇహ రేచకపూరకౌ విధాయ
స్థిరధీః కుంభకమేవ కేవలం యః,
సతతం కురుతే మనోజవత్వం
లభతే వీతజరామయస్స మర్త్యః. ౩౨
నహి తస్య సుదుర్లభం త్రిలోక్యా
మిహ యః కేవలకుంభకే నిషణ్ణః,
అణిమాదిగుణాష్టకం కరస్థం
నను తస్యైవ నిరస్తమృత్యుభీతేః. ౩౩

రాజదంతయుగళాదిమస్పృశన్
సన్నిధాప్య రసనాం తదంతికే,
కాకచంచుపుటమారుతం పిబే
త్ప్రాణసంయమనమేతదుత్తమమ్. ౩౮
షణ్మాసాభ్యాసేన రోగై రశేషైః
పాపేభ్యోఽసౌ ముచ్యతే సాధకేంద్రః,
అబ్దాదేకాద్విప్రసాం మృత్యుదూతీం
జిత్వా భూమౌ దీర్ఘకాలం స జీవేత్. ౪౨
వర్షత్రయాభ్యాసవశాదతీత
మనాగతం వేత్త్యలినీలకేశః,
విషం న దేహే క్రమతే తదీయే
దష్టే సుఘోరై రపి పన్నగేంద్రైః.” ౪౩

త్రిపురాసారసముచ్చయము, మూఁడవపటలము.

చూచితిరా! యోగాభ్యాసమున జరామరణములు లేక చిర కాలము జీవింపవచ్చునని యోగశాస్త్రము లెట్లు ఘోషించు చున్నవో! ప్రాణాయామయోగము సామాన్యమైనది. దాని నభ్యసించినను అతీతానాగతజ్ఞానముకలుగుననియు మహావిషము కూడ నాతని నించుకంతయు బాధింపదనియు, జరయు మర ణము నాతనిఁ దేటిచూడఁ జాలవనియుఁ జెప్పఁబడినది. ఫలస్తు తిగానఁ బ్రమాణమూ యందురేని యోగమభ్యసించినవారు కారు కావున మీకావిషయము తెలియ దనునదియే సమా ధానము. మహర్షులు చిరంజీవులుగా నుండుట వినలేదా? సనకస నందనాదులు శాశ్వతముగా నున్నయట్లు పురాణములు ఘో షించుచుంటలేదా! “తస్మాద్యోగీ భవార్జున” అని యర్జునునకు

భగవంతుఁ డుపదేశింపలేదా? వీని నన్నింటి నాలోచింపఁగా యోగాభ్యాసము లేనిదే మనోదార్ఢ్యమును బొందన నవకాశము లేదని స్పష్టమగును. కావుననే,

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్."

అనునర్జునుని ప్రశ్నమునకు

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే."

"అభ్యాసో నామ చిత్తభూమౌ కస్యాంచిత్సమానప్రత్యయావృత్తిశ్చిత్తస్య." అని శంకరభాష్యము.

"అసంశయాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః."

అసంయతాత్మనా అభ్యాసవైరాగ్యాభ్యామసంయతః ఆత్మా అంతఃకరణం యస్య సోఽయమసంయతాత్మా. తేన అసంయతాత్మనా యోగః దుష్ప్రాపః దుఃఖేన ప్రాప్యత ఇతి మే మతిః. యస్తు పునర్వశ్యాత్మా. అభ్యాసవైరాగ్యాభ్యాం వశ్యత్వమాపాదితః ఆత్మా మనో యస్య సోఽయం వశ్యాత్మా తేన వశ్యాత్మనా తు, యతతా భూయోఽపి ప్రయత్నం కుర్వతా శక్యః అవాప్తుం యోగః ఉపాయతః. యథోక్తాదుపాయాత్." అని శంకరభాష్యము.

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున". ౪౬
గీతాశాస్త్రము ౬ అధ్యా.

అని శ్రీకృష్ణపరమాత్మ సమాధానము చెప్పెను. అందఱికన్న యోగి యధికుఁడని నొక్కి వక్కాణించు టేలయని యూహింతము. మనస్స్థిరత్వము మాటలచేఁ గుదురదు. అది యోగాభ్యాసముచేతనే కుదురవలయును. స్థిరమనస్సు లేనివారికి ముక్తిదొరకదు. మనోనిగ్రహము యోగశాస్త్రము చదివి తదుక్తరీతి నభ్యసించినఁగాని కలుగదు. కాఁబట్టి యన్నింటికి జితేంద్రియత్వము ప్రధానము. కావున నర్జునా! యోగివి కమ్మా యని భగవంతుఁ డుపదేశించెను. కడుపారఁ దిని కూరుచుండి శుష్కవేదాంత ముపదేశించుచుండ వచ్చును. దాన మనశ్చాంచలత మానదు. దానికి యోగాభ్యాసమే కావలయును. కాఁబట్టి యన్నింటికంటె యోగాభ్యాస ముత్తమోత్తమము. ఆ యోగ బలముచేత నీ ఋభుముని యఱువదాఱువేల దివ్యసంవత్సరములు జీవించెను. ఆహారమును మానుట చాల స్వల్పవిషయము. యోగుల కిది ప్రథమసోపాన మనవచ్చును. త్రికాల వేత్తయగుట కవకాశము కలదు. కావున ముని యంతకాలము జీవించియుండుననుట నమ్మఁదగినవిషయమా యనుశంక గలుగ నవకాశము న్యాయముగ లేదు. లేనిపోనిశంకలకు మనసునఁ జోటీయకుఁడు. భగవంతునిభక్తిభావమున నారాధించి యోగము నభ్యసింపఁ బూనుఁడు. దాన మనస్సు నుంత స్థిరతఁ గాంచును. కావున దానికై ప్రయత్నింపుఁడు. యోగము భగవత్స్వరూపము. దానినాశ్రయించుట భగవంతు నాశ్రయించి నట్లే. మఱొక్కమాట. రాధం గూడి విహరించుకాలమున నీము నిచెంత కరుగనేల యనుశంక కలుగవచ్చును. రాధకు మానుష శరీరధారణమునఁ గలమోహము తగ్గవలయుననియు, దాన

నామె శాపఫల మనుభవింపఁ గలదనియుఁ దనమహిమమును ప్రత్యక్షమున నామెకాంచిన మోహపాశములకుఁ దగులనిమనస్సు కలదగుననియు భగవంతుని భావము. కావున నీ పుణ్యచరిత్రమునుండి యిట్టి మహత్తరవిషయములఁ దెలిసికొనవలయును. తెలిసికొనినంతమాత్రమునఁ బూర్ణఫలము గలుగదనియు దాని నభ్యసింపవలయుననియు నదియే యత్యుత్తమమనియు నెఱుంగఁ దగును. ఇంక నీచర్చమూని యుపరి తనవిషయమును వ్రాయఁ బూనెదను. దాన శ్రీరాధామాధవుల యత్యద్భుతచరిత్రము తెలియఁగలదు. ఆ పుణ్యతమచరిత్రమును శ్రద్ధధానులరై పఠింపుఁడు. మనస్సు నేకాగ్రతనొందఁజేయఁ బ్రయత్నింపుఁడు.

## ఋభుచరిత్రాంతర్గత నారదచరిత్రము.

* ఆయద్భుతవృత్తాంత మెఱింగి రాధిక ప్రాణేశుం గాంచి యిట్లని ప్రశ్నించెను. శ్రీకృష్ణా! ఈముని పరమధన్యుఁడు. నీయం దధిక ప్రేమవంతుఁడు. నీసారూప్యము నొందెను. నీవును బాష్పవారిపూర్ణనేత్రుఁడ వైతివి. పాపహరణా! ఈ మునిశార్దూలుని దేహమును సంస్కరించుటొప్పుఁగదా. ఈదేహము తపస్సమాధిచేఁ బ్రజ్వలజ్వాలనాకృతియై మెఱయుచున్నది. అని రాధిక ప్రశ్నింపఁగా శ్రీకృష్ణుఁడుత్తరముచెప్పునంతలో నాదేహము నదీరూపమై పాపమును వహించుచు నారోహితగిరిఁ బ్రవహించెను. రాధాంబ యత్యంతవిస్మయావిష్టహృదయ యయ్యెను. కావున నందనందనునితో నిట్లు పలికెను. జగన్నాథా! ఈ మహామునితనువు నదీరూప

---

* ఇక్కథ గర్గసంహిత మథురాఖండము ఇరువదొకటవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగనగు.

మును దాల్చెనే. ఏల? నీవు సర్వజ్ఞుఁడవు గావున నా యీసంశయమును దీర్పుము. అన విని శ్రీహరి యిట్లు పలికెను. దేవీ! ప్రేమలక్షణ యగు భక్తితోఁగూడినవాఁడే మునియని యెఱుంగుము. కావున నీతనువు ద్రవత్వము నొందెను. నిన్నుఁ గూడి యున్న వరదుఁడనగు నన్నుం గాంచి యీముని హర్షాంబుధి మునింగెను. నేను బూర్వము ద్రవత్వము నొందినట్లే యీ మునియు జలత్వము నొందెను. అని పలుక రాధమాట కడ్డము వచ్చి యో దయానిధీ! దేవదేవా! నీవేల ద్రవత్వము నొందితివి? నాకెంతో సందియము తోఁచెను. దానిని దొలఁగింపుము. అనివేఁడ నామె సంశయములఁ దొలఁగింపఁ బూని శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను

మహాదేవీ! పురాతనేతిహాసము నుదాహరించెద. ఆలకింపుము దానిని విన్నంతనఁ బాపతూలము లెగిరిపోవును. నా నాభిపంకజమునుండి మున్ను ప్రజాపతి యగుబ్రహ్మ యుదయించెను. నావరప్రభావసముపగతశక్తియై యావిరించి ప్రకృతిని సృజించెను. బ్రహ్మ యూరుభాగమునుండి నారదుఁ డావిర్భవించెను. భక్త్యతిశయమున నాపాదముల నాశ్రయించి మహానందమున భూమి నెల్లెడలఁ దిరిగెను. ఒకానొకప్పుడు ప్రజాపతి యగుబ్రహ్మ నారదుం గాంచి యిట్లులడిగెను. మహామతిమంతుఁడా! నారదా! ప్రజలఁ బుట్టింపుము. వ్యర్థముగా భూమిదిరుగు టుడుగుము. అనవుడు నామాటలు విని నారదుఁడు జ్ఞానతత్పరుఁడై యిట్లుత్తరమిచ్చెను. తండ్రీ! ప్రజల సృజింపను. శోకమోహాదికారిణిగదా ప్రజాసృష్టి. హరిభక్తి వివరించెదను. హరికీర్తనము చేయుచుందును. నీవును బ్రజాసృ

ష్టిని వదలిపెట్టుము. విశేషించి దుఃఖాతురుఁడ వైతివి. అని భాషించు నారదుం జూచి యానలువ క్రుద్ధుఁడై పెదవు లదరుచుండ నిట్లు శపించెను. దుర్మతీ! సర్వదా గానరతుఁడవై కల్పకాలము గంధర్వుఁడవై యుండుము. రాధాదేవీ! ఆమాట బ్రహ్మనోటినుండి వెడలఁగనే యానారదుఁ డుపబర్హణుఁ డను గంధర్వుఁ డయ్యెను. గంధర్వపతియు నయ్యెను. స్వర్గమున నొకకల్పముమాత్రము గంధర్వపతియై యుండెను.

ఒక్కనాఁడు బ్రహ్మలోకమునకు స్త్రీపరివృతుఁడై యా గంధర్వపతిరూపముననున్న నారదుఁ డరిగెను. సుందరీమణు లయందు మనస్సుంచి తాలవివర్జితముగా గానము చేసెను. అదివిని మరల బ్రహ్మ యానారదుని శూద్రయోనిం బుట్టుమని శపించెను. ఆకారణముననే నారదుడు దాసీపుత్త్రుఁడుగాఁ బుట్టెను. సత్సంగవశముననే పూర్వము బ్రహ్మపుత్త్రత్వము నొందెను. నాయందలి భక్తిభారమున గానము చేయుచు భూమి నెల్లఁ గ్రుమ్మరుచుండెను. మునీంద్రుఁడు విష్ణుభక్తుఁడు మత్ప్రియుఁడు జ్ఞానభాస్కరుఁడు నయ్యెను. విశేషించి వచింపనేల? నామనస్సు నారదుఁడనియే తలంపుము. ఒకానొకప్పుడు నారదముని లోకములఁ గాంచుచుఁ దిరుగుచు నిలావృతమను భూఖండమును జూడఁబోయెను. సర్వత్ర గతికలవాఁడు కదా. ఏచోట జంబూనది ప్రవహించెనో ఏ నదియందు జంబూఫలరసము కలియుచుండునో ఆచోటికిం బోయెను. ఆనదిఁబుట్టిన స్వర్ణమే జాంబూనదమనఁ బిలువఁబడునని యెఱుంగుము.

ఆదేశమున వేదనగరము గలదు. అది రత్నప్రాసాద నిర్మితము. అందు దివ్యనారీనరు లుందురు. ఆనగరవరము నార

డుఁడు గాంచెను. అందు గొందఱుమనుష్యులు పాదరహితులు. కొందఱు గుల్ఫరహితులు. మఱికొందఱు జానుశూన్యులు. కొందఱు విజంఘులు. ఇంకను గొందఱు జఘనశూన్యులు. కొందఱు కృశోరువులు. కొందఱు పొట్టివారు. కొందఱు దంతరహితులు. కొంద ఱున్నతస్కంధులు. కొందఱు నతాననులు. కొందఱు వికంఠులు. స్త్రీలు నిట్టే యంగవిరహితలుగ నుండిరి. నారదుఁడు వారినెల్లం గాంచి యోహో! ఇదేమిచిత్రమని తలంచెను. మీ రెల్లఁ బంకజముఖులు. దివ్యదేహులు శుభాంబరులుగ నున్నారు. దేవతలా, ఉపదేవతలా లేక సిద్ధులా, అని యడుగుచు దివ్యగానపరాయణులై వాదిత్రములం గూడియున్నవారు. అట్టులయ్యు మీలోఁ గొందఱు భంగాంగులై యున్నారే. హేతువేమో నాకుం దెల్పుఁడు. అని ప్రశ్నింప నారదునిం జూచుచు దీనాననులై వారు "మహాముని! మా తనువులయందు స్వతస్సిద్ధముగా నొకదుఃఖము గల్గెను. ఎవఁడు దీనిఁ దొలఁగింపఁగలఁడో వానియెదుటనే చెప్పఁదగినది. మేమెల్ల రాగములము. సదా వేదపురమున వసించువారము. ఇట్టి మాకంగభంగము కల్గినది. దానికారణమాలకింపుము. హిరణ్యగర్భున కొకకుమారుఁడు గలఁడు. ఆతనిపేరు నారదుఁడని. ప్రేమోన్మత్తుఁడై యాముని కాలనియమమును బాటింపక యకాలమున ధ్రువపదములను బాడుచు నీభూమినెల్లఁ దిరిగెను. ఇచ్ఛానుసారము ప్రవర్తించువాఁడు. దుష్కాలమున విస్వరములుగాఁ దాలశూన్యముగా గానము చేయుటచేత విమానములనుండి పడితిమి. దాన నంగములు భంగము లయ్యెను." అని పల్కి యూరకుండిరి. ఆమాటలు

విన్నంతనే నారదునకు విస్మయము మదిఁ దోఁచెను. నడచుచుఁ బరిహాసోక్తుల నిట్లు పల్కెను. రాగములారా! ఆముని కేకారణమునఁ గాలతాళజ్ఞాన మలవడును? స్వరయుక్తమగు నాజ్ఞానము కలుగునో నాకుం దెలుపఁగలరా? అన విని యారాగము లిట్లు బదులిడెను. వైకుంఠనాథుని సాహిత్యప్రియురాలు సరస్వతి యగు. ఆమె యెప్పుడాముని కీవిషయము శిక్షారూపముగాఁ దెల్పునో యప్పుడాముని కాలజ్ఞుఁ డగును. అన విని నారదుఁడు దీనవత్సలుఁడై సరస్వతీప్రసాదార్థము గిరివరమున కరిగెను. దివ్యవర్షశతము దుష్కరమగు తపస్సాచరించెను. ఆహారమును మాని జలపానము చేయక వాణీధ్యానతత్పరుఁ డయ్యెను. ఆపర్వతము శుభమనుపేరు గలదయ్యెను నారదశైలమనఁ బ్రసిద్ధిని గాంచెను. తపస్సు పూర్ణముకాఁగా వాగ్దేవియగు శ్రీసరస్వతి ప్రత్యక్షమయ్యెను. ఆమెయే విష్ణుప్రియ యగు. ఆపరమేశ్వరిం గాంచినంతనే త్వరపడి లేచి నతాననుండయి తద్రూపగుణమాధుర్యస్తుతి నీప్రకారము చేసెను. రవికోటిభాసమాన రత్నతాటంకకేయూరకిరీటకంకణములఁ దాల్చి స్ఫురత్కంకణన్నూపురరావములచే నలరారుచుఁ గోటిశశాంకుల ధిక్కరించు ముఖముగల యో సరస్వతీ! నీపాదములకు వందన మాచరించెదను. కలహంసగతులఁ గ్రిందుసేయు పదగతివిశేషముల నొప్పుచు నిర్ధౌతముక్తాఫలహారవితతి ధరించిన కరుణానీరధివగు సరస్వతీదేవీ! నిన్ను భజించువాఁడను. వరాభయపుస్తకవల్లకులు ధరించిన కరసరసిజద్వయముగలిగి శుభముల నీయఁజాలి జగత్స్వరూపురాలవై బ్రహ్మమయివై యలరారు నీ దివ్యరూపమును ధ్యానించువాఁడను. తరంగితక్షౌమదుకూలమును ధరించిన

మహాదేవీ! అతిశయశుభఫలప్రదమగు స్వరజ్ఞానమును బ్రసాదింపుము. దానిచే నందఱికన్న మిన్ననై నిరుపమరాగమండలమును సేవింతును. తల్లీ! కరుణించి నాకీవరము నను గ్రహింపుము. అని ప్రార్థించెను.

రాధా! ఈస్తోత్రము జాడ్యాపహారణక్షమము. ఎవఁడుగాని ప్రాతఃకాలమునఁ బఠించునో వాఁడు విద్యావంతుఁడగును. అంత వాగ్దేవి ప్రసన్నాత్మయై మహాత్ముఁడగు నారదునకు దేవదత్తమగు వీణియను స్వరబ్రహ్మవిభూషితంబును రాగములచేతను రాగిణులచేతను వానిపుత్త్రులచేతను దేశకాలాదిభేదములచేతను దాలమానములచేతను గూడినదియునైనదాని నొసంగెను. అది ఏబదియాఱుకోట్ల భేదములచేతను, అంతర్భేదములచేతను గ్రామములచేతను నృత్యములచేతను వాదిత్రములచేతను మూర్ఛనలచేతను గూడి యావీణియ మెఱయుచుండెను. శ్రీసరస్వతి వైకుంఠప్రియురాలు. కావున నారదునకుఁ జక్కఁగా శాస్త్రపద్ధతుల నేర్పెను. రాగమండలమున నద్వితీయునిగా ముని నొనరించెను. విష్ణువల్లభ వైకుంఠమున కరిగెను.

## —— నారదచరిత్రము. ——

* ఆమీఁద గంధర్వరూపమున నున్న యానారదముని యీ రాగరూపమనోహర గుహ్యావిషయము దీని నెవరికీఁదగు నని బుద్ధినాలోచించుచు గంధర్వనగరమున కరిగెను. అందుఁ

---

* ఇదియు గర్గసంహిత మధురాఖండము ఇరువదిరెండవయధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగనగు.

దుంబురుఁ డనుగంధర్వుని శిష్యునిగా గ్రహించి యావిద్య నెల్ల నిచ్చెను. నాగుణకీర్తనము నుపదేశించెను. వీణావాదన పద్ధతి నెఱుకపఱచెను. ఆవల నీమహావిద్య నెవరియెదుట గానము చేయఁదగును. ఇది గానరూపమగు మనోహరకళ కదా. దీనిని వినఁదగిన పాత్రమెవ్వరని వెదకుచు నారదముని శక్రసభ కరిగెను. అందు నింద్రుఁ డనిర్వృతుఁడై యుంటనెఱింగి తుంబురుంగూడి సూర్యలోకమున కేగెను. అందు రవి స్యందనముతోఁ బరుగిడుచుండెను. ఆతనింగాంచి యీతఁ డిద్దానివినఁ బాత్రుఁడు కాఁడని శంకరుపార్శ్వమున కరిగెను. అందుఁజని శంకరుని జ్ఞానతత్త్వజ్ఞునిగను ధ్యానస్తిమితలోచనుఁగను దెలిసికొని బ్రహ్మలోకమునకుఁ బోయెను. సదా సృష్టికార్యవ్యగ్రుఁడై యున్న యాపరమేష్ఠిని గనుంగొని వైకుంఠమునకేగి సర్వలోకనమస్కృతుఁడగు నారాయణమూర్తిం జూచెను. అతఁ డేభక్తునికొఱకో యెచ్చటికోపోవ నుంకించుచుండు టెఱింగి భక్తవత్సలుఁడగుట నాతురపడి యెందో పోవనున్నాఁ డీతఁడు విననర్హుఁడు కాఁడని నిశ్చయించి తుంబురుంగూడి పోయెను. వృషభానుపుత్రీ! యోగీశ్వరులకు మూఁడులోకములలో బాహ్యాభ్యంతరములయందు గతిగలదని చెప్పుదురు. కర్మములచే వారు కట్టఁబడరు. కోటిబ్రహ్మాండముల దాఁటి యామునీశ్వరుఁడు ప్రకృతికంటె నుత్తముఁడగు భగవంతుఁడుండు గోలోకమునకుఁ బోయెను.

విరజానదీకల్లోలమాలికల దాఁటి మనోహరబృందావనమునకుం బోయెను. దానికిసమాన మదియేగాని రెండవది కానరాదు. భృంగఝుంకారనినాదము లా బృందారణ్యమున మిక్కి

లిగనుండును. వసంతర్తు వందు సర్వదా వెలసియుండును. లతా గృహివితానము లటఁ గన్పడును. అందున్న గోవర్ధనాద్రిని గాంచెను. అందు నానికుంజమునకుం బోయెను. అందు మీరెవ్వరు? ఏకార్యమునకరుదెంచితిరి? అని సఖిబృందము ప్రశ్నింపఁగా సంతుష్టులై వారిరువురు తమవచ్చినవిధ మెఱింగించిరి. ఓ రామామణులారా! మేము గాయకులము. అందు నేర్పరులము. వీణావాదనదక్షులము. పరిపూర్ణతముఁడై రాధాకాంతాయుతుండగు శ్రీకృష్ణుని దర్శించి యాపరమపురుషుని కీగానకళఁ బాడి వినిపించిపోవ వచ్చితిమి. మేము స్తుతిపాఠకులము. తుంబురునారదులను పేరుగలవారము. అని తమవృత్తాంతమును దెలిపి యీవృత్తాంతమును శ్రీకృష్ణపరమాత్మకుం దెల్పుఁడని తెలిపిరి.

ఆసఖిమణులు తద్వార్తను నా కెఱింగించిరి. నేను రాననుమతినీయ మదాజ్ఞానంతర మాచేడియలు మృదువాక్కులలోనికిం బోవచ్చునని తెలుప వారిరువురు వచ్చిరి. నానివాసమగు నికుంజాంగణము కోటిభాస్కరతేజో విరాజితము. కౌస్తుభమణిస్థగితము. అందుఁ జామరములు వీవఁబడుచుండెను. ముక్తామణి కోటిఖచితశ్వేతఛత్రము క్రింద మహాపద్మస్థితుఁడనగునన్ను నిన్నును దుంబురునారదులు గనుంగొనిరి. ప్రదక్షిణక్రమముగా నమస్కరించిరి. మదాజ్ఞంగొని కూరుచుండిరి. నాగుణగేయములఁ బాడ నారంభించిరి. నారదుఁడు వీణియమీటుచు స్వరయుక్తముగాఁ బాడెను. అది యద్వితీయము. తుంబురుఁడుకూడఁ బాడెను. ఆగానమునకుఁ బరమసంతుష్టుఁడనై శిరఃకంపముచేసి శ్లాఘించితిని. ప్రేమాన్వితమతినై నన్ను వారి

కొసంగి జలత్వమొందితిని. ఏజలము నాశరీరమునఁ బుట్టినదో యది బ్రహ్మద్రవమని పెద్దలు పిలుతురు. ఆ బ్రహ్మద్రవముననే కోటి కోటి బ్రహ్మాండములు పొరలాడుచుండును. స్వర్గఫలంబుం బోని యత్యున్నతమగు తజ్జలమునఁ బ్రకాశగర్భమగు నీబ్రహ్మాండము మత్పదమని యెఱుంగుము. దానిని భేదించుకొని యామన్వంతరమున వచ్చిన నాపాదోదకమునే స్వర్ధుని యనియు నాకాశగంగ యనియు నందురు. పాపహారిణియగు గంగాతరంగిణి యదియే యని నమ్ముము. ఆ గంగానదియే యంబరమున మందాకినియనియు, భూలోకమున భాగీరథియనియు, పాతాళమున భోగవతియనియు నీ మూఁడుపద్ధతుల నలరి త్రిపథగామినియనఁ బ్రఖ్యాతిం గాంచినది. దానిలో స్నానము చేసినను, దూరమునుండి పలుమాఱు భక్తియుక్తులై స్మరించినను రాజసూయాశ్వమేధాదిక్రతుఫలము దొరకుట దుర్లభమనం జనదు.

ఎవరుగాని శతయోజనదూరమునున్నను గంగాగంగా యని పలుకుదురో వారి సకలపాపములు నశించును. విష్ణుసాయుజ్యము లభించును * గంగాదర్శనమున శతజన్మపాపములు తొలఁగును. జలపానమున రెండువందలజన్మముల పాపములు నశించును. స్నానమున సహస్రజన్మపాపములును గలియుగమునఁ దొలఁగును. జాహ్నవీనదిని దర్శించువారి జన్మము సఫలము. ఏనరులు కలియుగమున జాహ్నవీనదిని జూడరో వారిజన్మములు వ్యర్థములు సుమీ! రాధికా! నీభయమున

---

* దృష్ట్వా జన్మశతం పాపం పీత్వా జన్మశతద్వయం, స్నాత్వా జన్మసహస్రేణ హంతి గంగా కలౌయుగే = అనిమూలము.

విరజాంగన నదీరూపమును దాల్చెనో విరజాతనయులును నదీ రూపములఁ దాల్చిరో విష్ణువెట్లు కృష్ణానదీరూపమును ధరించెనో సదాశివుఁడెట్లు వేణీనదీరూపమును వహించెనో బ్రహ్మ కకుద్మినీనదీరూపధారి యయ్యెనో అప్సర గండకీతరంగిణి యెట్లయ్యెనో అట్లే యీ ఋభుమునియు నదీరూపమును ధరించెనని తెలియవలయు. ఎవరికిఁ బ్రేమ లక్షణయగుభక్తి నిలుకడఁగాంచునో వారు నదీరూపు లగుదురు. సంశయములేదు. ఈ చరిత్రము పరమపవిత్రము. పాపలతాలవిత్రము. దీనిని వినిన నన్ని లోకములను దాఁటి నాలోకమున కేతెంతురు. అని ఋభుచరిత్రమును దెలిపి రాధాదేవినిగూడి యాపర్వతమునుండి మాలతీవనమునకుం బోయెను భక్తవత్సలుఁడగు భగవంతుఁడు గోపికావిరహము నెఱింగెను. కావున వారి మనోవ్యథను దీర్పఁ బొంటె యమునాపులినమున కరిగెను. అందందు శ్రీకృష్ణుని వెదకుచున్న గోపిక లాతురంబున గతవ్యథలై నీలమేఘశ్యాముఁడగు నాలీలామానుషవిగ్రహుని మెఱపుఁదీఁగెలు ఘనము నాశ్రయించిన చందమున నాశ్రయించిరి. యమునాతరంగిణీ తీరమునఁ గనుఁగట్టు బృందావనమున శ్రీకృష్ణుఁడు గోపికానికురుంబపరివేష్టితుఁడై వంశీనాదముఖరితదిగ్వలయుఁడై వేడుకఁ గాలముపుచ్చెను. ఆవేణునాదమున గోపికలు మూర్ఛితలైరి. నది వేగరహితయయ్యెను. పక్షులు కదలకయుండినవి. దేవతలు మౌనముద్రలం దాల్చిరి. దేవాధీశులందఱు స్తంభితాంతఃకరణులైరి. తరువరములు జలత్వము నొందినవి. జగంబంతయు నిద్రాత్వము నొందెను. రాధికకు గోపికలకును మనోరథంబగు రాసవిహారమును సలిపి శ్రీకృష్ణుఁడు బ్రాహ్మముహూర్తమున

వారింగూడి ప్రమోదమున నందమందిరమునకుం బోయెను. గోపికాజనపరివృతయై రాధికయు నానందమనోరథస్వరూపిణి యగుట వృషభానుని సుందరమందిరమునకు శ్రీహరియనుమతి నరిగెను.

ఆర్యమహాశయులారా! పుణ్యాఖ్యానకుతూహలులారా! ఈ రెండు కథలనుండి మనమూరయందగు విషయములు కొన్నికలవు. కథాశ్రవణమాత్రము చాలదనియుఁ దత్సారమును గ్రహించి దాని మదిఁ బదిలపఱచుకొనుటయు, శక్త్యనురూపముగ దానినీతి నభ్యసింపఁబూనుటయుఁ బ్రథానములనియు మీ రెఱుఁగనిది కాదు. నేనిపుడు వ్రాయుట మీకు దానిని స్మృతిగోచరము గావించుటకేయని యెఱుంగుఁడు. ముందు నారదచరితమునుండి మనము గ్రహింపఁదగిన విషయమేదని యూహింతము. బ్రహ్మ నారదుని సృజించెను. ఊరుభాగమునుండియే నారదుఁడుదయించెను. ఈమాట వినుచు నులికిపడకుఁడు. ప్రాక్కాలమున సృష్టిపద్ధతి యిట్టిదేయని మహాత్ము లెఱుఁగుదురు. ఇపుడిపుడు కొందఱు తత్త్వజ్ఞు లెఱుఁగుచున్నవారు. ఇంకను వారికిఁ బూర్ణముగాఁ దత్పద్ధతి తెలియలేదని నాభావము. లోకజ్ఞానము రవంతయులేనివారా క్షేపింతురు. వారి దృష్టికి తొడనుండి యొకముని పుట్టుట వెంటనే మాటలాడుట, జ్ఞానియగుట, లోకములఁ దిరుగుటయను నివి యసంగతప్రసంగములుగాఁ గనఁబడక మానవు. ఏలనఁగా వారికి జ్ఞానములేదు. వారికింగల జ్ఞానమున నీవిషయమెఱుంగఁ దరముగాదు. కాఁబట్టియే వారా క్షేపింతురు. దానికి మనము కినియరాదు. కినిసినచో మనము వారికంటెఁ బామరులమే యగు

దుము. తమకు విశ్వాసపాత్రములుగాని విషయములు సర్వా బద్ధములని పలుకుటకుఁ గారణము తెలివితక్కువయేగాని వేఱు కాదు. అట్టివాని నెఱుంగఁదగు జ్ఞానము సంపాదింపఁ బ్రయత్నింపవలయును గాని యున్న యత్యల్పజ్ఞానమునకు సంతృప్తి నొందరాదు. ఇప్పటిచదు వట్టిజ్ఞానము నార్జింప సాధనము కాదు. ఐహికజ్ఞానమునకే యిది చాలదనఁగా నిఁక నింద్రియాతీత విషయముల నది యెట్లు తెలియఁగలదు? ఇఁక విషయమును వినుఁడు.

పూర్వకాలమునఁ బ్రాయికముగా నందఱు జ్ఞానసంపన్నులు. వారికి సదా తపోనిష్ఠపైననే దృష్టియుండెడిది. కామక్రోధాదులు వారికి దూరముగా నుండునవి. కావున వారి చిత్తమతినిర్మలము. సంకల్పములు క్షణక్షణ భిన్నరూపములు గలుగవు. సదా భగవదర్పితమై వారిచిత్తము విషయాంతరములయందుఁ బ్రవర్తింపకుండెడిది. కావున నెప్పుడే నొక వాంఛ వారికిం గల్గిన నది యప్పుడే ఫలించును. సదా విషయాంతరములప్రక్కకే వ్రాలుచుండు చంచలాత్ముల మనస్సునఁగల్గు సంకల్పములకుఁ బరిమితిలేదు గావున నేదియు ఫలింపదు. అట్టివా రితరులసంకల్పములు నట్లే ఫలింపవన్న నమ్మకమున నిట్టి యద్భుతవిషయముల నమ్మరు. వారి నమ్మింప సాధువులు ప్రయత్నింపరని నా విశ్వాసము. ఏలనఁగా వారి కర్మములట్టివి. వానికి లోఁబడియే వారుండవలయును. కర్మఫలముల మార్పఁ బ్రయత్నించుపని భగవంతుఁడే మానినప్పుడు తద్భక్తులు మానకుందురా? సత్కర్మానుష్ఠానమున మానసము నిర్మలమగు. అద్దము ధూళిచేఁ గ్రమ్మఁబడినపుడు ప్రతిబింబము నది

కనఁబడునట్లు చేయఁజాలదు. దానిని దుడిచినఁ గనఁబలుపఁ గలదు. అట్లే దుష్కర్మఫలముల ననుభవించువారి కజ్ఞానాంధకారము సాంద్రముగ మనోదర్పణము నాచ్ఛాదించి యుండును. అది జ్ఞానభాస్కరోదయమునఁ గాని నశింపదు. అట్టివారికడఁ గూరుచుండి యింద్రియాతీతవిషయములఁ దెలుపఁబూనువారి ప్రయత్నము పనిలేనిమంగలి పిల్లితల గొఱిగెనన్న సామెత వంటిది. అట్టివారి కింకను దెలుపఁబూనిన వ్యర్థకాలక్షేపము చేసిన ట్లగునుగదా? కావున వారితో సంభాషింపకుండుటయే సముచితము. అయిన వారికెన్నటికిని దెలియకున్న నెట్లు? వారికి సత్కర్మాచరణబుద్ధి యుదయించు టెట్లు? అన్న ప్రశ్నము రాఁ దగును. సమాధాన మేమనఁగా వారి యసత్కర్మఫల మనుభవమునఁ జాలభాగము క్షీణింపఁగా యత్కించిత్సత్కర్మ ఫలము పొడసూపును. ఇది నిక్కువము. దాన నించుక సద్గోష్ఠి కతఁడు ప్రయత్నించును. ఆమార్పు సాధువు లెఱుంగుదురు. కాన నట్టితఱి వాని కించుకహితమును బోధింతురు. దాన నాజీవుఁడు వృద్ధికి రాఁదగు కర్మముల నొనరింపఁ బ్రయత్నించును. ఇది యప్రతిహతసిద్ధాంతము. ప్రకృతవిషయము నింక వినుఁడు.

యోగులు జ్ఞానభాస్కరప్రతిధ్వంసితకల్మషాంధకారలేశులు. కావున నెప్పుడో వారికిఁ గాంక్ష గలుగును. అది లోకోపకారమున కగు. సృష్టిచేయుమూహ వారికింగల్గిన నది భగవంతునియాశయమని వారు నమ్ముదురు. కాఁబట్టి యట్టితఱి నా వాంఛాపూర్తికి సంకల్పించి యేయవయవమును వీక్షింతురో యందుండియే యావాంఛ ఫలించును. మానసపుత్త్రు లట్టివారేయని యెఱుంగఁదగు. బ్రహ్మ పరమేశ్వరానుగ్రహ

పాత్రుఁడై సృష్టికార్యమున నియుక్తుఁ డయ్యెను. అట్టితఁడి సత్పుత్రవాంఛ యతనికిం గల్గెను. తనయూరువు నపుడు చూడఁగా నావాంఛయే తత్తపఃఫలముగా జ్ఞానప్రదుఁడగు నారదాకృతిం దాల్చెను. అతఁడు బ్రహ్మకుమారుఁడని ప్రసిద్ధుఁ డయ్యెను. కావునఁ దొడనుండికూడఁ గొడుకు పుట్టునా యని ప్రశ్నింపరాదు.

"గహనా కర్మణోగతిః."

అన్నగీతోక్తి యీవిషయమునే సూచించెడిని. కర్మము పరమేశ్వరస్వరూపము. దానిగతి విశేష మిట్టిదని యెఱుంగఁ దరము కాదు. ఇఁక నారదచరిత్రము నించుక విమర్శింతము.

నారదుఁ డుదయించి జ్ఞానియై తిరుగుచుండెను. భగవంతునాజ్ఞ లోకులకు జ్ఞానసంపత్తిని గల్గించువాఁ డుండవలయు ననియే. కావున నాతఁ డాపని చేయఁబూనెను. బ్రహ్మ యతఁడు సృష్టిచేయక యూరక తిరుగుచున్నాఁడే యని యూహించి నాయనా! ఊరక తిరుగనేల? ప్రజల సృజింపుము. విశ్వము జనపూర్ణము కావలదాయని హెచ్చరించెను. నారదునివలన నెన్నియో కార్యములు కావలసియున్నవి. కావున నారదుఁడు తండ్రికి బుద్ధిచెప్పునట్లు భగవంతుఁడు సంకల్పించెను. వెంటనే నారదుఁడు తండ్రితో నించుక యసంగతముగా నసఁగా నతని భావమునకు విరుద్ధముగా బదులు చెప్పెను. దాన బ్రహ్మకుఁ గోప ముదయించెను. నీవు గంధర్వుఁడవు కమ్ము. ఒక్కకల్ప ముండుమని బ్రహ్మ శపించెను. ఇట్లు శాపమిచ్చునట్లు చేసినది, శాపమీయ మూలకందమగు కోపము బ్రహ్మమదిఁ గల్పించిన దియు, భగవత్సంకల్పమే యని దీనిసారము. దీనికి ఫలమేమని

ప్రశ్నింతురా? సమాధానము చిత్తగింపుఁడు. గానకళ లోకమున వెలయవలయు. దానిచే స్తుతిపాఠములు వృద్ధిగాంచును. దానఁ బ్రాణికోటి భగవద్భక్తి నలవరించుకొనును. దానినుండి భగవత్కారుణ్యం బడయఁగలరు. ఈయూహ భగవంతుని మదిఁ గలిగినవెంటనే శాపవాక్య తదనుగుణముగా వెలువడియె. దాన నాముని గంధర్వుఁ డయ్యెను. ఇంతమాత్రమున భగవంతునిసంకల్పము పూర్ణముగా ఫలింపలేదు. గానకళ సంపూర్ణాకృతిం గాంచవలయునని కదా పరమేశ్వరసంకల్పము. అది నెఱవేఱవలసినదియే కదా. కావున నారదుఁ డొకనాఁడు గంధర్వనారీపరివృతుఁడై బ్రహ్మలోకమునకుంబోయి తాళహీనముగా గానము చేసెను. బ్రహ్మకు మరలఁ గోపముకలిగి మరల శపించెను. తత్ఫల మనుభవించుచుఁ దిరుగుచుండఁగా భగవంతుని సంకల్పబలమున నొకయడవిలో నగరమొకఁడు కనఁబడియెను. వేదనగరమని దానిపేరు. వాస్తవముగా నది నగరముకాదు. అందున్నవా రంగహీనులుగా నారదునకుఁ గానఁబడిరి. కారణ మడుగఁ దమ రెల్ల రాగములనియు నారదుఁడు తాళవిహీనముగా గానముచేసెనను లోనగువిషయములఁ దెల్పి సరస్వతి నారాధించిన నాకళయందుఁ బూర్ణపాండిత్య మలవడుననియు వా రుపదేశించిరి. నారదుఁడు సిగ్గుపడి సరస్వతి నారాధించెను. ఆమె విష్ణుపత్నియని చెప్పఁబడినది కదా. అదెట్లు? వినుఁడు. విద్యలన్నియు భగవంతుని వశంవదలు. ఈ గానకళాధిదేవత సరస్వతి. క్రొత్తగా సృజింపఁబడునదెల్ల భగవదనుగ్రహపాత్రము కదా. కావున నీ గానకళాధిదేవత సరస్వతి విష్ణుపత్నియగుట కేమిసంశయము? వేదకళకు సరస్వతి యని సావిత్రి

యనిపేరులు గలవు. ఆమె బ్రహ్మపత్ని యగును నారదుఁ డాసరస్వతి నారాధింపఁ బ్రత్యక్షమయ్యెను. వరమొసఁగి వీణ నిచ్చెను. దానింగొని వినఁదగువా రెవ్వరని వెదుకగా గోలోకమున రాధాకృష్ణులే దీనివినఁ బాత్రులని నారదునకుం దోఁచెను. వారియెదుటఁ బాడెను. అతనిశిష్యుఁడు తుంబురుఁడు కూడఁబాడెను. భగవంతుఁ డానందించెను. అనఁగా నేవిద్యగాని కొఱంతలేక నేర్చుకొనఁదగుననియు, దానిని రసజ్ఞులకడఁ బఠింపవలయుననియు నట్లుచేయకున్న నావిద్య యతనికి సత్ఫలము నీఁజాలదనియు దీనిసారము. గోలోకము సంతోషస్థానమనియు "నానందో బ్రహ్మ" యటన్న వేదమున కదియే దృష్టాంతభూతమనియు మన మెఱుంగఁదగును. ఎట్టివారికేని యసత్పథప్రవర్తనము దుష్ఫలము నీయక మానదనియుఁ దానే యధికుఁడనని స్వేచ్ఛగా మెలఁగుట హానిని గల్పించుననియుఁ దనకంటె నధికులే యందఱు నని భావించుట యభివృద్ధిమార్గమనియు నీ కథాద్వయమునుండి మనము నేర్చుకొనఁదగిన నీతులు. ఇంక గంగాప్రభావము నించుక వినుఁడు.

భారతవర్షమున నెన్నియో పుణ్యనదులు గలవు. అందు నగ్రస్థానము వహించినది గంగానదియని సకలపురాణమతము. సర్వసాధుసమ్మతము. ఈనదినుండియే హిమాలయ మతిశయ ఖ్యాతిఁ గాంచెను. ఇది స్వర్గమర్త్యపాతాళములయందు నున్నయట్లు ప్రసిద్ధిగాంచినది. మందాకిని భాగీరథి భోగవతి యని వరుసగా దానిపేరులు.

"యజ్జలం మద్వపుర్జాతం తద్వై బ్రహ్మద్రవం విదుః"

గోలోకమున శ్రీకృష్ణపరమాత్మ దేహమునుండి గలిగినజలము

అనఁగాఁ బాదోదకమే బ్రహ్మద్రవమను పేరఁ బరఁగెను. అదియే మందాకిని. అదియే భాగీరథి. అదియే భోగవతి. పుణ్యలోకముల గోలోకమెట్టిదో యీనదియు నట్టిదియే. సాక్షాచ్ఛ్రీకృష్ణపాదారవిందసంభూతము. శ్రీకృష్ణుఁడు పరబ్రహ్మము. తజ్జనితంబగు నీనదియుఁ బరమపావనము. కావునఁ దన్నదీస్మరణజలపానస్నానాదులకంటె సత్కర్మములు లేవని సాధుపురాణసమ్మతము. దూరముననుండి గంగాస్మరణముచేసినను జాలుననిరి. ఏల? మనస్సు ప్రధానముగదా. మనస్సుచే స్మరించుటయే చాలును. కాయికవాచికములకంటె మనస్సుచేఁ జేయఁబడినకర్మ మనంతఫలప్రదము.

"మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః."

అన్నసూక్తి సుప్రసిద్ధమే కదా. ఈ గంగామాహాత్మ్యప్రస్తావమున మఱికొన్నివిశేషములు పొడకట్టినవి. విష్ణువు కృష్ణానదియని, శంకరుఁడు వేణీనదియని, బ్రహ్మ కకుద్మినియని కనుపట్టెడిని. అనఁగా నీనదులలో స్నానముచేయుతఱి నాదేవతాధ్యానము చేయవలయునని దీనిసారము. ఆభావమున స్నానముచేసిననే యనంతఫలము. కాని యూరకస్నానముచేయుట యింతఫలము నీఁజాలదని మనము గ్రహింపవలయును.

"శ్రుతి. ఆపః పునంతు పృథివీం పృథివీ పూతా పునాతు మాం."

అన్నశ్రుతి జలము పవిత్రపదార్థములలో నతిపవిత్రములని హెచ్చరించునది. నారాయణమూర్తి యుదకస్వరూపుఁ డనుట సుప్రసిద్ధమే కదా. కాఁబట్టి భగవద్రూపములు జలములని భావించుచు నందు స్నానముచేయవలయుననియు దీని ముఖ్యతమసారము. ఇదియే దీనినుండి మనము గ్రహింపఁదగినవిష

యము. ఇంక నీ చర్చను మాని తరువాతికథను వ్రాయ నాలే ఖినిని నియోగించుచున్నాఁడను.

ఆర్యులారా! రాధామాధవవిలాసము లించుమించుగా నిప్పటికిఁ బూర్తియైనట్లే యూహింపవచ్చును. మరల రాధాచరిత్రము చాలకాలమునకుఁగాని రాదు. ఈ యుపాఖ్యానములకు ఫలముగా మీరెల్ల భక్తియుక్తులరై శ్రీ రాధామాధవ విహారములఁ దెలుపుచున్న జయదేవకవికృతమగు నీ శ్లోకరత్నమును శిరసా వహింపుఁడు. హృదయకమలమున వారిని నిలిపి భక్తిమై దీనిం బఠింపుఁడు.

"శ్లో. మేఘై ర్మేదురమంబరం వనభువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరు రయం త్వమేవ తదిమం రాధే గృహం ప్రాపయ,
ఇత్థం నందనిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయోర్జయంతి యమునాకూలేరహః కేళయః."

గీతగోవిందము.

## శ్రీకృష్ణుఁడు నందవ్రజమున కరుదెంచుట.

* భగవంతుఁ డిట్లు రాధాదేవికి మనస్సంతోషమును గల్గించి విరహజనితవ్యథను దీర్చి ముం దిట్టివ్యథ కలుగకయుండ హితముపదేశించి రాధామందిరమునుండి నందమందిరమునకు వచ్చి యందుఁ గొలఁదిదినములుండి మధురానగరమున కరుగఁ బోవ నిశ్చయించుకొనెను. నందునిఁ, దొమ్మండ్రుగుర నుపనందులను,వృషభానుప్రభృతులను, గలావతీయశోదలను,గోపికలను,

---

* ఇది గర్గసంహిత మధురాఖండము ఇరువదిమూఁడవయధ్యాయము నుండి సంగృహీతమని యెఱుంగునది.

గోపాలకుల నుచితరీతి నాశ్వాసించి వారి మనస్సంశయములం బాపి చక్కనిజ్ఞానము నుపదేశించి వారియనుమతి నెట్లో పొంది దివ్యస్యందన మధిష్ఠించి మధురానగరదర్శనత్వర చే నందగోకుల మునుండె బయలువెడలెను. దూరభూమి కరుగుచున్న యాశ్రీ హరి వియోగమున కోర్వఁజాలక వ్రజవాసులంద ఱువ్విళ్లూరు కోరికల వెంటఁ బోయిరి. భూమండలమున భగవంతునిసాక్షా ద్దర్శనము దుర్లభము. అట్టియెడ సర్వదా చూచుచున్నను వారికిఁ దృప్తియనుమాటయే కలుగలేదు. వారి ప్రీత్యతిశయ మును వర్ణింప నెవరితరము? శ్రీధరుని ముఖచంద్రునిఁ జూచు కొలఁదిని వారినయనము లనిమేషములై యుండెను. ఎట్టకేలకుఁ బ్రేమవివశ్వలులై యిట్లు పలికిరి.

శ్రీకృష్ణా! సత్వరంబ రమ్ము. వ్రజముననివసించు మాకె ల్ల నీవకదా దిక్కు. దర్శన మిమ్ము. దేవతల కమృత మొసంగి నట్లు మాకుఁ ద్వరగా దర్శనమిమ్ము. యశోద నిన్నుఁ జూచియే మహానందము నొందును. ఆమె యానందమునకుఁ గొఱంత కల్గనీయకుము. నందనందనా! వ్రజవాసుల కానందంబన నీవ కదా. జీవనము నీవేకదా. వ్రజమునకు ధనము నీవే. కులము నకు దీపము నీవే. మహాత్ములకు మోహము నీవే. వేసవియందు గ్రీష్మాదిత్యకిరణతప్తులకు శీతలోదకమెట్లో, శీతార్తులకు వహ్ని యెట్లో, జ్వరార్తుల కౌషధమేలాగో, మృతుఁడగు మానవు నకు నమృతవృష్టి యెట్లో అట్లే వ్రజమునకంతటికి నీదర్శ నము జీవనప్రాయము. కావున సర్వదా యిందే యుండుము. విశేషించి పలుకనేల? ఈజన్మమునఁగాని పూర్వజన్మమునఁగాని మే మేమేని సుకృత మొనరించియున్న దానికి ఫలముగా మా

చిత్తములు నీపాదసరోజముల నిలుచుఁగాక. ఏజనులమానసములు నీపదాంబుజములయందు నిలుచునో వారే భక్తులు. నీకుఁ బ్రియులును వారే. నిర్గుణుఁడవయ్యును బ్రకృత్యతీతుఁడవయ్యు భక్తోద్ధారణార్థమే సగుణుఁడవైతివి. భక్తులకంటె శివవిరించులు శ్రీదేవియు నీకుఁ బ్రియులు కారు. నిష్కాములగు మహాపురుషులు బ్రహ్మపదమిచ్చినను వలదని నిన్నే సేవింతురు. యోగులందఱు నైరపేక్ష్యసుఖము శాంతము నీదర్శనమే యని వాకొనుదురు. అని పలుకుచుఁ బ్రేమాతిశయమున నోడలెఱుంగక యేడ్చిరి. శ్రీకృష్ణునింజూచుచు మరల నెపుడు చూడఁగల్గుదుమోయని పలుకుచు నశ్రుజలములు ధారలుగాఁ బ్రవహించుచుండఁగా నేడ్చిరి. భక్తవత్సలుఁడు కాన శ్రీకృష్ణుఁడు నశ్రుపూర్ణనయనుఁ డయ్యెను. అంతట విరహావిహ్వలులై వినతులగు నాగోపకులంగాంచి శ్రీహరి యిట్టులు పలికెను.

ఓ గోకులవాసులారా! నాప్రాణములు మీరే. నాకుఁ బ్రియులు మీరే. నాహృదయము మీయందే యుండును. మధురయందీదేహముమాత్ర ముండును. మిమ్మెల్లఁజూచుట కొక్కనెలకు మరలి వచ్చెదను. మనస్సుచే మీకు దూరమందుండును. అన్నింటికి మనస్సేకదా కారణము. మఱొక్కవిశేషము కలదు. గోపాలకులారా! యాదవులతో యుద్ధమొనరింప జరాసంధుఁడు రాఁ బ్రయత్నించుచున్నవాఁడఁట. నేనిపుడా యాదవులకు సహాయము చేయఁబోవుచున్నాఁడను. కాన మీరు దుఃఖింపరాదు. అని పలికి వారివగపుడిపి వారిని మరలించెను. కాని వారు శ్రీకృష్ణునానతి మీఱఁజాలక మరలి యింటికింబోవుచు మరలిమరలి శ్రీహరింగాంచుచు యశోదానందరాజుల

నొక్కరథముపైఁ గూరుచుండఁజేసి శ్రీదామాదిసఖులను వేఱొక్కరథముపై నెక్కించి తాను రథమెక్కిన శ్రీకృష్ణునిరూపమును మదినిలిపి ధ్యానించుచుఁ జనిరి.

ఉద్ధవుఁడు రథముఁ దోలెను. హరి యాయాయిమనోహరభాగములంజూచుచు నానందించుచు మున్ను తా గోపబాలకులంగూడి విహరించినతావు లివిగదా యని స్మరించుచు నుద్ధవునకుం దెల్పుచు గోవులమేపినతావు లివియని బ్రహ్మ యావుల నంతర్ధానముచేసినతా విదియని మరల నాధేనువు లెప్పటియట్ల కనఁబడిన దీచోటనేయని కనఁబఱచుచు రథగమనమును మెచ్చుకొనుచుఁ దన్నుదర్శించువారి నాదరించుచుఁ బర్వతములను గాననములను దాఁటి మధురానగరమును జేరెను. ఈచరిత్రము పరమపావనము. సదా స్మరింపఁదగినది.

## బలరాముఁడు కోలదైత్యుని వధించి మునులకు వరమిచ్చుట.

* మధురానగరమును శ్రీకృష్ణుఁడు ప్రవేశింపఁగా నందున్నవా రానందపరవశు లైరి. శ్రీహరి మరలరాఁడేమో వ్రజవాసు లడ్డుపడి రాకుండఁజేయుదురేమో యన్నసంశయములు దొలఁగెను. కొలఁదిదినములు సుఖముగాఁ గాలముగడచెను. దినమొకగడియగాఁ గాలము గడచుచుండెనే కాని శ్రీకృష్ణసందర్శనతృప్తి యందెవ్వరి కేదినమునందును గొఱంతగాంచకుండెను. మధురానగరమునకు నించుక దూరమునన్న దేశమునఁ బ్రజలనెల్లఁ గోలనామకదైత్యుఁడు బాధించుచుండెను. వాని బాధల నోర్వఁజాలక ప్రజలెల్ల శ్రీకృష్ణబలరాములకుఁ దెలుపు

---

* ఈవిషయము గర్గసంహిత మధురాఖండము ఇరువదినాల్గవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

కొనసెంచి బ్రాహ్మణులంగూడి సతీసుతులం దోడుకొని వచ్చు చుండిరి. వారిబాధలం దొలంగించువా రాభూతలమున నొక్కం డేని లేకుండెను. ప్రతిదిన మొకయేడుగా వారు గడపుచుండిరి. దేవతలే నాబాధలం బాపంజాలక మిణకరించుచుండిరి. ఆప్రజల దైన్యమునకు మేఱ లేకుండెను. ఎంతకాలమునకు దిక్కుగానక వారెల్ల రామకృష్ణులకుం జెప్పుకొనం దలంచి సంసారములు మాని ప్రాణములు పిడికిటంబట్టుకొని బయలువెడలి కష్టముల కోర్చి వచ్చుచుండిరి. త్రోవలోని వారికష్టములకుం బరిమితిలే కుండెను. ఎట్లో శ్రమంపడి మధురానగరమున కేతెంచి బ్రదికి తిమిరా స్వామీయని హాయి జెందిరి. యాదవులు వారి నాద రించి యుండ వసతులం జూపిరి.

ఒక్కదినము వేగముగాం బరుగిడు నశ్వవర్యమునెక్కి బలరాముండు స్వల్పసంఖ్యపరిజనులంగూడి వేంటలాడు కౌతూ హలమునం గానకరిగెను. దీనులై వచ్చుచున్నవారిలో వెనుకం జిక్కినప్రజ లాబలరాముని రాకనెఱింగి పాదములపైంబడి మొ ఱ్ఱపెట్టుకొనిరి. హర్షగద్గదవాక్కుల నిట్లు తమబాధలం దెల్పు కొనిరి. మహాబాహూ! రామా! బలరామా! కరుణానీరధీ! దేవాదిదేవా! కోలదైత్యునిబాధల ననుభవింపంజాలక శరణు చొరవచ్చుచున్నారము. ఒకానొకదానవుండు కలండు. వాండు కంసమిత్రుండు. మహాబలశాలి. క్రూరచిత్తుండు. హింసాపరా యణుండు. కౌశారవిభూపాలుండు మాదేశప్రభువు. ఆతనినశ్ర మంబున నాకోలదైత్యుండు జయించెను. కౌశారవినగరమును దా నాక్రమించి రాజ్యమేలుచు మమ్మెల్లం బీల్చి పిప్పిచేయు చున్నాండు. కౌశారవిరాజు తద్భయార్తుండై గంగాతీరమున

కరిగి యందెట్లో యున్నవాఁడు. రాజ్యార్థము మీపాదపద్మ ములనాశ్రయింప రాఁదలంచి యున్నవాఁడు. మే మాతనిప్రజలము. * మారాజునకు రాజ్య మిప్పింపుము. మాబాధలఁ దీర్పుము. మారాజు మమ్మెల్లఁ బుత్త్రులనుగాఁ బాలించువాఁడు. ధర్మాత్ముఁడు. ఆరాజుపాలనమున మారాజ్యము రాజన్వంతమనఁ బరఁగెడిది. కావున మేమెల్ల సుఖులమై యుంటిమి. అట్టిమమ్మును మారాజును గోలదైత్యుఁడు బాధించుచున్నవాఁడు. ఆకడగండ్లకుఁ దాళఁజాలకయే వచ్చితిమి. త్రిలోకకంటకుఁడగు కంసుని బొలియించిన సోదరులు కదా. తత్సఖుని గోలదానవుని బొలియించిన భూపీడన మించుకతగ్గును.కోలదైత్యుఁడు జీవించియుండుదనుకఁ గంసుఁడు చావనట్లే తలంపుము. భక్తరక్షణదీక్షుఁడవు గదా. భగవంతుఁడవయ్యు మానుషాకృతిం దాల్చితివి. అని గోడుగోడున నేడ్చుచుఁ బలికిరి.

ఆప్రజల దీనవాక్కులు నాలకించి భక్తవత్సలుఁడగు బలరాముఁడు వేఁటతమకముడిగి గంగాయమునా మహానదులనడుమనుండు కౌశాంబీనగరమున కరిగెను. కౌశారవిరాజు పాలించుటఁ గౌశారవీ నగరియనియుఁ గౌశాంబియనియు నాపురము ప్రఖ్యాతిం గాంచెను. బలరాముఁడు తనతోఁ బోరనేతెంచుట నాలకించి యాకోలదైత్యుఁడు భీకరాకృతుఁడై యాడుకఱచి పది యక్షౌహిణుల సైనికులంగూడి చండవిక్రమమున యుద్ధము చేయవచ్చెను. ఆబల మొకసముద్రమువలెఁ గానవచ్చెను. ఈ బలసముద్రమునందు వడివడిఁ బరుగువాఱు నశ్వములే తరంగ

---

* తత్సహాయం కురు విభో వయం యస్య ప్రజాశ్శుభాః, పుత్రవత్పాలితా స్తేన మహాసౌఖ్యసమన్వితాః=అని మూలము.

ములు, గజరథములు తిమింగిలములు. ఆసేనామహాసముద్రము ను జూచెను. ప్రళయార్ణవముభంగి ధ్వనిచేయుచు వచ్చుచుం డెను. వీరభటుల కోలాహలములు మిన్నుముట్టుచుండెను. బలరాముఁ డారాయని తలంచెను. దీని నశింపఁజేయఁదగు నని నిశ్చయించెను. ఈ సేనాసముద్రమునకు సేతువీ హలాయుధమే యగునని తలంచెను. తనబల మత్యల్పము. దానవసేనతో నిది పోరాడఁజాలదని యూహించి వారినెల్లఁ దనవెనుక నుండనియ మించి హలముసలములు సహాయములుగాఁ గొని దాని నెది రించెను. తనయవతారఫలముగా ముసలప్రహారమున దానిఁ బడలుపడం జేసెను. వీరులు ఘోటకములు గజములు రథములు దానివ్రేటునకుఁ జూర్ణము లగుచుండెను. పరిపక్వఫలముల వలెఁ దలలు క్రిందఁ దొరలాడుచుండెను. నిశ్శేషము చేయఁ గలఁ డీమహాత్ముఁడని హతశేషవీరభటు లాలోచించిరి. ఇఁకఁ దడవుచేయుట పాడిగాదని కాలికి బుద్ధిచెప్పిరి. రణమండల మెల్ల వీరభటవిచ్ఛిన్నమస్తకనిబిడ మయ్యెనుగాని శరీరధారి యొక్కఁడే నందుఁ గనఁబడకుండెను.

అంతఁ గోలమహాసురుఁ డేకాకియై బలరాముని మార్కొ నియెను. రాముఁ డొక్కరుఁడే సకలశస్త్రాస్త్రములఁ దాల్చి యయ్యసురుఁడు మార్కొనఁగా నాతఁ డెక్కినగజము మహో గ్రముగాఁ గనుపట్టెను. దాని నొసటఁబెట్టిన సిందూరతిలకము, గండములకుఁబూసిన కస్తూరీలేపము దాని భయంకరాకృతిని మఱింతభయంకరముగాఁ జేయుచుండెను. దానిని బంగరుగొలు సులతోఁ గట్టివేయుట వాడుక. కటిబంధ మెంతోవింతగా నుండెను. దానిచెక్కిళ్లనుండి మదజలము నిరంతరధారలుగా

స్రవించుచుండెను.నాల్గుదంతములు వానికుండుట నైరావతమా యనుభ్రాంతి కల్గుచుండును. ఘంటాద్వయటంకారనాదముల రులకుఁ బెనుభీతిని గల్గించుచుండును. దిగ్గజమునకన్న నది యున్నతమైనది. శబ్దించు కాలమేఘధ్వనివలె దానిఘీంకారము వినఁబడును. దానిచెవులకు రెండంకుశములు తగిలింపఁబడి యుండెను. అట్టి భయంకరమహాగజముపై నెక్కి కోలదైత్యుఁడు బలరామునిమార్కొని యేనుఁగును బైకిఁదోలెను.

కోలాసురుఁడు దానిని దనపై కురవడించుటయు నది మహత్తరాకృతిందాల్చి యట్టె తన్నుఁ గాలమట్ట నరుదెంచుటయుఁ జూచి బలరాముఁడు కోపోద్రిక్తమానసుఁడై శతమఖుఁడు వజ్రాయుధముచేఁ బర్వతమును భేదించునట్లు తీవ్రతరముసలాయుధమున దానిం గొట్టెను. ఆవ్రేటునకే యాదంతావళము భగ్నమై దండప్రతాడిత మృద్ఘటమువలె శకలములై ధరఁబడియెను. దాని యవయవము లివ్వివ్వియని యెఱుంగ శక్యముగాకుండెను.రాక్షసుఁడు ధరఁబడిలేచెను. వానిముఖము వరాహముఖము వంటిది. కాననే కోలదానవుఁడనుపేరు వానికిఁ బ్రసిద్ధమయ్యెను. వాఁడు భీకరాకారముఁ దాల్చి రక్తాక్షుఁడయ్యెను. వాఁడు నిశితాగ్రాంకుశమును విసరి బలరామునిపై వైచెను. అది యెందఱనో శత్రువులశిరముల ఖండించినది. ఆయలవాటునచే బలరామునిం జంపనెంచి వాఁడు వైచెను గాని బలుని ముసలాయుధప్రహారమున నూఱుతునుకలై ధరపై రాలెను. దానిపాటుఁగాంచి కోలదైత్యుఁడాగ్రహించి వేయిమంది మోయఁగల భారముగలిగి భయంకరాకృతిఁ గల్గు గద నవలీలఁ గరమునఁ గీలించి బలరాముని హృదయమును

లక్షించి విసరివైచి ఖలుఁడుకావున మేఘనాదమనునట్లు ఘోషించెను. యదూద్వహుఁడాప్రేటునకుఁ గదలక నిలిచెను. భగవంతు నాస్వల్పాయుధ మేమిచేయఁగలదు? లోకులెల్లఁ గనుఁగొనుచుండ నాగదాప్రహార మాతనికిఁ బుష్పప్రహారము గజమునకువలె నించుకయు నొప్పినైనఁ గల్పింపఁజాలదయ్యెను. అంత నవార్యకోపంబున బలరాముఁడాదానవుని మెడకు నాగలిని దగిలించి లాగి ముసలమున మోఁదగా నాతనిశిరస్సు పగుల రక్తప్రవాహమున భూమినిదడుపుచుఁ గ్రిందఁబడుచు నాదానవుఁడు ముష్టిప్రహారమున బలదేవునొప్పించి గతప్రాణుఁడై బొక్కగనఁబడి యదృశ్యుఁడయ్యెను.

ఇట్లదృశ్యుఁడై యాకోలదానవుండు దైతేయి యనంబడుమాయను గల్పించెను. ఆమాయ యతిభయంకరాకారము గలది. దానఁ బ్రళయవాతము లుద్భవించెను. వానింగూడిన ప్రళయాంబుదములు దోఁచెను. వానిచే నంధకార మఖిలజగంబు నావరించెను. ఆకాశము నిరవకాశ మయ్యెను. జపాకుసుమతుల్యరక్తబిందువులు పడఁజొచ్చెను. వెంటనే మహావృష్టి పర్వెను. దుర్గంధమును గల్పించుపదార్థములు పడసాగెను. సురావృష్టియు దానివెంట మాంసవృష్టియు గురిసెను. ఆభయంకరవృష్టిని జూచి యందున్నమానవులెల్ల హాహాకారము లొనరించిరి. బలదేవుఁడాదానవుని మాయామహిమమును జూచెను. క్రోధోగ్రనేత్రుఁడయ్యెను. సమంత్రకంబుగా మహావైరిచమూమారణదక్షంబగు ముసలాయుధమును బ్రయోగించెను. అది సర్వశత్రుప్రయోగముల ధ్వంసముచేయునది. సకలాస్త్రములు తద్దర్శనమాత్రమునఁ జెడును. అష్టధాతుమ

యము. దృఢసారము. దాని తేజస్సు శతయోజనములు వ్యాపించును. ప్రళయాగ్నియో యన నది ప్రజ్వరిల్లు. అట్టి యాముసలాయుధము దశదిశలఁ బ్రజ్వరిల్లఁ జేసెను. ఆకాశము నావరించిన మేఘములు దాని దర్శనమునే పటాపంచ లయ్యెను. రవికిరణప్రసారమున మంచుతుంపురులఁ బోలె మేఘములు శకలములుగా నశించుట చూచువారి కచ్చెరువు నింపెను. అంత బలరాముఁ డాయసురసేనల హాలాయుధమునలాగి యొక్కచోఁ జేర్చెను. ఆమంటలు వానినెల్లఁ గాల్చెను. మాయయంత నశించెను. రెండు చేతుల నాదానవాధముని బట్టుకొని బలరాముఁడు గిరగిరఁద్రిప్పి తూలలవమువలె వానిందలంచి భూపృష్ఠమున మోఁదెను. ఆదానవుఁడు పడునప్పటిభారమున భూమండలమెల్ల నల్లలనాడెను. ఆవ్రేటున నాయసురనేత్రము లూడిపడెను. పండ్లు చూర్ణము లయ్యెను. ప్రాణము లేక నీతనువున నుండనేలయని తమదారిన బోయెను. వానిమృతి వృత్రదానవునిమృతివలెఁ గనఁబడియెను. అత్తఱి భూమ్యాకాశముల యందు జయజయనినాదము లుప్పతిల్లెను. దేవదుందుభులు మ్రోఁగెను. పుష్పవృష్టి బలరామునిపైఁ గురిసెను.

ఇట్లు కోలదానవుఁ బొలియించి తత్పరిజనులఁ దును మాడి యారాజ్యంబు నిష్కంటకంబు గావించి కౌశారవిభూపాలుని బిలిపించి బలరాముఁ డాకౌశాంబీనగరమున నాతని నిలిపి రాజ్యం బెప్పటియట్ల యేలుచుండుమని హితముపదేశించి తనశరణు చొరవచ్చినప్రజల యథాపూర్వముగా నందునునిచి తనకృత్యమెల్లఁ బూర్తికాఁగా నందుండి భాగీరథీస్నానముసలుప నరిగెను. అత్తఱి నాబలరాముని గర్గాచార్యులు

లోనగు పురోహితులు కూడియుండిరి. ఆ స్నానసమయమున నచ్యుతాగ్రజుఁడు బ్రాహ్మణప్రవరులకు గోభూరత్నసువర్ణాదులఁ బెక్కువిధముల నొసంగెను. వారెల్లఁ బరమానందమున నా బలదేవుని వినుతించుచుఁ బోయిరి. బలరాముఁ డేస్థలమున స్నానముచేసెనో ఆచోటు రామతీర్థమనం బ్రఖ్యాతం బయ్యెను. అది మహాపవిత్రమని ప్రఖ్యాతిం బడసెను. కార్తికమాసమునఁ బున్నమయం దా రామతీర్థమున స్నానమొనరించిన వారి ద్వారస్నానశతగుణపుణ్యము లభించునని మహర్షులు శాసించిరి.

ఆ రామతీర్థము కౌశాంబీనగరమున కీశాన్యభాగమునందు నాల్గుయోజనములదూరమున నున్నది. సూకరదానవుఁ డేచోటఁ బడి ప్రాణములవదలెనో ఆచోటి కాతీర్థము వాయవ్యభాగమున నాల్గుయోజనములంతదూరమునఁ గలదు. కర్ణక్షేత్రమునుండి యాఱుక్రోశముల దూరముగను, నలక్షేత్రమునుండి యైదుక్రోశములంతదవ్వున నామహాతీర్థము గలదు. పై రెండు క్షేత్రముల కీరామతీర్థ మాగ్నేయభాగమున నుండునని పెద్దలు వచింతురు. వృద్ధకేశియనియు సిద్ధపీఠమనియు క్షేత్రములు ప్రఖ్యాతములు. బిల్వవనముకూడ నందే యుండును. వానికిఁ దూర్పుభాగమున మూఁడుక్రోశములంతదవ్వున నా రామతీర్థముగలదనియు నొకప్రతీతి గలదు.

## కోలదానవ పూర్వవృత్తాంతము.

వంగరాజగు దృఢాశ్వుఁడు కురూపుఁడగు రోమశ మునిం గాంచి పరిహసించెను. దాన నాముని యాగ్రహించి శపించెను. ఆశాపమునకుఫలముగా నారాజు వరాహముఖము కరాళదంష్ట్రలుగల దానవుఁ డయ్యెను. ముఖమునుబట్టియే

కోలదానవుఁ డనుపేరు వానికింగల్గెను. మహాఖలుఁడుకూడ నయ్యెను. కోలముఖుఁడగుట కా మునిశాపమే కారణము. బలదేవప్రహారమున నాయాసురశరీరమును బాసి ముక్తిపద మున కేగెను.

బలదేవుఁ డాతీర్థమునుండి యుద్ధవాది సచివవర్యులం గూడి జహ్నుతీర్థమును దర్శింపఁబోయెను. గంగానది యాచోటనే జహ్నురాజర్షి యజ్ఞవాటమును ముంచెను. ఆక్షేత్రమునఁ బ్రవహించుగంగకు జహ్నుతీర్థమనియు జాహ్నవి యనియు నామము ప్రసిద్ధమయ్యెను. ఆపుణ్యతమతీర్థమున స్నానముచేసి యందే కొలఁదిరాత్రులఁ గడపెను. దానిసమీపముననే పాండవుల కతిప్రియమగు నాహారస్థానము కలదు. అచ్చటికరిగి యొకరాత్రి నివసించెను. అందుండి యోజనదూరమున దేవగండూష మనుపేరుగల క్షేత్రమునకుంబోయి యందుఁ దపస్సొనరించుచున్న యొక్కమునిం గాంచెను. ఆతఁడు బలదేవునిగుఱించియే తపస్సొనరించుచుండెను. ఊర్ధ్వబాహువులొప్ప ముఖము పైకెత్తి యొంటికాలిపై నిలువంబడి ధ్యానస్తిమితలోచనుఁడై తనమూర్తినే ధ్యానించుచున్న తనభక్తుని జూడఁబోయి కుతూహలమున వానిం గాంచెను. వానిం జూచినంతనే యప్పటిరూపమును మాని తన యనంతరూపమును ధరించెను. వానిమదిఁ దోఁచెను. ఆరూపమును జూడఁగనే యామునికి బాహ్యస్మృతి గల్గెను. కన్నులు విప్పి యాయనంతుని మూర్తివిశేషమును దర్శించి పరమసుందరమగు నారూపమున కచ్చెరుపడి పాదములపైఁబడి వందన మాచరించెను. పరమభక్తి వినుతించెను. బలరాముఁ డాతనిశిరమునఁ దనహ-

ప్తమునిచ్చి వరమడుగుమా యని హెచ్చరించెను. ఆముని యానందపరవశత్వమున నోస్వామీ! నాయందుఁ దమకనుగ్రహము కలిగినట్లైన నే ననుగ్రహమునకుఁ బాత్రుఁడనైన నాకు సర్వోత్తమమై భగవత్సంబంధమై శుకమహాముని వక్త్రనిర్గతమై కలిదోషహరణక్షమమై తనరారు సంహిత ననుగ్రహింపుము. ఇదియె నేఁగోరువరము. అన విని బలరాముఁ డాతని లోకోపకారపరత్వమున కానందించి మునీంద్రా! నీకు భాగవతసంహిత యుద్ధవునిద్వారా లభింపఁగలదు. రాధికాదేవికీర్తి కలియుగమున నిహపరసాధక మగును. అని వరమీయ మాందూకముని యిట్లు పలికెను.

స్వామీ! బలదేవా! మహాప్రభూ! ఉద్ధవునకేల భాగవతసంహితోపదేశాధికార మిచ్చితిరి? నాకది లభించు టెప్పుడు? దయచే నీసందియమును బాపుమా. అన బలరాముఁ డోముమీంద్రా! పరమాద్భుతము పరమరహస్యమునగు నొకవృత్తాంతమును దెలుపువాఁడను ఆలకింపుము. ఇపుడుకూడ నాచెంతనే యుద్ధవుఁ డున్నవాఁడు. ఆచార్యసంప్రదాయము ననుసరించి యాయుద్ధవుని నిట దర్శింపుము. ఈ తీర్థయాత్రాసమయమున నీ కుపదేశము విధివిహితముకాదు. నీకుముం దీయుద్ధవుఁ డుపదేష్ట కాఁగలఁడు. నేనీతని కీవిషయమును దెల్పువాఁడను. సంహితాచార్యకత్వమున నుద్ధవునీతని నియోగించితి. దాని కీతఁడు పాత్రుఁడనియే తలంచి నియమించితిని. ఆసంహిత నందాదులకును గోకులమున నివసించు గోపికలకును బ్రీతిని గల్గింప నొనరింపఁ బడినది. అది భగవద్భక్తిమయము. పరాత్పరుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మ మద్దానినొనరింప నాజ్ఞాపించెను. అది

తత్వసారము. ఉద్ధవునకు స్వాత్మసారమును దెలిపి యీకార్య మునకు నర్హుఁడనియె. ఉద్ధవునకు సాక్షాత్కార మొసంగెను. భేద మీయిరువురకు లేదని నమ్ముము. వ్రజవాసు లితని శ్రీ కృష్ణుఁడనియే భావించి విశేషించి పూజించిరి. వసంతగ్రీష్మర్తు వులలో గోకులమున సంచరించి శ్రీహరియుపదేశముల వారికిం దెల్పి రాధకుఁగల మనస్సంతాపమును హరించి కృతార్థుఁడై యున్నవాఁడు. వ్రజవాసులంగూడి భూమండలంబెల్లఁ జరిం చెను. నందాదులకు గోపికలకు గోవులకు సంతాపహారుఁడనఁ బరఁగెను. మంత్రాధికార కుశలుఁడు. సగ్వపరికరపరియుతుఁడు. ఒకానొక కాలమునం దీయుద్ధవుఁడు భగవంతుని మదినిల్పి ధ్యానమొనరించుచుండఁగా ధర్మరక్షణార్థమై శ్రీకృష్ణమూర్తి తనతేజము నీతనిమదిఁ బ్రవేశపెట్టెను. ఆతేజస్సు పరమాద్భు తము. ముద్రాధికార మీతనికి సర్వదా కలదు. ఆ యంతర్ధా నమునందే యీతనికి భాగవతసంహిత యుపదేశించునధికార మాహరిచే నీఁబడినది. ముం దుద్ధవుఁడు బదరీవనసమీప ముననుండు సానుజుండగు ధర్మజునకు నాతత్వమును బోధింపఁ గలఁడు. ఆసంహితయే యర్జునునకుం గలుగఁబోవుసంతాపమును హరింపఁగల్గును. మధురానగరమున వజ్రనాభుఁడను యాద వుఁడు పుట్టఁగలఁడు. ఆవజ్రనాభుఁడు శ్రీకృష్ణపౌత్రునకుఁ బుత్త్రుఁడై జన్మించును. ఆసంతతి యాదవరాజ్ఞీకుటుంబమునకు సంబంధించినదియే యగునని నిశ్చయింపుము.

మఱియు నీయుద్ధవుని సంతాపహారుఁ డనునమ్మకమున శ్రీహరి భూషించుచును. కౌరవకులమునఁ బరీక్షిత్తను కుమా రుఁడొకఁడు కల్గును. ఆతనికిఁ గుమారుఁ డతితేజస్వి జనమే

జయుఁడు పుట్టఁగలఁడు. ఆజనమేజయుఁడు పితృశత్రుహా మగుయజ్ఞము నొకదానిఁ జేయఁగలఁడు. సంశయ మీవిషయమున లేదు. ఆజనమేజయునకు జ్ఞానసామగ్రియంతయు నీయుద్ధవునివంకనే కల్గును. అప్పుడు భాగవతపురాణపఠన మారాజుకడఁ గాఁగలదు. విప్రమునీ! శ్రీభాగవతపఠనమువలన సర్పయజ్ఞ మాజనమేజయుఁడు చేయుటవలనఁ గలుగఁగల సర్పప్రళయ మొకమునివలనఁ గాఁ గలదు. విప్రపూజ జనమేజయునిచే నొనరింపఁబడును. ఆవల నీయుద్ధవుఁ డీపుణ్యక్షేత్రమున కరుదెంచి యొకమాస ముండును. జనమేజయుఁడు నరుదెంచును. అనేకదానము లీక్షేత్రమునఁ జేయఁగలఁడు. మఱియు నారా జుద్ధవునింగూడి యందుండి గంగాతీరగతపుణ్యస్థలముల దర్శించుచు శయాననగరమునందు నివాసము చేయఁగలఁడు. శ్రీగుర్వాజ్ఞచేత సకలపరికరముల నేకరించి యందే యశ్వమేధ మొనరించును. దాన సర్వజేతయు నగు. ఏకచ్ఛత్రాధిపతియై శ్రీగురుశరణము నొందఁజాలును. గంగాతటమునఁ దూర్పుభాగమునఁ బంచక్రోశవిస్తృతభూభాగవర్యమునఁ బరమైకాంతికరూపమున భగవంతుని సేవింపఁగలఁడు. అందు భవరోగనివారిణియగు భాగవతీవార్త సాగఁగలదు. ఆసభయందు మహర్షులుందురు. ఆమహాత్ములసభలో నీవునుండి దానిని వినఁగలవు. దాన శ్రీనిర్మలపదమున కరుగఁగలవు. నన్నుఁగూర్చి తపస్సానరించితివి. కావున నీరహస్యవిషయములఁ దెల్పితిని. అని మాండూకమునికి వరమిచ్చి బలరాముఁ డుద్ధవాదులంగూడి యచ్చోటువాసి యీశాన్యదిగ్భాగమునకుం బోయెను.అందొక పవిత్రక్షేత్రమును బంచక్రోశపరిమితమునుగాంచి యందుం

డుగా నందలిమౌనులు సంకర్షణుఁ బూజించిరి. ఆపూజాకాల మున దేవత లరుదెంచిరి. మహర్షు లాపూజనుజూడఁ బిలువ కయే యొతెంగివచ్చిరి. కోలాసురుని జంపి ఖరాసురుని బొలి యించి హలాయుధమును ధరించి ముసలాస్త్రధారియై సౌందర్య రూపమున లోకులకు దర్శనమిచ్చి తాలాంకుఁ డనునామమును దాల్చినయనంతునకు నమస్కారములు. వారి స్తుతివచనముల నాకర్ణించి వారింగని యభీష్టవరమడుగుఁడనిపలుక వారు హర్షాం బుధినోలలాడుచు నిట్లు ప్రార్థించిరి. బలదేవా! మే మేయేసమయ ములయందు నాపదలఁగుంది భవత్పాదముల స్మరింతుమో అపు డాసకలబాధలు తొలఁగి మేము సుఖంబుండున ట్లనుగ్రహిం పుము. అని వారు ప్రార్థింపఁగా నారాముఁ డో ద్విజదేవత లారా! ఏయేసమయములయందు నన్ను స్మరింతురో శరణాగతు లగు మిమ్మెల్లఁ గలిబాధలంటకుండఁ గాపాడుదును. ఇది సత్య ము. నావాక్కు సత్యవిరహితముగాదని నమ్ముఁడు. ఈచోటనే మీకు వరమిచ్చితిని.నన్ను మీ రీతావుననే పూజించితిరి. కావున నిది సంకర్షణస్థాన మనంబడు. కలియుగమున నిది సకలపాపధ్వం సకంబగు. ఇందు స్నానముచేసి దేవతల నారాధించి ద్విజవ ర్యుల కన్నదానముచేసి విష్ణుపూజనము చేయుదురో వారిజన్మమే సఫలము. నిష్కాములు ముక్తి నొందుదురు. కాముకులు స్వేష్టఫలముల నొందుదురు. అని యాజ్ఞాపించి వారలనెల్ల నిలిపి సపరివారుండై స్వపురమున కరిగెను. కోలదానవుఁ బొలియించి విష్ణుపదీజలంబుల స్నానముచేసి శ్రీబలరాముఁడు మధురానగర మున కరిగిన యీకథను బఠించినఁ బాపము లడంగును.

మహాశయులారా! బలరామునిమాహాత్మ్యమును వింటిరి. ఇందుఁ గలవిశేషముల నాలకింపుఁడు. బలరాముఁడు దశావతారములలో నొక్కయవతారమెత్తిన విష్ణువుకదా. కొందఱు దశావతారములలోఁ గృష్ణుని జేర్చిరి. కాని కృష్ణావతార మీయవతారములలోఁ జేరినది కాదు. ఆ యవతారస్థితి వేఱు. దాని కింకొక్కటి సమానము కాదు. కావున నాచర్చ యిటఁ జేయను. ఈ కథనుబట్టి బలరాముఁ డవతారపురుషుఁడని తేలుచున్నది. భగవంతుఁ డొక్కపర్యాయము రెండురూపముల నవతరించునా? అట్టి తెలివితక్కువపని యేలచేయును? అని కొందఱందురు. కాని వారికిఁ గర్మసిద్ధాంతము మది నాటియుండదని నా తాత్పర్యము. అది మదిఁ బదిలపడి యుండిన వా రిట్లనరు. రామావతారమునఁ జావనివానరులు రక్కసులును గొందఱు గలరు. వారెల్ల నీ ద్వాపరాంతమున నవతరించి బలరామునిచేఁ దెగిరి. పరశురాముఁడుండఁగా శ్రీరాముఁ డవతరింపలేదా? ఎవ్వరెవ్వరిచే నేకాలమునఁ దెగవలయునో వారికొఱ కాకాలమున నాయవతారము గలుగును. భగవంతుఁడు కర్మస్వరూపుఁడు కదా. బలరామునిచే మృతినొందుప్రాణుల శ్రీకృష్ణుఁడు వధింపఁగలఁడు కాని స్వోక్తి వ్యాఘాత మొనరించిన ట్లగును. కావున శ్రీహరి రామకృష్ణరూపముల నవతరించెనని యెఱుంగవలయును.

బలరాముఁడు మధురానగరమున నుండఁగాఁ దనకొఱకై కాచియున్నజీవుఁడు స్మృతిగోచరుఁ డయ్యెను. వెంటనే శ్రీకృష్ణునిం గూడిపోవక తానొక్కండ బయలువెడలి కతిపయపరిజనులంగూడి వేఁటనెపమునఁ బోయెను. త్రోవలో శ్రీబలదే

వుని వెదకుకొనుచుఁ గౌశాంబీనగరవాసులగు ప్రజ లత్యా ర్తులై వచ్చుచు నెదురుపడిరి. వారి రాక బలదేవుఁ డెఱుంగును. అందులకే కదా పోవుచుండెను. వారియార్తి నాలకించి తనపయనము చాలించినట్లు నటించి వారింగూడి కౌశాంబీనగరమున కరిగెను. అప్రజలు తమరాజును గూర్చి పలుకునపుడు,

"పుత్రవ త్పాలితా స్తేన మహాసౌఖ్యసమన్వితాః."

అని పలికిరి. అట్టి యార్తికాలమునఁగూడఁ దమప్రభువును దండ్రివలె భావించిరని వారిమాటలంబట్టియే కానఁబడియెడిని. రాజన నట్టివాఁడే కదా. రాజ్యమే రాజునకుం గుటుంబము. ప్రజలే సంతానము. కావుననే కౌశాంబీనగరాధిపతి నంతగా నాప్రజలు కొనియాడి యాతనికి రాజ్య మిప్పింపుమా యని భగవంతుని బ్రార్థించిరి. ఆకాలపు మానవులస్వభావ మట్టిది. అందఱు ప్రభువులు కాఁగోరునాచార మాకాలమున లేదని దీనిచే స్పష్టము కాక మానదు. న్యాయప్రవర్తకుఁడగు ప్రభువునకు లోఁబడి ప్రవర్తించు సదాచారమే పూర్వకాలమునఁ గలదని శతశః సహస్రశః పలుకవచ్చును గదా.

కంసుఁడు మృతినొందినను బ్రజలకష్టము లంతము నొందవయ్యెను. తదనుచరులు తద్బంధువులు తన్మిత్రులు క్షితి నందందుఁ గలరు. వారిబాధలన్నిటిని వదలించినఁగాని ప్రజల యార్తి తొలఁగదు. అందుఁ గోలాసురుఁ డొకఁడని యెఱుంగఁదగు. శాపవశమున వంగరాజగు దృఢాశ్వుఁ డొకమహర్షి కురూపమును జూచి పరిహాసించెను. దాన నమ్ముని యాగ్రహమూని శపించెను. క్షమగల్గియుండుట మునులకు నైజమై యుండ నేల శపించెనన్న ప్రశ్నము రావచ్చును. కాని యా.

క్షమ లోకమున కిట్టితఁడి నుపయోగింపదు. ఆరాజు తొలిజన్మ మునఁజేసిన పాపఫల మనుభవమునకు రావలెఁ గదా. అట్టి దుష్కర్మప్రేరితుఁ డయినదే యారాజు పరిహసించెను. ధర్మచరితుఁ డైనను దుష్కర్మము తన్నుఁ బురికొలుప నతఁడా దుష్కార్య మొనరించెను. ఆకర్మమే యమ్మునిని శపింపుమా యని ప్రోత్సహించెను. కావున నతఁడు శపించెను. మునిని గాంచి నవ్వెనుగాన ముఖాంగము దోష మొనరించెను. కాన నీవు వరాహముఖము భయంకరదంష్ట్రలు గల దానవుఁడవు కమ్మా యని శపించెను. ఆమునివాక్క మోఘము. కాఁబట్టియే,

"శ్లో. లౌకికానాం హి సాధూనా మర్థం వా గనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వా చ మర్థోనుధావతి."

ఉత్తరరామచరిత్రము.

"హి యస్మాత్ లౌకికానాం ప్రాకృతానాం సాధూనాం సత్యవాదినాం వాక్ వాక్యం అర్థం అభిధేయం వస్తు అనువర్తతే. లక్షీకృత్య ప్రసరతి పునః కింతు అర్థః అభిధేయవిషయః ఆద్యానాం ప్రాథమికానాం ఋషీణాం వసిష్ఠాదీనాం వాచం వాక్యం అనుధావతి అనుసృత్య ఉత్పద్యత ఇత్యర్థః. లోకే యద్యద్వస్తు ప్రసిద్ధ మస్తి ప్రాకృతసత్యవాదిన స్తత్తదేవ వదంతి నతు తేషాం వాక్యతో వస్త్వంతర ముత్పద్యతే కింతు బ్రహ్మర్షయో యద్యద్వదంతి తత్తదేవ అసదపి ఉత్పద్యతే ఇతిసరళార్థః."అని వ్యాఖ్య. అన్నసూక్తి కల్గినది. మహర్షు లేవిధముగాఁ బల్కుదురో యది యసాధ్యకార్యమైనను సాగును. సామాన్యులగువా రన్నమాట యట్లు ఫలింపదు. కారణ మేమనఁగా సత్క

ర్మముల నాచరించి తత్ఫలములనుగోరక వానిని బ్రహ్మార్పణము చేసిన జ్ఞానధనులే మహర్షు లనఁబడుదురు. వారివాక్కు ఫలించుతటేనిగాని వెలువడదు. అది వెడలినయెడల దాన నేదో యొక లోకోపకార ముండును. ఆవాక్కు భగవత్సంకల్పాను సారమే బయలువెడలును గాని వృథా కాదు. ప్రకృతవిషయమున నీపద్ధతి యన్వయించునా యన్న వినుఁడు. బలరామునిచేఁ జావఁదగిన ప్రాణు లెందఱో గలరు. బలరాముఁ డచటికి వచ్చుటకు హేతు వుండవలెను. సూత్రధారుఁడు లేకయున్న నాటకము సాగదు. ఒక్కఁడు పెద్దతనము పూనకున్న సంసారయాత్ర సాగదు. అట్లే వీరినందఱి నొకతట్టు చేర్పఁగలవాఁ డుండవలెను. అట్టివాఁడే యీ కోలదానవుఁడు. భగవదాగమనకుఁ బ్రజలయార్తి కారణము. అందఱును మలమలమాడ్చువాఁ డుండినఁగాని శిష్టజనులందఱు ఘోషింపరు. అత్యుత్కటాధర్మములు సాగుచుండినఁగాని భగవంతుఁ డవతరించి వాని నడంపఁడు. కావున నమ్మునిని దోలుతఁ బురికొల్పి యాతని శపింపఁజేసినదియుఁ గర్మమే. కోలదైత్యుని బాపకార్యములు చేయఁ బ్రోత్సహించినదియుఁ గర్మమే. ప్రజలు బాధపడునట్లొనర్చునదియుఁ గర్మమే. కర్మమున కడ్డములేదని యెఱుంగుటయే సౌజన్యము. కావునఁ గర్మసిద్ధాంతము బలవత్తరము. దాని నాపఁజాలువాఁ డా సర్వేశ్వరుఁడు. కాని యితరుఁడు లేఁడు.

"శ్లో. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్. ౭.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే. ౮

భగవద్గీతా. ౪ అధ్యాయము.

"యదాయదా హి ధర్మస్య గ్లానిః హానిః వర్ణాశ్రమాదిలక్షణస్య ప్రాణినా మభ్యుదయ నిశ్శ్రేయససాధనస్య భవతి భారత! అభ్యుత్థాన ముద్భవః అధర్మస్య తదాతదా ఆత్మానం సృజామ్యహం మాయయా." అని శంకరభాష్యము.

అను నీ భగవద్వాక్యము పైయర్థమునే స్పష్టపఱచుచున్నది. భగవంతుని నవతరింపఁజేయు కార్యమనఁగా నితరులచే నేమాత్రము సాధింపశక్యముగానంత యసత్కర్మజాతము ధరఁ బ్రబలినమీఁద గత్యంతరము లేదని భగవంతునకుఁ దోఁచును. అపుడు ప్రకృతి నాశ్రయించును. ఆకార్యమును సాధింపఁజాలు రూపములవడ నాప్రకృతియే చేయును. ఆరూపమున నాకార్యమును దీర్చి తనరూపము నుపసంహరించుకొనును. బలరాముఁ డీమహాకార్యమును జేయుటకే యవతరించెను. కౌశాంబీనగరమున కధర్మరూపరాక్షసునివలనఁ గల్గిన బాధలం దీర్చి కాపాడెను. కాఁబట్టి బలరాముఁడు కృష్ణుననుచరుఁ డన్నదుర్వాద మెగిరిపోవునదియే గాని చర్చించినచో నిలువదు. అట్టులౌట బలరాముఁడు సామాన్యుఁడన్న దుర్భావమును వీడి ధర్మరక్షణార్థ మవతరించిన శ్రీమన్నారాయణమూర్తియే యని భావించి భజింపుఁడు. ఇరువురుగా నేల యవతరించుచున్న మొండిప్రశ్నము చేయకుఁడు. ఈ యిరువురివలనఁ దెగి ముక్తిని గాంచఁదగుజీవులు పెక్కండ్రు గలరు. వారిం బ్రోలియుంచుటకే యిట్లవతరించెనని నమ్ముఁడు.

ఇంక నుద్ధస్ఫరింగూర్చి నాలుగుమాటలు వ్రాయవలసి వచ్చినది. మాండూకముని బలరామునిరూపమును గల్పించుకొని బలరాముఁడు భూమియం దవతరింపకముందే నియతి జపము చేయుచుండెను. ఇది యసంగత ప్రసంగము కాదాయని మీ రూహింతురుగదా యని నే నెఱుంగుదును. వినుఁడు. భక్తుఁడు నిర్గుణుఁడు రూపనామరహితుఁ డగుభగవంతుని భజింపఁగోరి యొకరూపమును గల్పించుకొనును. వాస్తవముగా రూపము కల్పితమే. నాము మట్టిదే కల్పించుకొనకున్న నేమి బాధయని యాక్షేపింపరాదు. మనోవీథి నొకరూపము పాఁడ కట్టిరఁగాని ధ్యానింప వీలుండదు జగదాకారముగా ధ్యానింప రాదా యన్న నాస్థితి శుకునివంటివారికింగాని కలుగదు. అట్టి వాఁడు తపస్సుచేయ నక్కఱలేదు సదా తద్భావభావితుఁ డగుచుండును అదియే కర్తవ్యము. అట్టిభావము సర్వజనసుల భము కాదు. విగ్రహములఁ బూజించువారలకంటె మనోవీథి భగవద్రూపమును గల్పించుకొని ధ్యానించువాఁ డుత్తమోత్తముఁ డనఁబడును. సర్వదా లోహమయవిగ్రహములఁ జెంత నుంచుకొని గంధపుష్పాదుల నర్చించుచుండుట వృద్ధిమార్గము కాదు. మహర్షులుకూడ విగ్రహములఁ బూజించినట్లు పురాణములు ఘోషించునుగదా యని యడుగుదురేమో. పూజించుటయు సత్యమేయని మన మంగీకరింపవలయును. ఏలయనఁగా లోకసంగ్రహార్థమని తలంపుఁడు.

"శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే."

అన్నగీతోక్తిఁ బరికింపుఁడు. జనకాదులు లోకసంగ్రహార్థమై

కదా పామరులంబోలి యన్నికార్యములు చేసిరి. ముక్తులు కూడఁ దమరుచేసిన లోకు లాచరింతురన్న భావమునుగల్గియే కర్మము లాచరింతురు. విగ్రహములం బూజింతురు. అంతియే గాని యాత్మారాముని మనోవీథిని గనుఁగొనలేక కాదని యెఱుంగవలయును. కావున మాండూకముని తనమది కింపగురూపమును గల్పించుకొని భగవంతు నారాధించుచుండ నారూపమునే దాల్చి భగవంతుఁ డవతరించి యాత్రావ్యాజమున నచటికింబోయి తన యనంతత్వమును మదికిఁ దోఁచునట్లుచేసి యతనికి స్మృతిని గల్పించి వరమిచ్చెను. వరమడుగుమనఁగా నా మాండూకముని భాగవతసంహిత నుపదేశింపుమని కోరెను. ఏల? అనఁగా భగవద్దర్శనమునఁ దానుదరించితిననియు లోకులను దరింపఁజేయఁ దత్త్వమును బ్రధానముగాఁ దెలుపుభాగవతము నుపదేశింపఁ బ్రార్థించెననియు నామునిభావ మని మన మూహింపవలయును. ఆవర మీయఁగోరి యప్పుడే దాని నుపదేశింపకముం దాకార్యము ఫలించుననియు నుద్ధవుఁ డుపదేశింపఁగలఁడనియు దాని కనువగుసమయము రాఁగలదనియుఁ జెప్పెను. దీనియంతరర్థ మేమైయుండునా యని యించుక పరికింతము.

భక్తులయశస్సు లోకమునఁ బ్రఖ్యాతముగావలయునని భగవంతుని యాశయము. తానెఱింగింప సమర్థుఁడయ్యు దాని నుద్ధవునిద్వారా వ్యాపింపఁజేసినచో నా భక్తవర్యునికీర్తి విస్తరిల్లుననియు శ్రీభాగవతము నెఱింగిన యుద్ధవుఁడు భగవత్కారుణకు బాత్రుఁడయ్యెను. మన మట్లేచేయుదమని కొందఱయినఁ బ్రయత్నింతురనియు శ్రీహరి యభిప్రాయము. అంతియగాక

ఆభాగవతమును సభాముఖమునఁదెల్పినఁ బెక్కుమంది తరింతు రనియు బలరాముఁ డూహించెను. కావున ముం దుద్ధవుఁడు శ్రీకృష్ణప్రసాదపాత్రుఁడై యాభగవంతుఁడు స్వాంశమును దనయందుఁ బ్రవేశింపఁజేయుటవలనఁ దేజశ్శాలియై సభాముఖమున నీకు నుపదేశించుననియు వరమిచ్చెనని మన మెఱుంగవలయును. తనకుఁ బ్రసిద్ధిరావలయుననియు నితరులకు రాఁగూడదనియు నీచాత్ముల కుండుభావము భగవంతున కుండునా! తన భక్తులు లోకోద్ధారకులు కావలయుననియే శ్రీహరియాశయము. ఇంకొక్కమాట. ఇది యనవసరమని భావింపక శ్రద్ధమైఁ బఠింపుఁడు. పఠించునపుడే నాపైఁ గోపమూనకుఁడు. విషయమును దెలిసికొని మదియందుఁ దానిం దర్కింపుఁడు. నేఁ జూపినప్రమాణముల నాలోచింపుఁడు. అవి కల్పితములను శంక గల్గిన నాగ్రంథమును జూడుఁడు. దానిభావము నెఱుంగుఁడు. ఇన్నియుఁ బరిశీలించినపిదప నాభావము సమంజసముగాఁ దోఁచకున్న నపుడు భావమిది సమంచితముకాదని నిశ్చయించుకొనుఁడు. అంతవఱ కాతురంపడి నాపైఁ బడకుఁడు.

బలరాముఁడు మాండూకమునికి రాఁబోవుకాలమున నీయుద్ధవుఁడు కృష్ణోపదేశమునఁ బవిత్రాంతఃకరణుఁడై నీకు భాగవతసంహిత నుపదేశించునని వరమిచ్చెను గదా. ఆప్రకారమే యుద్ధవుఁడు ద్వారకలో దుర్నిమిత్తములు తోఁచినపుడు శ్రీకృష్ణుఁడు గోపాలురతో నీమహోత్పాతములు గన్పట్టుటఁ జూడఁగా యాదవకులము నశించునని తోఁచెడిని. అని పలుకు నపు డుద్ధవుఁడు చెంతనుండి యాలకించుచు నేకాంతమున

నొకనాఁడు శ్రీహరితో నన్ను వైకుంఠమునకుం దోడుకొని పొమ్మని ప్రార్థింపఁగా శ్రీహరి బలదేవుఁడు మాండూకముని కొసంగిన వరమును దలంచి యుద్ధవుఁడు కొంతకాలము భూతలంబుననుండి శ్రీమద్భాగవతసంహిత నెల్లర కుపదేశించుటొప్పునని యూహించి యాతనికి మహాదరణంబున భక్తిజ్ఞానవైరాగ్యములపద్ధతుల నుపదేశించి,

" శ్లో. గచ్ఛోద్ధవ మయాదిష్టో బదర్యాఖ్యం మమాశ్రమమ్,
తత్ర మత్పాదతీర్థోదే స్నానోపస్పర్శనైశ్శుచిః.
ఈక్షయాలకనందాయా విధూతాశేషకల్మషః,
వసానో వల్కలాన్యంగ! వనభుక్సుఖనిస్పృహః.
తితిక్షుర్ద్వంద్వమాత్రాణాం సుశీలస్సంయతేంద్రియః,
శాంతస్సమాహితధియా జ్ఞానవిజ్ఞానసంయుతః,
మయానుశిక్షితం యత్తే వివిక్తమనుభావయన్.
మయ్యావేశితవాక్చిత్తో మద్ధర్మనియతో భవాన్,
అతిక్రమ్య గతీస్తిస్రో మామేష్యతి తతఃపరమ్." ౪౪

శ్రీభాగవతము. ౧౧ స్కం. ౨౯ అధ్యాయము.

అని యిట్లాజ్ఞాపించెను. ఆయ్యానతి శిరసావహించి యాయుద్ధవుఁడు బదరికాశ్రమమునకుం బోయెను. ఈకథయుఁ బైబలరాముని యుపదేశమున కనుబంధముగనే శ్రీభాగవతమున నున్నది.

ఉద్ధవుఁడు భగవదాజ్ఞను నొదలధరియించి బదరికాశ్రమమునకుఁ బోవుచుండఁ ద్రోవలో విదురుఁడు కనంబడి కుశలప్రశ్నముచేసి యాదవప్రళయాదుల నడిగెను. ఉద్ధవుఁడు చెప్పఁదగిన మాటలుచెప్పి తాను బదరికాశ్రమమునకుఁ బోయెను.

ఉద్ధవుఁడు శ్రీకృష్ణలీల లుపదేశించి యాత్రకుంబోవఁగా విదురుఁడాయుపదేశమునఁ దృప్తిపడక యమునాతీరమునకుం బోయి మైత్రేయమునిం గాంచి ప్రశ్నించి వారినుండి యనేకవిషయముల నెఱింగెను. ఈవిషయము శ్రీభాగవతమున మూఁడవ స్కంధమున నాల్గవయధ్యాయాంతమున నున్నది.

"అన్యేషాం దుష్కరతరం పశూనాం విక్లబాత్మనాం,
ఆత్మానం చ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితం,
ధ్యాయన్ గతే భాగవతో రురోద ప్రేమవిహ్వలః,
కాళింద్యాః కతిభిస్సిద్ధ అహోభిః కౌరవర్షభః,
ప్రాపద్యతస్వస్సరితం యత్ర మిత్రాసుతో మునిః. ౩౬

ఆవల మైత్రేయముని యనేకధర్మముల నుపదేశించి విదురుని సంశయములఁ బాపెను. మైత్రేయకథితమగువిషయము భక్తి జ్ఞానవైరాగ్యబోధకముగా నున్నది. ఆయుపదేశమున వీతసంశయుఁడై విదురుఁడు భగవద్ధ్యానతత్పరుఁ డయ్యెను. ప్రకృతవిషయ మేమనఁగా,

మైత్రేయముని ద్వాపరాంతమున యమునాతీరమునఁ దపమొనరించుచుండెనని దీనింబట్టి స్పష్టమైనది కదా. ఆమైత్రేయుఁడు కలియుగము నైదువేలవత్సరములు దాఁటఁగా యుగమహిమమున విజ్ఞానము క్షీణింపఁగాఁ దా నొకరియం దావేశించి జ్ఞానము నుపదేశించు నను ప్రతీతిని గొందఱు కల్పించిరి. కొందఱామైత్రేయుఁడే యవతరించునని పల్కిరి. ఆ యుపదేశము చేయువారే జగద్గురువులని మఱికొందఱు పల్కుచున్నారు. ఇది మూఢవిశ్వాసమా లేక యిందేమేని సత్యముగలదా యని యించుక విచారింతము. ఏదో యొక్కవిశ్వాసము

లేకున్న నెవ్వరు నేవిషయమును దెల్పరు. వంచకులు కొంద ఱుందురుగాని వారిట్టి సద్విషయములజోలికిం బోరు. ఈకాల మునఁ బెక్కుతావుల నొక్కయవతారము బయలువెడలునని చాలమంది యాశించుచున్నారు. కారణమేమో తెలుపఁజా లను. కొందఱిదిగో వీరభోజవసంతరాయఁ డవతరించు నందురు. కొంద ఱెవ్వఁడోయొకఁ డవతరించు నందురు. కొందఱిదిగో నేనే యవతారపురుషుఁడ నందురు. మొత్తముమీఁదఁ బ్రతి మతమువారు నవతారపురుషుఁడు వచ్చునని యాశించుచు న్నారు. కారణమిందులకు మనోదార్బల్యమే యని నే నూహిం చుచున్నాఁడను. ఏలన మతగ్రంథములం బఠించి తదర్థమును దెలిసికొనఁజాలు బుద్ధి తగ్గినది. అంతమాత్రము శ్రమమునకు బుద్ధి యోర్వఁజాలదు. కావున నిధిగా నొక్కఁడు జ్ఞానసార మునుదెల్పిన మ్రింగవలయునని వీరిభావమై యుండనోపును. అదికల్ల. ఏనాఁటికి నది సరిపడుభావము కాదు. ప్రయత్నము విశేషించిచేసినఁగాని విజ్ఞాన మలవడదు. దానికిఁ బ్రాక్తనసత్క ర్మము తోడ్పడవలయును. ఎల్లరకు నుపదేశింప నొక్కగురువు పుట్టునన్నమాట పరిహాసపాత్రము. వారికిఁ గర్మసిద్ధాంతము తెలియదు. భగవంతుని యేయవతారమున నీపని సాగియుండ లేదని నిఁక నొక్కమహర్షి చేత నగునాయని యూహించినఁ గాదనితోఁచును.

మైత్రేయుఁడే యవతరించియో తనశిష్యునిబంపియో కలియుగమున నెల్లరఁ దరింపఁజేయఁబూనిన నాయుపదేశ మెట్లుండునని యించుక పరిశీలించుటె న్యాయము. మహర్షులు జాతిమతముల నంగీకరించువారుకాని జాత్యైక్యము నంగీకరించు

వారు కారుగదా. మైత్రేయముని విదురునకుపదేశించుచు ననే కేతిహాసములం దెల్పుచు నందొక్కచో,

"తత్రాపి స్పర్శవేదిభ్యః ప్రవరా రసవేదినః,
తేభ్యో గంధవిదశ్శ్రేష్ఠా స్తతశ్శబ్దవిదో వరాః. 30
రూపభేదవిద స్తత్ర తతశ్చోభయతోదతః,
తేషాం బహుపదాశ్శ్రేష్ఠా శ్చతుష్పాదా స్తతో ద్విపాత్.
తతో వర్ణాశ్చ చత్వార స్తేషాం బ్రాహ్మణ ఉత్తమః,
బ్రాహ్మణే ష్వపి వేదజ్ఞో హ్యర్థజ్ఞో హ్యధిక స్తతః. 32
అర్థజ్ఞా త్సంశయచ్ఛేత్తా తతశ్శ్రేయాన్ స్వకర్మకృత్,
ముక్తసంగ స్తతో భూయాన్ న దోగ్ధా ధర్మమాత్మనః. 33
తస్మాన్మయ్యర్పితాశేషక్రియార్థాత్మా నిరంతరః,
మయ్యర్పితాత్మనః పుంసో మయిసన్న్యస్తకర్మణః. 34
నపశ్యామి పరం భూత మకర్తు స్సమదర్శనాత్,
మనసైతాని భూతాని ప్రణమే ద్బహుమానయన్. 35
ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవానితి,
భక్తియోగశ్చ యోగశ్చ మయా మాన వ్యుదీరితః." 36

శ్రీభాగవతము. 3 స్కం. 29 అధ్యాయము.

ఇట్లు మైత్రేయుఁ డుపదేశించిన ట్లున్నది. జాతిమతము లుండ రాదనువారు మైత్రేయశిష్యులుగాని మైత్రేయాంశావేశితచిత్తులుగాని కారాదు కదా. ఎల్లరకు నొక్కరీతి జ్ఞానము నుపదేశించుట యనఁగాఁ గర్మసిద్ధాంతమేమియో వా రెఱుంగరనుటయే కాని వే ఱేమున్నది?

"ప్రకృతేర్గుణసమ్మూఢా స్సజ్జంతే గుణకర్మసు,
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్."

"ప్రకృతేర్గుణైః సమ్మూఢాః సమ్యఙ్మూఢాః సంతస్సజ్జంతే గుణానాం కర్మసు గుణకర్మసు వయం కర్మ కుర్మః ఫలాయేతి. తాన్ కర్మసంగినః అకృత్స్నవిదః కర్మఫలమాత్రదర్శినః మందాన్ మందప్రజ్ఞాన్ కృత్స్నవిత్ ఆత్మవిత్ స్వయం న విచాలయేత్. బుద్ధిభేదకరణమేవ చాలనం తన్నకుర్యా దిత్యర్థః." అని శంకరభాష్యము.

దీనిచేత మందప్రజ్ఞులయి కర్మఫలముల నాశించిచేయు వారికి బుద్ధిభేదము కల్గింపఁగూడదనుటచేత వారికి జ్ఞానము నుపదేశించి యాకర్మములనుండి వారిని దప్పింపరాదనికదా దీని భావము. ఇట్టులుండఁ "గలిపి కొట్టరా కస్తూరిరంగా"యన్నట్లు సర్వజనులకొక్కరీతిగా ధర్మములుండునని యుపదేశించుటయ శాస్త్రముకాదా. మైత్రేయుఁ డట్టిపద్ధతి కంగీకరించునా? కావున మైత్రేయుఁ డావేశించియో యవతరించియో లోకగురువనఁ బరఁగుననుట కల్లయని దీనినుండి తేలుచున్నవి. ఇంతియగాక కలిధర్మముల భారతాదులు తెలిపియున్నవి. వానికి విరుద్ధముగా నీ జగద్గురువుని రాకకల్గిన నవి యసత్యము లనవలయుఁ గదా. ఆమాట యనుటకంటె నీవార్త మూఢవిశ్వాసమన్న మేలుకదా. ముప్పదిసంవత్సరములక్రిందనే వీరభోజవసంతరాయలు పుట్టి పెరుగుచున్నాఁడని యొకప్రతీతి గల్గినది. ఇట్టి వెన్నియో ప్రతీతులు గలవు. ఇవికల్గుటకుఁ గారణము లివియని తెల్పఁజాలనుగాని దీన నించుకమూఢమతులకు మతాభిమానముదయించుటకుఁ గల్పితమేమో యని యూహించుచున్నాఁడను. అంతమాత్రము ఫలముకల్గినను జాలదాయన్న నది సత్యమూలముకాదేని శాశ్వతముగా నిలువఁజాలదనియు దానఁ

గీడుమూఁడుననియు నాయాశయము. కావున భక్తులగువారు మనమహర్షు లుపదేశించిన వివిధవిషయములను దమకనుకూలమని తోఁచినవానినిఁ గైకొని వానిని శక్త్యనురూపముగా నాచరించి భక్తిమార్గమును బరిశీలించి భగవంతుని శ్రీరాధామాధవుని ధ్యానించి తన్నామమును వినుతించి కృతకృత్యులు గావలయును. తెలియనివారాసక్తమతులైనవారి కుపదేశింపవలయును. ఇదియ యీకాలమునఁ గర్తవ్యమని నాయాశయమును దెల్పుచు ననంతరకథావిశేషములఁ దెల్పఁబూనెదను.

## మధురాపుర మాహాత్మ్యము.

* ఈకథల నారదముని తెలుపఁగా బహుళాశ్వభూజాని మునీంద్రా! భగవంతుఁడగు బలదేవుఁడు తీర్థయాత్రనుముగించి కోలాసురుం బొలియించి మధుర కేతెంచెనని వింటిని. ఆహా! ఆమధురానగర మెంతధన్యము! అట్టిభగవంతుఁ డం దుండెను గదా. అంతకంటె విశేషపుణ్య మేముండును? ఆ మధురానగర మాహాత్మ్యమును వినఁగోరెదను. ఆనగరరక్షకుఁ డెవఁడు? ఆ పురవృత్తాంతమునెల్ల సవిస్తరముగా వచింపుమా యని ప్రశ్నింప నారదముని యిట్లు బదులు చెప్పెను. రాజేంద్రా! మధురానగర మేమని వర్ణింపఁగలను? పూర్ణతముఁడై భగవంతుఁడై క్లేశనాశకుఁడగు శ్రీహరియే మధురానాయకుఁడని నమ్ముము. మున్ను భగవంతునిచే నావిగ్రహము కపిలముని కొసంగెను. ఆకపిలముని ప్రసన్నుడై శతమన్యువున కొసంగెను. రాక్షసేంద్రుఁడగు రావణాసురుఁడా దేవతల జయించి యావిగ్రహమును బూజించి

---

*ఈకథ గర్గసంహిత మధురాఖండము ఇరువదేనవయధ్యాయమునుండి సంగృహీతమని యెఱుంగునది. ఇది బహుళాశ్వనారదసంవాదముగా నున్నది.

పుష్పకమున నునిచి లంకానగరమునకుం గొనిపోయెను. అందా విగ్రహము చిరకాల మర్చింపఁబడుచుండెను. అంతఁ గొంతకాలమునకు నా రావణుని జయించి శ్రీరామచంద్రుఁడద్దానిని యోధ్యకుం జేర్చెను. ఆవిగ్రహము వారాహమని యెఱుంగుము. లవణాసురసంహారానంతరము శత్రుఘ్నుఁడు శ్రీరామచంద్రుని దర్శించి ప్రార్థించి యామూర్తినిబడసి పదిలముగాఁ గొనిపోయి మధురానగరమున స్థాపించెను. ఆపురమునఁ గలవారెల్ల నామూర్తిని బూజించి కృతార్థులైరి. వరదానముల నెల్లర నామూర్తి తన్పుచుండెను. కపిలవారాహనామ మానగరమున నామూర్తికి విఖ్యాతమయ్యెను. ఆతఁడే మంత్రివరుం డనఁ బరఁగెను. భూతేశ్వరుఁ డనునామమున శివుఁ డానగరమున కేబాధలు లేకయుండఁ గాపాడుచుండును. పాపాత్ముల దండించుచు సుకృతాత్ములకు శుభము లొసంగుచు నాశంకరుఁ డందుండును. దుర్గతినాశిని యగునంబిక మహావిద్యయనియుఁ జండికయనియు దుర్గయనియు నామములఁబాల్చి సింహవాహనారూఢయై మధురయందు నివసించును. కావున దానిని బాధింప నెవ్వరికే నశక్యము. మధురానగరచారుఁడను నేనే. సర్వలోకములఁ గ్రుమ్మరుచుఁ దన్మహిమమును దెల్పుచుందును. ఎల్లరవృత్తాంతములను శ్రీకృష్ణునకుం దెల్పుటయే నా ప్రధానకార్యము. రాజేంద్రా! మధురానగరమునడుమ కరుణాస్వరూపిణి యగునంబిక మధురాదేవి యనంబరఁగి యాఁకొన్నవారి కన్నమిడుచు నుండును. చతుర్భుజములుగలిగి శ్యామలాంగులైన శ్రీకృష్ణపార్షదులు మధురానగరమున మృతినొందినవారిని గొనిచన విమానములకైకొనివచ్చుచు వీరిని దోడ్కొని పోవుచుందురు. భగ

వంతుఁడగు శ్రీకృష్ణుని యంగసంభూతమే మధురాపుర మని నమ్ముము. కావుననే దానిదర్శించినంతనే మనుజుఁడు కృత కృత్యుం డగును.

పూర్వము మధురానగరమహిమము నెఱింగిన విరించి యందు నిరాహారుఁడై శతవర్షములు తపమొనరించెను. హరి మంత్రము జపించెను. స్వాయంభువుఁ డనుకొడుకును బడసెను. భూతేశ్వరుండగు నీశ్వరుఁడు మధురానగరమునకుఁ జెంతనున్న మధువనమున దివ్యవర్షశతములు తపంబొనరించి శ్రీకృష్ణప్రసాద పాత్రుఁడై వెలసెను. మధురానివాసమును గోరెనుగాన నద్ధానిం బడసి భగవంతుని సేవించుచున్నవాఁడు. భూపాలా! నేను గూడ శ్రీకృష్ణప్రసాదమును బొంది మాధుర్యమండలమునఁ గొంతకాలము నివసించుచుఁ దిరుగుచుఁ దద్వార్తాహరుఁడనగు చారుండ నైతిని. దుర్గయు ననేకసంవత్సరములు నియతిఁబూని భగవద్దాస్యము నొంది మధురానగరమున నివసించెను. ఇంద్రా దు లామధువనమునఁ దపంబొనరించియే యిష్టసిద్ధులం బడసిరి. మధువనురాక్షసుఁడు తపంబుచేసి యందఱికంటె బలవంతుఁ డయ్యెను. మాధవమాసమున భగవంతునితోఁ బోరాడెను. సప్తర్షు లిందుఁ దపంబొనరించి తపస్సిద్ధి నందిరి. రావణాదు లీవ నమునఁ దపంబొనరించి యత్యద్భుతపరాక్రమమును గడించిరి.

ఇఁక నీ పురమాహాత్మ్యమును వివరించెద. బహుళాశ్వ రాజా! ఆలకింపుము. ఆదివరాహమూర్తిని ధరించిన శ్రీమహా విష్ణువు భూమి జలనిమగ్నయై క్రుంగ నిజదంష్ట్రాగ్రమున దాని నెత్తి యేనుఁగు పద్మమును దుండాగ్రముననెత్తి పట్టుకొను లాగున ధరించి యీమాహాత్మ్యమును జెప్పెను. మధురా

మహిమమును వచించువాఁడు భగవన్నామసంకీర్తనఫలము నొందును. ఈపురమహాత్త్వమును విని శ్రీకృష్ణకథాశ్రవణఫలము నొందును. మధురానగరమును జేరిన భగవద్దర్శనపుణ్యమును బడయును. ఆనగరమును జేరిభుజించిన ననంతఫలము గలుగును. నివసించుభాగ్యమే కలిగినఁ జెప్పవలసినదేమి? నివాసమున యోగీశ్వరుల కేఫలముగలుగునో యది కల్గును. ఎవనిపాదములు మధువనమును ద్రొక్కవో యవి నిరర్థకములు. ఎవనికన్నులాపుణ్యవనమును జూడలేవో యవి నిష్ఫలములు. ఎవనిచెవులామధువనమహిమమును వినఁజాలవో యవి నిరర్థకములు. ఎవనివాక్కుతన్మహిమము నుతింపదో యది సార్థకము కాదు. రాజా! ఈ నగరప్రాంతమున ననేకతీర్థములు గలవు. ఒక్కొక్కటియు సకలపాపముల హరింపఁజాలును. అట్టిమధురానగరమునకు నమస్కరించుచున్నవాఁడను. గోలోకనాథుఁ డనేకబ్రహ్మాండనాయకుఁడు సాక్షాత్తుగా నిందుండును. అట్టిభాగ్యమును బడసిన యీనగరమునకు నమస్కరింతును. తక్కుంగల నగరములఁ జేరొననేల! ఏనగరము నామస్మరణమాత్రమునఁ బాపముల హరించునో ఏదిదర్శించినంతన భగవద్దాస్యలాభమును గల్గించునో వీథులదర్శించినంత నేది ముక్తిననుగ్రహించునో ఆనగరమును మించినపుణ్యనగర మేదియుండును? కాశ్యాదినగరములు ముక్తిమాత్ర మీఁగలవు. మధురానగరము ధర్మార్థకామమోక్షము లను చతుర్విధపురుషార్థముల నిచ్చును. పురీశ్వరియు శ్రీకృష్ణపురియు వ్రజేశ్వరియు నను మొదలగునామములఁ బ్రసిద్ధిఁగన్న మధురానగరమునకు నమస్కారము లొనర్చెదనని

నారదముని తెలుప బహుళాశ్వరాజు పరమాశ్చర్యపరిపూర్ణ మానసుం డయ్యెను.

" శ్లో. అరుణాధరామృత విశేషితస్మితం
వరుణాలయానుగతవర్ణవైభవమ్,
తరుణారవిందదళదీర్ఘలోచనం
కరుణామయం కమపి బాలమాశ్రయే. ౧౭

లావణ్యవీచీరచితాంగభూషాం
భూషాపదారోపితపుణ్యబర్హామ్,
కారుణ్యధారాళకటాక్షమాలాం
బాలాం భజే వల్లవవంశలక్ష్మీమ్." ౧౮

శ్రీకృష్ణకర్ణామృతము. 3 ఆశ్వాసము.

మహాశయులారా! ఇంతదనుక శ్రీకృష్ణబలరాముల బాల్యక్రీడలు వర్ణితములయ్యెను. వారియమానుషక్రీడ లున్నవున్నట్లు వచియింపఁ దరముగాదనుట మీ రెఱింగినవిషయమే. పురాణముల ననుసరించి యించుక వ్రాసితిని. ఇఁక భూభార హారణార్థమై శ్రీకృష్ణపరబ్రహ్మ మొనరించిన మహాకృత్యముల వ్రాయవలయును. కంసాదులవధించుట భూభారహరణము కాదాయన్న నౌనవచ్చును గాని మహాకార్యములు పెక్కు లున్నవి. అన్నియవతారములకన్న నీయవతారమునఁ గలవిశేషము తాఁజేయుటయే గాక యితరులతోఁ గార్యములు చేయించుటయేయని యీవఱకే పెక్కుతావుల వ్రాసియుంటిని గదా. అట్టికార్యము లీవఱకు శ్రీకృష్ణుఁడు చేసినది లేదు. తాఁజేయుచు నితరులద్వారా చేయించుచుఁ దాను సాక్షిభూతుఁడుగా నుండి భూభారమును హరించువిషయములు

ముందు వ్రాయంబడును. కర్మసిద్ధాంతమున కవన్నియు నుదాహరణములు కాఁగలవు. భగవంతుఁడు సాక్షిమాత్రుఁడనుట తేటపడఁగలదు. ఏకార్యముగాని ప్రాణులు చేయఁజాలరనియుఁ గర్మము వారిని బ్రోత్సహించి వారిమూలమునఁ జేయుననియు స్పష్టము కాఁగలదు. భగవదనుగ్రహము నొందవలయునన్న నెట్టిసత్కర్మముల నాచరింపవలయునో తేటపడఁగలదు. ఇట్టి మహత్తరసద్విషయములు ముందు భగవత్కృత్యములవలనఁ దేటపడును గావున వాని శ్రద్ధమైఁబఠించి యందు గ్రహింపఁ దగినవిషయముల గ్రహింపవలయును. ఆకార్యములకు ముందు శ్రీబలరామకృష్ణులకు బాలత్వమును వదలించుకథను జదువవలయును గదా. ఇంతవఱకు లోకదృష్టిచే వారిరువురును బాలురే. కార్యము లెట్టివైనను వయఃపరిమితి యత్యల్పము కదా. కావున లోకులకుఁ దెలుపునీతులను దమకార్యములమూలమునఁ గొన్నింటిని దెలుపుట భగవద్ధర్మము.

బ్రహ్మక్షత్రవైశ్యులను మూఁడుజాతులు ద్విజులనఁబడుదురు. ఈ మూఁడుజాతులకు నుపనయనసంస్కారము కలదు. వివాహాదిసంస్కారములు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రజాతులకు సమానముగాఁ గలవు. ఇందు మొదటి మూఁడుజాతుల వారు ద్విజులనంబడుదురు. కావున బలరామశ్రీకృష్ణులకు నుపనయనమహోత్సవము సాగినకథను మనము చదువవలయును. యాదవులు రాజులే కారే. వారి కుపనయన మేలాగని యడుగుదురేమో. ఆప్రశ్నము చేయుట పొరపాటు. రాజ్యమును పాలించునధికారము లేదుగాని యాదవులు రాజవంశభ్రష్టులు కారు. జాత్యంతరములతో వారికి సంబంధము కలదని చెప్ప నవ

కాశము లేదు. వారియింటిపిల్లలను రాజులు వివాహమాడు వాడుక కలదు. కుంతి యాదవవంశజనితయే కదా. కంసాదులకు యాదవులతో సంబంధము కలదనుట యంద ఱెఱుంగుదురు. అది లేకున్న శ్రీకృష్ణావతారప్రసక్తియే లేకపోవును. సామంతరాజులుగా నుండిరిగాని జాతిభ్రష్టులై వైదికసంస్కారములఁ గోలుపోయినవారు యాదవులు కారని యెఱుంగందగు. యాదవులకు గురువు గర్గమహాముని. ఆమునియే నందాదులకు నుపనయనాదులఁ జేయించువాఁడు. కావున నిఁక రామకృష్ణులకు నుపనయనము సాగినకథను జదువఁ బ్రయత్నింపుఁడు.

## శ్రీరామకృష్ణుల యుపనయన మహోత్సవము.

* రామకృష్ణులు మధురానగరమును జేరినపిదపఁ గొలఁదిదినములకు వసుదేవుఁడు తనయులకు నుపనయనసంస్కారము చేయ నాలోచించెను. అంతలోఁ గులగురువగు గర్గముని ఆవిషయమును దనదివ్యదృష్టి నెఱింగి చనుదెంచెను. అట్టిమహోత్సవమున గురువనుమర్యాదను బొందుటకన్నఁ బురుషార్థ మేమున్నది? సర్వజ్ఞునకు గాయత్రి నుపదేశించుటకంటె మఱియొక్కయదృష్ట మేమియుండును? పౌరోహిత్యము పరమనీచమైనను వసిష్ఠాదు లంగీకరించిన దావంశమున భగవంతుఁ

---

* ఈవిషయము శ్రీకృష్ణజన్మఖండము తొంబదితొమ్మిదవయధ్యాయము నుండి గ్రహింపఁబడినది. ఇతరపురాణములయందు విశేషించి కానరాదు. శ్రీవిష్ణుపురాణమునఁ బంచమాంశమున నిరువదొకఁడవ యధ్యాయమున "విద్యార్థం జగ్మతుర్బాలౌ కృతోపనయనక్రమౌ" అనిమాత్రము కనుపట్టెడిని. హరివంశాదులయం దీవిషయము కానరాకున్నది. కృష్ణజన్మఖండమునందే విశేషించి కనఁబడియెడిని.

డవతరించుననియే కాని రాజుగారింటి పురోహితుఁ డన్నమ ర్యాద నాశించి కాదు. బ్రహ్మనిష్ఠులగు వసిష్ఠాదుల కాద్రవ్య మాగౌరవము కావలసియుండునా. వారికింగూడ నీరూపమున భగవత్సంగతి దొరకునా యన్న వాంఛ యుండును. తక్కినవారి కడుగనేల? సదా మనోవీథిని భగవంతుని నిలిపి పూజించి ధ్యానించి సేవించువారే యీసేవనుగూడఁ గోరుదురు. దాని ఫలవిశేష మామహాత్ములకుఁ దెలిసిన ట్లితరులకుఁ దెలియదు కదా. అట్టిభగవంతుని యుపనయనమహోత్సవమును గన్నులారఁ గాంచుటకుఁ దంత్రము లోకాచారరీతి నడపుటకు గర్గ మహాముని శిష్యనికరపరియుతుఁడై యరుదెంచెను.

ఈయుపనయన ప్రస్తావమునుబట్టి శ్రీకృష్ణబలరాముల వయస్సు ఇంచుమించుగా నిర్ణయింపవచ్చును. ఉపనయనసం స్కారమే ద్విజత్వమును గల్పించునది యని పెద్దలనిరి. ఇ ప్పట్టున నుపనయనకాలమును గుఱించినచర్చ యనవసరము కాదు. కాఁబట్టి యించుక వ్రాసెదను.

## విప్రాదులకు నుపనయనకాలము.

విప్రులకు గర్భాష్టమవర్షంబునను, క్షత్రియులకుఁ బదు నొకండవ సంవత్సరమునను, వైశ్యులకుఁ బండ్రెండవసంవత్సరమున నుపనయనము చేయవలయును. అనఁగా జన్మాదిగ నేడవ పది యవ పదునొకండవసంవత్సరము లుపనయనకాలములని భావ ము. గర్భాష్టమనుచోటఁ గొందఱు జన్మాష్టమమని పల్కిరి. ఆమతము బహుసమ్మతమే. ఈ రెండుమతములంబట్టి యాచా రము సాగుచున్నది. కాఁబట్టి విప్రులకు సప్తమాష్టమ సంవత్స రములు, క్షత్రియులకుఁ బదియుఁ బదునొకండుసంవత్సరములు,

వైశ్యులకుఁ బదునొకండు పండ్రెండువత్సరములు నుపనయన మునకు ముఖ్యకాలములని సారము. ముఖ్యకాలము చెప్పఁ బడినపుడు గౌణకాలము చెప్పఁబడుట సదాచారము. విశేష విధిలేక యే నియమము లుండవుకదా. కావున ముఖ్యకాలము పై నన్నిసంవత్సరములవఱకు నుపనయనమునకు గౌణకాలము చెప్పఁబడినది ఇదియు స్మృతిసమ్మతమే. దానిప్రకారము విప్రు లకుఁ బదాఱువత్సరములవఱకు నుపనయనకాలము కలద నియు, క్షత్రియుల కిరువదిరెండువత్సరముల వయస్సువఱకు నుపనయనకాలము కలదనియు, వైశ్యులకు నిరువదినాల్గువత్స రముల వయస్సుపర్యంతము సావిత్రి నుపదేశించుకాలము కల దనియు స్పష్టమగును. ఇవి ముఖ్యగౌణకాలములు. ఇవియుఁ గాక బ్రాహ్మణుల కైదవవత్సరము, క్షత్రియుల కాఱవయబ్దము, వైశ్యుల కెనిమిదవసంవత్సరము నుపనయనార్హము లగుననియు నీసంవత్సరములు కామ్యాబ్దములనియుఁ జెప్పఁబడినది. బ్రహ్మ వర్చస్సుకోరిన విప్రబాలునకు గర్భపంచమ సంవత్సరమునందును, బలమునుగోరిన క్షత్రియబాలునకు నాఱవసంవత్సరమునందును, విశేషించి కృష్యాదులనుజేయఁగోరు వైశ్యబాలునకు నెనిమిదవ సంవత్సరమునందు నుపనయనము చేయవలయునని స్మృతికర్తృ మతము. ఈ కామ్యాబ్దములు గర్భాదిగానని చెప్పఁబడినది. దానిం బట్టి జన్మాదిగా నాల్గవ యైదవ యేడవసంవత్సర వయస్సుకలిగిన పుడని యేర్పడును. అంతటి యల్పవయస్సునం దాయాకోరికలు పొడమునా యని శంకించుకొని తత్పిత కాయిష్టముకలిగినపు డనఁగా దనకొడుకు వేదవేదాంగపారంగతుఁడు కావలయునని కోరువిప్రుఁడు, తనకుమారుఁడు హస్త్యశ్వాది రాజ్యబలాధి

కుఁడు కావలయునని యాశించుక్షత్రియుఁడు, తనయాత్మజుఁడు కృష్యాదులచే నధికధనవంతుఁడు కావలయునని కోరువైశ్యుఁడు నుపనయనము చేయవచ్చునని స్మృతికర్త లనుమతి నొసంగిరి. వీనికిఁ బ్రమాణములు చూడుఁడు.

"శ్లో. గర్భాష్టమేఽబ్దే కుర్వీత బ్రాహ్మణస్యోపనాయనమ్,
గర్భా దేకాదశే రాజ్ఞో గర్భాత్తు ద్వాదశే విశః. ౩౬
ఆషోడశా ద్బ్రాహ్మణస్య సావిత్రీ నాతివర్తతే,
ఆద్వావింశా త్క్షత్రబంధో రా చతుర్వింశతేర్విశః. ౩౮
బ్రహ్మవర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే,
రాజ్ఞో బలార్థిన ష్షష్ఠే వైశ్యస్యేహార్థి నోఽష్టమే". ౩౭
మనుస్మృతి. ౨ వ యధ్యాయము.

ఉపనయనమునందుఁ జేయఁదగునాచారములు ప్రత్యేకము వీరికిఁ జెప్పఁబడినవి.

"శ్లో. వైదికైః కర్మభిః పుణ్యై ర్నిషేకాది ద్విజన్మనామ్,
కార్యశ్శరీరసంస్కారః పావనః ప్రేత్యచేహ చ." ౨౬
మను. ౨ అధ్యాయ.

"ఏత యర్గ్ధ్వ విసంయుక్తః కాలే చ క్రియయా స్వయా,
బ్రహ్మక్షత్రియవిడ్యోనిర్గర్హణాం యాతిసాధుషు."
మను. ౨ అధ్యాయ.

"శ్లో. బ్రహ్మక్షత్రియవిట్ఛూద్రా వర్ణాస్త్వాద్యాస్త్రయోద్విజాః,
నిషేకాద్యాశ్శ్మశానాంతా స్తేషాంవై మంత్రతః క్రియాః.
గర్భాష్టమేఽష్టమేవాబ్దే బ్రాహ్మణ స్యోపనాయనమ్,
రాజ్ఞా మేకాదశే సైకే విశామేకే యథాకులమ్." ౧౪
యాజ్ఞవల్క్యస్మృతి. ఆచారకాండము.

ఆపస్తంబసూత్రము—

"గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత. ౨

గర్భైకాదశేషు రాజన్యం గర్భద్వాదశేషు వైశ్యమ్. ౩

వసంతో గ్రీష్మశ్శరదిత్యృతవో వర్ణానుపూర్వ్యేణ." ౪

"శ్రీసుదర్శనాచార్యవ్యాఖ్య. ఋతవో వసంతాదయః త్రయో బ్రాహ్మణాదివర్ణక్రమేణోపనయనస్య కాలాభవంతి, అయంచర్తు విధిస్సామాన్యవిధిప్రాప్తోదగయనస్య యథార్థాం నియమాపవాదార్థః. పూర్వపక్షాదిస్తు భవత్యేవ. శిశిరే చ వా సర్వేషాం. ఇతి భరద్వాజగృహ్యోక్త శిశిరప్రతిషేధార్థః." అని.

జ్యోతిశ్శాస్త్రమునందు—

"శ్లో. విప్రాదేర్గర్భతోఽష్టేఽష్ట శివరవిమితే జన్మతో వా వ్రతంస్యా
దత్రానిష్టేపి జీవేఽనిమిషరవిమఖా కార్యమబ్దస్యదార్ఢ్యాత్,
స్వాబ్దా దూర్ధ్వం క్రమాత్స్యా ద్ద్విగుణితశరదో నింద్యమ
[బ్దక్రమేణ
పంచాష్టాంకాబ్దతో వా ప్రపఠనరుచిత శ్శస్తమేషాం
[తదాహుః."

ముహూర్తమార్తండము.

కాత్యాయన గృహ్యసూత్రము—

"ఆషోడశా ద్బ్రాహ్మణస్యానతీతః కాలో భవత్యాద్వావింశాద్రాజన్యస్యాచతుర్వింశాద్వైశ్యస్యాత ఊర్ధ్వం పతితసావిత్రీకా భవంతి. నైనానుపనయేయుర్నాధ్యాపయేయుర్న యాజయేయుర్న చైభిర్వ్యవహరేయుః. కాలాతిక్రమే నియతవత్త్రిపూరుషం పతితసావిత్రీకాణా మపత్యే సంస్కారోనాధ్యా

పనం తేషాం సంస్కారేష్వర్త్విత్యస్తో మే నేష్ట్వా కామమధీ యీరన్వ్యవహార్యా భవంతి."

సంగ్రహామునందు—

"బ్రహ్మవర్చస మూర్జశ్చ విద్యాయుశ్శ్రీ ర్యశస్సుఖం,
విప్రాదే రుపనీతస్య పంచాష్టాంకాబ్దతః ఫలమ్."

ఇ ట్లెన్ని యో ప్రమాణములు చూపవచ్చును. గ్రంథవిస్తర భయంబున వదలితిని. ఈగోడవ యేటికని ప్రశ్నింతురేమో. శ్రీకృష్ణుని యుపనయనకాలమునుబట్టి వయస్సింతయని నిర్ణ యింపవచ్చునేమో అనునూహతో వ్రాసితిని. కాని ముఖ్య గౌణకాలములలో నేకాలము ననుసరించి యుపనయనము చేసి రో తెలియ శక్యము కాకున్నది. ముఖ్యకాలముననే చేసియుం దురని యూహించినఁ బదునొకండవసంవత్సరమో పదవసంవత్స రమో యని యూహింపనగు. ఈ యాకాశరామన్నపంచాం గము మఱొకరికి వదలెదను. భగవంతునిచరిత్ర మెట్టిదని తెలిసి కొనుటయే నాపనిగాని కాకదంతపరీక్షాన్యాయము ననుసరించి యీ తెలియనివిషయమును దెలిసినట్లు నటించి వ్రాయఁబూనను.

* ప్రకృతకాలమునఁ బూర్వాచారములన్నియు దాఱుమాఱయి యున్నవి. క్షత్రియులకుమాత్రము వేదోక్తముగా

---

వైశ్యులు ద్విజులు. వారికె నుపనయనాదిసంస్కారము లెట్లు?

* ఈవిషయమునఁ గొందఱుమహాత్ములు కలియుగమున క్షత్రియ వైశ్యకులములు లేవని వచింతురు. ఇపుడు క్షత్రియవైశ్యుల మనుకొనువారు క్షత్రియ వైశ్యజాతులుగారనియుఁ బలుకుదురు. వారి నిట్లు మాటలాడునట్లు చేసినదియు భ్రాంతినిగల్పించి బుద్ధివైకల్యము నాపాదించినదియుం నీ క్రింది వాక్యజాలము. దానిం దిలకింపుఁడు.

నుపనయనము సాగుచున్నదనవచ్చును. వైశ్యులు ద్విజులైనను గొన్నితావులయందుఁ దప్పఁ దక్కినచోట్ల పురాణోక్తముకాక పురోహితముఖోక్తముగా నుపనయనాదిసంస్కారములు సాగుచున్నవి. ఇదొక దుఃఖవార్త యనవచ్చును. ఆచర్చ యీకథకు సంబంధించినది కాదు. కాని యించుక సంబంధము కలదు. కానఁ గ్రిందవ్రాసెదను. దాని నవసరమనితోఁచినవారు చదువుకొనవచ్చును. ఇటనుండి శ్రీకృష్ణజన్మఖండము ననుసరించి కథ వ్రాయఁబడును.

వసుదేవుఁడు తనయులకు నుపనయనము జరపఁదగునను నూహగలవాఁడెపుడయ్యెనో అపుడే గర్గముని యరుదెంచెను. దండము ఛత్రము జటలు దాల్చి బ్రహ్మతేజము నలుదెసల

---

వైశ్యకమలాకరమునందు—

బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా వర్ణాస్త్రయో ద్విజాః,
యుగేయుగే స్థితా స్సర్వే కలావాద్యంతయోస్థితిః.

మాత్స్యపురాణమునందు—

నాధీయంతే కలౌ వేదాన్న యజంతే ద్విజాతయః,
ఉత్సీదంతి తథా చైవ వైశ్యైస్సాకంతు క్షత్రియాః.

అత్రిస్మృతియందు—

నందాంతం క్షత్రియకులం వేదవైదికసంయుతం,
భవిష్యతి తతశ్శూద్రప్రాయం వైశ్యకులం తథా.

మాధవాచార్యకృత పరాశరస్మృతిభాష్యమునందు—

క్షత్రియవైశ్యజాత్యోస్స్వరూపత ఏవోచ్ఛిన్నత్వాత్.

వెలిఁగింపఁజేయుచుండఁగాఁ దెల్లనియజ్ఞోపవీతములు ధరియించి తపస్వియై సంయతేంద్రియుఁడై శుక్లదంతములు చెలువార శుక్లవస్త్రముల ధరించి యా యదుకులపురోహితుఁడు చనుదెంచెను. గర్గునకు గర్గాచార్యులని నామధేయము విశ్రుతము. ఆమహర్షి రాఁగానే దూరమునుండియే కాంచి యశోద త్వరగ తినెదుర్కొని నమస్కరించెను. వసుదేవుఁడు భక్తిచే నమస్కరించి దివ్యమగుపీఠమున నాసీనుం గావించెను. విధిననుసరించి మధుపర్కము నొసంగెను. గోదాన మొసంగెను. పరిశుభ్రవస్త్రము నిచ్చెను. గంధము పుష్పమాల్యములు సమర్పించి యథావిధిఁ బూజించెను. మిష్టాన్నమును బరమాన్నమును బిష్టకమును మధురపదార్థములను మధువు నొసంగి సంతృప్తుం గావించెను. తాంబూల మొసంగెను.

పూజితుఁడైన గర్గముని యందుఁ దిరుగుచున్న శ్రీకృష్ణపరబ్రహ్మమునకు లోకాచారమునుబాటింప నమస్కరింపక మనసునందే సాష్టాంగనమస్కారము లాచరించి బలరామునకు నట్లే నమస్కరించి వారినాదరించి తాఁ గృతకృత్యుఁడనైతినని భావిం

---

బ్రహ్మవైవర్తపురాణమునందు—

వైశ్యాః కలౌ న హి భవంతి తులాదియుక్తా
యే వా భవంతి న హి తేషు వృషః కదాచిత్,
శూద్రాదివృత్తయ ఇమే ద్విజదేవనింద్యా
ధర్మద్విషః పరమదారుణబుద్ధయశ్చ.

ఈ మొదలగువచనములే వారిమాటల కాధారములు. ఈవిషయమునొకప్రశ్నము కలదు. ఇపుడుండు క్షత్రియవైశ్యజాతులు సత్యములా. కావా యనునదియే యాప్రశ్నము. పైనుదాహరించిన మత్స్యపురాణాది వాక్యము

చుచుఁ బతివ్రతయగు యశోదను వసుదేవునిం జూచి యిట్లు పలికెను. వసుదేవా! నామాట నాలకింపుము. బలరాముని శ్రీకృష్ణునిం బరికింపుము. ఉపనయనసంస్కారమునకుఁ దగినవ యస్సు వీరి కొనఁగూడినది. ఈవిషయము నీ వింతకుముం దూహింపలేదా. అన విని వసుదేవుఁ డిట్లు బదులు చెప్పెను. యదుకులపూజ్యదైవతమవు. కావున మంచిముహూర్తమును బరికింపుము. ఉపనయనసంస్కారము చేయఁదగియున్నది. సదాచారముకదా. దానిం జేయఁదగువారు మీరుకాదా. నేను నావిషయమునే యోజించుచుండఁగా మీ రరుదెంచితిరి. అను టయు గర్గముని పరమానందమంది యిట్లు పలికెను. బంధువుల

---

లనుబట్టియవి నశించినవని పూర్వపక్షులు వాదింతురు.నందాంతం క్షత్రియకుల మ్మనునట్టి యత్రిస్మృతివాక్యమునుబట్టి నందుఁడు రాజ్యమేలినంతవరకు వా రెండుకులము గలవని సిద్ధాంతము. ఇదియే దీనిసారము. ఈయొక్కమాటతోఁ బైవాదము పూర్ణముగా నశింపదు. ఇంచుక వివరింపక తప్పదు. కొందఱు వాదించువాదముపై నొక ప్రశ్నము చేయవచ్చును. ఏమనఁగాఁ బరిశుద్ధక్షత్రియ వైశ్యులు కలియుగముననే యుండరా? లేక కలియుగమునఁ గొంతకాలము గడవఁగాఁ దర్వాతనా యని. కలియుగమునఁ గొంతకాలమనఁగా నెంతకాల మనియుఁ బ్రశ్నమే. ఇందుఁ గలియుగమునందే పరిశుద్ధక్షత్రియవైశ్యులు లే రనరాదు. అట్టివారు కలరని యనేకగ్రంథములు ఘోషించుచున్నవి. ఈమాట కేమియాధారములని యడుగుదురేమో. విష్ణుపురాణమున నీవిధముగ నున్నది. దానింజూచిన మీసందియ మంతరించునని చెప్పెదను.

"అతఃపరం భవిష్యానహం భూపాలాన్ కీర్తయిష్యామి. యోఽయం సాంప్రతమవనీపతిః పరిక్షిత్, పరిక్షితః జనమేజయ శ్రుతసేనోగ్రసేన భీమసేనా శ్చత్వారః పుత్రా భవిష్యంతి. తస్యాపి శతానీకో భవిష్యతి. ౧..

నందఱకు శుభపత్రిక నంపుము. యత్నపూర్వకముగా వలయు సంభారముల నేకరింపుము. నేఁటికిఁ మూఁడవదినమున శుభముహూర్తము కలదు. నాఁ డుపనయనము చేయుము. దినము సత్పురుషాంగీకార్యము. చంద్రతారాబలములు కలవు. మహూర్తము శుభగ్రహావీక్షితము. శుభగ్రహాసమన్వితము. కావున నతిప్రశస్తము. అను గర్గమునిపలుకులు విని వసుదేవుఁడు దేవతాసమానుఁడు కావున బంధువులకందఱకు మంగళాహ్వానపత్రికలను బంపెను. నేయి పెరుగు పాలు విశేషించి నేకరించెను. మధువు బెల్లము వలయునంత సంగ్రహించెను. అనేక భక్ష్యపదార్థముల సిద్ధము చేయించెను. మణులు సువర్ణము సంగ్రహించెను. నానాలంకారములను, నమూల్యవస్త్రములను ప్రత్యేకముగ ముక్తామణి మాణిక్యహీరకములను నేకరించెను. ఇట్లు వసుదేవుఁ డుపనయనార్హపదార్థములను గూర్చి బంధుజనులరాకకై యువ్విళ్లూరుచుండెను.

---

యోఽసౌ యాజ్ఞవల్క్యాద్వేదమధీత్య కృపాదస్త్రాణ్యవాప్య విషమవిషయవిరక్తచిత్తవృత్తిశ్చ శౌనకోపదేశాదాత్మజ్ఞానప్రవీణః పరం నిర్వాణమవాప్స్యతి. శతానీకాదశ్వమేధదత్తో భవితా, తస్మాచ్చ తిగ్మః, తిగ్మాద్బృహద్రథః, బృహద్రథా ద్విసీమకృష్ణః, విసీమకృష్ణా న్నచక్షుః, యోగంగయాపహృతే హస్తినపురే కౌశాంబ్యాం నివత్స్యతి, తస్యా పృష్ణః పుత్రో భవితా, తత శ్చిత్రరథః, తస్మాద్వృష్ణిమాన్, తతస్సుషేణః, తస్యాపి సునీథః, సునీథాత్సుచక్షుః, తస్యాపి సఖిబలః, తస్మాత్పరిప్లవః, తత్తస్సునయః, తస్యాపి మేధావీ, మేధావినో రిపుంజయః, తతో దుర్వసుః, తస్మాత్తిగ్మః, తిగ్మాద్బృహద్రథః, బృహద్రథాద్వసుధానః, తతోఽపరశ్శతానీకః, తస్మాచ్చోదయనః; ఉదయనాద్విహీనరః, విహీనరాన్నరవాహనః, తతశ్చ దండపాణిః,

అంతట శ్రీకృష్ణమూర్తి తనయాత్మను దేవతలను మహర్షులను స్మరించెను. సిద్ధపుంగవులం దలంచెను. భక్తవత్సలుఁడు కావున భక్తులనెల్ల మనసున స్మరించి రావలయునని సంకల్పించెను. భగవంతుఁ డిట్టు లెల్లరను స్మరించినంతనే వారెల్లఁ దన్మహూర్తశుభదినమునకుఁ దమంతన తమరే యరుదెంచిరి. తొలుదొలుత మునీంద్రు లామోదమానసులై వచ్చిరి. వారిపిదప

---

తతోఽయోయోనిః, తస్మాత్ క్షేమకః. ౧.అత్రాయం శ్లోకః. బృహత్క్షత్రస్య యో యోని ర్వంశో దేవర్షి సత్కృతః, క్షేమకం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ. ఇతి ఏవమేవ కలౌ బృహద్బలాదారభ్య సుమిత్రాంత మిక్ష్వాకువంశీయాః. శ్లో. ఇక్ష్వాకూణామయం వంశ స్సుమిత్రాంతం భవిష్యతి, యత స్తం ప్రాప్య రాజానం సంస్థాం ప్రాప్స్యతి వై కలౌ. ఇతి. ఏవం మాగధాః. బృహద్రథాంతా ద్వాత్రింశన్నృపాశ్చ. అధీతవేదో జనమేజయః సర్పయాగం కృత్వా అశ్వమేధకరణాయ ప్రవృత్తః వ్యాసేన నివారిత ఇతి. కథా హరివంశే భవిష్యత్పర్వణి సమ్యగ్వర్తతే. తతః యోయం రిపుంజయో నామ బార్హద్రథః తస్య సుక్రీతో నామామాత్యో భవిష్యతి, సచైనం స్వామినం హత్వా స్వపుత్రం ప్రద్యోతనామానమభిషేక్ష్యతి, తస్యాపి. బిలకో నామ పుత్రో భవిష్యతి, తతో విశాఖయూపః, తత్పుత్రో జనకః, తస్య చ నందివర్ధనః, తదనంతరం శిశునాగః, తతః కనకవర్ణో భవితా, తస్య పుత్రః క్షేమధర్మా, తస్యాపి క్షత్రౌజాః తత్పుత్రో విధిసారః, తతశ్చాజాతశత్రుః, తస్యాప్యర్భకః, అర్భకాచ్చోదయనః, తస్మాన్నందివర్ధనః, తస్మాన్మహానందీ, మహానందినశ్చ శూద్రాగర్భోద్భవో మహాపద్మనందో, నందః పరశురామ ఇవాఖిలక్షత్రాంతకారీ భవిష్యంతి, తతః ప్రభృతి శూద్రా భూపాలా భవిష్యంతి. స చైకచ్ఛత్రామనుల్లంఘితశాసనో మహాపద్మః పృథివీం భోక్ష్యత ఇతి. మాత్స్యపురాణేఽపి. మహానందిసుతశ్చాపి శూద్రాయాం కలికాంశజః,

దేవతలు వచ్చిరి. ఆమీఁద బంధువు లేతెంచిరి. వారితర్వాత రాజన్యులు చేరిరి. ఆమీఁద దేవకన్యలు నాగకన్యలు రాజకన్యకలు విద్యాధరకన్యకలు గంధర్వకన్యలు తమతమ వాద్యములం గైకొని భగవత్సేవకై యరుదెంచిరి. బ్రాహ్మణులు, భిక్షుకులు, భట్టులు, యతులు, బ్రహ్మచారులు, సన్న్యాసులు నవ

---

ఉత్పత్స్యతే మహాపద్మస్సర్వక్షత్రాంతకో నృపః, తతః ప్రభృతి రాజానో భవిష్యాశ్శూద్రయోనయః, ఏకరాట్సమహాపద్మ ఏకచ్ఛత్రో భవిష్యతీతి. ఏవమేవ శ్రీభాగవతేఽపి.

ఈరీతిగా విష్ణుపురాణమాత్స్యభాగవతాదిపురాణములయందు మహాపద్మభూపాలునిపర్యంతము కలియుగమున శుద్ధక్షత్రియవర్ణ ముండునట్లు కనఁబడుచున్నది. మత్స్యపురాణమునందు, ఉత్సీదంతి తథా చైవ వైశ్యాస్సార్థంతు క్షత్రియాః, అనియు నత్రిస్మృతియందు నందాంతం క్షత్రియం కులమ్మనియు నుండుటంబట్టి మహాపద్మభూపాలు నభిషేకముదనుకఁ గలియుగమునందు క్షత్రియవైశ్యజాతులు పరిశుద్ధములుగ నుండునని సారాంశము తేలుచున్నది కదా.

ఇపుడు కలియుగ మెప్పటినుండి యారంభించెను. అనునదియు, నా కలియుగమున మహాపద్మభూజానిపట్టాభిషేక మెప్పుడుజరగును, అనునదియు సిద్ధాంతము చేసినఁగాని పైవిషయము సిద్ధాంతము కాదు. ఇంతకుముందే కలియుగముననే క్షత్రియవైశ్యు లుండరా లేక కొంతకాలము తర్వాత నుండరాయని ప్రశ్నము వ్రాసితినిగదా. ఇంతకుముందు కనఁబఱచియున్న ప్రమాణముల ననుసరించి కలియుగమున మహాపద్ముని రాజ్యప్రాప్తికాల పర్యంతము నీరెండుజాతులు పరిశుద్ధములుగా నుండునని స్పష్టమైనది. ఆ కాలము కలియుగమున నెంతకాలమునకువచ్చు నన్నప్రశ్నము ప్రధానమైనది. దానింజర్చించుట యనవసరము కాదు.

ఘాతలు, యోగులు, శ్రీకృష్ణు నామహోత్సవమున దర్శింపనరుగుదెంచిరి. తల్లి పార్శ్వమునఁ గలబంధువు లాదృతి నేతెంచిరి. తండ్రివంకవారెల్లఁ దమపనియే యన్నసంతోషమున వచ్చితి. బంధువులకు బంధువులుగూడఁ బిలిచినదియే చాలునని యచ్చటికిఁ జేరిరి. భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు కర్ణుఁడు లోనగువారు వచ్చిరి. ధృతరాష్ట్రుఁడు పుత్త్రులంగూడి వచ్చెను. భర్తృవిహీనయగు కుంతీదేవి పుత్త్రులంగూడి హర్షశోకసమాకులస్వాంతయై యరుగుదెంచెను. నానాదేశరాజులు రాజపుత్త్రులు వేడుకలార వచ్చిరి. అత్రియు, వసిష్ఠ చ్యవన భరద్వాజులు, యాజ్ఞ

"శ్లో. తే తు పారిక్షితే కాలే మఘాస్వాస న్మహర్షయః,
తదా ప్రవృత్తశ్చ కలిర్ద్వాదశాబ్ద శతాబ్దకః."

అని విష్ణుపురాణమునందుఁ గనఁబడియెడిని. దీనింబట్టి కలియుగారంభ మెప్పుడని నిర్ధారణము చేయవచ్చును. ఏకాలమున సప్తర్షులు మఘానక్షత్రమున నుండిరో అపుడు కలియుగారంభము. పరీక్షిత్తు రాజ్యకాలము నదియే. కలియుగప్రమాణము దేవమానము ననుసరించి పండ్రెండువందలసంవత్సరములు దేవమానమనఁగా,

"శ్లో. ఐందవ స్తిథిభి స్తద్వ త్సంక్రాంత్యా సౌర ఉచ్యతే,
మాసైర్ద్వాదశభిర్వర్షం దివ్యం తదహ ఉచ్యతే"
తత్షష్టి షడ్గుణా దివ్యం వర్ష మాసుర మేవ చ."

అని సూర్యసిద్ధాంతమున మొదటియధ్యాయమున నున్నది. మనుష్యమానమున మూఁడువందల యఱువదివర్షములైన దేవమానమున నొక్కవర్ష మగును. కావున దేవమానము ననుసరించిన కలియుగప్రమాణమగు పండ్రెండువందలను మున్నూటయఱువదిచే గుణించిన ౪౩౨౦౦౦ నాలుగులక్షలు ముప్పదిరెండు వేలసంవత్సరములు మనుష్యమానమున నగును. మఱియును, విష్ణుపురాణ

వల్క్యమునియు. భీమ గార్గ్యగర్గ వత్స ధర్మ జైగీషవ్యపరాశర, పులహాపులస్త్య, సౌభార్యగస్త్య సనకసనంద సనాతన సనత్కుమార వోఢ్రుపంచశిఖ దుర్వాసులును, అంగిరసుడును, వ్యాస శుక కుశిక కౌశిక రాములును, ఋష్యశృంగ విభాండక శృంగి వాసుదేవ గౌతమ గుణార్ణవ క్రతు యతిమునులు, నరుణియు, శుక్రాచార్యుండును, బృహస్పతియు, నష్టావక్ర వామన వాల్మీకి పారిభద్రక పౌల వైశంపాయన ప్రచేతసు

---

మునందే, "శ్లో. యద్దైవ భగవాన్విష్ణో రంశో యాతో దివం ద్విజ, వసుదేవ కులోద్భూతే తద్దైవ కలిరాగతః" యస్మిన్ కృష్ణో దివం యాత స్తస్మి న్నేవ తదా హని, ప్రతిపన్నం కలియుగం తస్య సంఖ్యాం నిబోధ మే, త్రేణిలక్షాణి వర్షాణాం ద్విజమానుష్యసంఖ్యయా, షష్టిశ్చైవసహస్రాణి భవిష్య త్యేష వై కలిః." అని కనుపట్టెడిని. ఏదినమున శ్రీకృష్ణుని నిరుపమాన పరమమంగళకళ భూలోకమును వదలిపోవునో ఆదినముననే కలియుగారంభమని దీనినుండి యుగప్రారంభమును గుఱించి తేలినభావము. ఇంతియకాక విష్ణుపురాణము నందు. "గతే సనాతనస్యాంశే విష్ణో స్తత్ర భవోదివం, త్యాజ సానుజో రాజ్యం ధర్మపుత్రో యుధిష్ఠిరః, విపరీతాని దృష్ట్వా చ నిమిత్తాని చ పాండవః, యాతే కృష్ణే చకారాథ సోఽభిషేకం పరీక్షితః." అని యున్నది. శ్రీపరమాత్మకళ భూలోకమును వదలిపోఁగా నపుడె పరీక్షిత్తునకుఁ బట్టాభిషేకము జరిగినది. అనుటంబట్టి కలియుగారంభమునందే పరీక్షిత్తునకు రాజ్యాభిషేకమని కనఁబడియెడిని. ఈ పురాణము ననుసరించి కలియుగప్రమాణము మనుష్యమానమున మూఁడులక్షలు నఱువదివేలనుట స్పష్టము. కలియుగమానము నాలుగులక్షలు ముప్పదిరెండువేలని మున్న చెప్పఁబడియెఁ గదా. ఇపుడు మూఁడులక్షలు నఱువదివేలని చెప్పఁబడినది. ఈరెండింటికిని భేదము డెబ్బదిరెండువేలు గలదు. ఇం దేదిసత్యము ? అన్నప్రశ్నము రాక మానదు కదా.

లును, ఋరుజిత్తును, భృగు మరీచి మధుజిత్కశ్యపమునులు, దేవమాతయగు నదితియు, దైత్యమాతయగు దితియు నరుదెంచిరి. వారివెంట సుమంతు సుభానువులు. నేకకాత్యాయన మార్కండేయులును, లోమశ, కపిల, పాణిని, పారియాత్ర, పారిభద్ర, పుంగవ, సంవర్తోతథ్యనరులును, నేనును, విశ్వామిత్ర, శతానంద, జాబాలి, తైతిల, సాందీపనియు వచ్చిరి. సాందీపని బ్రహ్మాంశసంభూతుఁడు యోగివర్యుఁడు నగునని యెఱుం

---

సమాధాన మేమనఁగా, "శ్లో. షష్ఠాంశ స్సంధ్యయో స్స్వకః" అను సూర్యసిద్ధాంతవాక్యమునుబట్టి ఆరంభాంత్యకాల సంధిప్రమాణముయుంగ ప్రమాణమున నాఱవభాగమని తెలియఁదగును. నాల్గులక్షలు ముప్పదిరెండువేలలో నాఱవభాగము డెబ్బదిరెండువేలు. దీనిని మూఁడులక్షలు నఱువదివేలతోఁ గలిపినఁ గలియుగప్రమాణము నాల్గులక్షలు ముప్పదిరెండువేలని స్పష్టమగును.

మఱియుం విష్ణుపురాణమునందు. "శ్లో. యావత్పరీక్షితో జన్మ యావన్నందాభిషేచనం, ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచాశ దుత్తరమ్." అని యుండుటవలన పదివందల యేఁబదివత్సరములు పరీక్షిన్నందభూపతుల యంతరకాలమని స్పష్టమయ్యెడిని. భాగవతమునందు. "శ్లో. ఆరభ్య భవతో జన్మ యావన్నందాభిషేచనమ్, ఏకమేవ సహస్రంతు శతం పంచ దశోత్తరమ్." అని యుండెడు. దీనింబట్టి వేయినూటపదునైదువత్సరములని స్పష్టపడుచున్నది. మత్స్యపురాణమునందు. "శ్లో. మహాపద్మాభిషేకాత్తు యావజ్జన్మ పరిక్షితః, ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచ శతోత్తరమ్." అని యున్నది. దీనింబట్టి పరికింపఁగా, పరిక్షిన్నందరాజుల కంతరకాలము పదునైదువందలసంవత్సరములని కనుపట్టుచున్నది. ఈ మూఁడుగ్రంథములనుబట్టి పదివందల యేఁబడి వత్సరములు, పదునొకండువందల పదునైదువర్షములు, పదునైదువందల సంవత్సరములు, అని కనఁబడుచున్నది.

గుము. ఉపమన్యువు, గౌరముఖుఁడు, మైత్రేయుఁడు, శ్రుతశ్రవసుఁడు, కఠకచ కరఖభరద్వాజులు వచ్చిరి. వీరెల్ల శిష్య ప్రశిష్యులంగూడి వేదపఠనము చేయుచు వసుదేవు నాశ్రమము నకు నరుదెంచిరి.

వసుదేవుఁడు వారినెల్లం గాంచి సాష్టాంగదండాకార వందనములాచరించి ముకుళితకరుఁడై నిలువంబడి స్వాగతాది ప్రశ్నముల నాతిథేయసత్కారముల వారి నాదరించి వారి యాశీఃపాత్రుఁడై కృతకృత్యతంగంటినని యానందించెను. ఆసమ

---

ఇపుడు కలియుగమున నైదువేలు మీఱినవి. కావున నందరాజాంత కాలము మీఱినది. కావున శుద్ధక్షత్రియవైశ్యజాతులు లేవని కొందఱు దేవా నాంప్రియులు వాదింతురు. కాని వారిమాట యించుకయు విశ్వాసపాత్రము కాదు. పై నుదాహరించిన వచనములయందున్న పరిక్షిన్నందాంతరకాలము మనుష్యమానమున లెక్క పెట్టఁ దగినది కాదని యెఱుంగవలయు. మనుష్యమానముచేతనే లెక్కపెట్టవలయునని మే మంగీకరింతుమని కొంద ఱందురేమో అట్లే యంగీకరించినయెడల,

విష్ణుపురాణము—

"శ్లో. ప్రయాస్యంతి యదా చైతే పూర్వాషాఢాం మహర్షయః,
తదా నందాత్ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి." అను ప్రమాణము.

భాగవతము—

"శ్లో. యదా మఘాభ్యో యాస్యంతి పూర్వాషాఢాం మహర్షయః,
తదా నందాత్ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి." అనువచనము.

మత్స్యపురాణము—

"శ్లో. యావ త్పరిక్షితో జన్మ యావన్నందాభిషేచనమ్,
ఏకమేవ సహస్రంతు జ్ఞేయం పంచాశదుత్తరమ్."

యమున హంసవాహనారూఢుండై సస్మితముఖపంకజుండై పర
మేష్ఠియు, రత్నవిమానారూఢుండై పార్వతింగూడి పరమేశ్వ
రుండును, నందీశ్వరుండును, మహాకాళుండును, వీరభద్ర సుభ
ద్రక మణిభద్ర పారిభద్ర కార్తికేయగణేశ్వరులును విజయం

అనునదియుం బరస్పరవిరోధము గలిగినదగును. ఆవిరోధము మాన్ప శక్యము
గాకయుండును. ఏలయనఁగా,

"శ్లో. సప్తర్షీణాం తు యౌ పూర్వౌ దృశ్యేతే హ్యుదితౌ దివి,
తయోస్తు మధ్యే నక్షత్రం దృశ్యతే యత్సమం నిశి.
తేన సప్తర్షయో యుక్తా స్తిష్ఠం త్యబ్దశతం నృణాం,
తేతు పారిక్షితే కాలే మఘాస్వాసన్ ద్విజోత్తమ."

అను విష్ణుపురాణవచనము ననుసరించి సప్తర్షులమండల మొకనక్షత్రమున
నూఱువత్సరము లుండును. ఆవత్సరములు దేవమానముచేతనని యెఱుంగఁ
దగు. మనుష్యమానముచేతనే యని యంగీకరించినయెడలఁ గలియుగప్రమాణ
మున బరిక్షిజ్జన్మము, రాజ్యారంభకాలము నెన్నిపర్యాయములో రావలసి
యుండును. ఇపుడు కలియుగమున నయిదువేలకు మించినసంవత్సరములు
గతించినవని యందఱు అంగీకరింతురు. మనుష్యమానమున నని యంగీకరింతు
రేని సప్తర్షిమండల మార్ద్రానక్షత్రమున నుండవలయును. కాని యిపు
డామండలము మఘానక్షత్రమునందే యున్నది. కావున నాసంఖ్య మనుష్య
మానమునఁగాదనుట సిద్ధాంతము.

మత్స్యపురాణమునందు—

"సప్తర్షయస్తు వర్తంతే యత్ర నక్షత్రమండలే,
సప్తర్షయస్తు తిష్ఠంతి పర్యాయేణ శతంశతం.
సప్తర్షీణాం తు పర్యాయే తత్సమాప్తం దివ్యసంఖ్యయా."

అని కనపట్టువచనమునకు మహావిరోధము సంభవించును.

చేసిరి. ఐరావతము నెక్కి మహేంద్రుఁడును, ధర్మదేవతయుఁ, జంద్రుఁడును, భాస్కరుఁడును, గుబేర వరుణ పవన పావక భాస్కరపుత్ర జయంత నలకూబరులును, జనుదెంచిరి. గ్రహాధిదైవతములు, నేకాదశరుద్రులు, నాదిత్యులు, శేషువు, నానాదేవతాభేదములు, ఇంకను దిగ్విదిక్కులంగల మహాత్ములెల్లరు శ్రీకృష్ణోపనయనమును జూచువేడుక నేతెంచిరి. వారికెల్ల విధివంతముగా నాతిథేయసత్కారము లాచరించెను. యథార్థముగా వినుతించెను. భక్తినమ్రుఁడై పులకాంచితవిగ్రహుఁడై యున్న

---

లోపలఁ గనఁబఱచిన 'తిష్ఠంత్యబ్దశతం నృణామ్' అనుచో నృణామ్ అను పాఠము ప్రామాదికము. 'మునే' అను సంబోధనమే కొన్ని ప్రతులలోఁ గనఁబడియెడిని. అదియే సాధువని చెప్పవలయును. లేకున్నఁ బరస్పరవిరోధము దుర్వారమగును. అంతియగాక ప్రత్యక్షవిరోధముగూడ నగును. ఇంతియగాక పరిక్షిన్నందాంతరకాలమును మూఁడువిధములుగా గ్రంథములు చెప్పినవి కదా. అందు 'పంచాశదుత్తరమ్' అను పాఠమే సాధువు. ఎందులకనఁగా. మఘానక్షత్రము మొదలుకొని మూలనక్షత్రమువఱకు పదినక్షత్రము లగును. ఒక్కొక్కనక్షత్రమందు సప్తర్షిమండలము దేవమానమున నూఱువత్సరము లుండును. నూఱువత్సరములు దేవమానముననైన నవి మానవమానమున ముప్పదియాఱువేలవర్షము లగును. మఘ మొదలు మూలనక్షత్రముఱకుఁ బదితారలు గాన వానిని బదింట గుణించిన మూఁడులక్షలు నఱువదివే లగును. (౩౬౦౦౦౦.)

“ఏతద్వర్షసహస్రం తు జ్ఞేయం పంచాశదుత్తరమ్.”

అను పాఠము ననుసరించి పదివందలయేఁబది దివ్యవర్షములు మనుష్యమానమున మూఁడులక్షలు డెబ్బదియెనిమిదివే లగును. ఆకాలమున సప్తర్షిమండలము పూర్వాషాఢ మధ్యభాగమును బొందును.

వసుదేవునిం గాంచి వారెల్ల నానందాంబుధి నోలలాడిరి. అంతట వసుదేవుఁడు భక్తిభావమున నంజలి బంధించి యిట్లు పలికెను. పరమాత్మయనియు, పరబ్రహ్మమనియుఁ, బరమేశ్వరుఁడనియుఁ, బరాత్పరుఁడనియు, విధాతయనియు, జగత్పరిపాలకుఁడనియు, వేదజనకుఁడనియు, స్రష్టయనియు, సృష్టిహేతువనియు, సనాతనుఁడనియు, సురలకుఁ దదధిపతులకు మునీంద్రులకు సిద్ధేంద్రులకు గురువులకును గురుఁడనియుఁ, బొగడఁ

---

"శతం పంచదశోత్తరమ్."

అనుపాఠము నంగీకరించినయెడలఁ బూర్వాషాఢ నతిక్రమించి యుత్తరాషాఢను బొందును.

"పంచశతోత్తరమ్."

అనుపాఠమును గ్రహించినపక్షమునఁ గలియుగమే దాఁటిపోవును. కావున రెండవ మూఁడవపాఠములు వ్రాఁతపొరపాటువలనఁ గలిగినవనిచెప్పక తప్పినది కావు. గణితముగాన నిందుఁ బొరపాటులు తప్పక కనఁబడును. వారు చెప్పినప్రకారము లెక్కచేసితిమి కాని కలియుగకాలము సప్తర్షిమండల సంచారము కల్పించిన కాదు కదా. కావున రెండవ మూఁడవపాఠములు ప్రమాదము లనక యెవ్వరికిని దప్పదు. ఈవిషయమును దెలుపుటచేఁ దేలిన ఫలిత మేమనఁగా పరిక్షిన్నందరాజాంతరకాలము మనుష్యమానమున మూఁడు లక్షలు డెబ్బదియెనిమిదివేల సంవత్సరములు. కావున నాకాలమున ననఁగాఁ గలియుగమున మూఁడులక్షలు డెబ్బదియెనిమిదివేల వత్సరములుకాఁగా క్షత్రియ వైశ్యజాతులు శూద్రప్రాయులగుదు రనవచ్చును. కాని యిపు డన రాదని పురాణార్థములను జక్కఁగ నెఱింగినపెద్ద లంగీకరింపక మానరు.

ఇప్పుడు కలియుగమున నైదువేలు ఇరువదియెనిమిది (౫౦౨౮) సంవత్సరములు గతించినవి. ఇఁకమీఁదట మూఁడులక్షలు డెబ్బదిరెండువేలు

బడు నీవు మద్గేహంబున కరుదెంచితివి. ధన్యుఁడనైతిని. నా జన్మము కృతకృత్య మయ్యెను. అని పరమేష్ఠిని బొగడి పరశం కరుం బొడఁగని మహాత్మా! స్వప్నమందును నీపాదారవిందము క్షణమాత్రము చూచుటకుంగాడ దుర్లభము. శివ నామస్మరణమాత్రమున సర్వానిష్టములు తొలఁగును. సర్వసంక

---

తొమ్మిదివందల డెబ్బదిరెండు (౩౭౨౯౭౨) సంవత్సరములు గడచినమీఁద క్షత్రియవైశ్యకులము లుండవని పై వచనసారాంశము. ఆకాలమునందు,

"శ్లో. నాధీయంతే కలౌవేదా న్నయజంతే ద్విజాతయః,
ఉత్సీదంతి తథా చైవ వైశ్యైస్సార్థం తు క్షత్రియాః."

అను మత్స్యపురాణవచనానుసారము బ్రాహ్మణులు వేదపాఠమును మానుదురనియు, హోమాదుల నాచరింపరనియుఁ దేటపడియెడిని. అపుడు క్షత్రియవైశ్యజాతులు లేకుండునన్నఁ జింతయేటికి. ఈ మూఁడుజాతులుకలిసి వేఱొకజాతిగా మాఱును, ఇక్కాలమున నెందఱో బ్రాహ్మణులు వేదపాఠముచేయుచున్నవారు. యాగములచే దేవతలఁ దృప్తిపఱచుచున్నారు. కావున క్షత్రియవైశ్యజాతులకు విచ్ఛిత్తి కలిగినదనుమాట ధర్మవిరుద్ధము. క్షత్రియులకు వేదాధికారము కలదనియు, వైశ్యులకుమాత్రము లేదనియుఁ గొందఱు చెప్పంబూనుదురు. కాని యామాట యున్మత్తప్రలాపమని పై నుదాహరించినప్రమాణమే చెప్పుచున్నది. పైవచనములనన్నింటిని బరిశీలింపఁగా బ్రహ్మక్షత్రియవైశ్యులను నీ మూఁడుజాతులవారికి నేకకాలముననే జాతిభ్రష్టతయో జాతిసద్భావమో కలుగవలయునే కాని యొక్కజాతికి మాత్రమే కలుగదనుట స్పష్టము.

శ్రీమహాభారతమునఁ గర్ణపర్వమునందు—

"శ్లో. అతస్త్వాం కథయే కర్ణ నిదర్శన మిదం పునః,
వైశ్యాః కిల సముద్రాంతే ప్రభూతధనధాన్యవాన్,
యజ్వా దానపతిః క్షాంత స్స్వకర్మస్థోఽభవచ్ఛుచిః."

టములు నశించును. కల్యాణములు లభించును. అని గణనాయకుం గాంచి మహానుభావా! సర్వదేవతలకంటె ముందు పూజగొను నధికారము గలిగి దేవతాగ్రణి యనంబరంగుచు, నొకకలశమునందు మంత్రములచే నావాహనముచేసిన యంతనే సర్వశుభములం గల్పించుచు, గణేశుండను విఖ్యాతిం గాంచి షడ్గుణైశ్వర్యములు వెలయ సర్వవిఘ్నములం బోం

---

అని కనుపట్టెడిని. భారతము కలియుగమునకుగా వ్రాయఁబడక కృతయుగమునకని యెవ్వ రనరు కదా. వైశ్యుం డొకండు యజ్ఞముచేసినట్లు స్వకర్మనిరతుం డైనట్లు పైవచనమున నున్నదికదా. కలియుగమున వైశ్యులకు వేదాధికారము లేదన్నవాదము దుర్వాదమని స్పష్టమైనది కదా. నందాంతమే వారికి వేదాధికారము గలిగియుండునన్న వాదముననుసరించి కలియుగమున మూఁడు లక్షలకుఁ బైఁగా నెన్నియోవత్సరములు గడచినఁ గాని యావాదము చెల్లదని ముందే వ్రాసితిని గదా.

ఆపస్తంబధర్మసూత్రమునందు—

"స్వకర్మ బ్రాహ్మణస్యాధ్యయనమధ్యాపనం యజ్ఞో యాజనందానం ప్రతిగ్రహణం దాయాద్యగిశిలోంఛ అన్యద్వా పరిగృహీతమేతాన్యేవం క్షత్రియస్య అధ్యాపనయాజనప్రతిగ్రహణాని పరిహాప్యదండయుద్ధాదికాని క్షత్రియవద్వైశ్యస్య దండయుద్ధవర్జ్యం కృషిగోరక్షణవాణిజ్యాదికమితి." అనియున్నది. వైదికకర్మములు క్షత్రియవైశ్యులకుఁ దుల్యములని యాపస్తంబుల తాత్పర్యమని తెలిసెనుగదా.

పరాశరస్మృతియందు—

"శ్లో. వైశ్యం వా క్షత్రియం వాపి నిర్దోషం యోఽభిపాతయేత్,
సోఽపి కృచ్ఛ్రద్వయం కుర్యాద్గోవింశద్దక్షిణాం దదత్."

అని కనఁబడియెడిని. ఇట దోషమనఁగా విధివిహితకర్మత్యాగమని యర్థము.

గొట్టుశక్తిగలిగి పరమపావనమూర్తిగలిగి యలరారు నీకు నమస్కారములు. అని కార్తికేయుని దర్శించి స్వామీ! దేవాధిపతులు నిన్నుఁ బూజింతురు. కరుణింపుమని దేవతలంబొగడి దేవతేశ్వరుల కభివందనములొనర్చి మహాలక్ష్మినుతించి పార్వతి దిక్కు మొగంబై జగజ్జననీ పార్వతీ! జగదాదిస్వరూపిణివి. సర్వశక్తివి. మూలప్రకృతివి. ఈశ్వరివి. పరాత్పరులకంటెఁ బరమేశ్వరివి. పరబ్రహ్మస్వరూపిణివి. నీపాదవందనము భక్తుల సకల

---

యమస్మృతియందు—

"శ్లో. హత్వా స వనినం వైశ్యం రాజన్య మపి దీక్షితం,
హత్వా తు బ్రహ్మహత్యేవ తథా త్రేయీం చ బ్రాహ్మణీమ్."

అని యున్నది. యజ్ఞముచేసిన వైశ్యునుటచే వైశ్యునకు యజ్ఞముచేయు నధికారమున్నదనుట స్పష్టము కదా.

శంఖస్మృతియందు—

"శ్లో. యాగస్థం క్షత్రియం హత్వా వైశ్యం హత్వా తు యాగగం,
ఏతదేవ వ్రతం కుర్యాదాత్రేయీ వినిఘాతుకః."

అని యున్నది. క్షత్రియవైశ్యులకు యాగాధికారము దీనిచేతను స్పష్టమగును.

ఇట్టులుండఁగాఁ బైవచనజాతమునందు క్షత్రియవైశ్యుల నిద్దఱను బేర్కొనియుండఁగాఁ గొందఱు క్షత్రియునివదలి వైశ్యునిమాత్రము గ్రహించి వైశ్యునకు వేదాధికారములేదని ఘోషింతురు. వారిఘోష మరణ్యరోదనము వంటిది. మఱికొందఱు పండితులమనుకొనువారు పైవాక్యము లన్నియుఁ గృతత్రేతాద్వాపరయుగమున నున్నక్షత్రియవైశ్యులకు వేదాధికారమును బ్రతిపాదించునవని పల్కుదురు. ఆయర్థము దేనినిబట్టి చెప్పుదురన్న నాకాశమును జూడవలసినదే కాని వేఱుదిక్కు వారికి లేదు.

వాంఛితముల నొసంగు. శరత్కాలమున భక్తిచే నిన్నారాధించినఁ బ్రసన్నురాల వగుదువు. అట్టిపరదేవివగు నీవు నామందిరమునకు సర్వదేవతలం గూడి భక్తవత్సల యనుపేరు సార్థకముగాఁగ విజయంచేసితివి. ధన్యుఁడను. కృతకృత్యుఁడను. నాజీవనము సఫలము. నాగృహము పావనము. అని యిట్లు వేలువేలుఁబొగడి సకలమునీంద్రులను విప్రప్రవరులను సత్కరించి విడుదులంజూపి యందు నివసింపఁ జేసెను. అందఱు వసుదేవుఁడు వేర్వేఱఁ జేసినపూజల కానందించిరి.

---

"శ్లో. నందాంతం క్షత్రియకులం వేదవైదికసంయుతం,
భవిష్యతి తతశ్శూద్రప్రాయం వైశ్యకులం తథా."

అను వైశ్యకమలాకరవాక్యముచేత నందరాజు రాజ్యము పాలించినంతదనుక క్షత్రియవైశ్యులకు వేదాధికారముగలదని స్పష్టము కాక మానదు.

పరాశరస్మృతియందు—

"శ్లో. షట్కర్మాభిరతో నిత్యం దేవతాతిథి పూజకః,
హుతశేషం తు భుంజానో బ్రాహ్మణో నావసీదతి." ౩౮

అనువచనము కలదు. దాని వ్యాఖ్యానమునందు వేదభాష్యకర్తయగు శ్రీమాధవాచార్యులు విశేషించి స్మృతు లుదహరించిరి కాని యం దెచ్చటను వైశ్యులకు వేదాధికారము కలదని సిద్ధాంతము చేయలేదు. కావున వేదాధికారము వైశ్యులకు లేదని కొందఱు విద్వద్వ్రతంసుల మనుకొనువారు పల్కుదురు. ఇంతకంటె మహాసాహసము వేఱొకటి కానరాదు. ఇట్లు వాదించువారు కొంతకాలము గాయత్రి నారాధించినఁగాని యాపాపము పోదని నా యూహ. ఏలయనఁగా. వేదాధికారము లేదనునిషేధ మేస్మృతియందైనఁ గనఁబడినపుడు వారికిని గలదని ప్రతిపాదింపవలయును. ఎందును నిషేధింపఁబడని విషయమును మరలఁజెప్పుట తెలివితక్కువచేతఁ గాక మఱేమిటి? పరా

## రామకృష్ణోపనయనసంస్కారము.

అంత గర్గమునివరు ననుమతిచొప్పునఁ గళ్యాణమండపమున కెల్లర వసుదేవుఁడు రాఁ బ్రార్థించెను. ఆమండపము సర్వాలంకారసంభృతము. సర్వలోకపవిత్రము. సుమనోహరము. దాని కదియేసాటియని చెప్పుటకంటె వేఱుగ వర్ణింప

---

శరస్మృతి పరాశరమునిప్రణీతమే యని ప్రతిపత్రమునందును వ్రాయవలయునా. ఇట్లడుగుటమొండిపట్టుదలచేఁ గాక మఱేహేతువుచేతనో యెఱుంగఁజాలను.

పరాశరస్మృతియందు వైశ్యధర్మప్రకరణమునందు—

"శ్లో. లాభకర్మ తథా రత్నం గవాం చ పరిపాలనమ్,
కృషికర్మ చ వాణిజ్యం వైశ్యవృత్తి రుదాహృతా." ౬౩

అను శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయునపుడు వేదభాష్యకర్త వరాహపురాణమునుండి,

"శ్లో. స్వాధ్యాయం యజనం దానం కుసీదం పశుపాలనం,
గోరక్షాం కృషివాణిజ్యం కుర్యాద్వైశ్యో యథావిధి."

అనుశ్లోకము నుదాహరించి యంతతోఁ దృప్తినొందక,

మార్కండేయే—

"శ్లో. దానమధ్యయనం యజ్ఞో వైశ్యస్యాపి త్రిధైవసా,
వాణిజ్యం పాశుపాల్యం చ కృషి శ్చైవాస్య జీవికా."

అనియును నుదాహరించిరి. దీనిచేత మాధవాచార్యులమతము వైశ్యులకు వేదోక్తకర్మములు శాస్త్రసమ్మతము లనియూ కావనియూ. వేదభాష్యకర్తను సమ్మతమైనపుడు పండితమ్మన్యులకు సమ్మతముగా నున్న దానఁ గొఱంతపడనక్కఱలేదు.

శక్యము కాదు. ఆమనోహరశుభకర్మము నడుపఁ బెక్కుమంది మహర్షులను వసుదేవుఁడు నియమింప వరించెను. గర్గముని బ్రహ్మత్వమున నుండెను. వారినెల్లఁ దొలుదొలుత విధివంతముగా వసుదేవుఁడు చందన సుమనోమాలికారత్నాలంకారాదుల నర్చించి సంతుష్టమతులనుగా నొనరించి యుచితాసనములఁ గూరుచుండఁ జేసెను. వారినడుమ రత్నసింహాసనమున గణపతిని గూరుచుండఁ జేసెను. శుభకర్మమునకు ముందు గణపతిని బూజించుట సదాచారము కాన నాకార్యమునకై యాగణాధి

---

ఆపస్తంభ ధర్మసూత్రమునందు—

"సూ. అశూద్రాణా మదుష్టానా మూపాయనం వేదాధ్యయన మగ్న్యాధేయం ఫలవంతి చ కర్మాణి." అనియున్నది. దీనికిభాష్యము.

"శూద్రవర్జితానాం త్రయాణాం వర్ణానాం అదుష్టకర్మణా ముపనయనా దయోధర్మాః." అని,

దీనింబట్టి కొందఱు "అదుష్టకర్మణామ్" అని భాష్యమునం దున్నదిగాన నిప్పటివైశ్యులకుఁ బితృపితామహ ప్రపితామహులవఱకు నుపనయనసంస్కారము లేదుగావున వ్రాత్యత్వమలవడెననియు, దానిచే వేదోక్తకర్మార్హత పోయినదనియుఁ బలుకుదురు. ఆవాదమున కనురూపముగా మనుస్మృతి మూఁడవయధ్యాయమునందున్న,

> "కువివాహైః క్రియాలోపై ర్వేదానధ్యయనేన చ,
> కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ." ౬౩

అనుశ్లోకము నుదాహరింతురు. ఇంతకంటె నవిచారమూలమగు వాదము లేదు. ఇంచుక యాలోచింతము. శ్రుతిస్మృతినిషిద్ధకర్మము లాచరించువారు దుష్టకర్ము లనఁబడుదురు. కువివాహములనఁగా తమతమ గృహ్యసూత్రము ననుసరించిచేయని వివాహములు. క్రియాలోపములనఁగా గర్భాధానాద్యష్టచత్వా.

పతి నావాహనము చేసెను. సువర్ణకలశములనిండ సప్తతీర్థము
నుండి జలమును దెప్పించి యాకలశములకుఁ జందనకుసుమ
మాలికలచే శృంగారము గావించి పరిమళవస్తువుల నింపి యా
శీతలజలములచేతను, వియద్గంగోదకములచేతను, బరమపవిత్ర
మగు పుష్కరోదకముచేతను, బంచామృతములచేతను, బంచ
గవ్యముచేతను భక్తియుక్తచిత్తమున నాహారంబునకు స్నాన
ముచేయించి మరల సాగరజలములచే నభిషేకమహాము నడ
పించి శుద్ధోదకముల స్నానముచేయించి ధౌతవస్త్రముల గట్ట
నిచ్చెను. పారిజాతకుసుమహారముల నలంకరించెను. సురుచిర
వరరత్నభూషణముల సింగారించెను. అగ్నివలెఁ బావనమయి

---

రింశత్సంస్కారములు చేయకుండుట. వేదానధ్యయనమనఁగా ఫలవదర్థావ
బోధకసాంగవేదములఁ బఠింపకుండుట. అను వీనిచేత బ్రాహ్మణ క్షత్రియ
వైశ్యకులములు జాత్యభావతను బొందుచున్నవి. అని పై ఆపస్తంబసూత్ర
మనుస్మృతివచనతాత్పర్యము.

ఈదోషములు బ్రాహ్మణాదులకందఱకుం గలవు. ఎట్లనఁగా సావధాన
ముగాఁ దలంపుఁడు. మూఁడురాత్రములు దీక్షగలయుంపనయన మొక్కపూ
టలో ముగింపఁబడుచున్నది. నాల్గురాత్రములు దీక్షగాఁగలవివాహ మొక
పగటిలోఁ గొంతభాగముననే పూర్తిచేయఁబడుచున్నది. విధిహితకాలమునఁ
జేయఁబడక జాతకర్మాదిసంస్కారము లెపుడో చేయఁబడుచున్నవి. ఉపనయ
నానంతరమః వివాహమునకుఁ బూర్వముచేయఁదగు వేదవ్రతాదు లవకాశము
ననుసరించి చేయఁబడుచున్నవి. ఔపాసనాది విహితధర్మములు వంటచేయుు
వారిస్వాధీనము చేయఁబడుచున్నవి. ఇవన్నియుఁ బై మనుస్మృత్యుక్తదోష
మునకు లక్ష్యములు కావనుట బ్రహ్మకేని శక్యము కాదుకదా. ఈయాచార
ములు లోకమున నిపుడు లేవందురా. కలవందురా. కలవు అనక తప్పదు.

యమూల్యమయి తనరారు నంబర మొసంగెను. పరిమళచందనము మైనిండ నలఁదెను. సుమనస్సంతతులచేఁ బూజించెను. రత్నమాలికాలంకృతమగు భర్మాంగుళీయక మర్పించెను. విధియుక్తమగు పూజలచే నాహేరంబుని గణాధిపతిని దృప్తిపఱచెను. సర్వదేవాధిపా! పార్వతీపుత్రా! యని వినుతించెను. సర్వవిఘ్నములు శాంతినొందఁ జేయుమాయని ప్రార్థించెను. ఇట్లు తొలుదొలుత గణపతిపూజ సాంగముగా నెఱవేర్చెను.

---

అపుడందఱకు జాతిలేదు. క్షత్రియ వైశ్యులకు మాత్రమే యీదోషమనుట తెలివితక్కువ కాదా. కలికాలమున విధివిహితకాలమునఁ గాకున్న నెప్పుడేని పైసంస్కారములు నామమాత్రము చేయఁబడుచున్నవి కదాయని సంతోషింపవలసియుండఁగా నవి లోపములని చూపి వైశ్యకులమే లేదనుటకన్న సాహసకార్యము వే ఱేదియుండును? ఇట్టిసాహసము చేయఁబూనుట పరిహాసాస్పదమనుటకంటె వే ఱేమియుం ననఁజాల కున్నవాఁడను. ఇపు డాంగ్లభాషాతత్పరులు కొందఱు వేదపాఠము చేయనంతమాత్రమునఁ దత్పుత్రులు జాతిహీనులనవచ్చునా. ఆంగ్లభాషాతత్పరులుకాని వైదిక బ్రహ్మలలోఁ బెక్కుమంది వేదము చదువనివారుండుట ప్రత్యక్షము గదా. వారిపుత్రులు బ్రాహ్మణులు కా రనఁదగునా! వేదమంతయుం రాకున్నను యథాశక్తిఁ బఠించినను జాలునని తృప్తినొందవలయునే కాని "కువివాహైః" అను మనుస్మృతి ననుసరించి క్రియాలోపవేదానధ్యయనాదులచే జాతిభ్రష్టులనిపలుకుట యవివేకమూలమని నా భావము. స్మృత్యుక్తకర్మాచరణదారిద్ర్య మన్నిజాతులకుఁ గలదని యంగీకరించుట బుద్ధిమంతుల లక్షణముకాని యొక్కవైశ్యజాతియందే దాని నారోపించుట న్యాయమునకుఁ గడుదూరము.

సావిత్రీపతితులు వ్రాత్యులుకారా యని కొందఱందురు. ఆమాట సత్యము.

తెలఁచే బుస్తకమును బెంచవలయునను భావమునఁ గాదని యెఱుంగవలయును.

ఇందుఁ జేసినచర్చచేఁ బ్రకృతకథ కేమి లాభమో యించుక కథారంభముననే వ్రాసితిని. భగవంతున కీయవతారమున నెన్నియేండ్లు మనుష్యమానమునఁ గడచెనని యెఱుంగవచ్చును. కాని యుపనయనకాలము రెండువిధములుగా నున్నందున నేకాలము ననుసరించి వసుదేవుఁ డీకార్యము నడపెనో

---

ముక్తం తేన సహాస్య గురులాఘవ మనుసంధాయ జాతిశక్త్యాద్యపేక్షో వికల్పో మంతవ్యః." అని కుల్లూకభట్టు.

ఆర్యులార! చూచితిరా. మహాత్ము లెట్టికరుణాళువులో. వ్రాత్యులకుఁ బ్రాజాపత్యత్రయము ప్రాయశ్చిత్తముగాఁ జేయించి యుపనయనము చేయవలయునని చెప్పిరి. ఇంతటి స్వల్పప్రాయశ్చిత్తము నిర్దేశించిన మహాత్ముల భావమేమి? ప్రాయశ్చిత్త మతిభారమైన మానుదురనియు. దాన జాతికే వినాశము సంభవించుననియు నట్లు కాఁగూడదనియు, వ్రాత్యులుకానివా రుండుట యరుదనియు నల్పశ్రమసాధ్యమగు ప్రాయశ్చిత్తము చేయించి యుపనయనము చేయించినఁ జాలుననియు దీనిచే వేదోక్తకర్మములు ప్రపంచమున నిలుచుననియు నూహించియే గదా యిట్లు చెప్పిరి. అని మనము గ్రహింపందగును. ఎంతటివేదాభిమానము! ఎంతటిభూతదయ! ఎంతటి కరుణ! వర్ణింపసాధ్యమా. మన కెట్లున్నది? ఏమైన దోషము కనఁబడిన నాక్షేపింతమా యని, మనముచేయు దోషములను బయలుపఱుపరాదనియు నై యున్నది. ఇట్టి మనము ధర్మము చెప్పఁబూనుట కనర్హులము గాక మఱేమి?

ప్రాజాపత్య మనుప్రాయశ్చిత్త మెట్టిదనఁగా.

యెఱుంగుట కష్టముగ నున్నది. పదునొకండవసంవత్సరమని మనము నిర్ణయించుకొని ముందు కథను సాగింతము. "అగోత్రస్య త్వవర్ణస్య కుతస్తస్యోపవీతకమ్" అన్నట్లు భగవంతుఁడగు శ్రీకృష్ణునకు నేగోత్రమని యేవర్ణమని నిర్ణయించి యజ్ఞోపవీతము వేయవలయునో యెవ్వరెఱుంగరు. కాని యెవ రేగోత్రమన్నను గొఱంతయుండదు. ఏవర్ణమన్నను బాపము లేదు. ఏభక్తుఁ డేవర్ణమనిభావించి యేపేరున నేసంస్కారము విధివిహితముగా నొనరించినను భగవంతునకు సంతృప్తియే. కావున

---

యాజ్ఞవల్క్యస్మృతి—

"శ్లో. ఏకభక్తేన నక్తేన తథైవాయాచితేన చ,
ఉపవాసేన చైవాయం పాదకృచ్ఛ్రః ప్రకీర్తితః. 318
యథా కథంచి త్త్రిగుణః ప్రాజాపత్యోఽయ ముచ్యతే." 319

వ్యా. అయమేవపాదకృచ్ఛ్రః యథాకథంచిద్దండకలితవదావృత్త్యా స్వస్థానవివృద్ధ్యా వా. తత్రాప్యానులోమ్యేన ప్రాతిలోమ్యేన వా తథా వక్ష్యమాణజపాదియుక్తం తద్రహితం వా త్రిరభ్యస్తః ప్రాజాపత్యోఽభిధీయతే, తత్ర దండకలితవదావృత్తిపక్షో వసిష్ఠేన ప్రదర్శితః. అహః ప్రాతరహర్నక్తమహరేకమయాచితమ్, అహః పరాకం తత్రైకమేవం చతురహాపరౌ, అనుగ్రహార్థం విప్రాణాం మనుర్ధర్మభృతాంవరః, బాలవృద్ధాతురేష్వేవం శిశుకృచ్ఛ్రమువాచ హ. ఇతి. అనిమితాక్షర. ఈప్రాయశ్చిత్త మెంత సులభమో యూహింపుఁడు. ఈదోషమున కీప్రాయశ్చిత్తమని నిర్ణయించున దెవ్వరనునది మీఁది ప్రశ్నము.

మనుస్మృతి—

"శ్లో. ధర్మేణాధిగతో యైస్తు వేదస్సపరిబృంహణః,
తే శిష్టా బ్రాహ్మణా జ్ఞేయాః శ్రుతిప్రత్యక్షహేతవః." 109

వసుదేవుఁడా కృష్ణమూర్తికి నుపనయనము చేయఁబూనుట సహజముగనే యున్నది. ఏశాపమును భగవంతుని బాధింపఁజాలదు. స్వోక్తివ్యాఘాతము కాఁగూడదని తా సర్వేశ్వరుఁడయ్యు నొకప్పుడు లోకాచారము ననుసరించును. దాన సంగియని యాపరమాత్మను బలుకరాదు. శ్రీహరియే,

"శ్లో. జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేవ సోఽర్జున."

అని భగవద్గీతలయం దుపదేశించెను. భగవదవతార కారణ మేమని యెఱుంగుటయే తరణోపాయమని దీనిసారము. భగ

---

దశావరావా పరిషద్యం ధర్మం పరికల్పయేత్,
త్ర్యవరా వాపి వృత్తస్థా తం ధర్మం న విచాలయేత్." ౧౧౦

"వ్యా. యది బహవస్సంతోఽవహితా న భవంతి తదా దశావరాత్ర్యవరాశ్చేతి వక్ష్యమాణలక్షణాయస్యాస్సా పరిషత్ తదభావే త్రయోఽవరాయస్యాస్సా వా సదాచారా యం ధర్మం నిశ్చినుయాత్తంధర్మత్వేన స్వీకుర్యాన్నవి సంవదేత్." అని.

"శ్లో. త్రైవిద్యో హైతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః,
త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యాద్దశావరా. ౧౧౧
ఋగ్వేదవిద్యజుర్విచ్చ సామవేదవిదేవ చ,
త్ర్యవరా పరిషద్జ్ఞేయా ధర్మసంశయనిర్ణయే." ౧౧౨

అని సమాధానము చెప్పవచ్చును. ఇట్లు మహాత్ములు సకాలమున నుపనయనాదులు లేనివారికిఁ గరుణాళువులై సులభముగాఁ బ్రాయశ్చిత్తము విధించి యాప్రాయశ్చిత్త మీపాపమునకుఁ జాలునని చెప్పునధికారము పరిషత్తునకు (సభకు) నిర్ణయించి యీసభయందుఁ గూరుచుండఁ దగినవారియోగ్యత యిట్లుండవలయునని నిశ్చయించి యున్నారు. కావున నాయాపాపమునకుఁ దగినప్రాయశ్చిత్తము చేసికొనుట న్యాయసమ్మతమని నాభావము. మఱియొక ప్రశ్నము.

వంతుఁ డేలయవతరించునని యెఱుంగవలయునని దీనినీతి. అట్టి శ్రీకృష్ణునకు నుపనయనము చేయఁబూని వసుదేవుఁడుండ గర్గముని చనుదెంచెను. శ్రీహరికి గాయత్రి నుపదేశించుట కన్న భాగ్యముకలదా, యని తలంచి మహాముని శిష్యులం గూడి యరుదెంచెను. వసుదేవుఁ డాకస్మికముగాఁ బురోహితు లరుదెంచిరని తనప్రవృత్తి నెఱింగించెను. ముహూర్తము మూఁడవదినమునందే యున్నదని గర్గముని పల్కెను. బాహ్యాచారము లీకాలమున నున్నయన్ని యాకాలమున లేవు. శక్తికి

---

సకాలమున నుపనయనాదిసంస్కారములు లేక కాలాతిక్రమణము చేసి యుపనయనాదులు చేసికొని సావిత్రినుపాసించువారికి ప్రాయశ్చిత్తము చెల్లునుగాని సావిత్రియే యుపదేశించుకొనకున్న వైశ్యులకే ప్రాయశ్చిత్తము విధివిహితమని చెప్పఁగలరనునది యొకప్రశ్నము గలదు. కాని దీనికి సమాధానము వ్రాయుట యంతకష్టముకాదని నా నమ్మకము. ఏలనఁగా. ప్రశ్నించువారికి లోకజ్ఞానము చాలదు. కాఁబట్టియే యిట్లు ప్రశ్నింతురు. ఐనను సమాధానము వినుఁడు.

వివాహమునకుముందే వైశ్యులకు నుపనయనము చేయఁబడుచున్నది. యజ్ఞోపవీతధారణము తత్సంస్కారమునఁ గలదు. గాయత్రియు నుపదేశింపఁబడు చున్నది. సంక్రమణాదులయందు వారు పితృతర్పణము చేయుచున్నారు. కాని వారికి నుపదేశించుమంత్రము విప్రక్షత్రియుల కుపదేశించు గాయత్రిగాక మఱొకకల్పిత భగవన్నామమంత్రము నుపదేశించుచున్నారు. ఆదోషము గురువులది కాని శిష్యులది కాదు. ఆ యుపదేశించుమంత్రము గాయత్రియనియే వా రుపదేశించుచున్నారు. శిష్యులు గాయత్రియనియే జపించుచున్నవారు. కాని యిదియేదో యంశక్తిమంత్రమని మనకిది దొరకినదే పదివేలనిభావించి మనము జాతిహీనులముకాన మనగురువులు తగిట్లుపదేశించిరి. చాలును. బ్రదికిమితిరా స్వామీయని వైశ్యశిష్యులు తృప్తినొంది

మించిన కార్య మాకాలమునఁ జేయువారు లేరనుట సత్యము. గురువునందు మహా ర్థమునం దనఁగా గ్రహములయందుఁ బెద్దలయందు దృఢవిశ్వాస ముండెను. ఈకాలమున నవి లేక పోవుటయె గాక మీఁదు మిక్కిలి వాని నాక్షేపించుటయుఁ గూడఁ గలదు. ఆకార్యఫలము లట్టివే. ఆకాలమున విత్తము ననుసరించియే ప్రయత్నము. ఇపుడు ప్రయత్నముననుసరించి ద్రవ్యమును సేకరింతురు. ఈరెండింటి కెంతభేదము గలదో

యుండలేదు. శిష్యవంచనచేసినదోషము గురువులదే యనుట కావంతయుఁ శంకలేదు. దానికిఁ బ్రాయశ్చిత్తమెవరికో నేఁ జెప్పనక్కఱలేదు. కావున వైశ్యులకు వేదోక్తకర్మములు పొసగుటలేదని దానిచే వీరు 'జాతిగౌరవము బోఁగొట్టుకొనిరని మరల నది రమ్మన్నరాదని ఘోషించుట యవివేకమూలము గాని యితరముగాదు. వారిప్పు డాగురువంచన నెఱింగి గాయత్రి నుపదేశించు కొనఁబూనఁగా మీకు వేదాధికారము లేదు. కావున వేదస్థ గాయత్రీమంత్ర ముపదేశింపరాదు. "అచ్యుతాయనమః అనంతాయనమః అచ్యుతానంతాయనమః" అనునదియే మీకు గాత్రియని నెప్పుటకన్న మహత్తరపాప కార్యము వేఱొకటి కానరాదు. అట్టికార్యము నెవ్వరైనఁ జేయకుందురు గాతమని వారక వేఁడుచున్నాఁడను. మఱికొందఱు వైశ్యులకు నుపనయనము మాత్రము చేయఁబడుచున్నది గాని అది పురాణశ్లోకములచేఁ జేయఁబడు చున్నదనియుఁ గోత్రములు ఆర్షములు గావనియు, ఎల్లిసెట్టి మల్లిసెట్టిగోత్ర ములు చెప్పఁబడుచున్నవనియుఁ కన్యకాపురాణము వారికి స్మృతిగా నున్న దనియుఁ గావున వైదికసంస్కారములు లేవనియుఁ జెప్పుదురు. వారికి నా చెప్పుసమాధాన మేమనఁగా.

కన్యకాపురాణమును మీరు ప్రమాణముగా నంగీకరించినపక్షమున దానియందు వేదోక్తసంస్కారములు చెప్పఁబడినవి. ఇప్పటి లౌకికగోత్రము

యోజింపుఁడు. కర్మాచరణమునం దాసక్తి యప్పటివారి కుండెను. కర్మాచరణమం దాసక్తిలేదు గాని ఫలాహారతిక్తకషాయపానాసక్తి యిపు డెక్కుడుగా నున్నది. పెద్దలాశీర్వదించిన మేలని భావము వారికుండెను. మిత్రులు ఫలాహారములుచేసినఁ జాలు నను భావ మిపుడుకలదు. ఏది మేలో ఏది నిష్ఫలమో నేవ్రాయ నక్కఱలేదు. వేదశాస్త్రపద్ధతులయందు నమ్మకము వారికుం

---

లకు సరియగు నార్షగోత్రములు చెప్పఁబడినవి. అనఁగా వంశమర్యాదల నిలుపుటకై కన్యక యగ్నిప్రవేశము చేసెను. అట్టికన్యకను గులదేవతగా పూజించుట న్యాయమే కాని వేఱుగాదు. మఱియుం నాకన్యకంగూడి యొందఱు బాలురు వహ్నికుండమునఁబడిరో వారినెల్ల వంశకర్తలని భావించి వారిపేరు స్మరించుటకంటెఁ గృతజ్ఞత యింకొక్కటి లేదని తలంచి యిప్పటివఱకు వైశ్యులు వారిపేర గోత్రములు చెప్పుచున్నారు. ఆగోత్రమునకు సమానమగు నార్షము కలదు. కావున దండాపూపికాన్యాయము ననుసరించి యొకరిగోత్ర మిపుడు చెప్పంబడుచున్నదో యాతని యార్షగోత్ర మేమియుండునో యదే వీరిదని స్పష్టము కాక మానునా. అట్టులుండఁగా నిదొక లోపముగా భావించి యాక్షేపించుటకుఁ గలకారణమేమో తెలియఁజాలక యున్నాఁడను. కన్యకాపురాణమే ప్రమాణము కాదందురేని యీవాదమునకే యవకాశము లేదు. అది కల్పితమయినది. ఎప్పటికప్పుడే యేదేశముననున్నగురువులు వారి యిచ్ఛానుసారము మార్చుచున్నారు. అట్టివి నాల్గుప్రతులునేఁ బరికించితిని. ఒక్కదానికి వేఱొక్కటి సంబంధము గలిసియుండదు. కావున నది ప్రమాణమని బుద్ధిమంతులగు వైశ్యు లంగీకరింపరు. కన్యకామహిమమును దెలుపు గాన దాని శిరసావహించుచున్నారు. కాఁబట్టి దాని నాధారముచేసికొని యాక్షేపింప నవకాశమే లేదు. కల్పించుకొని యాక్షేపించిన లాభము లేదు.

డెను. వార్త్తాపత్రికాపఠనాసక్తి యిప్పుడు పెచ్చుపెరిగినది. కావున నప్పటికిప్పటికిని హస్తిమశకన్యాయ మీవిషయములఁ గలదనుట నిక్కము. ఆముష్మికఫలప్రధాన మాకాలమునఁ

---

ఇట్టిపనిలేని మంగలిసామెత కనుకూలముగా మాటలాడిన నేలాటిఫలము గలుగదు.

ఏపాపమున కేప్రాయశ్చిత్తము చెప్పఁబడినదో దానినాచరింప నసమర్థులైనపుడు ప్రాయశ్చిత్తము తగ్గింపవలయుననని స్పష్టమగును. శ్రుతి. సంవత్సరమేతద్వ్రతం చ రేత్, ద్వావామాసౌ, నియమస్సమాసేన. అని. అంగిరసుఁడు. "శ్లో. పచః పూర్వ ముదాహృత్య యథోక్తం ధర్మ వక్తృభిః, పశ్చాత్కార్యానుసారేణ శక్త్యా కుర్యు రనుగ్రహం, నహి తేషా మతిక్రమ్య వచనాని మహాత్మనామ్. ప్రజ్ఞానే నైవ విద్వద్భి శ్శక్యమన్య త్ప్రభాషితమ్." అని చెప్పెను.

దీనిం బట్టిచూడఁగాఁ దాఁజేసినది పాపమని యెఱింగి యనుతాపమును బొంది తనశక్తికనురూపముగా నించుక ప్రాయశ్చిత్తముచేసినఁ జాలునని సిద్ధాంతమగుచున్నది. శాస్త్రపద్ధతియందు శ్రద్ధగలిగియుండుటయే ప్రధానమని దీనిసారము.

"శ్లో. శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే యస్తే ఉల్లంఘ్య వర్తతే,
ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్వేష్య స్సమే పద్భ్యత మోమతః.
"శ్లో. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవినిర్ణయే,
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి.
యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్."

గీతాశాస్త్రము.

అని చూపబడెడిని. వేటోకగ్రంథమునందు,

జేయుకర్మముల కుండెను. కేవలైహికఫలప్రధాన మీమాంస మునఁ జేయుకర్మముల కున్నది. కావున నీ రెండింటి కేవిషయ మునను బోలికలు కనుపట్టకున్నవి. కాని యొక్కవిషయమునఁ బోలిక కలదు. కర్మములకుఁ బూర్వము పెట్టిన నామధేయములు మాత్ర మింతదనుక మార్పఁబడకున్నవి. దానికి మన మానం దింపవలసి యుండును.

వసుదేవుఁడు గర్గమునివాక్కులు చెవులఁబడఁగనే పర మానందభరితుఁ డయ్యెను. వలయుపదార్థములఁ గూర్పఁదగు వారల నియమించెను. శుభలేఖలఁ బ్రియబంధువులకుం

---

"శ్లో. స్వాభిప్రాయకృతం కర్మ యత్కించి ద్విధివర్జితం,
క్రీడాకర్మేవ బాలానాం తత్సర్వం స్యాన్నిరర్థకమ్."

అని యున్నది. ఇట్లుండఁగాఁ బ్రాయశ్చిత్తమే లేదనుట తెంపఱితనముగాక మఱేమిటిది? మఱొక్కవిశేషము వినుఁడు. పూర్వమీమాంసయందు ఆప దేవీయమీమాంసాన్యాయప్రకాశమునందు వైశ్యులకు వేదాధికారమున్నట్లు స్పష్టముగాఁ గనఁబడియెడిని.

"అతఏవ శూద్రస్య న యాగాదావధికారః, తస్యాధ్యయన విధిసిద్ధ జ్ఞానాభావాత్, ఆధానసిద్ధాగ్న్యభావాచ్చ. అధ్యయనస్యోపనీతాధికార త్వాత్. ఉపనయనస్యాపి వసంతే బ్రాహ్మణోగ్నీ నాదధీతేత్యాదినా త్రైవర్ణి కాధికారత్వాత్." అని

దీనిచే బ్రహ్మక్షత్రియవైశ్యులకు సమానముగా వేదపఠనాధికారము గలదని స్పష్టము కదా. ఇఁకఁ బ్రాయశ్చిత్తవిషయమే సంశయము. కావున దానిని పై నుదహరించినప్రకారము ప్రాయశ్చిత్త సంకోచముచేసి కర్మముల నాచ రింపవచ్చుననుట నిర్వివాదాంశమని నాభావము. నాభావమనఁగా స్మృతి

బంపెను. శ్రీకృష్ణపరమాత్మ తన యంతరంగమున నొక్క మాఱు దేవతలు మహర్షులు దిక్పాలకులు రావలయునని సంకల్పించెను. ఆసంకల్పము సామాన్యమా. సర్వలోకముల కొక్క క్షణమున నెఱిఁగింపఁ జాలునది. ఆ మహనీయునికళ లేని ప్రాణికోటి లేదుగదా. ఎవ రెవరు రావలయునని సంకల్పించెనో వారిమనస్సులు శ్రీకృష్ణసందర్శనాతురము లయ్యెను. వసుదేవు నింటికిఁ బిలువకయే వచ్చిరి. ఆత్మేశ్వరుని దర్శింప నరుదెంచిరి. బ్రహ్మయుఁ బార్వతియుఁ బరశంకరుండును వచ్చిరి. వసుదేవుఁడు వారి గౌరవించెను. జ్ఞానధనులగు మహర్షు లేతెంచిరి వారికి నుచితరీతి సపర్యల నాచరించి వసుదేవుఁడు ధన్యుఁడయ్యెను. వేలువేలుగా బ్రహ్మ మొదలగువారిని వినుతించెను. ప్రతిస్తో

---

పురాణాదుల భావమని యెఱుంగఁదగు. నిర్ణయించుటకు నాకేమి యోగ్యత గలదు? ఇంక సారాంశమును వినుఁడు.

క్షత్రియవైశ్యులకు బ్రాహ్మణులకెట్లో యట్లు వేదోక్తకర్మాచరణమున నధికారము కలదు. క్షత్రియులకేదోయొకరూపమున నుపనయనసంస్కారము వేదోక్తముగా సాగుచున్నదనవచ్చును. వైశ్యులకుఁ గొన్నితావుల నట్లు సాగుటలేదు. వారిపుడు విధిప్రకారము సంస్కారము చేసికొనఁబూనఁగాఁ గొందఱు పండితబ్రువులు మీకు వేదాధికారమే లేదనుచున్నారు. పురాణోక్తమే యనుచున్నారు. చిరకాలముక్రిందట నది వదలిపోయినదనియుం మరల నది రావీలులేదనియు వాదించుచున్నారు. ప్రాయశ్చిత్తముచెప్పుడన్న నదెందును లేదనుచున్నారు. కావున నీవాదము న్యాయసమ్మతము కాదని నా భావము. ఒక్కవిషయము నాలోచింపుఁడు. పురాణోక్తముగాఁ దంత్రము సాగుచున్నదా వేదోక్తముగా సాగుచున్నదా. అనునదియే యిటఁ బ్రధానము. ఉపనయనము పురాణోక్తమనిచెప్ప వీలున్నదా యనునది రెండ

త్రమందును నీవే పరమాత్మవు. సకల బ్రహ్మాండనాయకుఁడవని కనఁబడుచున్నది. దీని భావమేమి? ప్రతివ్యక్తిని జూచినపుడు నావ్యక్తియే పరతత్త్వమని భావింపవలయును. అపుడే సర్వసమత్వము దృష్టికలవడును. తత్త్వవేత్త యనఁ నట్టివాఁడే యని యెఱుంగవలయు. భగవంతుని కళలేని వస్తువుండదు కదా. ఇఁక నుత్తమాధమ మధ్యమభేదము తత్త్వవేత్తల కేల? పామరులకు నుండఁదగునుగాని సమదర్శన జ్ఞానముగలవారల కా బుద్ధియుండ నవసరము లేదు. కావుననే,

---

వది. శాస్త్రచర్చ యీవలకే వ్రాసితిని. మరల నాజోలికిఁ బోవక సారాంశము వ్రాసెదను. వివాహమునకంటె ముందుపనయనము సాగుచున్నది. గాయత్రి నుపదేశించుచున్నారు. యజ్ఞోపవీతధారణక్రియ సాగుచున్నది. కాని వారి కుపదేశించుగాయత్రి బ్రహ్మక్షత్రియులకు నుపదేశించు గాయత్రీమంత్రము మాత్రము కాదు. కావున నింతకాలమునుండి లేని దిపుడెట్లు వచ్చునన్న ప్రశ్నము తుచ్ఛమని నా యాశయము. ఏలయనఁగా లేదన్నమాట కర్థములేదు. గాయత్రీమాత్రమని వేఱొకదాని నుపదేశించుచున్నవారు. ఈదోషము శిష్యుల దేనాఁటికిని గాదు. గురువులదే యగును. గాయత్రీజపమునఁ బుణ్యము కలదన్ననమ్మకము వారికున్నది. మూఁడుకాలములయందును దానని జపించుచున్నారు. గాయత్రిమంత్రము కాని దానిని గాయత్రియని యుపదేశించుట యుపదేష్టల గ్రహచారమే కాని శిష్యులగ్రహచారమేనాఁటికిని గాదు. ఏకాలమున క్షత్రియులకు వేదాధికారము పోవునో యపుడే వైశ్యులకుంగూడఁ బోవునని ప్రమాణములు కనఁబడుచున్నవి. ఏకాలమున బ్రాహ్మణులు వేదపఠనము మాని యజ్ఞములవదలుదురో యాకాలమున క్షత్రియులకు జాతిగౌరవము నశించునని కనఁబడుచున్నది. అనఁగా బ్రహ్మక్షత్రియవైశ్యులకు జాతిగౌరవ మేకకాలముననే క్షీణించునని దీనిభావమని యెల్ల

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః."

అన్నమాట గీతలయందు భగవంతుఁడు తెలిపెను. దుర్గను వినుతించినపుడు నీవే సర్వకర్త్రివని వసుదేవుఁడు నుతించెను. సత్యముగా నామెయే సర్వప్రపంచనిర్మాత్రి. మూలప్రకృతి యాదుర్గయే కదా. దుర్గతినాశని యాజననియే. ఈతత్త్వ మెఱుంగలేక భగవంతునియం దీకర్తృత్వము నారోపింతురు.

---

రంగీకరింపక తప్పదు. ఒక్కవిధియందే మూఁడుజాతులు కూర్చఁబడినవి. సూత్రము తెగిపోఁగా రత్నము లొక్కసారియే పడిపోవునుగాని యొక్కటి నిలిచి తక్కినవి పడిపోవు కదా? కావున వేదోక్తకర్మాచరణవిధి యందఱకు సమానముగా నుండవలయును.

చిరకాలముక్రింద నశించిన కర్మాధికార మిపుడెట్లు వచ్చునన్న దొక ప్రశ్నముగా భావింపరాదు. ఒకపు డట్లే భావించినను సమాధానముచెప్పుట సులభమే కాని కష్టము కాదు. విప్రజాతియం దీకాలమున సంధ్యరానివారు లేరనరాదుకదా. వారిపుత్రులకు రాదనుట సంశయాస్పదమగువాక్యము కాదు. వారి కేమిప్రాయశ్చిత్తమో వీరికి నదేప్రాయశ్చిత్తమన్నదే దీనికి సమాధానము. ఇపు డాలోచింపఁదగినవిషయ మిది. సకాలమున నుపనయనాదిసంస్కారములు సాగకయున్నను గౌణకాలమునందైన సాగుచున్నవి. మంత్రసంస్కారము జరుగుచున్నది. విద్యావ్యాసంగాదులచేత సంధ్యావందనము చేయకున్నను, చేయుచున్నారమని భావించినను జాలును. కొందఱు చేయుచునే యున్నారు. కొందఱు సకాలముననే చేయుచున్నారు. వేదపఠనము చేయుచున్నారు. పంచయజ్ఞముల సక్రమముగా నాచరించుచున్నారు. జ్యోతిష్టోమాదియజ్ఞములు చేయఁబడుచున్నవి. అవి చేయకున్నను బాపము లేదు.

సర్వసాక్షీ కదా భగవంతుఁడు. సంకల్పమాత్రమునఁ బ్రకృతి యుదయించి సర్వబ్రహ్మాండముల నిర్మించును. ఈపరిశ్రమ మా నిరంజనుని కేల? దీనిచేత నా పరమపురుషునిమహత్త్వము తగ్గునా. అతిశయ మగును. మూలప్రకృతి యనఁగా భగవంతుని

---

"శ్లో. స్వాధ్యాయేన వ్రతైర్హోమై స్త్రైవిద్యే నేజ్యయా సుతైః,
మహా యజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః."

మనుస్మృతి. ౨ అధ్యా.

"వ్యా॰ మహాయజ్ఞైః. పంచభిర్బ్రహ్మయజ్ఞాదిభిః. యజ్ఞైః జ్యోతిష్టోమాదిభిః." అని కల్లూకభట్టుగారు వ్రాసిరి. పంచయజ్ఞములనఁగా బ్రహ్మయజ్ఞాదులని భావము. ఇవి మహాయజ్ఞము లనఁబడును. వీని నాచరించుట విధి. ఆచరింపకున్నఁ బాపము. యజ్ఞములని మనమూహించునవి కామ్యములు. స్వర్గాది భోగసాధనములు. మానినను బాధలేదు. కాని యవి లోకోపకారమును జేయునవి. యజ్ఞములచే దేవతలు హర్షించి వృష్టి నొసంగుదురు. కావున యజ్ఞములచే దేవతలఁ దృప్తులఁ జేయవలయును. ఆయజ్ఞములు హింసాకర్మము మానియే యీకాలమునఁ జేయవలయును. ఏలయనఁగా మాంసభక్షణము విప్రులకు నిషేధింపఁబడినపుడు యజ్ఞమునఁగూడఁ బశుహింస మానవలసినదే. మధ్వబ్రాహ్మణు లీసూత్రము నాలోచించి దానిని మానిరి. అదియే న్యాయసమ్మతమని నాభావము. కొందఱు క్రోధావిష్టమతులై పూర్వసూత్రములఁ బఠింతురు. పశుహింస దోషము కాదని యుద్ఘోషింతురు. కాని యాసూత్రము లేకాలమునఁబుట్టినవో యాకాలమున స్మృతులయం దేపదార్థములు భోజ్యములని నిర్ణయింపఁబడినదో అనియమ మిప్పుడున్నదో లేదో అనంతరస్మృతియగు పరాశరస్మృతి యెట్లు భోజ్యవస్తువుల నియమించినదో యించుకంతయుం యోజింపరు. అట్టివారితో నేటిమాటలని మానమఁద్రాధార

యిచ్ఛాశక్తియే. కాని వే ఱెవ్వరు కలరు. మనయిచ్ఛయే కార్యము నొనరించును. మనయిచ్ఛకు మనకు నెట్లు భేదములేదో యట్లే భగవదిచ్ఛకు భగవంతునకు భేదములేదు. సకలరూపములా ప్రకృతికల్పితములే. కావుననే మహాత్ముఁడగు నీశ్వరకృష్ణుఁడు సాంఖ్యదర్శనమునందు,

"శ్లో. సావయవం పరతంత్రం వ్యక్తం విపరీత మవ్యక్తమ్." ౧౦.

అని సిద్ధాంతీకరించెను. దీనికి మహానుభావుఁడగు గౌడపాదస్వామి భాష్యము వ్రాయుచు "కథా సావయవమ్. అవయవా

---

ణము చేయుటయే మంచిదని నేనూహించుచున్నాఁడను. వారిమాటలు, ఆటలుసాగుకాలము తగ్గినది. బ్రహ్మయజ్ఞాదు లిప్పుడు పౌండరీకమువంటి వగుచున్నవి. సంధ్యావందనముమాత్ర మాచరించిన సకలక్రతువులు చేసినట్లే యని యూహించుకాలము వచ్చినది. ఇట్టితఱి నాయజ్ఞముల జోలియేల? ఈకాలమున వేదోక్తకర్మాచరణమనఁగా సంధ్యానుష్ఠాన పంచయజ్ఞాచరణమే చాలును. మనపూర్వు లీవిషయముల నాలోచించియే కలియుగమున నెన్నివిషయములలో తగ్గించి కర్మముల నిర్ణయించిరి.

"శ్లో. వేదవ్యాస స్స ఇహ దశ యో వేద వేదాక్షరాణి
శ్లోకం త్వేకం పరిపఠతి యస్స స్వయం జీవ ఏవ,
ఆపస్తంబ స్సకిల కలయే త్వస్మ్యై గౌపాసనాగ్నిం
కష్టం శిష్ట శ్రుతికృతి కలా కార్శ్య మృచ్ఛంతి విద్యాః."

అని వేంకటాధ్వరిగారు చెప్పిరి. నాలుగువందల వత్సరముల క్రిందటఁ గర్మాచరణాదు లిట్లుండఁగా నిప్పటిమాట విచారింప నవసరము లేదు. వేదోక్తకర్మకలాపము లిట్లు నశించుచుండఁ గావలయునని విధియుక్తముగాఁ బల్కువారి నాక్షేపించుటకంటె నభిమానము వే ఱేమున్నది? కావున శ్రుతిస్మృతివిహిత

శ్శబ్దస్పర్శరూపరసగంధాః. తైస్సహ. కించ పరతంత్రమ్. నాత్మనః ప్రభవతి యథాప్రధానతంత్రా బుద్ధిః బుద్ధి తంత్రోఽహంకారః. అహంకారతంత్రాణి తన్మాత్రాణీంద్రియాణి చ, తన్మాత్రతంత్రాణి పంచమహాభూతాని చ. ఏవం పరతంత్రం పరాయత్తం వ్యాఖ్యాతం వ్యక్తం. అథోఽవ్యక్తం వ్యాఖ్యాస్యామః విపరీతమవ్యక్తమ్. ఏతైరేవ గుణైర్యథోక్తైర్విపరీతమవ్యక్తం, హేతుమవ్యక్తయుక్తం. న హి ప్రధానాత్ పరం కించిదస్తి, యతః ప్రధానస్యానుత్పత్తిః. తస్మాదహేతుమదవ్యక్తమ్. తథా నిత్యం చ వ్యక్తం. నిత్యమవ్యక్తం. అనుత్పాద్యత్వాత్, న హి భూతానీవ కుతశ్చిదుత్పద్యత ఇత్యవ్యక్తమ్ ప్రధానమ్. కించావ్యాపి వ్యక్తం. వ్యాపి ప్రధానం సర్వగతత్వాత్" అని తెల్పిరి. తనంతటం దాంబుట్టి సర్వవ్యాపకమగు తత్వమే యవ్యక్తము. అదియే భగవంతుఁ డనఁబడును. వ్యక్తమైనదనఁగా నామరూపక్రియావంత మయినదని భావము. ఇది యవ్యక్తమునుండి కలిగినది. ఇది నశ్వరముగాక మఱేమగును? కావున వసుదేవకృత దుర్గాస్తుతి యర్థవంతమయినది గాని యన

---

మగు ద్విజత్వము వైశ్యులకుఁ గలదు కావున వారు వేదోక్తకర్మములఁ జక్కఁగాఁ జేసికొని వేదపఠనాదృతిం గాంచుట లోకమునకు మహోపకారము. వారిగురువుల మనుకొనువారును వారిని బ్రోత్సహించి సత్క్రియావంతులుగా వైశ్యుల నొనరింపఁ బ్రయత్నింతురు గాక. వేదోక్తకర్మములు పరుసగా నశింపకుండనిలుప నందఱును బ్రయత్నింతురు గాక. క్షత్రియవైశ్యులకు సమానాధికారము వేదమునఁ గలదని సిద్ధాంతము. దానిని మార్ప నెవ్వరికేఁ దరముగాదు. ప్రాయశ్చిత్తాదులు ప్రతిపాదించుచోఁ ద్రైవర్ణికులకంద

ర్థము కాదు. ఈ భావమెఱుంగక పండితబ్రువులు దుర్మతాభిమానమూని దేవతల దూషించి పాపమును సంపాదింతురు. ఇంతియకాని సాధించుపురుషార్థము వేఱొకఁడు కానరాదు. అట్టి దుష్ప్రయత్నమును మాని భగవత్తత్వము సర్వత్ర నిండియున్నదనియు నదిలేనితావు లేవనియు నమ్మి దేనిని దూషించినను భగవంతుని దూషించినట్లగునన్నజ్ఞానము గలిగి తనయిష్టదైవము తనకెట్లో యితరుల యిష్టదైవము వారికి నట్లే యన్న విశ్వాసము కలిగి ప్రవర్తించిన నిహాపరసుఖముల నొందఁజాలుననుట సర్వసమ్మతసిద్ధాంతము. ఇందుల కావంతయు శంకాతంకములు లేవు.

ఇప్పట్టున మఱొక్కమాట చెప్పక తప్పదు. అదేది? అనఁగా నింతమందిదేవతలు తమరూపములతో మధురానగరమునకు వచ్చి యందఱకు దర్శనమిచ్చిరా? అనునదియే యామాటయనఁగా. ఇది కలుగవలసినసంశయము కాదు గాని యీకాలమునఁ గలుగక తప్పదని నా భావము. ఏలయనఁగా. దేవతలు మనుష్యులకుఁగల యన్యోన్యసంబంధము ప్రస్తుతకాలమునఁ బ్రత్యక్షము గాక పురాణస్థమైనది. దేవతలనఁగా నెంతయెత్తుందురో వారికిని గరపాదము లెట్లుండునో యన్న

అకుఁ బ్రసాదింపవలసి యుండునుగాన నట్టితెంపఱితనము నుపయోగింపకుందురు గాక. ఆర్యులార! వచింపఁదగినంతఁ దెలిపితిని. "అతి సర్వత్ర వర్జయేత్" అని యున్నదిగదా. దానిని మన్నింపక తప్పదు కాన నింతట నీచర్చ ముగించుచు యాదవులకు రాజ్యముపోయినను రాజులతోటి సంబంధాదులు గలవనియుఁ గావున శ్రుత్యుక్త సంస్కారములు కలవనియు మఱొకపర్యాయము తెలుపుచు నింతతో నీవాదమునుండి విరమించుచున్నాఁడను.

శంక కలిగినది. అనఁగా నట్టిదుస్థ్సితి లోకమునఁ జేకూరినదన్న మాట. పూర్వకాల మట్లుగాక రాకపోకలు గల్గియుండెను. ఆమాటలు నమ్మునట్లు చేయుటయుఁ గష్టముగ నున్నది. ఇంచుక వినుఁడు. పూర్వము దేవమనుష్యులకు సంబంధ మీకాలమున దేశాంతర వాసులతోటి పొత్తువంటిదని యెఱుంగందగు. మన మిపుడు దూరదేశమునకుఁ బోవుట యెట్టిదో యూర్ధ్వలోకములకుం బోవుట యట్టిదియై యుండెను. వియద్గమన మందఱకు సులభమా యన్న నౌనన వలనుపడదుగాని చాలమంది కాయలవా టుండెను. ఆకాలమున యోగవిద్య సామాన్యలభ్యముగా నుండెను. కావున యోగాభ్యాసము చేయువా రెక్కుడుమంది యుండిరనక తప్పదు. ఖేచరవిద్యయని యం దొక్క భాగమునకుఁ బేరు. అనఁగా వియద్గమనము చేయుసాధనమని యా యభ్యాసమునకుఁ బేరు. ఆయభ్యాసము యోగముననే కాక యోషధులమూలమున నాశక్తి కలుగును. ఆయోషధుల శక్తి యిపుడు తగ్గినదనరాదు. వానిం దెలిసికోనఁ గోరువారు తక్కువగనున్నారని భావము. పాదుకాసిద్ధి, అంజనసిద్ధి, ఘుటికాసిద్ధి, లోనగుసిద్ధులు ప్రస్తుతకాలమున నిఘంటువుల నిమిడి యున్నవనుటకంటె వేఱొక్కమాట చెప్పఁజాలకున్నాఁడను. మఱొక్కమాట యీవిషయమునఁ జెప్పకతప్పదు. కాని యది మీనమ్మకమునకు దూరమని నే నెఱుఁగుదును. సత్యముచెప్ప వలసినపుడు జంకరాదు.

పదునొకండవ సంవత్సరప్రాయమున నే నింట నెవరికిం దెలుపక బైరాగులవెంట నడచియే కాశీయాత్ర చేయఁ బయనమైతిని. అప్పటి నాయూహ రెండుశాస్త్రములనైనఁ జదువక

ఋల్లుచేరఁగూడదని యుండెను. కడపనుండియే గురువులకును దెలుపక వెడలితిని. కామలాపురమునుండి రామదాసను నొక బైరాగి తోడయ్యెను. గోదావరినది పుట్టుచోటునకుఁ జాల దినములకుఁ బోఁ గలిగితిమి. అందొక్క నెలదినము లుంటిమి. త్ర్యంబక క్షేత్రమని దానిపేరు. ఆ క్షేత్రమునకుఁ బడమర దెస నొకపర్వతము కలదు. దానియందే గౌతమి పుట్టినది. ఆగిరికిఁ బ్రదక్షిణముచేసి వచ్చినచో దేవాలయమున ధర్మకర్త లొక రూపాయ యిత్తురు. బీదతనము దానికి నన్నుఁ బాల్పడఁ జేసెను. బయలువెడలితిని. రామదాసు ప్రియమిత్రుఁడౌట మందలించితిని. నవ్వి క్షణము నిలువుమని యెచ్చటికో పోయి యొకమూలికను దెచ్చి సవ్యహస్తమునకుం గట్టెను. ప్రొద్దు పోయినదే యంటిని. కొలఁదిగడియ లుండిపోయినను వేళకు రాఁగలుగుదు వనెను. అఱుక్రోశములదూరము దాని చుట్టు కొలతయఁట (పండ్రెండుమైళ్లు) జాముప్రొద్దు గడచెను. నా తోడ రామదాసు పయనము సాగించెను. మాటలాడుచుఁ బోయితిమి. అది కార్తికమాసము. పదునొకండుగంటలకు ముందే వచ్చిచేరితిమి. ఇంచుమించుగా రెండుగంటలకాల మునఁ బాషాణకంటకములచే నిండియుండుతావులం దిరిగితిమి. నా కొక్కశ్రమయుఁ దోఁపదయ్యెను. దేవాలయమునకు వచ్చి నపిదపఁ గొలఁదినిమేషములకుఁ బదునొకండుగంటలు కొట్టఁ బడియెను. మాప్రయాణము గంటన్నఱకాల ముండును. కుశ స్థలియనుచోట స్నానముచేయుచుండ నామూలికను దీసికొ నెను. నాకప్పుడు స్మృతి బాగుగఁ గల్గెను. ఆలోచించి యింత వేగముగా వచ్చితిమిగదా యంటిని. నవ్వి యతఁ డిదిమూలికా

ప్రభావమని చెప్పుచు దానిని జలమధ్యభాగమున వైచెను. ఎంతో ప్రార్థించితి. దానిసాయమున నే నెన్నియోదేశములు తిరుగుదునయ్యా యని వేడితి. అందులకే నీకుఁ జెప్పగా దనియెను. మేమిరువురము రెండుసంవత్సరములు పదినెలలు కూడ నుంటిమి. ఎన్నియోసారు లడిగితి. మంచిది. మంచిది. సమయము వచ్చును చెప్పెదను. అని కాలము వెళ్లఁబుచ్చెను. నన్నువదలి కాశీనుండి యాతఁడు పోవునపుడు నమస్కరించి యడిగితిని. కన్నీరునింపి నిన్నుఁబాయుట సామాన్యకార్యము కాదు. మరల నేనిన్నుఁ గలియుతఱిఁ జెప్పెదను. అని వెళ్లెను. అట్టిప్రాణమిత్రు నెడఁబాయఁజాలక చింతించు నేను బాదములు పట్టుకొని ప్రార్థింప సాహసింపనైతిని. ఇప్పటికిని వగచుచున్నాఁడను. కావున మూలికలప్రభావము నిరుపమానమని నా యనుభవమునఁ జెప్పఁగలను. అత్యద్భుతసిద్ధులు గలవు. అవన్నియు లోపింపఁగా నిపు డావాక్య మసత్యమేయనుకాలము వచ్చినది. ఆకాలమున యోగమంత్రమూలికలసాయమున వియద్గమనము చేయువా రుండిరి. దేవతలు వచ్చుచుం బోవుచుండిరి. కావున యజ్ఞములకు దేవత లీకాలమున వివాహాదులకు బంధువులం బోలి వచ్చుచుండిరి. శ్రాద్ధములకుఁ బితృదేవతలు వచ్చుచుండిరి. ఆమాట లిపుడు పరిహాసపాత్రములుగ నున్నవి. కనుక దేవతలెల్ల శ్రీకృష్ణు నుపనయనమునకు వచ్చుట యతిశయోక్త్యలంకారమున కుదాహరణము గాదు. సత్యమే యన విశ్వసింపవలయును. పరోపకారమే ధర్మముగా భావించువా రనేకు లాకాలమున నుండిరి. తపస్సత్యములు ప్రధానములుగా నుండెను. కర్మఫలములఁ గోరనివారు పెక్కుమంది యుండిరి. వనవా

సము నాశించువారిసంఖ్య విశేషించి యుండెను. కాఁబట్టి దేవతలు గోకపోకలు చేయుచుండిరి. అవన్నియును మార్పు నొందిన యీంకాలమున నప్పటిమాటలు విశ్వాసపాత్రములు కావు. కాని కొంతకాలమున కివన్నియును సత్యములని విశ్వసించుకాలము రాకమానదన్నవిశ్వాసము నన్నింకను వదలక యున్నది. దాని కించుకసూచనలు పొడకట్టుచున్నవి. లోకాంతరవాసులతో మాట్లాడఁజాలు యంత్రములు కనిపెట్టఁబడుచున్నవి. ఎన్నియోపద్ధతుల లోకాంతరగమనము చేయఁ బ్రయత్నించువారు తలసూపుచున్నవారు. ఈలాటిప్రయత్నము లెన్నియున్నను నంబరమునఁ దిరుగుభూతములతో మాటలాడ శక్యమగునేమో కాని నిర్మలతపోధనులకు గమ్యములగు స్వర్గాదులనుండు దేవతలతో మాటలాడుట శక్యమే కాదని నా యూహయై యున్నది. దానికి యోగాభ్యాసమంత్రోపాసనాదులు సముచితమార్గములు. ఆమార్గముల నాశ్రయించువా రింకను బహుతరముగాఁ గనఁబడకున్నవారు. కొంతకాలమునకుఁ గనఁబడుదురని యాశించుచున్నాఁడను. అట్టిసత్కాలము భరతఖండమునకు సత్వరము వచ్చుఁగాక. భగవంతునియపారకరుణ ప్రజలయందు వ్యాపించి భక్తిజ్ఞానవైరాగ్యములు పెంపొందఁజేయును గాక. ఎల్లరు శ్రీకృష్ణపాదారవిందభజనానందసాగరమున మునిఁగి తేలుదురు గాక. ఇంతట నీవిషయమును వదలి మీఁదికథను వ్రాయఁ బూనెదను. అనుజ్ఞ నిండు. సర్వప్రపంచనాయకునకు వేదాంతాగమ్యమహిమునకు నుపనయనసంస్కార మొకమహర్షి చేయును. ఏమి యుపదేశించునో ఈబాలుఁ డేమిగ్రహించునో యెవ్వరికిం దెలి

యదు. ఇట్టిలీలల భగవంతుఁడు పలుమాఱు కనఁబఱచి యా నందించుచుండును. ఆచరిత్రము వేదాంతములకన్న నుత్తమ మని మనము పఠింపవలయును.

—— దేవకీదేవి మొదలగుస్త్రీలు గర్గి ప్రభృతులఁ బూజించుట. ——

* ఆవల నదితియు, దితియు, దేవకియు,రోహిణియు, రతి సరస్వతులును, సావిత్రియు, యశోదయు, లోపాముద్రారుంధ తులును,నహల్యయుఁ, దారకాదేవియుఁ, బార్వతిం గాంచి భక్తి మెయి నమస్కరించి మందిరమునకరిగి పరస్పరము మాటలాడు కొనుచు నొండొరులఁ గౌఁగిలించుకొనుచు సకలోపచారముల నాపార్వతిం బూజించి రత్ననిర్మితపీఠమునందుఁ గూరుచుండఁ జేసిరి. రత్నభూషణముల నర్పించి కుసుమమాలికలఁ బూజించి తల్లీ! యీశుభకార్యమును నెఱవేర్చుము. నను గ్రహింపుమా యని ప్రార్థించిరి. శతమఖుఁడు స్వర్గమునుండి తెచ్చిన పారిజాత కుసుమములను దేవకి యా గౌరీపాదారవిందములయం దర్పిం చెను. భక్తిపూర్వకముగా నొసంగిన యాపుష్పముల కాదేవి యానందించెను. సిందూరతిలకమును సీమంతమందును జందన బిందువును భాలభాగమునందు నునిచెను. కస్తూరీకుంకుమాదుల నాచారానుసారము సమర్పించి దేవకి కృతకృత్యురాల నైతి నని సంతోషించెను. మిష్టాన్నమర్పించి పరిమళోదకమును సమ ర్పించెను. కర్పూరాది దివ్యవస్తుభరితంబగు తాంబూల మొసఁ గెను. పార్వతీపాదారవిందముల విరాజిల్లు కోమలనఖాంకుర

* ఈచరిత్రము శ్రీకృష్ణజన్మఖండము నూఱవయధ్యాయమునుండి వ్రాయఁబడినదని యెఱుంగునది. ఈభాగము నారదనారాయణ సంవాదరూప మనియుం దెలియఁదగును.

ములను లత్తుకను బూసెను. కుంకుమపంకమార్చ శ్వేతచామర మునుబూని తానే విసరెను. దేవకీదేవింగూడి యాపార్వతిని మునిపత్ను లెల్ల నర్చించిరి. పతిపుత్రసంయుతలగు నతివలందఱు క్రమముగా నాజగదంబికను బూజించిరి. రాజకన్యలు, దేవకన్యలు, నాగకన్యకలు, మునికన్నియలు, బంధుకన్యలు దేవకిచే వరుసగా మర్యాదల నలరింపఁబడిరి.

అంతట నానావిధశుభవాద్యములు మ్రోసెను. బ్రాహ్మణులకు మిష్టాన్నదానము చేయఁబడెను. మధురానగరమున భైరవియను దేవతగలదు. నగరరక్షణార్థ మా యంబికను నిల్పియుండిరి. ఆనగరదేవతను దేవకి భక్తిమెయి నారాధించెను. షోడశోపచారముల మంత్రయుతముగా నాపూజ చూడఁదగియుండెను. గళచండికయుఁ బూజింపఁబడెను. గృహమున మంత్రపూతముగా స్వస్త్యయనకర్మము సాగెను. విప్రప్రవరులు వేదపాఠ మొనరించిరి. వసుదేవాదులా వేదనాదశ్రవణమున నానందపరవశులైరి. ఆకాశగంగానదినుండి బంగరుకలశముల బావనజలములఁ దెప్పించి బలదేవుని శ్రీకృష్ణునిఁ గూరుచుండఁబెట్టి స్నానము చేయించిరి. పుత్రవాత్సల్యమున దేవకియే స్నానకృత్యమున నుండెను. ఆమెయే తనయులనిద్దఱ దివ్యవస్త్రములచేతను జందనచర్చలచేతను జక్క నలంకరించెను. రత్నేంద్రసారవినిర్మితమనోహరభూషణములఁ గై చేసెను.

అత్తఱి శ్రీకృష్ణుఁడు బలదేవుఁడు తల్లిచేతులార నునిచిన యలంకారములచేఁ జూచువారికి ముద్దులుమూటగట్టినట్లు విలసిల్లిరి. తల్లింగూడి వా రిర్వురు మునీంద్రసంభరితసభాభవనమునకు గర్గుని యానతిమెయి నరుదెంచిరి. దేవతలా

రాకాశీతాంశుమండలములఁ దృణీకరించు బలరామ శ్రీకృష్ణుల రాకనుగాంచి ధన్యులైరి. ఆజగన్నాథుని యాగమనము నెఱింగి చతురాననుండు దిగ్గన సింహాసనమునుండి లేచెను. శంకరుఁడు, శేషుఁడు, ధర్ముఁడు, భాస్కరుఁడు, దేవతలు, మునులు, కుమార వినాయకులు తమ యాసనములనుండి లేచి నిలువంబడి యనేక వేదవాక్కుల వినుతించిరి. బ్రహ్మ కరముల జోడించి జగన్నా యకా! అనిర్వచనీయుఁడవు కదా. భక్తానుగ్రహార్థ మీవిగ్రహ మును ధరించితివి. వేదములు వర్ణింపఁజాలకయుండ నీకు నితరుఁ డెవఁడు నిన్ను వినుతింప నర్హుఁడనియె. అంత మహాదేవుఁడు సర్వదేహములయందు దేహివై యుండి నిర్లిప్తుఁడవై కర్మము లకుఁ గర్తవై పరిశుద్ధుఁడవై సాక్షిమాత్రుఁడవై కులియన నెఱుంగక సర్వేశ్వరుఁడవై రూపరహితుఁడవై గుణశూన్యుఁ డవై నిర్గుణుఁడవనం బ్రసిద్ధిఁగాంచి వెలయు నిన్ను సన్నుతింప నే నెంతవాఁడను. అని ప్రార్థించెను. అనంతుఁడు చేమోడ్పుగీలించి యజ్ఞుఁడనగు నేను నిన్ను నేమని యెఱుంగుదును. ఈశ్వరుఁడవు కదా. అనంతకోటి బ్రహ్మాండ కారణుండవు. దుఃఖతారణుండవు. మహావిష్ణువవు. నీ లోమకూపములయందు స్వేదజలబిందువుల యందు ననేకవిశ్వములు గలవు. వానిసంఖ్య లెక్కింపఁ దర ముగాదు. అవి విచిత్రములు. కృత్రిమములు. అందు సత్పురు షులు దేవతలు బ్రహ్మ విష్ణుమహేశ్వరులు త్వదంశములుగాన నెందఱో గలరు. సకలతీర్థము లా జలబిందువున నిమిడియున్నవి. నే నొక్క బ్రహ్మాండమున సూక్ష్మరూపమున నాగరూపమును దాల్చియున్నవాఁడను. నీచే స్థాపింపఁబడితిని ఆదికూర్మము కూడి యుండును. మదగజమందు మశకమున్న ట్లున్నవాఁడను. బ్రహ్మాం

డములయం దెందు వెదకినను బరమాణువునకన్న సూక్ష్మవస్తువు గానరాదు. శ్రీమహావిష్ణువునకంటె స్థూలము లేదు. తత్తుల్య వస్తువు లేదు. మహావిష్ణువునకంటెఁ బరుఁడవు నీవే. నీకంటెఁ బరుఁడు లేనేలేఁడు. ఇదిసత్యము. స్థూలవస్తువులకంటె స్థూలవస్తువవు. సూక్ష్మవస్తువులకంటె సూక్ష్మవస్తువవు. మహావిష్ణుశబ్దవాచ్యుఁడవు. సర్వాధారస్వరూపుఁడవు; జలరూపుఁడవు. అన్నియు నీవే. జలమునకు నీవే యాధారభూతుఁడవు. స్థావరరూపములయందు గోలోకము నీవే. సర్వాధారుఁడవుకాన నే వాయురూపుఁడ వనంబరఁగుదువు. శ్వాసనిశ్వాసరూపము గాంతువు. కాననే నిన్ను మహావాయువందువు. భక్తానుగ్రహార్థ మివ్వీరూపమును ధరించితివి. నిత్యుఁడవు. సహస్రవదనముల నొసంగితివి. ఇన్నింటిచే వినుతింప నిచ్ఛ గలదు. కాని యట్టిజ్ఞానము నాకు లేదు. క్షమింపుము శ్రీకృష్ణా యనియె.

దేవతలందఱు చేతులు జోడించి భక్తిభావముల ననంతుఁడే నిన్ను నుతింపఁజాలననియె. నీవే యనంతుఁడవు. విధాతయు జ్ఞానరూపుఁడగు శంకరుఁడు వినుతింపఁజాలరు. ఇది నిక్కము. సరస్వతి వినుతింపఁ జాలదనుట సత్యము. ఇఁక మేమేయని వినుతిచేయంగలవారమని పలికి నమస్కరించిరి. మునీంద్రులు భక్తిరసపరిపూర్ణమానసులై మహాత్మా! వేదములకు నిన్ను నుతించుసామర్థ్యము లేదు. ఇఁక నట్టి నిన్ను నెఱుంగనైన మాకు శక్తి గలదా. మేము వేదవేత్తలము. కాన వేదాశక్యప్రభావుని నేమని పొగడుదుము. అని పలికి నమ్రకంధరులైరి. నారదా! ఈస్తుతి పరమపావనము. పూజాకాలమున నవ

శ్యము పఠింపఁదగినది. ఇహాపరసుఖములు గలవు. అంతమున గోలోకనివాసపుణ్యము లభించును.

ఆర్యులారా! ఈవిషయమునుగూర్చి వ్రాయఁదగినభాగములు లేవు. ఉన్నను అవి చర్వితచర్వణము వంటివి. బ్రహ్మ శంకరుని స్తుతించినభావమే యీస్తుతియందును గలదు. కాన దీనియందలి సత్యమేమనఁగా నేమూర్తియందును భావ మొక విధముగానుండిన ముక్తికాములకు ముక్తి లభించునని దీని సారము. ఏమూర్తిని ధ్యానించిన నామూర్తి భక్తానుగ్రహార్థము భగవంతుఁడు ధరించినమూర్తియే కావున నెల్లర కఖిలపురుషార్థముల నిచ్చును. ఈరహస్య మెఱింగినచో మతవైషమ్యములు దేవతాంతరదూషణములు నశించుననుట నిక్కము. కావున మానవులు భక్తిభావమును గుదుర్చుకొనుటకుముం దీవైషమ్యమును మానవలయును. అది మానకున్న భగవంతునికృపకు దూర మగుచుందుము. కాఁబట్టి యట్టిపనికిఁ బూనరాదనుట దీనినుండి గ్రహింపఁదగు నీతి. ఇఁకఁ దర్వాతికథను జిత్తగింపుఁడు.

## రామకృష్ణులకు నుపనయనసంస్కారము చేయుట.

* ఇట్లు దేవతలు వినుతించి నిమీలితనయనులై భగవత్పాదపద్మముల ధ్యానించి కన్నులు విప్పగనే ప్రాంగణమునఁ బీతాంబరమును ధరించిన శ్రీకృష్ణమూర్తి కనఁబడెను. తొలకరి మెఱపుఁదీగెఁగూడిన జలధరమువలెఁ బ్రకాశించుచుండెను. మాలతీమాల్యము ప్రకాశించు భగవంతుని వక్షస్థలమలరా

* ఈ భాగము శ్రీకృష్ణజన్మఖండము నూటయొకఁడవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగఁదగు.

రెను. చెంపలయందుఁ గస్తూరీచందనతిలకము వెలుఁగుచుం డెను. ఆమూర్తిని గనుఁగొనఁగా మేఘమాలికాసమావృత పూర్ణచంద్రబింబము ముందుఁదోఁచిన ట్లుండెను. ద్విభుజముల విరాజిల్లుచు శ్యామలవర్ణము వెలయ రాధాకాంతుఁడై జగ న్మోహనాకారుఁడై చిఱునవ్వు ముఖమునఁ దేజరిల్ల భక్తానుగ్ర హతత్పరత్వము కనుదమ్ములయందు స్పష్టమగుచుండ రత్నేంద్ర సారనిర్మిత మంజుమంజీరములు పాదపద్మముల మెఱయుచుండఁ దండ్రియుత్సంగమున శిశుత్వమున గన్నీరుఁ గార్చుచున్నరూప ము ప్రత్యక్షమయ్యెను. ఆబాలగోపాలవిగ్రహమును గాంచి యెల్లరు నాశ్చర్యావిష్టమానసు లైరి. బలరాముఁడు నట్లే యుండెను.

సుముహూర్త మాసన్నమయ్యెనని గర్గముని తెలిపెను. ఆలగ్నము శుభగ్రహసంవీక్షితము. లగ్నాధిపతి యస్తమింపక బలయుతుఁడై యర్థస్థానమం దుండెను. పాపగ్రహములు లగ్నమును జూడక తృతీయషష్ఠలాభస్థానముల నుండిరి. అంత గర్గముని సభాస్తారులగు మహర్షి దేవతల యనుమతి నంది స్వస్తి వాచనకర్మమును జరపెను. వసుదేవుఁ డందఱకు భక్తినమ్రా త్మకంధరుఁడై వందనమొనరించి గర్గముని మంత్రములు చెప్పు చుండ స్వస్తివాచనకర్మక్రియలఁ దా నడపెను. స్వస్తివాచన క్రియానంతరము గర్గమునీంద్రునకు సువర్ణటంకశతక మర్పిం చెను. దేవతలు మహర్షులా గర్గముని యదృష్టవిశేషమును బొగడి యెంతటిపుణ్యాత్ముఁడవైతివి మునీంద్రా! యని నమస్క రించిరి. వసుదేవుఁ డంత గణనాయకభాస్కరహుతవహ మహా దేవుల నర్ఘ్యావిధిం బూజించెను. వా రాశీర్వదించి యిడినయక్ష

తల శిరమున ధరించి వనితతలపై నునిచి బాలకద్వయశీర్షముల నునిచెను. వేదమంత్రములు మునులు నుడువుచుండఁ గొడుకుల నిరువురను జెంతకుఁ జేర్చుకొనియెను. దేవతాదిక్పాల నవగ్రహపూజాక్రియ జరపఁబడెను. పిదప షోడశమాతృకాపూజనము సాగించెను. వసుధార నేడుమారులు హుతవహునందు వేల్వఁబడెను. చేదిరాజగు వసువు నర్చించి యంతట వృద్ధిశ్రాద్ధము చేసెను. వేదోక్తరీతిగా యజ్ఞోపవీతమునఁ బుత్రుల నలంకరించెను. ముందు బలదేవునకుఁ బిదప శ్రీకృష్ణునకు యజ్ఞోపవీతధారణమహోత్సవము నడపెను. సాందీపనిముని వారికి గాయత్రి నుపదేశించెను. పార్వతీదేవి పరమాదరమున వారికిఁ దొలుత భిక్షాదానము చేసెను. తండ్రియగు వసుదేవుఁడు సురుచిరరత్నహారములఁ దనయుల కిచ్చెను. తెల్లనికుసుమములు దూర్వలు మంత్రపూర్వకముగా దీవనలిచ్చుచు మహర్షులాయర్భకులపైఁ జల్లిరి.

అదితియు దితియు మునిపత్నులు దేవకియు యశోదయు రోహిణియు సావిత్రీసరస్వతులును బరమానందభరిత లైరి. వీరెల్ల వరుసగా నొక్కరొక్కరుగా భిక్షను బెట్టిరి. మణికాంచనటంకము లా భిక్షాద్రవ్యములని యెఱుంగఁదగు. దేవనాగరాజకన్యకలు పతిపుత్త్రులు గల పురంధ్రీమణులు బంధుపత్నులును సంతోషాశ్రువులు నిండ భిక్ష నిడిరి. ఇంద్రపత్నియు వరుణపత్నియు నగ్నిపత్నియుఁ రోహిణియుఁ గుబేరపత్నియుఁ గామపత్నియు మరల నాదరమున రత్నభూషణముల నొసఁగి యాకుమారుల నాశీర్వదించిరి. బలదేవ శ్రీకృష్ణు లాభిక్షాద్రవ్యములఁగొని లేచి యందఱకు నమస్కరించి యావస్తువులలోఁ

గొన్నింటిని గులగురువగు గర్గముని కొసంగిరి. గురువగు సాందీపనిమునికిఁ గొన్నింటి నిచ్చిరి. వేదోక్తక్రియాకలాపము పూర్తి కాఁగా వసుదేవుఁ డానందమున గర్గమహామునికి సర్వదక్షిణ నొసంగెను. దేవతలకు సర్వభోజనమిడి తృప్తులం గావించెను. బ్రాహ్మణులు తృప్తులైరి. ఆమహోత్సవమునకు వచ్చినవారెల్ల రా బాలకులకు శుభాశిషముల నొసంగిరి. వసుదేవుఁ డందఱ యథాయోగ్యముఁగాఁ బూజించెను. మర్యాదల నలరించెను. ఉత్సవము పూర్తి కాఁగా నందఱు తమతమగృహములకుఁ జనిరి.

నందుఁ డీరీతి యశోదంగూడి యాశుభకార్యము నిర్వహించి బలకృష్ణులను దొడలపై నిడుకొని ముఖముల ముద్దాడి గట్టిగా రోదనము చేసెను. పతివ్రతయగు యశోదయు నేడ్చెను. శ్రీకృష్ణుఁడు వారినిర్వుర నుచితరీతి నూఱడించి ముందు దెలిపిన విషయముల స్మృతికిం దెచ్చుచు నిట్టులనియె. జననీజనకులారా! సానందచిత్తముల వ్రజమున కరుగుఁడు. మీరే నాకుఁ దలిదండ్రులు. వేఱుభావము నాకు లేదు. నేనిపు డన్నంగూడి యవంతీపురమున కరిగెదను. సాందీపనియొద్ద విద్యాభ్యాస మొనరించెద. ఆమీఁద వచ్చి మిమ్ము దర్శింతును. కాలము కొంతగడచినఁగాని రాజాలను. కాలమే ప్రాణులకు సంయోగవియోగములఁ గల్పించును. సర్వము కాలకృతమేగాని యితరుల కందు స్వాతంత్ర్యమేమాత్రము లేదు. కన్నులు మూసి తెఱచునంతలో నెన్ని యోకార్యములు సాగుచుండును. సుఖదుఃఖాదిద్వంద్వము లొకదానివెంట నింకొక్కటిగా వచ్చుచునే యుండును. మీకు ముందే యోగిజనసుదుర్లభమగు తత్త్వమును దెలిపితిని. ఆ

విషయము తండ్రీ! నాతల్లికి నెఱింగింపుము. అని పలికి వారల కుందు మాన్పి నందుఁ డానందమునొంద యశోదయు నూఱ డిల్ల వారిసెలవుగైకొని వసుదేవుసభ కరిగెను. వసుదేవున కీవి షయమే తెల్పెను. తదాజ్ఞఁ బడసెను. గర్గమహాముని యుపదేశ మున వసుదేవుఁడు విజ్ఞానసంపన్నుఁ డయియే యుండెను. కావునఁ గుమారు నాశయమెఱింగి చదువుకొనఁబోవ ననుమతి యిచ్చెను. దేవకియు ననుమతించెను.

అంత రామకృష్ణులు దేవకీవసుదేవులకు నమస్కరించి వినయమున వారిని బ్రార్థించి సాందీపనిమానియాశ్రమమునకు విద్యాభ్యాసమున కరిగిరి. నందుఁడు యశోదంగూడి దేవకిని వసుదేవుని బ్రార్థించి వారియనుమతి నొంది గోకులమున కరి గెను. అత్తఱి నాతనిమనస్సు విషణ్ణమై యుండెను. యథాపూ ర్వముగా శ్రీకృష్ణుఁ డాడుకొనుచు గోకులమున బృందావన మున నుండఁగాఁ జూచుచుండవలయుననియే యాతనిసంక ల్పము. శ్రీకృష్ణు నెడఁబాయుటయు వసుదేవుఁ డుపనయనాది సంస్కారములు చేయుటయు నాతనికి సమ్మతములు గావు. ఐనను బ్రాజ్ఞుఁడౌటను శ్రీకృష్ణునియుపదేశమున నిర్మోహుఁ డగుటను విశేషించి దుఃఖింపలేదనవచ్చునే గాని గోకులమున కరుగుట నరకమునకు బోవునట్టిదని యాతనిభావమై యుండ నోపు. అది నిక్కమే. భగవంతునిసాన్నిధ్య మెడఁబాయుట యనఁగా నెట్టిది! నరకమునకుఁ బోవునట్టిదియే కదా! దేవకీ దేవి యాదంపతులు పయనముసాగించుతఱి వారికి ముక్తాము ఖులు లోనగు నమూల్యవస్తువుల నాదృతితోనె నొసఁగెను. తెల్లగుఱ్ఱమును గజేంద్రమును సువర్ణముద్రికలు శ్రీకృష్ణుఁడు

తాఁ బ్రయాణమగునపుడు నందున కొసంగెను. నందుఁడు పరమానందమున గ్రహించెను. వారివెంట వచ్చినభూసురులకు దేవకీదేవి లోనగు నతఃపురపురంధ్రీమణులు విశేషద్రవ్యము నొసంగి గారవించిరి.

## రామకృష్ణులు విద్యాభ్యాసము చేయుట.

శ్రీరామకృష్ణులు సాందీపనిమునికడ విద్య నభ్యసింపనరుగుతఱి వసుదేవోద్ధవాక్రూరులు సాగనంపఁ బోయిరి. కాళిందీతీరముదనుకఁ బోయి వారి వదలిరాఁజాలక విలపించిరి. శ్రీకృష్ణుఁడు తెలిపిన హితవాక్యముల నాలకించి విధిలేక వారెల్లమరలి యాకుమారులఁ దలంచుచు మరల నెప్పుడు చూతుమా యని యువ్విళ్లూరుచు నిండ్లకుఁ జనుదెంచిరి. భర్తృహీనయగు కుంతియు వసుదేవుఁడొసఁగిన రత్నములఁగైకొని పుత్త్రులంగూడి యింటికేగెను. ఉపనయనమహోత్సవమున కరుదెంచినమహర్షులకుఁ బండితేంద్రులకు ఋత్విజులకు వసుదేవుఁడు యథార్హముగ సత్కారపూర్వకముగా దుకూలాంబరాభరణరాజి నొసంగి సంతోషింపఁ జేసెను. ఆయింట వేదపాఠము బహుతరముగాఁ జేయఁబడియె. హరినామసంకీర్తనము మహానందమునఁ జేయఁబడియెను. ఆగృహవరము సకలకల్యాణనిలయమై యుండెను. బంధువులకు జ్ఞాతిబృందమునకు మర్యాదల ననుసరించి వస్త్రాదుల నిచ్చి వసుదేవుఁడు వారివారిగృహములకుఁ బోవ ననుజ్ఞనొసంగ నాగౌరవముల కలరుచు వారు పోయిరి. శ్రీహరియు బలరాముఁడును సాందీపనికడఁ జేరిరి.

ఆర్యమహాశయులారా! ఈవిషయమున వ్రాయఁదగిన రహస్యములు లేవు.

"శ్లో. నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన
నానవాప్తమ వాప్తవ్యం వర్తఏవ చ కర్మణి. ౨౨
యదిహ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయు రిమేలోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తాస్యాముపహన్యామిమాః ప్రజాః. ౨౪
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాంస్తథాసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్.
న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్."

గీతా. 3 అ.

అనియు,

"శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే." ౨౧

గీతా. 3 అ.

అనియు భగవద్వాక్యము గీతోపనిషత్తునందుఁ గనఁబడియెడిని. లోకమున నాసక్తిగలిగి యవిద్వాంసుఁ డెట్లు కర్మముల నొనరించునో విద్వాంసుఁ డనఁగా లోకవృత్తాంత తత్త్వమెఱిఁగిన జ్ఞాని యాసక్తుఁడు కాక యట్లే కర్మముల నాచరించును. అర్జునా! నేఁజేయఁదగిన కర్మమేదియు ముల్లోకములయందును లేదు. నాకు లభింపనిది లభింపఁదగినదియు నగు నేవాంఛయు లేదు. నేను లోకుల ననుసరించి కర్మములు చేయకయున్న నందఱు నామార్గమునే యనుసరింతురు. కావున వారిని మంచిమార్గము

ననుసరింపఁజేయువాండెఁ గర్మముల నాచరింతును. నేనే కర్మములఁ జేయకయున్న నీలోకులు భ్రష్టులగుదురు. కావున సంకరముగ లోకమును జేయుటకు నేనపుడు కర్తనగుదును. దాని కంగీకరించినయెడల జనులనెల్లఁ బాడుచేసినవాఁడ నగుదునుగదా. కావున నాత్మజ్ఞానముగలవాఁడు కర్మములయందాసక్తిగల పామరులబుద్ధిని జలింపఁజేయఁగూడదు. తనకుఁ గర్మఫలాపేక్ష లేకున్నను గర్మములను దాఁజేయుచు వారిచేత నన్నికర్మములను జేయించుచుండవలయును. యోగ్యుఁ డేయే కర్మముల నాచరించునో పామరు లాయాకర్మములనే చేయుదురు. అతఁ డేది ప్రమాణమని నియమించునో దాని ననుసరింతురని పైగీతావాక్యముల సారతరార్థము.

ఇట్లు భగవంతునిభావము కావున గురుశుశ్రూష చేయుట పరమధర్మమనియు దానిచే లభించినవిద్య ఫలదాయిని యగుననియు నామార్గము ననుసరింపకయున్న నావిద్య సత్ఫలముల నీఁజాలదనియు లోకులకుఁ దెలుపుటకొఱకే శ్రీకృష్ణుఁడు సాందీపనికడఁ జదువనరిగెను. విద్యాప్రదాత విద్యనభ్యసింపఁ బోవుట యుపహాస్యలక్ష్యము కదా. కావున భగవంతుఁడు తానుగూడఁ బ్రాచీనాచారములఁ బాటించిన వానిని లక్ష్యములుగాఁ గైకొని యంద అనుసరింతురనియు నదియే తాఁ జేయవలసినపనియనియు భావించి చేయఁబూనెను.

"శ్లో. గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా,
అథవా విద్యయా విద్యా చతుర్థా నోపలభ్యతే."

అన్నసూక్తి వినఁబడియెడుఁగదా. గురుశుశ్రూషచే లభించునది యొకటి. విశేషించి ధనవ్యయముచేసి సంపాదించినదొకటి. తన

విద్య యొరులకుంజెప్పి వారివిద్య తా గ్రహించుటొకటి. అను నివి విద్యనుగ్రహించు మార్గములు మూఁడు గలవు. నాల్గవ మార్గమేదియుఁ గనరాదు. ఈ మూఁడుపద్ధతులయందుఁ దొలి మార్గము సారతమము. ఆమార్గము ననుసరించి సంపాదించిన విద్యయే ఫలము నొసంగును. ధనసహాయమున సంపాదించినది జ్ఞానదాయకము గాఁజాలక నిర్వీర్యమగును. మూఁడవదియగు పరివర్తనన్యాయము దానికంటెఁ దుచ్ఛమైనది. అనఁగా నాము ష్మికసాధనము కాదన్నమాట.

గురుశుశ్రూష చేసి తత్కారుణకుఁ బాత్రుఁడైన శిష్యుఁడే కృతార్థుఁడగు. శుశ్రూషయే తపస్సు. దానివలనఁ గలుగుఫలమే బ్రహ్మతేజోలాభము. అదియే శాపానుగ్రహదానసమర్థము. కావున గురుశుశ్రూష ప్రధానము. గురువునుసేవించి యతఁడు కరుణాపూర్ణుఁడై యొసంగినమంత్రము ఫలించినట్లు ద్రవ్య మిచ్చి పరిగ్రహించినమంత్రము ఫలింపదు. ఏలయనఁగా మనో దృఢము గలుగదని భావము. మనస్సునందు విశ్వాసము లేకున్న నేదియు ఫలింపదని దీనిసారము. ద్రవ్యమిచ్చి విద్య నేర్చుకొన్న చో గురుభక్తి కుదురదు. గురువును భగవంతుఁడని నమ్మకున్నఁ దదుపాత్తవిద్యయో మంత్రమో నిస్సారమగును. లక్ష్యశుద్ధి తగ్గునని భావము. అక్షరముల కూర్పునందుమాత్రమే గాక గురుభక్తియందే యెక్కుడు శక్తిగలదు. ఇవియొక యక్షర పంక్తు లనుకొన్నచో నామంత్రము నించుకంతయు ఫలము నీఁజాలదు.

"శ్లో. శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన."

అనుప్రమాణము పురశ్చరణప్రదీపికయందుఁ గనఁబడియెడిని.

కొందఱకు మంత్రము ద్వేషింప మతి భ్రమ మొదవును. ఏల? అను ప్రశ్నము యుక్తము. మంత్రమనఁగా ధ్యానించినఁ దరింపఁ జేయునది కదా. అట్టి మంత్రమును జపించిన దానఁ గీడు గలిగెనేని మంత్రశబ్దార్థము తప్పుగదాయని ప్రశ్నమునకర్థము. సమాధాన మేమనఁగా, ఉపాసకుఁడు మంత్రజపము చేయునపుడు దురుద్దేశము గలవాఁడైనచో నాతనియూహ ఫలించు నంతటి యదృష్టము వానికి లేకుండిన నామంత్రాధిదేవత యతనికి మనోవిభేదము చేయును. ఏలయనఁగా ఆతఁ డట్టిఫలముల నొందఁదగినసత్కర్మములఁ బ్రాగ్జన్మమునఁ జేయలేదు. కావున నవి లభించినఁ బొందఁదగఁడు. మంత్రసిద్ధియైన నవి యలవడక తప్పవు. కావున మంత్రము సిద్ధిగాకుండు మార్గము నే తదధిదేవత వెదకును. కావున గురుభక్తియను సాధనమున్న దేవతానుగ్రహము గలుగును. అనఁగా జ్ఞానముగలిగి ఫలమును గోరక జపము చేయును. పై రెండువిషయములకుఁ గుంభకర్ణుఁడు విభీషణుఁడు నుదాహరణభూతులు. ఇద్దఱు తపస్సు నిష్ఠమై నొనరించిరి. ఫలమునుగోరిన కుంభకర్ణుఁడు దుష్ఫలములఁ బొందెను. ఫలములనుగోరని విభీషణుఁడు సత్ఫలముల నితరులకు సాధారణముగా లభింపనివానిం బొందెను. ఏల? అని యాలోచింపుఁడు. చక్కఁగా బోధపడును.

మంత్రమెట్లో వేదాదివిద్యలు నట్టివే. గురుభక్తి ప్రధానమని యది లేకున్న నావిద్య సంపూర్ణఫలము నీఁజాలదని దీనిసారము. ఈవిషయమే మనుస్మృతియందు,

"శ్లో. విద్యా బ్రాహ్మణమేత్యాహ శేవధిస్తేఽస్మి రక్షమాం,
అసూయకాయ మాంమాదా స్తథాస్యాంవీర్యవత్తమా.

యమేవ తు శుచిం విద్యాన్నియతబ్రహ్మచారిణమ్,
తస్మై మాం బ్రూహి విప్రాయ నిధిపాయాప్రమాదినే.
బ్రహ్మ యస్త్వననుజ్ఞాత మధీయానాదవాప్నుయాత్,
స బ్రహ్మస్తేయసంయుక్తో నరకం ప్రతిపద్యతే." ౧౧౬

(౨ అధ్యాయము.)

విద్యాధిదేవతయగు శారద గురువుదగ్గరకు వచ్చి యిట్లుచెప్పె నని కథారూపముగా ధర్మ ముపదేశింపఁబడినదని యెఱుంగు నది. గురువునం దెవనికసూయయుండునో వాని కావిద్య ఫలిం పదు. నియతుఁడై యింద్రియనిగ్రహముగలవానికి విద్య చెప్పిన నది తపస్సువలె ఫలించును. కాపాడుశక్తిగలవాని కడనుంచినద్రవ్యము నిల్చునుగాని రక్షింపఁజాలనివానిచెంత నిలువఁజాలదు కదా. అట్లే విద్య భగవతిగా భావించి దాని నారాధించినఁ బురుషార్థముల నొసంగును. లేకున్న నిష్ఫలమే దానికి ఫలమగును. అని యీ యుపదేశసారమగు నర్థము. దీనిచే గురుశుశ్రూష ప్రధానమనియు నాపద్ధతి ననుసరించి సం పాధించిన విద్య ఫలించుననియు నెఱుంగఁదగినది.

ఇట్టియుపదేశమును శ్రీకృష్ణుఁడు తాఁ జెప్పక యాచ రించి చెప్పెను. ఇది గ్రహించిననే విద్యఫలించును. కాని వేఱు భావమున్న విద్య యేయేఫలముల నీఁగల్గునో యాఫలములు లభింపవని తాత్పర్యము. ఈకాలమున విద్యాభ్యాసము మొద టిమార్గము శూన్యమైనది. రెండవమార్గము శరణ్యమైనది. కావుననే విద్య యైహికసుఖసాధన మగుచున్నదిగాని యాము ష్మికఫలసాధనమగు జ్ఞానమున కాధారము కాకున్నది. పూర్వ కాలమున నట్లుగాక గురుకులవాసముచేసి శిష్యులు చదువు

కొనుచుండిరి. దాన వారికది యించుకలభించినను బూర్ణఫలము గలుగుచుండెను. అది లేనికతన నీకాలపువిద్య యంతటివిజ్ఞానము నొసఁగలేకున్నది. కావుననే శాపానుగ్రహసమర్థులు కాకున్నవారు ఆశీర్వాదములు ఫలింపకున్నవి. శాపములు నిష్ఫలము లగుచున్నవి. ఇన్నింటికిని గారణము విద్య చక్కనిపద్ధతిచే నభ్యసింపకపోవుటయే కాని వేఱొక్కటి కాదు. ఈవిషయమే శ్రీకృష్ణపరబ్రహ్మ మొకమహర్షికడ విద్య నభ్యసింపఁబోవుచు నాహేతువుచే లోకులకు వెల్లడిచేసెను. ఈరీతియే యీకథనుండి గ్రహింపఁదగును. గురుభక్తి ప్రధానమని దాని సాయమున లభించినవిద్య సద్విద్యయగునని యీ కథాసారములు. ఇఁకఁ దరువాతిభగవచ్చరిత్రము నాలకింపుఁడు.

## బలదేవకృష్ణులు సాందీపనికడ విద్య నభ్యసించుట.

* బలరామునింగూడి శ్రీకృష్ణమూర్తి వసుదేవాదుల వెనుకకు బంపి పాదగతినే యాశ్రయించి సాందీపనిముని యాశ్రమమునకుం బోయెను. గురువునకు నమస్కరించి యావెనుకఁ బతివ్రతాశిరోమణియగు నాగురుపత్నికి నభివాదన మాచరించెను. వారిచ్చిన శుభాశిషములఁ బడసెను. తాఁ గొనిపోయిన రత్నాదివస్తువుల సమర్పించెను. వారింగాంచి యిట్లు పలికెను. మహాత్మా! మీవలన విద్య గ్రహింప వచ్చితిమి. మేము కోరినవిద్య నుపదేశింపుఁడు. సుముహూర్త మెప్పుడో నిర్ణయించి విద్యనుపదేశింప నారంభింపుఁడు. మీకేది యుచితమనితోఁచిన నావిద్య నారంభింపుఁడు. ఇదియ

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము నూటరెండవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని గ్రహింపవలయును.

మాప్రార్థనమని వినయవినమితకంధరుఁడై ప్రార్థింప నామాటల నాలకించి యామునిచంద్రుఁడు హర్షపులకితగాత్రుఁడై యట్లే యని సమ్మతించి యతని సపర్యలం దన్వెను. బలరాముని సత్కరించెను. మధుపర్క మొసఁగెను. గోదానకర్మము నడ పెను. వస్త్రముల నొసంగెను. చందన మిచ్చెను. మిష్టాన్న ముపెట్టి వారిని సంతృప్తులఁ గావించెను. తాంబూల మిచ్చెను. ప్రియవాక్కుల నలరించెను. భగవంతుఁడని యెఱుంగుంగాన శ్రీహరి నిట్లు వినుతించెను.

పరంబ్రహ్మవు. పరంధామ మనఁబడుదువు. స్వేచ్ఛామయుఁడవు స్వయంజ్యోతివి. నిర్లిప్తుఁడవు. నిరంకుశుఁడవు. భక్తైకనాథుఁడవు. భక్తేష్టదాయకుఁడవు. భక్తానుగ్రహావిగ్రహుఁడవు. భక్తవాంఛాకల్పతరువవు. భక్తప్రాణవల్లభుఁడవు. మాయంగొని బాలరూపమున నున్నవాఁడవు. బ్రహ్మశంకరానంతాదివందితపాదారవిందుఁడవు. మాయచే భూపాలుఁడవైతివి. భూభారనిర్వహణార్థ మవతరించితివి. బ్రహ్మజ్యోతివని సనాతనుఁడవని నిన్ను యోగులు వినుతింతురు. జ్యోతిర్మధ్యవర్తివిగా భక్తులు నిన్ను ధ్యానింతురు. ద్విభుజములఁ దాల్చి మురళిని హస్తారవిందమునఁ బట్టుకొని శ్యామసుందరమూర్తివై చందనోక్షితసర్వాంగుఁడవై సస్మితుఁడవై పీతాంబరధారివై వనమాలావిభూషితుఁడవై లీలాపాంగతరంగములచే నిందితానంగమూర్ఛితుఁడవై పాదద్వంద్వమలక్తకకాంతిని జెన్నారుచుండఁ గౌస్తుభమణిహార మురమున వెలయుచుండ దివ్యమూర్తివై యొప్పునిన్ను నేమని వినుతించువాఁడ? మహానుభావా! దేవాదిదేవా! జగన్నాథా! త్రైలోక్యమోహనాకారా! కోటి

కందర్పలీలాభుని, గమనీయదర్శనుని, నమూల్యరత్ననిర్మాణభూషణవిభూషితుని వరదుని వరదానదక్షుని నాల్గువేదములకు సకలకారణములకుఁ గారణభూతుని ధ్యానించువాఁడను. నాయందలి యనుగ్రహమునఁ బాకార్థమై నాయీకుటీరమున కేతెంచిన మాయేశ్వరుని నిన్ను నేవిద్య క్రొత్తదని పఠింపఁ జేయుదును. పరిపూర్ణుఁడవు. సనాతనుఁడవు. సర్వేశ్వరా! నాయొద్ద నే మభ్యసింపఁగోరిన నాహృదయముననున్న నీవే నీకు విద్య చెప్పువాఁడవు. ఇంతకంటె నాకేమియుఁ దెలియదని కరాంజలింబట్టి యూరక యాశ్యామసుందరమూర్తిని ధ్యానించుచుండెను.

అంత సాందీపనిమునిపత్ని పూతచరిత్ర భగవంతుని దర్శించుచు మహాత్మా! ఇపుడు నాజన్మము పవిత్రమైనది. జీవనము సఫలము. పాతివ్రత్యము సఫలము. తపోవనము ధన్యము. ఏ నీకు నన్నమిడు భాగ్యముగలిగెనో అట్టి యీ నాదక్షిణహస్తము సఫలము. కావున నీయాశ్రమము తీర్థభూతము. ఏలయనఁ దీర్ఘపాదపాదాంకితము. నీపాదపద్మరజస్సంస్పర్శమున నీయాశ్రమస్థలులు పావనములు. మాదంపతులకు నీపాదపంకజారాధనమే యలంకారము. ఎంతదనుక మనుష్యుఁడు నీపాదసేవచేయఁడో యంతదనుక దుఃఖశోకరోగాదిబాధ లుండును. ఆవల నవి నామమాత్రశేషములై యుండఁగలవు. త్రిమూర్తులు నీయంశములు. కృపాకరా! మాపై ననుకంప యుంచుము. మాయామోహముల నశింపఁజేయుము. అని పలికి బాష్పపూర్ణనేత్రయై శ్రీహరిచెంత నిలుచుండి తల్లియగు దేవకివలె నాతని బ్రీతిచేఁ గాంచెను.

ఆస్తుతి నాలకించి శ్రీకృష్ణుఁడు తల్లీ! నన్ను సన్నుతించుట న్యాయము కాదు. పాలుత్రాగుతనయుని జనని వినుతించునా. భర్తనుగూడి శాశ్వతసుఖాధారమగు గోలోకమున కరుగుము. ఈకళేబరము నశ్వరము. ప్రాకృతిరము. మిథ్యారూపము. దీనిని వదలి నిర్మలదేహమును దాల్చి జన్మమృత్యుజరాదిబాధలులేని లోకమున కరుగుము. అని వరమిచ్చి బలరామునింగూడి యమ్ముని యాశ్రమముననే యుండి వేదములను సాంగముగా * నొక నెలలోఁ బఠించెను. విద్య పూర్తికాఁగా నంతకుముందే మృతి నొందియున్న గురుపుత్త్రుని దెచ్చియిచ్చి యమూల్యరత్నముల గురుదక్షిణగా నిచ్చెను. ఆమునియు నా శ్రీహరి యొసంగిన

---

* ఈవిషయము విష్ణుపురాణమునఁ బంచమాంశమున నిరువదొకఁడవ యధ్యాయమునందు, "శ్లో. దర్శయాం చక్రతుర్వీరా వాచార మఖిలేజనే సరహస్యం ధనుర్వేదం ససంగ్రహ మధీయతామ్, అహోరాత్రచతుష్షష్ట్యా తదద్భుత మభూద్ద్విజ. ౨౨. సాందీపనిరసంభావ్యం తయోః కర్మాతిమానుషం, విచింత్య తౌ తదా మేనే ప్రాప్తౌ చంద్రదివాకరౌ. ౨౩. సాంగాంశ్చ చతురో వేదాన్ సర్వశాస్త్రాణి చైవహి, అస్త్రగ్రామమశేషం చ ప్రోక్తమాత్ర మవాప్య తౌ. ౨౪. అని యున్నది. శ్రీకృష్ణజన్మఖండమునందు విద్యాభ్యాసము నెలమాత్రమే యనియు. విష్ణుపురాణమునందు నఱువదినాలుగుదినములు మాత్రమనియుఁ నున్నది. పరస్పరవిరుద్ధములుగా నున్నవే యనుశంక పుట్టరాదు. ఏలయనఁగా శ్రీకృష్ణజన్మఖండమున వేదములు మాత్ర మభ్యసించిన ట్లున్నది. విష్ణుపురాణమునందుఁ జతుష్షష్టివిద్య లభ్యసించిన ట్లున్నది. కాన విరుద్ధమిటఁ గానరాదు. బ్రహ్మపురాణమునం దున్న శ్లోకములే విష్ణుపురాణమం దున్నవి. కాన నవి రెండు నొక్కవిధముగ నే విషయమును దెల్పును.

దక్షిణను బుత్త్రున కొసంగి భగవత్కరుణాలభ్యమగు దివ్యవిమానమునెక్కి గోలోకమునకు భార్యం గూడిపోయెను. ఈచరిత్రము పరమాద్భుతము. సంసారభయనాశనము. దీనిం బఠించువారికి శ్రీకృష్ణదాస్యము లభించును.

భక్తవరులారా! ఈవిషయమును గూర్చి వ్రాయఁదగిన విశేషములు ముందే వ్రాసియుంటిని. కాన నిట మరల వ్రాయఁబూనను. ఇంతవనుక భగవంతుని బాల్యచరిత్రము ముగిసినట్లు భావింపనగును. ఇఁక శ్రీకృష్ణమూర్తి రాజవేషమును ధరించి దుష్టసంహారము చేయఁబూనును. విద్యాభ్యాసము పూర్తి కాఁగా బాల్యము పూర్తియయ్యెనని గ్రహింపవలయును. "పరిత్రాణాయ సాధూనామ్." అనుభాగమును దాఁటి "వినాశాయ చ దుష్కృతామ్" అన్నభాగమును నెఱవేర్ప భగవంతుఁడు పూనినచరిత్ర మింక వ్రాయఁదగును. అవతారఫలమన నదియే కదా. కావున నిఁక నాక్రమము నాలకింపుఁడు.

శ్రీకృష్ణమూర్తి బలరాముంగూడి సాందీపనియొద్ద విద్య నభ్యసించి గురుదక్షిణ నిచ్చెనని ముందే చెప్పియుంటిని గదా. మృతుఁడగు గురుపుత్త్రుని దెచ్చియిచ్చి యనర్ఘ్యరత్నములు గూడ గురువున కొసంగెననియు వానినెల్లఁ దనకుమారున కొసంగి భార్యంగూడి గోలోకమున కేగెననియు ముందే వ్రాయఁబడినది. మృతగురుపుత్త్రుని దెచ్చుపద్ధతి పురాణాంతరమున నున్నది. ఆవిషయమును వ్రాయవలయును. ఆకథయందే యనంతునిమహాత్త్వము తేటపడుటయే గాక భక్తుల కామహాత్ముని యపారశక్తి బోధపడును. దాన వారికి భక్తిభావము మఱెంత దృఢమగును. అంతియగాక భగవత్కథల నమ్మనివారి కించుక

తత్త్వమెఱిఁగింపఁ దగును. దాన వారును భక్తులగుదురు. భక్తి కుదిరినఁగాని ముక్తిమార్గము దొరకదనుట సిద్ధాంతమే కాని రిత్తవిషయము కాదు. ఆకథ స్వల్పమైనను దానియందుఁ గల విషయము గొప్పది. కాన సావధానులరై యాలకింపుఁడు.

## మృతపుత్త్రుని దెచ్చి గురువునకు శ్రీకృష్ణుఁ డర్పించుట.

* విద్యాభ్యాసము పూర్తికాఁగా బలరాముఁడు శ్రీకృష్ణుఁడు గురువుముందుఁ గరముల ముకుళించి నిలువంబడి స్వామీ! మీకరుణచే విద్యలు లభించినవి. గురుదక్షిణ సమర్పించి మే మరుగవలయు. అభీష్టమెద్దియో తెలుపవేఁడెదము. అని ప్రార్థింపఁగా నాలకించి సాందీపని వారిచర్య లతిమానుషములని నిశ్చయించి మున్ను లవణార్ణవతీరమందుఁ గలప్రభాసతీర్థంబున మృతుఁ డగు తనకొడుకును దెచ్చియిమ్మని యాచించెను. గురువు వాంఛితమును దెలిపినవెంటనే మహాప్రసాదమట్లే తెచ్చియిత్తుమని వారియాశిషములఁ బడసి శరచాపములూని యాయపూర్వసోదరు లిద్దఱు ప్రయాణమై లవణోదధిచెంతకుం బోయి సాగరుంబిల్చి మహార్ణవమా! మాగురుపుత్త్రుని దెచ్చియిమ్మా యని యడిగిరి. సముద్రాధిదేవత భగవదాగమనమునకుఁ గరముహర్షించి జలములనుండి వెడలివచ్చి యర్ఘ్యపాద్యాదివిధుల వారిం బూజించి కరములుజోడించి వినయసంభ్రమములు వెలయఁగా మహాత్ములారా! మీగురువగు సాందీ

---

* ఈకథ బ్రహ్మపురాణము ఎనుబదాఱవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది. విష్ణుపురాణమునందును గలదు. విష్ణుపురాణము బ్రహ్మపురాణమునకు స్వీకారపుత్త్రతుల్యమని యీవఱకే పెక్కుమాఱులు వ్రాసియుంటిని గదా.

పనిమునితనయుని హరించినవాఁడను నేనుగానని విన్నవించెను. అంత నూరకుండక పంచజనుఁడను దైత్యుఁ డొక్కఁడు శంఖరూపుఁడై యాబాలకుం గొనిపోయెను. రాక్షసాంతకులారా! ఆదనుజుఁడు నాజలముల నున్నవాఁడు. తరువాతఁ దమయానతి యెట్లో యెఱుంగ వేఁడువాఁడ ననియె.

సాగరోక్తుల నాలకించి శ్రీహరి బలరాము నందె నిలిపి తానొక్కఁడ యాసాగరజలంబులం బ్రవేశించి పంచజనుంబట్టుకొని వాఁడు పోరఁబూనఁగా క్షణమాత్రమున వానిని సంహరించి వానియొమ్ముకఁ బుట్టినశంఖమును గ్రహించెను. ఆశంఖము పూరించినంతన దానవబలము నశించును. దేవతలకు బలము వృద్ధియగును. అధర్మము వృద్ధిగాంచక నశించు. వానిచెంగట నాగురుపుత్త్రుఁడు లేకుండెను. ఆవిషయమెఱింగి శ్రీహరి యా పాంచజన్యమును బూరించి యమపురంబున కరిగెను. యమనగరమునకు హరిపోవుచుండ బలరాముఁడును వెంటఁబోయెను. యముఁ డజ్ఞానమూని వారితత్త్వ మెఱుంగక మృతశిశువును మరలఁ గొనిపోవవచ్చితిరా అని వెక్కసములాడి వారల మార్కొనియె. బలరాముఁ డశ్రమంబున నాతని నోడించెను. ధర్మరాజంతట విగతాహంకారుఁడై గురుపుత్త్రునొసంగి వారిని సత్కరించి పంపెను. ఆగురుపుత్త్రుఁడు యమనగరమున యాతనల ననుభవించుచుండెను. ఆబాలకుఁడు శ్రీహరిదర్శనమున విగతపాపుఁ డయ్యెను. వానింగొని శ్రీరామకృష్ణు లరుదెంచి గురువునకు సమర్పించిరి. సాందీపని యానందమునకు హద్దులేకుండెను. అంతట గురుననుమతినొంది మథురానగరమున కరుదెం

చిరి. మధురానగరవాసులందఱు తదాగమనమునఁ బరమ ప్రమోదసాగరనిమగ్నులైరి.

ఆర్యమహాశయులారా! కథాభాగమును వింటిరి. సామాన్యుల కీకథ నిజమే కాదని తోఁపకమానదు. ఏలయన భగవన్మహిమము లనంతములనుభావము వారికిఁ గుదురలేదు. కావున వా రట్లూహింతురు. దానఁ దప్పేమి? కొంతకాలమునకుఁ జిత్తము పరిపక్వముకాఁగా నింతకంటె నత్యల్పకార్యము భగవత్కృత్యములలో లేదని తోఁచును. ఇది సత్యము. కాని పామరుల వాదము లాలకించినపుడు వారిని మనము ద్వేషింపరాదు. సుప్రసన్నముఖముల మఱింత యాలకింపవలయును. మనము చెప్పుమాటలు వారి మదికెక్కనట్లు తోఁపకున్నచో నప్పు దూరకయుండవలయును. పట్టుదలఁ బూనరాదు. అది మనపని కాదు. వారికర్మము వారిని నమ్మనీయకున్నపుడు మన మేమిచేయఁగలము. కొంతకాలమునకు వారిని నమ్మునట్టిమార్గమునకు దేవలయును. ఎట్లు? భగవన్మహిమ మపారమని వారికి లక్ష్యలక్షణపురస్సరముగా నచ్చఁజెప్పవలయును. క్రమముగా వారు నమ్ముదురు. తరువాత వారే తమయజ్ఞానమునకు లజ్జింతురు. అంతదనుక బుద్ధిమంతులు వారి నాక్షేపింపరాదు. దానిచే వారిపట్టుదల వృద్ధియగును. అది దుష్కార్యము. దానిని బుద్ధిమంతులు చేయరాదు. భగవన్మహిమము లపారములని సాధారణులకు బోధపడదు. కాన నది వారిమదిఁ బాదుకొనునంతదనుక వారితో వాదింపరాదు. ఇఁక దీనిసారమును వినుఁడు.

మృతుఁ డెంతకాలము తనపాపఫలమగు నరకదుఃఖము ననుభవింపఁదగునో యంతకాలము లింగశరీరమును దాల్చి

యుండును. అది నశించునది కాదు. పుణ్యపాపానుభవమునకే యది యేర్పడినది. భగవదాజ్ఞ యట్టిది. ఆయాజ్ఞ యేకార్యము నెట్లు చేసినను జేయును. అది సాధింపరాని కార్యము లోకముల నేదియునుండదు, మనకున్నజ్ఞానము భగవచ్ఛక్తిని నిర్ణయింపఁ జాలదు. చాలుననుట పాపవిశేషఫలము. అల్పబుద్ధిచే నత్యధిక జ్ఞానగమ్యవిషయము నూహించి నిశ్చయించుట ఆకార్యమునఁ బ్రయత్నించుట యించుక తెలివిచాలమి ననవలసివచ్చినందులకు విచారించుచున్నాఁడను. పాపానుభవమును మార్పనగునా? అనునది రెండవప్రశ్నము. పాప మనుభవించుకాలమున దానిని మాన్పఁ బ్రయత్నించువాఁ డెవ్వఁడుండును? తనకుఁ దానే గతికదా. కావున ముందు చేసికొనియున్న పుణ్యమే దానిని దగ్గింపవలయును. అది లేనిచో దానిని మాన్పఁజూచువాఁ డెవ్వఁడు నుండఁడు. భగవంతున కట్టియధికారము కలదు. సర్వ శక్తు లాయనవశమం దుండును గదా. ఇపుడు కర్మసిద్ధాంత మీవిషయమున నెట్లన్వయింపనగునో యరయుదము.

సాందీపని తొలిజన్మమునఁ బుత్త్రదుఃఖము నించుక యనుభవింపవలసినట్టి పాప మొనర్చెను. ఆయనపత్నియు నట్టిపాపమే చేసియుండును. ఆ రెండుపాపములు సమములు గాన వారికి దాంపత్య మొనఁగూడెను. సత్కుటుంబమునఁ బుట్టఁగల్గినంత మాత్రము పుణ్యముచేసికొన్న జీవుఁడొకఁ డాయింటఁ బుట్టును. వానిద్వారా మృతినొందఁదగు హేతువుగలవాఁ డొకఁ డుండును. దానిచెంత కీదంపతులశిశువును గారణాంతరముచేఁ దీసికొనిపోవుదురు. వాఁడు శిశువును జంపును అదియొక మహా సాహసకార్యమని వాఁ డూహించి తృప్తినొందియుండును గాని

దానిచేఁ దనకురాఁగలదుష్ఫలమును వాఁ డెఱుంగఁజాలఁడు. ఆశిశువు తనపాపఫల మనుభవింప నరకమున కరుగును. అనఁగా నొకనివలన నెంద తేయేకష్టముల ననుభవింపవలయునో వారి కందఱకు సంబంధము కుదురును. ఒక్కసూత్రమునకుఁ బుష్పములఁ గొన్నింటినిగూర్చినట్లు కర్మమే యేకరూపఫలము ననుభవింపఁగలప్రాణులకు నొక్కచో సంబంధమును గల్పించును. వీరందఱును గల్గినసంబంధమునుగూర్చి యాలోచింపక యానందించుచుందురు. బంధుత్వమనఁగా నిట్టిదేయని నమ్ముఁడు. ఎంతవఱ కాకర్మసంబంధ ముండునో యంతవఱకే యీసంబంధ ముండును. ఆవల క్షణమాత్రమున నది వీడిపోవును. వీడిపోవఁదగినకారణ మత్యల్పము. దృఢతరమగుబంధుత్వ మాయల్పకారణమున నశించును. ఈవిషయమును సదా యాలోచించుచుండిన దుఃఖము కలుగదు. మనము దీనినాలోచించు వాడుకగలవారము కాము. కావుననే బంధుత్వము విడిపోయినదే మిత్రుఁడు నశించెనే యని దుఃఖింతుము. ఈవిషయమునే శ్రీ శంకరభగవత్పాదులు,

"శ్లో. కా తే కాంతా కస్తే పుత్ర స్సంసారోఽయమతీవవిచిత్రః

కస్య త్వం వా కుత ఆయాతః కా మే జననీ కో మే తాతః."

అని వివరించిరి. ఎన్ని వేదాంతగ్రంథములు పఠించినను లోకానుభవమును గర్మసిద్ధాంతము తోఁల్చిచూచి దాని తత్త్వమెఱుంగకయున్న గ్రంథపఠనము నిష్ఫలము. ఒక్కయుదాహరణమును వినుఁడు. సముద్రగమనముచేయువా రెందఱో గలరు. ఒక్కదినమున సాగరజలముల మృతినొందఁదగువా రెల్ల నొక్కనౌకయందుఁ జేరుచుందురు. సాగరజలములఁ బడి కష్టమనుభ

వించి బ్రదుకఁదగువారు నందే చేరుదురు. ఇతరులకష్టమును జూచి దుఃఖమునుమాత్ర మనుభవింపఁదగువారు నా నౌక యందే కూరుచుందురు. నౌక బయలువెడలి కొంతదూరము పోవును. ఏచోట నీనౌకలోనున్నవారెంద తేయేజంతువుల నోటఁబడఁదగినవారో ఆజంతువు లేచోటనుండునో ఆచోటు చేరఁగనే నౌక మునుంగు. జలజంతువులు కొందఱ గ్రసించు. కొందఱు జలపాతమున దుఃఖించి ప్రాణభీతిననుభవించి పుణ్యశేషమున నెట్లో బ్రదుకుదురు. కొందఱా నౌకావయవములం బట్టుకొని జలముల స్పృశింపకయే జీవింతురు. వారాకష్టమును జూచి దుఃఖింతురు. వారిపాప మంతమాత్రమే ఫలము నీఁ జాలును. అం దేకష్టము ననుభవింపఁదగనివాఁడు వారితోఁ గూడి యానౌకలోఁ గూరుచుండి కారణాంతరమున నవి పయనము చేయకముందే దిగిపోవును. ఇందఱికర్మ మొక్కరీతిగా నుండునని యీ యుదాహరణముచే మనము నమ్మవలయును. సంఘాతమరణమన నిదియే కదా. ఇం దొక్కమాటయైనఁ గల్పితముకలదా యని యోజింపుఁడు. ఇట్లే కర్మసిద్ధాంతము గ్రంథపఠనమునఁగాక యనుభవముచేఁ దెలియుచున్నను గొంద ఱీవిషయమునుగూర్చి యోజింపరు. ప్రతిమనుజుఁడు దినదినము నాలోచింపఁదగినవిషయ మిదియే. దీని నాలోచించి తత్త్వ మెఱుంగకయున్న నుత్తరకాలమున మేలుపొందు నవకాశమే యుండదు.

ప్రకృతవిషయమున కీసిద్ధాంతము నమన్వయించునా యని యాలోచింతము. ఇందు విచిత్రకార్య మొక్కటియే యున్నది. మరల నరకమునుండి సాందీపనియింట మనుజశరీర

ములో నాజీవుఁడు వచ్చి చేరుటయనునదియే. తక్కినవన్నియుఁ గర్మసిద్ధాంతానుకూలములే కాని వేఱుకావు. ఆజీవుని కారణమునఁ బంచజనుఁడను రాక్షసుఁడు మ్రింగెను. యమునకుఁ బరాభవము కల్గెను. నరకఫల మేకాలమునకుఁ బూర్తియగునో ఆసమయమునకే బలరామ శ్రీకృష్ణులు పోయిరి. విడిపించిరి. భగవద్దర్శనమున నన్నిపాపములు హరించును గదా. తన్నామమే యట్టిదనఁగా సాక్షాద్దర్శనముమాట చెప్పవలసినదేమి? సకలకార్యముల నేవిధముననైనఁ జేయఁగలభగవంతుఁడు యమలోకముననున్న బాలకుని దెచ్చి గురువున కొసంగుట యొకవింతయు గాదు. అశక్యమగుపనియుఁ గాదు. అల్పకార్యమే. సృష్టిస్థితిసంహారములు క్షణకాలమునఁ జేయు సర్వేశ్వరున కొకబాలకుని బ్రతికించి గురువునకు సమర్పించుట యొకగొప్పకార్యము కాదని బుద్ధిమంతులు భావింతురు. కావున భగవంతుని నిశ్చలభక్తి భజించువారికి లభింపరానిఫలము లుండవనునీతి నీగాథనుండి గ్రహింపఁదగును. లీలామానుషవిగ్రహుఁ డీకృష్ణమూర్తియని సాందీపని యెఱింగెను. కావున శిష్యుఁడని భావింపక భగవంతుఁడు దర్శనమిచ్చి కృతకృత్యునిజేయ నరుదెంచెను. నాభాగ్యమే భాగ్యమని యాముని తలంచెను. కావున నచిరకాలమున నామునియొక్కయు నాయనకళత్రము యొక్కయుఁ గోర్కె లన్నియు ఫలించెను. తుదకు సాయుజ్యము కరతలామలకముగాఁ జూపట్టెను. శిష్యుఁడనియే భావించియున్నచో వారికి లభించునవి ప్రకాశముగల పాషాణములే గదా. కావున భగవంతుని నిశ్చలభక్తిని సేవించువారికి

సకలపురుషార్థములు లభించునని నమ్మవలయును. ఇఁకఁ దర్వాతి కథ నాలకింపుఁడు. ఇపుఁ డీరీతి భగవంతుని ధ్యానింపుఁడు.

శ్లో. కదావా కాళిందీకువలయదళశ్యామలతరాః
కటాక్షా లక్ష్యంతే కిమపి కరుణావీచినిచితాః,
కదావా కందర్పప్రతిభటజటాచంద్రశిశిరాః
కిమప్యంతస్తోషం దదతి మురళీకేళినినదాః. ౧ అ. ౨౬.

## పాండవుల వృత్తాంతము.

ఆర్యులారా! భూభారహరణచణమగు రూపమును భగవంతుఁ డీకఁ దాల్చును. కావున దానికనుగుణమగు ప్రవృత్తి సాగింప యత్నించును. అన్నిపనులు సాగుచుండఁగాఁ దాను సాక్షిమాత్రుఁడుగా నుండును. ఆవిషయమే తేటపడఁగలదు. ఆకథల నాలకింపుఁడు. నాల్గవప్రకరణమునందుఁ బాండవజననమును వ్రాసియుంటిని. అందుఁ బాండవుల కథలను వ్రాయక భగవంతునియవతారమునకుఁ దోడ్పడునంతభాగమును వ్రాసితిని. పాండవులు ద్రౌపదిని వివాహమాడుట యను భాగము వఱకు వ్రాసి నిలిపితిని. ఇఁక శ్రీకృష్ణావతారము పాండవుల ద్వారా ఫలమును గనవలయును. భగవంతుఁడు కారణము దుష్టమృతి కార్యము. పాండవులు సాధనభూతులు. ఈరీతిగా సాగుచున్న దిగదా యీ యవతారకథ. కావున దానిని శ్రద్ధమైఁ బఠింపుఁడు.

పాండవులు ద్రౌపదిని బెండ్లియాడి పాంచాలబలము సహాయభూతమై యుండఁగా శౌర్యవంతులను ప్రఖ్యాతి గాంచిరి. విదురుననుమతంబున ధృతరాష్ట్రుఁడు రాజ్యము చేయుచుండెను. పాండురాజు మృతినొందినపిదప భీష్మునిసాయము

విదురునినీతియుక్తిదనకుఁ బ్రాపుగాఁ జక్కనిమార్గమున రాజ్యమును బాలించుచుండెను. విదురుఁడు కేవల ధర్మపక్షపాతము గలవాఁడు. కావున నితనియాలోచనము ధర్మైకతత్పరముగా నుండెను. ఆతనిమాట జవదాఁటక ధృతరాష్ట్రుఁడు ప్రవర్తించుచుంట ప్రజారంజనమునకుఁ గొఱఁతలేక యుండెను.

ఆతనికుమారులు నూఱుగురును బరస్పరమైత్రి గలవారుగనే యుండిరి. దుర్యోధనుఁడు పుట్టువుఁదొట్టి పాండవులపై ద్వేషమూనియే యుండెను. దుశ్శాసనుఁ డన్నవలెఁ దానును బాండవద్వేషియై యుండెను. తక్కినసోదరులు తదాజ్ఞాప్రవర్తకులే యైనను బేరుపొందఁదగినవారు కారు. దుర్యోధనుసంపద యసమానము. అది యీకాలమునఁగూడ నుదాహరణముగఁ గైకొనఁదగినదిగ నున్నది. ఆదుర్యోధనునకుఁ దోడుగాఁ గర్ణుఁడుండెను. శకుని మేనమామ కాన నతఁ డల్లుని మాటల నాదరించుట స్వభావము. -ఈనలువు రొక్కమాటగాఁ బాండవులపైఁ గత్తులు నూఱుచుండిరి. కాని విదురు నను మఱిదాఁటని ధృతరాష్ట్రునిపాలనము కాన వారియాటలు సాగకుండెను. విదురుఁ డింతటి ధర్మాత్ముఁ డగుటకుం గారణము వినుఁడు. లోకమున ధర్మము విపరీతవృత్తివెలయుతఱి భగవంతుఁడు దాని నాపవలయునని సంకల్పించును. ఒకప్పుడు దండనముద్వారా అధర్మమును దొలఁగించి ధర్మమును నిలుపును. ఒకప్పుడు హితబోధముచేత ధర్మమును వృద్ధినొందించి యధర్మమును క్షీణింపఁజేయును. ఒకప్పుడు మనుజులు పరస్పరము మచ్చరించి యుద్ధములుచేసి చావఁగా ధర్మాత్ములు మిగులునట్లు చేసి ధర్మమును నిలుపును. ఇట్లు పెక్కుభంగుల నాయాయి

కాలముల ననుసరించి లోకమున ధర్మమును గాపాడుచుండును. ఇప్పటికాలమున నన్నిమార్గముల నవలంబించినఁగాని ధర్మము నిలువదని భగవంతునకుఁ దోఁచెను. కావునఁ దా నవతరించెను. ధర్ము నతరింపఁ జేసెను. యుద్ధముచేయఁగల వారినెల్ల నావిర్భవింపఁ జేసెను. అందు విదురుఁడు ధర్మునంశమున జగతిపైఁ బుట్టెను. ఆపుట్టుక మనకు ముఖ్యము. కావున దానిని నాల్గుమాటలుగ వ్రాసెదను.

## విదురుని యుత్పత్తి.

"న హి కారణం వినా కార్యస్యోత్పత్తిః" అన్నన్యాయము నిరంకుశము. దానికి మార్పుకలుగదు. ధర్మదేవత భూతలమున నవతరింపఁ గారణమొకటి యుండవలయుఁ గదా. కావున నాకారణము నెఱుంగవలయు. మాండవ్యనామక ముని కలఁడు. ఆముని దేశాటనముచేసి సకలతీర్థరాజములను సేవించి మహాత్ములగోష్ఠి జరపి కొంతకాలమునకు నొకనగరమునకు సమీపమున సాంద్రారణ్యమున నదీతీరమున నాశ్రమము కల్పించుకొని యందుఁ దపముచేయుచుండెను. ఆనిష్ఠ యద్వితీయము. కొంతకాల మీరీతి సాగెను. పూర్వజన్మకృత పుణ్యపాపకర్మము లనుభవమునకురాక తొలఁగునవి కావు. ఎట్టివారికైనను గర్మసిద్ధాంత మొక్కవిధమే గాని సామాన్య విశేషవిధు లిందులేవు.

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్."

అన్ననియమమునకు మార్పులేదు. ఒకపుణ్యకర్మముచేత నొక పాపకర్మము నశించును గదాయన్న నది సత్యమేయనవలయును. ఎట్లనఁగాఁ దెలియకచేసిన యల్పపాపకర్మములు జ్ఞానమునఁ

జేసిన యత్యుత్కటపుణ్యకర్మములచే నశించును. కాని యించు కయైన ఫలము నీయక నశింపవు. ఆఫల మనుభవమునఁ గనఁ బడదు. కాని యించుకగా ఫలము నొసంగును. కొన్ని ప్రమాణములు అత్యల్పపుణ్యకార్యమున నత్యుత్కటపాపకర్మములు నశించునని తెలియఁజేయును. రామనామము, మహాదేవనామము, ఒక్కమా రుచ్చరించిన నెన్నియో బ్రహ్మహత్యలు తొలఁగునని తెలియఁజేయు ప్రమాణవచనములు గలవు. అవి యసత్యములే కదా యని మాత్ర మనకుఁడు. అసత్యములు కావు. సత్యములాయన్న సత్యములు కావు. ఇదెట్లు? అన్న నించుక శ్రద్ధమై నాలకింపుఁడు. భగవన్నామ ముచ్చరింపక కామచారులై తిరుగువారికిగా నీవచనములు చెప్పఁబడినవి. వారిని సన్మార్గవర్తులనుగాఁ జేయవలయునన్న శక్యముకాదు. వదలిపెట్టుట సాధుమార్గము కాదు. వారిచిత్తమున ననంతవాంఛ లుండును. వా రెన్నియోపాపకార్యములు చేయుచుందురు. అట్టివారి కత్యల్పప్రయత్నసాధ్యమగు నొకసత్కార్యమును జెప్పి దాని కనంతఫలముకలదని బోధించిన నొకని మేషకాల మామూర్ఖుఁడు తత్పుణ్యకార్యమునఁ బ్రవర్తించును. దాన నాతఁడు చేసిన పాపకర్మములు చెడవనుట నిశ్చయము. ఐన నీయత్యల్పపుణ్యకర్మాచరణమునఁ బైజన్మమున నించుక భక్తి కుదురును. దాన నాజన్మమునఁ దొలిజన్మమునఁ జేసినన్ని పాపకర్మముల నొనరింపఁడు. తదనంతరజన్మమున భక్తి మఱింత దృఢపడును. దానఁ బాపకర్మముల నాచరింపక భగవదారాధనమునఁ దత్పరుండగును. దాన సత్సాంగత్యము దొరకును. దాన నిస్సంగుఁడగును. దానిచే మోహపాశములు తెగును. దానిచే జ్ఞానము

గలుగు. దానిచే నాతఁడు భగవత్కరుణాపాత్రుఁ డగు. దానఁ దరించును. ఇదియే యత్యల్పపుణ్యకర్మమున కత్యుత్కృష్టఫలము చెప్పుటకుం గలకారణము. పరమకారుణికులగు మహాత్ములు పామరులకుఁ దరణోపాయము నీరూపమున నుపదేశించిరి. ఈ పద్ధతినెఱుంగక యొక్క "రామ"నామమున కింతఫలమా. ఇన్ని బ్రహ్మహత్యలొక్కసారి "మహాదేవా"యన్న నశించునాయని కొందఱాక్షేపింతురు. అది మిగులఁ బొరపాటు. వారలించుక శ్రద్ధగలిగి యీసిద్ధాంతము నాలోచించిన జన్మమధ్యమమున మరల నిట్లాక్షేపింపరు. ప్రస్తుత కథవంకకు మరలుదము.

ఆ మాండవ్యమహాముని తపస్సుచేయుచు భగవంతు నాతపమున నారాధించుచుండఁగాఁ దొలిజన్మమునఁ జేసినపాప కర్మఫల మనుభవించుకాల మరుదెంచెను. ఆనగరమున రాజు నింటఁ జోరులు ప్రవేశించి ద్రవ్య మపహరించిరి. వారిని రక్షక భటులు పట్టుకొనఁ బ్రయత్నించిరి. కాని దస్యువులు పాఱఁ జొచ్చిరి. భటులు తోడన తవిలిరి. వా రడవులఁ జొచ్చిరి. రక్షకులు తమరు నడవులంజొచ్చి యెట్లో వారిని బట్టుకొనిరి. ఏక్షణమున భటులు దొంగలఁ బట్టుకొనిరో ఆక్షణమున మాండవ్యముని దుష్కర్మఫలము ననుభవించుకాలము వచ్చెను. కావున నొకచెట్టుక్రిందఁ దపముచేయు మాండవ్యుని భటులు దొంగయని భావించిరి. ఆమునిదుష్కర్మము వారినట్లు భ్రాంతులుగా నొనరించెనని గ్రహింపవలయు. మాఱువేషముననూని యీతఁడు తప్పించుకొనఁ జూచుచున్నాఁడని వా రూహించి దొంగలతోఁగూడ నాతనిం దీసికొనిపోయి ద్రవ్యమును దొంగల రాజున కప్పగించిరి. రాజు వారినెల్ల వధింప నాజ్ఞాపించి

మునిని గొఱ్ఱవేయ నాజ్ఞాపించెను. గ్రామమునకుఁ జెంత నెల్లరు రాకపోకలు చేయుతావున మాండవ్యుని గొఱ్ఱవేసిరి. అట్లుండియు నమ్ముని తన దుష్కర్మమునకుఁ బరితాపమందక భగవంతుని నేమఱక ధ్యానించుచుండెను.

కొంత కాలమిట్లు లాతని దుష్కర్మము ఫలము నిచ్చెను. ఆఫలమునకుఁ గొంతకాలమని నియమము కలదు కదా. దాని కవసానసమయము సమీపించెను. అత్తఱి మహాత్ములగుమును లరుదెంచి మునీంద్రా! నీకేల యిట్టి దుష్ఫలముగలిగెనని ప్రశ్నించిరి. ప్రాక్తనకర్మఫలమని యామాండవ్యుఁడు బదులు చెప్పుచు రాజునుగాని తన్నుఁ బట్టితెచ్చిన భటులనుగాని దూఱక తన కర్మమును నిందింపక భగవంతునిఁ బడఁదిట్టక శాంతముగా మాటలాడెను. వా రామహాత్ముని శాంతమును మెచ్చుకొనుచుఁ బోయిరి. ఆసంభాషణమును రాత్రులందుఁ దిరుగుచుఁ బురమును రక్షించుభటు లాలకించి వడివడిఁ బరుగిడి నిద్రపోవు రాజును మేల్కొలిపి యెఱింగించిరి. ఏలయనఁగా మాండవ్యునిదుష్కర్మము నశించినది. ఇఁక క్షణకాలమైన నతనికది ఫలము నీఁజాలదు. కాన సత్కర్మ మాభటులను బురికొలిపినది. వారు క్షణమైన నాలసింపక రాజునకుం దెల్పిరి. రా జామాటలకు భీతుఁడై యప్పుడ పరుగిడి యాకొఱ్ఱు తీయించి తనయపరాధమునకు క్షమార్పణము చెప్పుకొనియె. మౌని యాతనిపై నించుకయు నలుకఁజూపక రాజా! నాదుష్కర్మము నిన్నుఁ బ్రోత్సహించి నీద్వారా నా కీఫలము నొసంగినది. కర్తృత్వము నీకు లేదు. నీవు నిమిత్తమాత్రముగ నుంటివి. నీ వీకార్యముచేసితినని దిగులొందకుము. నాకర్మమే యిందఱిఁ బ్రోత్సహించి నాకీఫల

మును గల్పించినది. ఇపు డాఫలము ననుభవించు కాలము ముగి సినది. నిన్ను మరలఁ బ్రోత్సహించి నాకీబాధను నీవలననే తప్పిం చినది. దీనికి నేనును నీవును వగవఁ బనియుండదు. కర్మము బ్రహ్మస్వరూపము. దాని నారాధింపవలయునే గాని నిందింప రాదు. వలయునని చేసినపాపము లూరకపోవునా? అని జ్ఞాన ముపదేశించి యారాజు నాశీర్వదించి తనయిచ్చం బోయి తప మొనరించి కొంత కాలమునకు యమలోకమునకుం బోయెను.

ఏకాలమున ధర్మదేవత భూలోకమునఁ బుట్టఁజనునని భగవంతుఁ డూహించెనో ఆక్షణమున మాండవ్యముని యముని దర్శింపఁజనియెను. యముఁ డమ్మునిం బూజించెను. ఆగమనకారణ మడిగెను. మునియు ధర్మరాజా! నే నిట్టి దుష్ఫల మనుభవింప నేమిపాపముచేసితినో నీవలన నెఱుం గవచ్చితిని. దయమెయిఁ దెలుపుమా యని ప్రశ్నించెను. యముఁడు మునీంద్రా! నీ యెఱుంగని విషయము లుండునా? నన్నడిగితివి కావునఁ జెప్పెద వినుము. నీవు తొలిబాముున బాల్యమునందు నాడుకొనుచు నాయాటలయం దొక యాటగాఁ దూనికలను నల్పజంతువులం బట్టుకొని వాని తోఁకలకు ముండ్లు గ్రుచ్చి యవి బాధపడుచున్నను లెక్కిం పక యాడుకొని నీయుత్సాహము ముగియగనే వానిని వదలి తివి. ఆపాపఫలము ననుభవింపక తప్పునా? దానికి ఫలముగా నీవును గొంతకాలము గొఱుతవేయఁబడితివి. ఇది నీతొలిబా మునఁ గలవృత్తాంతము. అని బోధించెను. ముని కాగ్రహ ముదయించెను. ఏలన నతనితపస్సునశించి తద్ద్వారా లోకమున నొకనియమము కలుగవలయునని యీశ్వరుని యూహ. అది

మాఱునా? కావున నాధర్ముఁ డవనీతలమున నవతరింపఁగల శాపమునీయ ముని యూహించెను. ముని యిట్లు పలికెను.

ధర్మరాజా! నే నెఱుఁగనిధర్మములు లేవనుట నిక్కము. నే బాల్యమునఁ జేసినపాప మత్యల్పము. దానికిగా నింతటి ఫలము నాకుఁ గల్పించితివి. కావున నీకొక శాపమీయఁ దలంచితిని. లోకమున కొకయుపకార మొనరింతును. ఈ రెండింటికి నా తపస్సునొడ్డి పలుకుచున్న వాఁడను. పండ్రెండేఁడులు దాఁటు నంతదనుకఁ బురుషుఁడు బాలుఁడనఁ బరఁగు. వాఁడు చేసినకర్మములకుఁ బాపానుభవము కలుగదు. వానికితరులు హానిచేసినఁ బాతకు లగుదురు. ఇదియే నాచేసినమర్యాద. నీవు నా కింతదారుణఫలమును గల్పించితివి. కనుక శూద్రయోనిం బుట్టుకంగాంచుము. అని తనయిచ్చం బోయెను. యముండును విధివిహితం బిదికాఁబోలునని జగమున ధృతరాష్ట్రునింట దాసీపుత్త్రుండై పుట్టి సకలధర్మజ్ఞుఁడనం బ్రఖ్యాతింగాంచి లోకమునకు మేలుచేయుపాంటె ధృతరాష్ట్రునికడ మంత్రిగా నుండెను

ఇదియే విదురుని జన్మవృత్తాంతము. దీనఁ గలసారమును గథయందే వ్రాసితిని. కావున నిందలిసారమిదియని యిట వ్రాయను. కర్మసిద్ధాంత మెంత బలవత్తమమో యిందువలనఁ దెలియందగును. దుర్వాదములఁ గాలముపుచ్చిన లాభము లేదు. ఏక్షణమున మృతిగల్గునో తెలిసికొనఁజాలనిపుట్టువు గాంచితిమి. ఒక్కక్షణమును వ్యర్థముగాఁ బుచ్చినను మనబ్రదుకు వ్యర్థమగును. కావున భగవన్నామసంకీర్తనము నేమఱక చేయవలయును. దానికి ద్రవ్య మక్కఱలేదు. కాశీకి వెళ్ల నక్కఱ

లేదు. నియమ మక్కఱలేదు. శ్రద్ధయొకటియున్నఁ జాలును. దానినైన నాచరింపనిచో మనకు భగవంతుఁడొసఁగిన మనుష్య జన్మమును వ్యర్థము చేసినవార మగుదుము. కావున శ్రద్ధాళువుల మై భగవన్నామసంకీర్తనమున దినమునఁ గొలఁదిగడియలనైనఁ బుచ్చుట సముచితము. ఇఁకఁ బ్రకృతకథకు మరలుదము.

పాండవులు లక్కయింట మడియక బ్రదికి పాంచాలదేశ మున కేఁగి యొరులకు సాధ్యంబగు మత్స్యయంత్రమును సాధించి యోర్వక మార్కొనిన యరాతుల నోడించి ద్రౌపదిని వివాహమాడిరని ధృతరాష్ట్రునకు విదురుఁ డెఱిఁగించెను. ఆమా టలకెంతయుఁ జింతించి వారియభ్యుదయమును గోరి పాండు రాజు తనయందునిచిన ప్రీతివిశ్వాసములను దలంచి మహాదర మున సోదరపుత్త్రుల నైదుగురను రావించి సన్మానించి యుచిత రీతి నుండనియమించి తనపుత్త్రులంబోలె వారి నాదరించుచుం డెను. వారును గతమునకు వగవక హస్తినాపురమున సుఖ ముగాఁ గాలము గడపుచుండిరి. విదురుఁడు కర్ణ శకుని దుర్యో ధన దుశ్శాసనుల దుర్మంత్రఫలములు పాండురాజతనయులకుఁ దగులకయుండఁ గంటికిఱెప్పవలెఁ గాపాడుచుండెను. భీష్మాది కురువృద్ధులు ధర్మపక్షపాతము గలవారు. కావున దుర్యోధ నాదులపై నీసుపూనక పాండుతనయులయం దాదృతి గలిగి యుండిరి. సదా తోడునీడవలె శ్రీకృష్ణచిత్తము తదేకాయత్త మైయుండుట నెల్లరు వారి నాదరించుచుండిరి. దుర్యోధనా దులు తమ ప్రయత్నములన్నియు విఫలములగుటకుం జింతిల్లుచు నెవ్వరికిం దెలుప వలనుపడదు గాన మదిఁగుందుచుఁ జేయుఘన

కార్యము సాగనందులకుఁ జేతులు పిసికికొనుచు నేవిధముననైన ధర్మరాజాదుల సంహరించినఁగాని తమకు రాజ్యలక్ష్మి స్థిరముగాఁ దక్కదన్న యుమ్మలికంబున రహస్యముగా నాలోచించుచు, విదురుని నేమనను శక్తిలేక భీష్మాదులకుఁ దెలిసినఁ దమకేమి కీడుమూడునో యని సంశయించుచు నెట్లో కాలముఁబుచ్చుచుండిరి. విదురుఁడు వారి దురుద్దేశమునెఱింగియు నెఱుంగనివాఁడవోలె ధర్మరాజాదుల నేమఱక కాచుచుండెను. ద్రోణద్రౌణులు కృపాచార్యుఁడును బాండవపక్షపాతమూని యందును ధనంజయునియం దెక్కుడుమక్కువం జూపుచు ననేకాస్త్రరహస్యముల నతనికిం దెలుపుచునుండిరి. ప్రజలెల్లరు పాండవపక్షపాతముగలిగి వారికించుక దోసఁగుపొసఁగినఁ దమకే యది యొదవెననుకొనుచు వారిమేలు తమమేలుకంటె నెక్కుడుగాఁ గోరుచునుండిరి. కావునఁ బ్రతిక్షణము యుధిష్ఠిరునిమాట జనసమ్మతమై నీతియుతమై గురుజనాదృతిపాత్రమై భగవంతున కిష్టమై నిర్మలశీతాంశునిచంద్రికవోల్కి నొప్పుచు దినదినాభివృద్ధి నొందుచుండెను.

పాండవచరిత్రము మొదటినుండి వ్రాయుట కిది చోటు కాదు. కావున శ్రీకృష్ణచరిత్రమునకు సంబంధించు భాగములను మాత్రమే వ్రాయుదును. ఇందు నించుకపూర్వాపరవైషమ్యము లుండవచ్చును. శ్రీకృష్ణచరిత్రము ప్రధానముగాన దాని కనుగుణముగా వ్రాయుచుందును. కావున స్వల్పాపరాధములు క్షంతవ్యములు. ఇది పెద్దలకు విన్నవింప నక్కఱలేదు. నాపని కాన మనసు నిలువక విన్నవించితిని.

## శ్రీకృష్ణమూర్తి యక్రూరుని హస్తిపురికిఁ బంపుట.

* మధురానగరమునకు బలరామ శ్రీకృష్ణులు వచ్చిన కొలఁదిదినముల కొకనాఁడు అక్రూరునింటి కతనినొకపనికి నియమింపఁ బూనిపోయిరి. భగవదాగమనమున కక్రూరుఁడు కరము హర్షించెను. అంతకంటెఁ గోరఁదగిన మంగళ మేదియుండును? సకలకల్యాణము లాభగవంతుని యాగమనమునఁ గలుగఁగల వన్న నమ్మక మాతనికిం గలదు. కావుననే యుద్ధవ బలరాములం గూడి వచ్చుచున్న శ్రీకృష్ణమూర్తిని జూచినంతన యాతనిమది పరవశ మయ్యెను. ఆనందరసము మది నిముడఁజాలక పొంగి పొరలాడెను. పైకుబ్బి వెలికిఁబోవఁ బ్రయత్నించెను అక్రూరుఁడు పరమభక్తుఁడు. సాధుపుంగవుఁడు. కరుణారసభరితాంతఃకరణుఁడు. ఆకస్మికముగా నవ్యాజప్రేమమున వారరుదెంచుట తనపూర్వజన్మార్జిత సుకృతఫలమని యతఁడు భావించి యెదురేగెను. మహానుభావులారా! దయచేయుఁడు. నా జన్మము ధన్యమయ్యెను. కృతకృత్యుఁడ నైతిని. కరుణించినదే పదికోట్లు. దయచేయుఁడీ యని ప్రార్థించెను. వారు నక్రూరునింటికిం జనిరి. యథార్హాసనములఁ గూరుచుండుఁడని యతఁడు వినయమున వేఁడెను. [1]అయక్రూరునకు వారు మువ్వురు నమ

* ఈచరిత్రము శ్రీభాగవతము దశమస్కంధము నలువదెనిమిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

[1] ననామ రామం కృష్ణం చ సతైరభ్యభివాదితః, పూజయామాస విధివత్కృతాసనపరిగ్రహాన్ = అని మూలము. చకారముచే నుద్ధవునకు నమస్కరించెనని గ్రహింపవలయు. తైరభ్యభివాదితః = అనుచో తైః = అను బహువచనము వ్యర్థమగుచు.

స్కరించిరి. అక్రూరుఁడు వారికి నమస్కరించెను. పరస్పరాశ్లేష మర్యాదలు సాగెను. అందఱు యథోచితపీఠముల నుపవిష్టులైరి.

పిదప నక్రూరుఁడు వారికిఁ బాదప్రక్షాళనము చేసి తజ్జలంబులు శిరస్సున నునుచుకొని మనోహరామూల్యవస్త్రములు వారికిం గట్టనిచ్చి చందనములంది కుసుమదామముల వారి నలంకరించెను. మఱియు భక్తిరసంబున శ్రీరామకృష్ణుల పాదారవిందములను దనతొడపై నిడుకొని మృదుతరముగఁ బిసుకుచు మధురభాషణంబుల నిట్లనియెః మహాత్ములారా! అనుచరులతోడఁ గంసుఁడు మీచే వధింపఁబడియె. ఎన్నటికైన యీ కులకష్టములు నివర్తించునా యన్నవన్నియుఁ దొలఁగెను. కులము వర్ధిల్లెను. మీరు జగత్కారణులు, పురాణపురుషులు, ప్రధానపూరుషులు. జగన్మయులు. మీకు గడచిన గడువనున్న కార్యకారణములు లేవు. ఈప్రపంచమును సృజించితిరి. మీరే ఆత్మశక్తులం బ్రవేశించి శ్రుతిప్రత్యక్షగోచరముగా ననేక ప్రకారముల మీర లగపడుదురు. పంచభూతములు చరాచరభూతములయందు వర్తించుచు నానాపద్ధతులఁ గనఁబడుచుండునట్లు ఆత్మకారణకంబులగు భూతభౌతికంబులయందు నాత్మస్వరూపులగు మీరు స్వతంత్రులరై బహుప్రకారముల భాసిల్లుచుందురు. అని వినుతించి మఱియు నిట్లనియె.

శ్రీకృష్ణా! పరమాత్మవు నీవే. రజస్సత్వతమస్సు లాత్మగుణములు. వానిచే జగమునుబుట్టించి బోషించి సంహరింతువు. కాని యాత్మగుణములగు నా రజస్సత్వతమస్సులకుఁ గాని, వానికర్మములగు సృష్టిపాలనాసంహృతులకుఁ గాని నీవు బద్ధుఁ

డవు గావు. నీవు కేవల జ్ఞానాత్ముఁడవు. అట్టినిన్ను బంధకార ణంబైన యవిద్య చేరరాదు. దేహాద్యుపాధియోగము మిథ్యా పదార్థము. కావున జన్మము, అది మూలముగాఁ గలభేదము పరమాత్ముఁడవగు నీకు లేవు. అట్లగుటంజేసి బంధమో క్షములు పారమార్థికములు గావనుట నిశ్చితము. ఆ బంధ మోక్షములు పరమాత్మవగు నీకును గలుగుననువాదము నీ తత్త్వమెఱుఁగని యజ్ఞానమునకు గుఱుతుగాని వేఱుగాదు. దుర్వృత్తులగు పాషండులు సనాతనమై శాశ్వతమునగు వేద మార్గమునకు దాని నవలంబించు సాధువులకుఁ గీడుసేయ నెప్పుడు ప్రయత్నింతురో అప్పుడు లోకహితము చేయఁబూని నీవు సత్వగుణము నాశ్రయించి యవతరింతువు. * ఇది నీవు మున్ను చెప్పినమాటయే గాని నాకల్పించినది కాదు.

రాక్షసు లనేకులు మిషచే భూమియందుఁబుట్టి సాధు వుల బాధింపఁగా వారిం బొలియించి యీ మహత్తరభూభార మును దీర్చ నిర్మలకీర్తి వెలయుచుండ యదువంశమున నీతరు ణమున వసుదేవునింట నవతరించితివి. వామనావతారమునందుఁ బాదప్రక్షాళనోదకంబుల మూఁడులోకములఁ బావనములుగా నొనరించితివి. జగద్గురుండవు. దేవపితృభూత నరదేవమూర్తివి. అట్టి పరమపురుషుఁడవగు నీవు కరుణారసముపెంపున మాయిం టికి వేంచేసితివి. ఈశ్వరా! మా యీగృహములు పావనము లయ్యెను. భాగ్యవంతము లయ్యెను. సదా నిన్నేనమ్మి భక్తులు

---

* త్వమాదితోఽయం జగతో హితాయ యదా యదా వేదపథః పురాణః, బాధ్యేత పాషండపథైరసద్భిస్తదా భవాన్ సత్వగుణం బిభర్తి= అని మూలము.

సేవింతురు. అట్టిభక్తులకు సర్వకామముల నొసంగుటయే కాక నిన్నే యిత్తువు. అట్టి మహావాత్సల్యముగల నిన్నుమాని జ్ఞాని యగువాఁ డెవ్వఁడు మఱొకని శరణమని యాశ్రయింపఁ బూనును? భక్తరక్షణబిరుదాంచితుఁడవు కదా నీవు. యోగీశ్వరులుగాని సురేశ్వరులుగాని నిన్నుఁ గనుఁగొనఁ జాలరు. అట్టి నీవు నా పూర్వపుణ్యవశమున మాగృహములఁ బావనములుచేయ నరుగుదెంచితివి. పుత్త్రులని, దారలని, సుహృదులని, విత్తములని, దేహములని, గేహములని, యింక ననేక పదార్థములని మమ్ము మాయ యావరించి వానియందు వ్యామోహము పుట్టించియున్నది. ఈమాయ మాబోంట్లకుఁ దొలఁగింప శక్యము కాదు. కావున నీమాయను దొలఁగించి కృతార్థులమగునట్లు కరుణింపుము. ఇంతకంటెఁ గోరఁదగినవాంఛ నాకు వేఱొండు లేదు. అని మఱియుఁ బెక్కుభంగుల వినుతించుచున్న పరమభక్తు నక్రూరు నాతనిం జూచి శ్రీకృష్ణుఁడు ప్రప్రథమమున మోహము గావించువానిచందమున మృదుమధురవాక్కుల నిట్లు వచించెను.

* అక్రూరా! మాకు నీవు గురుఁడవు. పినతండ్రివి. ప్రియబంధువవు. మేము మీచే రక్షింపఁదగినవారము. దయయునుపఁ దగుదుము. ఇంతేల? మీబిడ్డలము. మమ్మింత గొప్ప సేయనేల? శ్రేయస్సు పడయఁగోరుమానవులు మీవంటి పరమపూజ్యులగు భాగవతులను సేవింపవలయును. సాధువులు దేవత

---

* త్వం నో గురుః పితృవ్యశ్చ శ్లాఘ్యో బంధుశ్చ నిత్యదా, వయం తు రక్ష్యాః పోష్యాశ్చ అనుకంప్యాః ప్రజాహి వః=అని మూలము.

లెట్లు స్వార్థపరులు కారో యట్లు స్వార్థమును గోరువారు కారు. * జలమయములగు తీర్థములు, మృణ్మయములు శిలామయములు నగువిగ్రహములతో నమర్పఁబడినదేవతలు తమ్మాశ్రయించినవారిని బవిత్రులనుగాఁ జేయఁ బూనరనరాదు. తీర్థములు మృచ్ఛిలావిగ్రహములుగల దేవతలు చిరకాలమునకుఁ బవిత్రులనుగాఁ జేయుదురు. సాధువులు దర్శనమాత్రంబున నే భక్తులగు వారిని బరిశుద్ధాంతఃకరణులనుగాఁ జేయుదురని యెఱుంగుము. నీవో సాధువులలో నగ్రగణ్యుఁడవు. కావునఁ బరోపకారమునకే పాటుపడువాఁడవు. అట్లగుటం జేసి మాకు శ్రేయము నొడఁగూర్పఁపనియందుఁ బ్రవర్తింపఁ గలవాఁడవు. సుహృదయుఁడవు.

ఇపుడు హస్తిపురమునకుఁ బోవవలయు. మాకుఁ బాండుతనయులు బంధువులని యెఱుఁగుదువు కదా. వారికుశలం బెఱిఁగి రమ్ము. ఆ పాండురాజతనయులు తండ్రి తమ చిన్నవయస్సునందే చావఁగా బలుబాములంబడి పెద్దతండ్రియగు ధృతరాష్ట్రుఁడు రావింపఁ దల్లియగు కుంతీదేవితోడ హస్తినగరమునకు వచ్చియున్నవారనియు, ధృతరాష్ట్రుఁ డంధుఁడౌటఁ గుత్సితులగు తనకొడుకుల యనుమతంబునఁ బ్రవర్తించువాఁడు గావున వారిని జక్కఁగా నాదరింపక యున్నవాఁడనియు నొక

---

* నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః, తే పునంత్యురుకాలేన దర్శనాదేవ సాధవః=అని మూలము. అమ్మయాని తీర్థాని మృణ్మయాశ్శిలామయాశ్చ దేవా నపునంతీతి న. అపి తు పునంత్యేవ. తథాపి సాధూనాం తేషాం చ మహదంతరమిత్యాహ. దర్శనాదేవ తే పునంతీతి. అని వ్యాఖ్య.

వార్త శ్రుతిగోచర మయ్యెను. ఈవార్త సత్యమా. లేక కల్పి తమా. వారివృత్తమం దిపు డెట్లున్నది. అను నీవిషయములఁ జక్కఁ గనుఁగొని రమ్ము. నీవు తెలుపఁగా వారికేమేని సాయము చేయు నవసరముకల్గినఁ జేయంబూనుదము. అది మనకుఁ గర్తవ్యము కదా. పాండునందనులు సుహృదయులు. దయనీయులు. ధర్మమార్గతత్పరులు. కాఁబట్టి యిప్పని నీవిపుడు త్వరగాఁ జేయవలయును. అనిపలుక నక్రూరుఁడు మహాత్మా! నీ యనుమతిచొప్పునఁ బ్రవర్తించెద. ఇపుడే ప్రయాణ మయ్యెద. అచ్చటి వార్తనెల్ల నరసివచ్చి తమసన్నిధి విన్నవింతును. అనిపలుక నతని మన్ననలకుఁ బ్రీతులై యుద్ధవబలదేవులు శ్రీహరియుఁ దమ గృహమున కరుగుదెంచెను.

ఆర్యమహాశయులారా! ఈకథనుండి యెఱుఁగఁదగిన విషయములు లేవని తోఁచునుగాని యపూర్వవిషయ మొక్కండుగలదు అక్రూరుఁడు పరమభక్తుఁడు. శ్రీకృష్ణమహిమము నెఱింగినవాఁడు. కావుననే శ్రీహరి తద్గృహమునకుఁ బిలువఁబడకయే పోయెను. భగవంతునకు భక్తి నిర్మలహృదయుల యిండ్లు నివాసార్హములుగాని భక్తివిరహితులగృహములు చేరరానివే యనవలయును. అక్రూరునింటికిఁ బోఁగా నాతఁడు తనతపస్సు ఫలించెనని సంతోషించెను. వినుతించెను. ఇంతదనుకఁ గలకథాభాగము సామాన్యవిషయము. శ్రీకృష్ణుఁ డక్రూరునితో మాటలాడుపట్టున నొక్కవిశేషము కలదు. అదియే మనమెఱుంగఁదగిన యపూర్వవిషయము. తీర్థములు జలమయములు. దేవతలు మట్టిచేతనో శిలలచేతనో చేయఁబడుదురు. వారు పవిత్రులనుగాఁ జేయుటకుఁ జాలకాలము పట్టును. సాధు

వులు దర్శనమాత్రమునఁ దమ్మాశ్రయించువారిని బవిత్రుల నుగాఁ జేయుదురు. అను నీ వాక్యామృతమును బరిశీలింపుఁడు. దేవతావిగ్రహములఁ బూజించుటకంటెఁ దీర్థస్నానము చేయుట కంటె సాధువుల సేవించుటయే ముఖ్యమనికదా దీనిసారము. అట్లైనఁ దీర్థములసేవించుట, దేవాలయములఁ గట్టించి యందు విగ్రహములఁ బ్రతిష్ఠించుట, మృత్తికచే శివలింగమును జేసి పూజించుట వ్యర్థమనియుఁ దోఁపవచ్చును. సాధువు లేయూరి కైనఁ బోవుచుండ మన మేపనికైనను బోవుచుండి యొక్క మాఱు దర్శించినంతనే పవిత్రుల మగుదుము. ఏకష్టములేక యింతపుణ్యము లభించును. ఇంతసులభమగు నుపాయము దొరకఁగా నింక శ్రమంపడనేల? అని యూహించుట పొర పాటు. ఏలయనఁగా సాధుదర్శనమునమాత్రము పవిత్రుఁడు కాఁజాలఁడు. తీర్థస్నానము శీఘ్రఫలప్రదము కాకపోదు. మృచ్ఛి లావిగ్రహములఁ బూజించుటయు వ్యర్థము కాదు. ఈశ్లోకము సాధుదర్శనము తప్పక చేయఁదగినదను నియమమును బోధిం చునది యని మనము గ్రహింపవలయును. దీనిసార మేమనఁగా, గంగాస్నానము చేయఁబూని దూరదేశమునకుఁ బోయి యందు మునిఁగి భక్తితో నాగంగను భగవత్స్వరూపముగా భావిం చిన సకలపాపములు తొలఁగును. మృచ్ఛిలావిగ్రహముల సర్వ వ్యాపకుఁడగు భగవంతుఁ డీరూపమున వెలసెనని భావించి పూజించినఁ బవిత్రుఁ డగును. సర్వదేవతాస్వరూపుఁడు. సర్వాం తర్యామియు నగు పరమేశ్వరుఁడని యేవిగ్రహమును భావించి పూజించినను బాపములు తొలఁగును. మహాభక్తుఁడు సకలతీర్థ యాత్రలుచేసి సకలదేవతలఁ బూజించినవాఁడు కావున నాతనిం

జూచి తత్సహవాసమునఁ గొన్నిధర్మముల నెఱింగి యశ్లే ధ్యానతత్పరుఁడైన సకలసిద్ధు లొనఁగూడు. ఇందుఁ దారతమ్య ములు లేవు. చాలకాలమునకుఁ దీర్థములు విగ్రహములు ఫల మునిచ్చునని చెప్పుట యేలయనఁగా వినుఁడు. గంగాదేవి విష్ణు పత్ని శాపవశమున మర్త్యలోకమున నదీరూపమును దాల్చెను. అను నీకథను మదియందిడుకొని స్నానమాచరింప నీతనిభక్తిచే వశీకృతయై గంగాదేవి యాకారమునుదాల్చి ప్రత్యక్షమగు టకుఁ జాలకాలము పట్టును. రామవిగ్రహమును బూజించిన రామావతారము ముగిసి చాలకాలమయ్యెఁ గావున నీతనిభావ నచే విష్ణుమూర్తి రామరూపమునఁ బ్రత్యక్షమగుటకుఁ జాల కాలము పట్టును. ఈయర్థము మనసుననుంచుకొనియే యీశ్లో కము చెప్పఁబడియెనని యూహింపఁ దగును. సాధువులు పరిప క్వచిత్తులు గావున భగవత్సేవాఫలము ననుభవించియుందురు గాన వారిని దర్శించినంతనే ఫలము కలుగుననఁగా నంతమా త్రమునఁ గాదనియుఁ దదుక్తరీతిఁ బ్రవర్తించినఁగాని పవిత్రుఁడు కాఁడనియు గ్రహింపవలయు. ఇదియే సారము. సాధువు లెవ్వ రోయని ముం దెఱుంగవలయు. అన్నివిధముల నెఱుంగఁదగు జ్ఞానము కుదురవలయు. కావున జలములను విగ్రహములను సాధువులను భగవత్స్వరూపులని భావించి దర్శించినంతనే పవి త్రతగలుగునని యిందు గ్రహింపఁదగిన నీతి. ఈవిషయమునే శ్రీహరి వెల్లడించెను.

"అహం కాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహం,
ఇతి బ్రువాణస్సతతం కాశీవాసఫలం లభేత్."

అను నారోక్తి కలదుకదా. దీనిభావ మేమి? మనస్సున దృఢ

ముగ భావించుటయే ప్రధానమని కాదా. జ్ఞానముగలిగి నదిని భగవత్స్వరూపముగా ధ్యానించిన నచ్చటికింబోయి స్నానము చేసిన పుణ్యము కలుగును. కావున భక్తి పూర్ణభావనయే ప్రధానముకాని భక్తిహీనముగాఁ బూజించుట నిష్ఫలమని యెఱుంగవలయునని యీ భగవదుక్తినుండి గ్రహింపఁదగిన నీతి. ఇఁక దీనిమీఁది యవ్వలివిషయమును వ్రాసెదను.

## శ్రీకృష్ణననుమతంబున నక్రూరుఁడు కరిపురి కరుగుట.

* అక్రూరుఁ డంతట శ్రీకృష్ణునాజ్ఞ శిరసావహించి కౌరవేంద్రుల కునికిపట్టయి వారియశస్సుచేఁ బ్రకాశించుచు భూతలంబునఁ దనకునీడగు పురవరం బెదియైనఁ గలదేయను గర్వమున విఱ్ఱవీఁగున ట్లుల్లసిల్లుచు ననన్యసామాన్యభాగ్యంబునఁ దేజరిల్లుచున్న హస్తిపురంబునకుం బోయెను. అందుఁ దొలుదొలుత ధృతరాష్ట్రమందిరంబున కరిగి యవ్వల భీష్మునిగేహము నకుం బోయి పిదప విదురుసదనంబునకుం జని తరువాతఁ గుంతీదేవి సద్మమున కరిగి మఱియు బాహ్లీక సోమదత్తుల నిశాంతములకును, ద్రోణ ద్రౌణి కృపాచార్యుల యాలయములకును, గర్ణ దుర్యోధనుల సౌధంబులకును, బాండవుల నివాసంబులకును, దక్కుంగల సుహృజ్జనుల ధిష్ణ్యంబులకును, మఱియును బ్రియబంధువుల వేశ్మములకును బోయి వారల యాదృతింబడసి యుచితరీతుల వారితో సంభాషించి కుశలప్రశ్నాదుల వారిమదుల నుల్లసిల్లంజేసి యం దుండెను.

---

* ఈకథ శ్రీభాగవతము నలువదితొమ్మిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁ బడినది.

ధృతరాష్ట్రాదులు మున్నే యక్రూరుని యశస్సెఱుంగుదురు. కావున నాతనికిం దగువిధంబుల మర్యాదలు నడపిరి. పదంపడి యక్రూరుఁ డవ్వీట ధార్తరాష్ట్రులదుర్వృత్తం బెఱుంగందలంచి కొన్నినెల లుండెను. అందు దుర్వృత్తుల ననుసరించుచు వారిమర్మముల నెఱుంగుచు దుష్టచిత్తుఁడై యల్పసారముగలిగియున్న ధృతరాష్ట్రుని చరితం బరయుచు నుండెను. విదురాదులసచ్చరితంబును బాండుకుమారులపై భీష్మద్రోణాదులకుం గలయనురాగంబును, ధర్మరాజాదుల ప్రతాపంబును, వారి శస్త్రాస్త్రనైపుణ్యంబును దెలిసికొనియెను. పాండునందనులధైర్య మపారమనియు, వారి వినయాదిసద్గుణములు పొగడ్తగాంచునవి యనియుఁ, బ్రజలకు వారిపై యనురాగంబు గలదనియుఁ దెలిసికొనియెను. ధార్తరాష్ట్రులు పాండుపుత్త్రుల యున్నతికినోర్వక వారికిం జేయించిన విషప్రయోగాదులఁ జక్కనెఱింగెను. కుంతియు విదురుండును ధార్తరాష్ట్రులు చేయుచున్న దుశ్చేష్టలఁ దెలిపిరి.

అంతఁ గుంతి యక్రూరుఁ డున్నగేహమున కరిగి యొకనాఁడు తన పితృగృహచరిత్రములనెల్లం దలంచుకొని కటకటంపడి కన్నీరుమున్నీరుగా నేడ్చి యతఁ డాశ్వాసింప నించుక యూఱడిల్లి యిట్లు పలికెను. సాధుమతీ! తల్లిదండ్రులు, నన్నదమ్ములు, సోదరీమణులు, భాగిత్రుపుత్త్రులు, కులకాంతలు, సుహృదులు, మమ్ముఁ దలంతురా? సర్వజనశరణ్యులు భక్తవత్సలులు నగు మా యన్నకొడుకులు రామకృష్ణులు తమ మేనమత్తకొడుకులు కరినగరంబున నున్నవారు. గదాయని యెప్పుడేఁ దలపోయుదురా? వృకములనడుమఁ జిక్కుపడిన హరిణశాబ

కములవలె హితశత్రువుల నడుమ నుండఁజాలక సకలదుఃఖముల ననుభవించు నన్నును దండ్రి లేని యీ నాకొమరులను శ్రీకృష్ణుఁడు తనమృదువాక్కుల నెన్నఁడైనఁ గుశలముగ నున్నవారా యని పలుకునా? అని పలుకుచు నంతలోఁ దనకుఁ దోఁచిన భక్తిభావంబున హరిం గూర్చి శ్రీకృష్ణా! శ్రీహరీ! మహాయోగీ! విశ్వాత్మా! విశ్వభావనా! కృపాకరా! ఈశిశువులతోఁ గష్టపరంపరలకుఁ జిక్కి వానినెల్లో యనుభవించుచు నిన్నే యాశ్రయించిన నన్నుం గాపాడుము. ఈసంసారము మృత్యుభూతము. దీనిబాధలకు వెఱచువారికి నీవే శరణ్యుఁడవు. ఈశ్వరుఁడవు. నీ పాదారవిందములు ముక్తిప్రదములు. అట్టి నీపాదపద్మములకంటె వేఱొక్కశరణము నాకుఁ జూపట్టదు. ధర్మాత్ముఁడవు. అప్రమేయుఁడవు. పరమాత్ముఁడవు. అణిమాద్యష్టైశ్వర్యయుక్తుఁడవు. జ్ఞానాత్మకుఁడవు. అట్టి నిన్ను దిక్కని నమ్మియున్న దానను. వేఱొకరిని నమ్మినదానం గాను. నీవే రక్షకుఁడవని నమస్కరించుదానను. అని తనబంధువులను విశేషించి సకల బ్రహ్మాండనాయకుఁడగు శ్రీకృష్ణుని దలంచుకొని పృథాదేవి పలవించెను.

విదురుఁ డందున్నవాఁడు కావున నాతఁడు నక్రూరుఁడు తత్సమదుఃఖమునుగని యామెసుఖమును గోరువారు కావున నమ్మా! నీకుమారులు దేవతాంశసంజనితులు కాని సామాన్యులు కారని వారిజన్మప్రకారంబు స్మృతికివచ్చున ట్లొనర్చి కుంతీదేవి నించుక యూఱడిల్ల నాశ్వాసించిరి. వారిహితాలాపముల కించుక సంతసిల్లి తనమదిం గల దుఃఖమును నించుక తగ్గించుకొని తనకొడుకులు శ్రీకృష్ణానుగ్రహపా

త్రులే యను నావిదురాక్రూరుల భావమెఱింగి కష్టములు గట్టెక్కఁ గలవన్ననమ్మిక గల్గియుండెను. ఇట్లు కరిపురంబున నక్రూరుఁడు కొన్నిమాసములుండి యాయాయివిషయముల నెఱింగెను. పాండవులపైఁ బన్ను ధార్తరాష్ట్రుల కృత్రిమోపాయముల నెల్లఁ దెలిసికొనియెను. శ్రీకృష్ణున కవియెల్లఁ దెలుపఁదగునని ప్రయాణముచేయ నూహించెను ఒక్కనాఁడు దుష్పుత్రప్రేమంబునఁ దదనుమతంబున వర్తించు నాంబికేయునొద్దకుంబోయి సద్హృదయులందఱు వినునట్లుగా బంధుమర్యాదం బాటించి హితమితోక్తులలర నిట్లనియెను. విచిత్రవీర్యకుమారా! కౌరవకీర్తివర్ధనా! నీతమ్ముఁడగు పాండురాజు పరమపదమునకుం బోయినపిదప నీవు రాజాసనమున నెలకొంటివి. ధర్మమున భూమినంతయుఁ గాపాడుచున్నవాఁడవు. సాధువర్తనమునఁ బ్రజల కనురాగము గల్గఁజేయుచున్నాఁడవు. బంధువులయెడ సమత్వవర్తనము నడపుచున్నాఁడవు. ఇట్లుండుటంబట్టియే యింతకాలము రాజ్యము సుఖముగాఁ బాలింపఁబడుచున్నది. కాని కొన్నివిషయములయందు సుంత లోపమున్నట్లు నుడి వినఁబడియెడిని. పైవిధములఁ బ్రవర్తింపకున్నఁ దప్పక దూఱు కలుగును. అది రాకుండఁ బ్రవర్తింపుము. పాండురాజతనయులను నీతనయుల నొక్కవిధముగా భావింపుము. రాజేంద్రా! ఈలోకమున నెవ్వరికింగాని యెవ్వరితోడను నిత్యసహవాసము తగదు. విశేషించి పలుకనేల? తనదేహముతోడనే తనకు నియతస్థితి కలుగదని శాస్త్రములు ఘోషించుచుండ నిఁకఁ బుత్ర జాయాప్రభృతులమాట యిటఁ జెప్పనేటికి?

అంబికేయా! నిక్కంబారయుము. * లోకమునఁ బ్రాణి తానొక్కండే జన్మించు. ఒక్కండే మృతినొందును. ఒక్కఁడే సుకృతమునో దుష్కృతమునో యొనరించును. ఒక్కఁడే ఆ సుకృత దుష్కృతములఫలము ననుభవించును. అంతియకాని యీవిషయములయం దెవ్వరుగాని తోడు రాఁజాలరు. ఒక్క మనుష్యుఁ డెన్నియో యధర్మము లొనరించి ధనమార్జించిన దానిని బెక్కుమంది పుత్త్రులని భార్యయని బంధువులని యి ట్లనేకనామములం బూని యనుభవింతురు. చేఁపలకుఁ బ్రాణా ధారభూతములగు జలముల నెన్నియోమత్స్యము లామడువుం జేరి యనుభవించుట కానఁబడును గదా. † అధర్మమున కింత యైన జంకక పలుభంగుల శ్రమమునకులోనై ద్రవ్యము సంపా దించి దానిచేత నజ్ఞానవశంబున భ్రాంతినొంది పుత్త్రులని భార్య యని యింకనెన్నియో సంబంధములఁ గల్పించుకొని తాను బోషించినచో నాపుత్త్రులు భార్యయు నర్థములు ప్రాణములు ప్రాప్తభోగుఁడగు నా యజ్ఞానమండితుఁ డగుపురుషునిఁ బా యును. ద్రవ్యము సంపాదించునిమిత్తము తాను బెక్కు పాపము లొనరించి యా యన్యాయార్జితవిత్తంబుచేఁ బుత్త్రా

---

* ఏకః ప్రసూయతే జంతు రేక ఏవ ప్రలీయతే, ఏకోనుభుంక్తే సుకృతమేక ఏవచ దుష్కృతమ్, అధర్మోపచితం విత్తం హరంత్యన్యేఽల్ప మేధసః, సంభోజనీయాపదేశై ర్జలానీవ జలౌకసః = అని మూలము. జలౌక సో మత్స్యస్య జీవనభూతాని జలాని యథా తత్పుత్రా హరంతి తద్వదితి భావః = అని శ్రీధరాచార్యులు.

† పుష్ణాతి యా నధర్మేణ స్వబుద్ధ్యా తమపండితం, తే కృతార్థం ప్రహిణ్వంతి ప్రాణారాయ స్సుతాదయః = అని మూలము.

దులను బోధించి తుదకు వారెల్లఁ దన్ను వదలిపెట్టఁగా నే సహాయములేక పరమార్థమేదియో యెఱుంగక యసిద్ధసంకల్పుఁడై స్వధర్మవిముఖుఁడై తుద కామూర్ఖుఁడు దుస్తరములగు నరకకూపములం బడును. కాఁబట్టి యో రాజేంద్రా! యీ ప్రపంచమంతయు స్వప్నమాయామనోరథమని యూహించి తన్నుఁ దానే నియమించుకొని యనఁగాఁ దనకృత్యమేదియో యేదిచేసినఁ దాఁ దరించునో నిశ్చయించుకొని పరమపురుషార్థమునకుఁ బ్రయత్నింపం దగు. నీవు నశ్వే లోకమెల్ల భ్రాంతికల్పితశాశ్వతతత్వమని నిశ్చయించి సర్వసముఁడవై శాంతిని మది నెలకొల్పవలయును. చక్కఁగా నీవిషయము నాలోచింపుము. పక్షపాతబుద్ధిని మానుము. అని నొక్కిపలుకు నక్రూరునిభాషణముల నాలకించి ధృతరాష్ట్రుఁ డాతని మనోభావ మెఱింగి యిట్లు పలికెను.

దానపతీ! మర్త్యున కమృతము లభించినచందమున నీవిపు డుపన్యసించిన యీ శుభంకరవాక్యామృతమును గ్రోలిన నామది తృప్తినొందదు. ఇంకను వినవలయుననియే యున్నది. సాధుమతీ! నామనం బిపుడు పుత్త్రానురాగమున విషమంబైనది. అట్టి నా చంచలచిత్తమునందు నీసుభాషితము మెఱపుఁదీఁగవలె నిలుకడఁ గాంచకున్నది. * ప్రకృతము భూభారము దుర్భరమైనది. దానిని హరింప యదుకులమున భగ

---

* ఈశ్వరస్య విధిం కోను విధునో త్యన్యథా పుమాన్, భూమేర్భారావతారాయ యోఽవతీర్ణో యదోః కులే, యో దుర్విమర్శపథయా నిజమాయయేదం సృష్ట్వా గుణాన్ విభజతే తదనుప్రవిష్టః, తస్మై నమో దురవబోధవిహారతంత్రసంసారచక్రగతయే పరమేశ్వరాయ = అని మూలము.

వంతుఁ డవతరించినవాఁడు. ఆపరమేశ్వరుని నియమమును దాఁట నేపురుషునకు శక్యము గాఁగలదు? తదనుకూలముగాఁ గార్యములెల్ల సాగుచుండును. మార్పఁబూనినవి మార్పనోం దవని యెఱుంగుదును. భగవద్విధాన మిట్టిదని విమర్శింప శక్యము కాదు. అట్టిమార్గముచే నాత్మ మాయాయోగమున నీ జగమును బుట్టించి యందుఁ దాను జొరంబడి కర్మఫలముల వేలువేలుగా విభాగించి మనసుచే నూహింపనైన శక్యము గాని విహారమున నీసంసారచక్రమును ద్రిప్పుచు నానందించుచుండు పరమేశ్వరునకు నమస్కరింతును. ఇందు నాప్రయత్న మేమియు లేదని యెఱుంగుము. భగవదిచ్ఛానుసారము కార్యము సాగుచుండును. దీని కన్యథాత్వము గల్పింప శక్యము కాదు.

అనిపలుకు నాంబికేయుని యభిప్రాయ మెఱింగి యక్రూరుం డాతనిచేఁ బ్రయాణముచేయ ననుమతింబడసి మిత్రజనుల వీడుకోలుపడసి బంధువులయనుమతిచేఁ దరలి పాండవులకు జరగినవార్తల శ్రీహరికిం దెల్పువాఁడనని తెలియఁజెప్పి కుంతి నూఱడించి మధురాపురంబునకుఁ జనుదెంచెను. రామకృష్ణులా యక్రూరుని రాకం గోరుచుండిరి. కాన నాతఁడు రాఁగాఁ గుశలప్రశ్నపూర్వకముగా నచ్చటివృత్తాంత మేమని యడిగిరి. అక్రూరుఁడు వారితోఁ బాండవులవిషయమున ధృతరాష్ట్రుఁ డెట్లు ప్రవర్తించునదియుఁ, దా నతనితోఁ బల్కినపద్ధతియు, దానివిని యతఁ డొసంగినయుత్తరము, నితరులవలనఁ దా విన్న వృత్తాంతమును, గుంతీదేవి యాశయమును వదలకుండ విన్న

వించెను. అక్రూరుని పరిశీలనమునకు రామకృష్ణులు కరము హర్షించిరి.

ఆర్యమహాశయులారా! ఈయుదంతమున నించుక విశేషము కలదు. అది మనమెఱుఁగఁదగినదియే కాని వీటఁ బుచ్చఁదగినది కాదు. అక్రూరాంబికేయుల సంభాషణమును గమనింపుఁడు. పక్షపాతబుద్ధిమానుట న్యాయమనియు, దానఁ గీర్తి వాటిల్లదనియుఁ, బుత్త్రమిత్త్రకళత్త్రాదులకై పాటుపడి ధనము సంపాదించి పోషించినవారు తనకుసహాయులు కాఁజాలరనియు, నన్యాయమార్గమునకులోనై తా నార్జించిపోషించుట న్యాయము కాదనియు, నది తనమేలు తా నెఱుంగకపోవుటయే గాని మేలుగాదనియుఁ, దనమేలుకీళ్లకుఁ దానే కర్తగాని యితరులు కారనియు, నీసంసారము భ్రమమాత్త్రకంబే కాని యిందేమియు సత్యములేదనియుఁ, దనమేలు తా నెఱుంగక ప్రవర్తించువాఁడు మూర్ఖుఁ డనంబడుననియు నక్రూరుని యుపదేశవాక్యసారము. నీవు చెప్పినదెల్ల సత్యమనియు, నామనస్సు పుత్త్రానురాగమున సుస్థితిఁ గాంచకున్నదనియు, భూభారమును దీర్ప భగవంతుఁ డవతరించి యున్నవాఁడని నే నెఱుంగుదుననియు, భూభారమును దీర్ప యుద్ధము కావలయునని భగవత్సంకల్పమనియు, దానికి నాకొడుకులు పాండురాజతనయులు ప్రాపుగానున్నవారనియు, దీని నివారింప నెవ్వరికైన నశక్యమనియు, నీయుద్ధమూలమునఁగాని యీభూభారము తగ్గదనియు, దీనికి నన్నూరకదూఱి లాభములేదనియు, భగవంతునే యాశ్రయించి యంత్రముపోల్కి నే నున్నవాఁడఁ గాని స్వాతంత్త్ర్యము నాకేమియు లేదనియు ధృతరాష్ట్రుని యభిప్రాయసారము. ఈ

వాదమునుండి మనమేమి నేర్చుకొనఁ దగుననునదియే యిటఁ బ్రశ్నము. దాని నాలకింపుఁడు.

లోకమున నెందఱో తమకుఁ గీడుమూడఁ జేయుకార్యములను జేయుదురు. సజ్జనులు వారికి హిత ముపదేశింతురు. కాని యామాటలు వారికి హితములుగాఁ దోఁపకుండుటయే గాక చెడుగులుగాఁగూడఁ దోఁచును. అట్లుతోఁచుట వారి దుష్కర్మపరిణామమే గాని వేఱుగాదు. మనలోఁ గొంద ఱట్టి వారిని దూషింతురు. ఈ దూషించువారు తమరు జ్ఞానులనియే తలంచుకొనువారు కాని వారిదుష్కర్మము పలుభంగుల వారిని ద్రిప్పుచున్నదని తలంపరు. కావున వీరు నజ్ఞానులే యనవచ్చును. కర్మము ప్రాణులం ద్రిప్పుచుండును. దానికడ్డములేదు. భగవదుద్దేశము కర్మరూపముగనే యుండునని తలంపవలయును. ఈ విషయము తెలిసికొన్నవారు పరుల దూషింపరు. కొందఱు తమయుపదేశమును వినలేదని కోపపడుటయుఁ గలదు. వారు మఱింతమూర్ఖులు. వారికిఁ బురుషుఁడు కర్తకాఁడన్నమాటయే తెలియదు. తమకు సర్వము తెలియుననియే భావింతురు. కావుననే వారితరుల ద్వేషింతురని మనము నమ్మవలయును. ద్వేషించుటకంటెఁ బ్రేమించుట మంచిది. దానఁ గర్మసిద్ధాంత మెఱింగినవారమని యోగులెఱుంగుదురు. పరులపై ద్వేషమూనుట యనఁగా దుష్కర్మము తమరుకూడ నాచరించియున్నవారనియే భావము. కావున నతినీచమనందగు పరదూషణము చేయఁబూనుట కర్మోపహతుఁ డగునరుఁడు తనకుఁ గాఁగలకీడు నెఱుంగక మూర్ఖుఁడై కార్యమును సాగించుచుండఁగా నావిధ మెఱింగిన

జ్ఞానులు వారి నాక్షేపింపక చింతింతురు. ఆదుష్కర్మమును దొలఁగున ట్లనుగ్రహింపుమని శ్రీమన్నారాయణుం బ్రార్థింతురు. అంతియకాని దుష్కర్మనిరతుల నాక్షేపింపరు. అట్టివారే జ్ఞానధనులు. ఈవిషయ మెఱుంగుటయే నీతి. దీని నెఱుంగకుండుటయే యవినీతి. భగవత్కృతము మార్పరానిది. దానిచే బద్ధుఁడగు మానవుఁ డయుక్తకర్మముల నాచరించుచుండ మన మాతనిదూఱిన లాభమేమి? కావున దుష్కర్మఫలముల ననుభవించువారిని దూఱరాదు. మనమట్లు చేయకుండఁజేయుమా సర్వేశ్వరా! శ్రీకృష్ణా! యని భగవంతు నారాధించుటయే మనకృత్యమని గ్రహింపవలయు. ఇఁకఁ దర్వాతికథ నాలకింపుఁడు.

## జరాసంధుఁడు మధురపై దండెత్తి వచ్చుట.

* అక్రూరాగమనము కాఁగాఁ బాండవులయిడుమలు వారికి స్పష్టములయ్యెను. తా సర్వజ్ఞుఁడయ్యు సామాన్యమనుజాకృతిం దాల్చినవానిచందమునఁ బ్రవర్తించుట యప్పటికాలమున కనుకూలము. కావుననే లోకాచారములఁ బాటించుట కలవాటుపడియెను. పాండునందనులు ధర్మపరులై న్యాయార్జితధనముచేఁ గాలముపుచ్చువారలయ్యు దురాత్ములవలనఁ గష్ట

* ఈవిషయము శ్రీభాగవత దశమస్కంధము నేఁబదియవ యధ్యాయమునుండియుం హరివంశవిష్ణుపర్వము ముప్పదినాల్గవ యధ్యాయమునుండియుం, విష్ణుపురాణ పంచమాంశమున నిరువదిరెండవ యధ్యాయమునుండియుం, గర్గభాగవతము ద్వారకాఖండ ప్రథమాధ్యాయమునుండియు సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయు. బ్రహ్మపురాణము డెబ్బదియేడవ యధ్యాయమునుండియుం నీకథ సంగృహీతము.

ముల నొందుచున్నవారని శ్రీహరి యెఱింగెను గాని వారి కప్పుడే తాను సాయపడ నుంకింపఁడయ్యెను. శ్రీకృష్ణావతార మునఁ గలవిశేష మిదియే కదా. తాఁ గొన్ని కార్యములను జేయుచుఁ గొందఱచేఁ గొన్ని కార్యములఁ జేయించుచుఁ దాను సాయపడుచు నన్ని కార్యములను దానేచేయుచు నన్ని కార్య ముల నొరులుచేయుచుండఁ దానేమియుఁ దెలిసికొనఁ బూన నట్లు నటించుచు నుండును. వీనిచే భగవంతుని సర్వజ్ఞత్వ సర్వ కారణత్వ సర్వసాక్షిత్వ సర్వేశ్వరత్వములు ప్రకటింపఁ బడును. ప్రకృతము శ్రీకృష్ణుఁడు తన యవతారఫలమును జూపనెంచె నని మన మెఱుంగవలయును.

ఇంతదనుక శ్రీహరి తనబాల్యలీలల ననేక కార్యములు సాధించెను. అవియే భగవన్మహిమమును వేనోళ్లఁ గొనియాడఁ జాలియుండును. కాని వానిచే భూభారహరణకార్యము కొన సాగలేదు. మధురాప్రయాణమున లోకభారకార్యము కంసవధ మునఁ గొంత సాగెననవచ్చును. కాని భూభారమును హరింపఁ బూనిన భగవంతునికార్యమును గొనసాగింప నెందఱో రక్క సులు భూమిని బుట్టియున్నవారు. వారికిఁ బ్రతిపక్షులుగా దేవ తలును భూమిఁ బుట్టిరి. వీ రిరువురకు నొక్కచో సమావేశము కావలయును అది సమకూడినఁగాని తనపని పూర్తినొందదని భగవంతుఁ డెఱుఁగును. అందు దేవతాంశసంభూతులకు విజ యము దానవాంశసంభూతులకు నపజయము కలిగింప దైవ మెంచెను కాని తనచేఁ దెగవలసినభూతములు కొన్ని గలవు. వానిని దాఁ బొలియించి పిదప నితరులద్వారా కొంత కార్యము సాగింప నూహించిన శ్రీహరి తొలుదొలుతఁ దాఁ జేయఁదగిన

వైరిమారణకార్యమునకుఁ బూనెను. శ్రీహరి మనసునఁ దలఁచినవెంటనే యాపని నెఱవేఱునుగాని యవి లోకాచారాను గుణముగా నుండవలయుఁ గనుక నట్లుచేయక యాచారానుసారము చేయ సంకల్పించెను. అ దెట్లనినఁ జక్కఁగా వినుఁడు.

కంసవధానంతరము రాక్షసాంశసంభూతులగు రాజుల కెల్ల నొకయద్భుతాగ్రహ ముదయించెను. సభాముఖమున నాకస్మికముగా వంచనచేఁ గంసునిఁ గృష్ణుఁడు వధించెనను ప్రవాదము భూమి నెగడెను. దానఁ గంసపక్షపాలంబుల కెల్లఁ గ్రోధాగ్ని మనస్సుల నుదయించి పొగరాఁజి దగ్గున మండెను. అంతటఁ గృష్ణునితో మార్కొని పోరి చంపినఁగాని మనమిఁక బ్రదుకమను నూహాలు మింటి కెగసెను. తదనుకూలముగాఁ బ్రయత్నములు చేయఁబూనిరి. దుష్టుల కెల్ల నొక్కవిధమగు నూహాయే కలిగెను. సజ్జనులచిత్తములు శాంతమయములై యుండెను. భీతి నశించెను. భూభారము నిశ్శేషముగా నశించు నన్న యూహాలు ప్రబలెను: ఆకస్మికసమ్మోదము లు వారియందుఁ బొడసూపెను. ఏల? భగవంతునిమది నేసమయమున దుష్టులఁ బొలియింపవలయునన్న యుద్దేశము కలిగెనో యప్పుడే సజ్జనుల కానంద ముదయించెననుట కబ్బురము పొంద నవసరములేదని నా యూహా. ఏలయనఁగా నిర్మలస్వాంతుల హృదయారవింద పీఠము భగవంతునకు స్థానము కదా. అందు భగవత్కళ చక్కఁగా వెలయు. సర్వత్ర వ్యాపించియుండు భగవంతుఁడు నిర్మలస్వాంతుల మదులయందే యుండునా యనరాదు. దుష్టులచిత్తములు మలినములు కావున నందున్న భగవత్కళ చక్కఁగాఁ బ్రకాశింపదు. నిర్మలస్వాంతులచిత్తములు పరిశుద్ధములు కావున

నందది నిరతిశయప్రకాశమునఁ గనుపట్టును. ఇదియే భేదము. కావున దురాత్ముల కాసమయమునఁ బెనుభీతియుఁ బరిశుద్ధాత్ముల కా తరుణమునఁ బరమానందము కలిగెను. ఆకారణమున రాక్షసాంశజనితులగు రాజులెల్లఁ గృష్ణు నేసమయమున వధింతుమా యను తహతహపాటు గలవారలై యుద్ధప్రయత్నములు చేయసాగిరి. ఆవిషయమే యీక్రింద వ్రాయఁబడును.

జరాసంధుఁడు ద్వాపరాంతమున నున్న శూరులలో గొప్పవాఁడు. ఆతని మార్కొనఁ దగురాజు లేఁడను ప్రసిద్ధి కలదు. సకలవిధముల నా జరాసంధుఁడు రాజలోకమున మర్యాదను బెంపొందుచుండువాఁడు. ఆతనికిఁ బలువురు బంధువులు కలరు. మిత్రులును గలరు. ఏసమయమున నేమాట యతని నోటనుండి వెడలునో ఆకార్యముచేయ సిద్ధముగనుండువారెందఱో గలరు. ఆతనిసేన యపారమని యంద ఱెఱుంగుదురు. ఏక్షణమున యుద్ధమన్నను సిద్ధముగనే యాసేన యుండును. సేనాధిపతు లపారబలదర్పులు. వారిలో నొక్కఁడే సర్వలోకముల జయింపఁజాలునన్న విఖ్యాతి లోకమున వ్యాపించియుండెను. కావున జరాసంధునిమాట విన్నంతనే రాజులు గడగడ వడఁకుచుందురు. ఎందఱో యతనికిఁ గప్పముకట్టి పాదాక్రాంతులగువా రుండిరి. బంధువులమనుపేరఁ గొంద ఱాతని నాశ్రయించి మర్యాదలఁ గాపాడుకొనుచుండిరి. కాఁబట్టి యేవిషయమున నాలోచించినను జరాసంధునిమాటకు బదులు లేకుండెను. ఆతఁడు పట్టినదే పట్టు. అన్నమాట సార్థకముగా నుండెను.

జరాసంధునిపుత్రికలలో నిర్వురను గంసుఁడు పెండ్లి యాడెను. అస్తియని, ప్రాప్తియనియు వారిపేరులు. జరాసంధుని తోటి సంబంధమునఁ గంసుఁడు మఱింత బలవంతుఁ డయ్యెను. రాజేంద్రుఁ డన్నను బాధలేదు. పుత్రికాపరిణయానంతర మా జరాసంధుఁ డల్లునిసేమ మరయువాఁడు కదా. కావున నాతని మేలు తనమేలుగా భావించుచుండెను. కంసుఁ డంత పరాక్రమ శాలియైనను గాకున్నను జరాసంధున కల్లుఁడుగాన నధిక విఖ్యాతిపాత్రుఁ డయ్యెను. జరాసంధుని సామంతరాజులెల్లరు కంసున కును సామంతరాజులైరి. జరాసంధునికృప సంపాదించుటయే పరమపురుషార్థముగా భావించువారెల్లఁ గంసుని దోలుత నాశ్రయించువారైరి. ఇది లోకస్వభావమే కదా.

అట్టి జరాసంధునియల్లుఁడగు కంసుఁడు సభారంగమున శ్రీకృష్ణునిచేఁ జంపఁబడఁగా నాతనిపత్నులగు నస్తిప్రాప్తినామ ధారిణు లిరువురును భర్తృవ్యసనకర్శితలై తమకుఁ బాటిల్లిన విపత్తును దండ్రి కెఱింగించిరి. ఆవార్త శ్రవణరంధ్రములఁ జొచ్చినంతన జరాసంధుని హృదయాంతరాళమునఁ గ్రోధాగ్ని యుదయించి రాఁజి ధూమావృతమైయుండి యొక్కసారి దగ్గున మండెను. ఆక్రోధమును బరిమితిగలదన్న వారికంటె నవివేకులు లేరనుట యతిశయోక్తి కుదాహరణము కాఁజాలదని నా విశ్వాసము. లయకాలరుద్రుఁ డందుమా తృతీయనేత్రము లేదు. విలయకాలదండధరుఁడందుమా కాలదండ కాలపాశ కాలమృత్యువు లాతనికడఁ గానరావు. ప్రళయకాలాగ్నియందుమా యవయవవిశిష్టమూర్తి కానఁబడుచున్నది. అంత్యకాల భాస్కరబింబమందుమా యంబరస్థితి చూపట్టదు. బడబానలమందుమా

సముద్రజలేతరస్థలముల నది పొడచూపు నాచారములేదు. కావున నిది క్రోధాగ్నియై యుండనోపునని తత్త్వజ్ఞు లూహించిరి. త్రికాలజ్ఞులుమాత్రము జరాసంధుని యాగామి పరిణామము నెఱింగినవారు గావున దానికి భీతిచెంద రైరి. తక్కినవారెల్ల నఱచేతులఁ బ్రాణము లుంచుకొని భగవంతా! యకాండప్రళయమును గల్పించితివా యని వేఁడసాగిరి. ఆ జరాసంధుని ముఖదీప్తులు సభాభవనమునఁ బర్వఁగానొక్కఁడే నట నిల్వలేకుండిరి. చెంతనుండ నవకాశ మెవ్వరికిని గలుగకుం డెను. ఆసమయమును వర్ణింప మర్త్యలోకమునఁ గాళిదాసు ప్రభృతులు వలంతులా కారా యనుశంక పొడమక మానదు.

ఆసమయమునఁ గంసునిభార్య లిరువురు మధురానగర మును వీడి తండ్రిని జూడఁబోయి విలపించుచుఁ బాదములపైఁ బడిరి. అత్తఱి నాతనిమది చింతాశోకక్రోధభరముల నాక్రాం తంబై యెట్లుండునో వివరింప నలువకే శక్యముగాని యితరు లకుం గాదనవచ్చును. అందును దన యిర్వురకొమరితలు కనఁ బడుచున్నవారు. వారిమోములు వైధవ్యదూషితములు. నిర్భ రవయస్సు దేహముల వ్యాపించియున్నది కాని యనుభవించు నదృష్టము దూరముగాఁ బోయినది.

"కన్యాపితృత్వం దుఃఖాయ."

అను జనకమహారాజవాక్య మొకటియుండఁగా మీఁదు మిక్కిలి యల్లుఁ డన్యాయముగాఁ జంపఁబడెననియు దాన వై ధవ్య మలవడెననియు నింకఁ దనపుత్త్రికల కధోగతియే కాని సుఖోర్ధ్వగతి లేదనియు నాజరాసంధునిమది నాటెను. ఆతరుణ మున నాతనికి మన్నుమిన్ను తెలిసినది కాదు. ప్రపంచమే యతని

దృష్టికి లేన ట్లగపడియెను. తా నెందుఁ గూరుచున్నవాఁడో తెలియకుండెను. ముందేమి చేయఁదగుననునూహ యాతనికిఁ బొడచూపఁజాల దయ్యెను. ప్రపంచ మెల్ల శూన్యప్రాయముగా నతనికిం దోఁచెను. కొంతసేపటి కాతనికి స్మృతి గల్గెను. తాను సభామండపమున నున్నయట్లు, కంసుఁడు శ్రీకృష్ణునిచే నన్యాయమార్గమునఁ దటాలున సింహాసనమునుండి యీడ్చి చంపఁబడినట్లు, భర్తృశోకాతురలై పుత్రికలు దిక్కుమాలి తనచెంత నరుదెంచినట్లు మదిఁ దగిలెను. క్రమక్రమముగాఁ బ్రపంచ జ్ఞానము గల్గెను. తా నేమిచేయవలయునో యాలోచింత మనుజ్ఞానము కలిగెను. కొలువుకూటము కలయం జూచెను. సేనాధిపతుల వీక్షించెను. వీక్షణమాత్రమున వా రాతనిభావ మెఱింగి సేనలు సంసిద్ధములుగ నున్నవనిరి. మేమేపోయి యా మధురానగరమును దగులఁబెట్టుదుమని పౌరుషములు పలికిరి. కృష్ణుని బలరాముని నీడ్చుకొని వత్తుమనిరి. ఏమేమో ప్రల్లదము లాడిరి. జగంబులమూఁడింటి నుగ్గుచేయుదు మనిరి. సముద్రోదకములఁ బుక్కిలించి యుమియఁజాలుదు మనిరి. రామ కృష్ణుల వధించుటకంటె నత్యల్పకార్యము కలదా యనిరి. వారి యప్పటిమాటలకు హద్దులేదు. త్రిమూర్తులు వారిం జూచి భయపడుదురనియే యందున్నవారికిం దోఁచెను.

అంతట మ్మగధదేశాధిపతి మధురానగరమును ముట్టడింపఁ దలంచెను. యాదవవంశము నిర్మూలము చేయవలయునని నిశ్చయించెను. వెంటనే బయలువెడలుఁడని సేనాధిపతుల కాజ్ఞాపించెను. ఇరువదిమూఁ డక్షౌహిణులసేన సిద్ధమయ్యెను.

దండనాయకులు తమతమ సేనలవెంట నడువసాగిరి. * షడంగ ములలో నొప్పు నా సేన మహాసాగరమును మించియుండెను. సామాన్యు లా సేనాసాగరమును గాంచి ప్రళయ మాసన్న మాయెననియు యాదవులు పుడమి నామరహితులగుదురనియు నెంచిరి. కొందఱు నేల యీనినదని భావించిరి. కతిపయదిన ముల కాబలములు మధురానగరమును జేరఁగలిగెను. పుర మును ముట్టడించు నాచార మా కాలమున నుండెను. పురనిరో ధమునఁ బ్రజలు శ్రమంపడుదురనియు వారియనురాగము నకుఁ బ్రభువుఁ పాత్రుఁడు కాకుండ నుండఁజాలఁడనియు విధిలేక యుద్ధమునకు నగరము వెడలివచ్చుననియు యుద్ధదక్షుల భావము. ఆ కాలమున కది యలవాటుగా నుండెను. ఆ యా చారము ననుసరించి యా మాగధసైన్యములు మధురానగ రము నలుదిక్కుల నావరించెను. బయటివారు నగరమును జొర వీలుపడదయ్యెను. నగరముననుండువారు బయటికి వచ్చు నవకాశ మట్టిదే యయ్యెను. మహత్తర సేనాకలకలములు భూ నభోవివరములను జెవుడ్పడఁ జేసెను. ఆక్షోభము చెప్ప నలవి కాదనుట నిర్వివాదము. యాదవు లత్తరుణమున భయంపడి యీయెడరు తప్పనుపాయ మేదియనియు నాలోచింప సమర్థు లుకాక యుండిరి. వనితలు శిశువులు బాలకులు పడరానికడ గండ్లఁ బడసాగిరి. దిక్కు మనకెవ్వరని పామరు లూహించిరి.

---

* ఆజగామ షడంగేన బలేన మహతా వృతః=అని హరివంశము. షడంగేన రథగజతురగపదాతిపణ్యధాన్యాపణికాఖ్యైః షడ్భిరంగైరుపేతేన అని వ్యాఖ్య. హరివంశమునఁ దప్ప నన్నిపురాణములందు నిరువదిమూఁ డక్షౌ హిణులసేన బయలువెడలిన ట్లున్నది.

ఇదియే తమకుఁ బ్రళయమని నాగరికులు తలంచి నిశ్చేష్టులైరి. ఎవ్వరికే నేయూహయుఁ బొడమక యుండెను. రోదనధ్వనులు దిక్కులఁ బిక్కటిల్లం జేసెను. కంసాదుల వధించిన శ్రీకృష్ణమూర్తితప్ప వేఱొక్కరియెడరుఁ దీర్పఁజాలరని యెల్లరుం దలంచిరి.

* శ్రీహరియు మాగధసేనలు నగరమును ముట్టడించి నిలిచియుండుటయుఁ బ్రజలు భీతిల్లుచుండుటయు నితరులెవరును యుద్ధోన్ముఖులు కాకయుండుటయు యాదవులీప్రళయమును నివారించునని తన్నే నమ్మియుండుటయు నెఱింగెను. హరి కారణకల్పితమానుషదేహసంపన్నుఁడు కదా. కావున దేశకాలోచిత మగుపద్ధతియుఁ దా నవతరించిన ప్రయోజనమును నుంతచింతించి తనమదిలో నిట్టు లాలోచించెను. జరాసంధుఁడు ప్రోఁగుచేసిన యీసేన భూభారమును గల్పించునదియే. ఇందు నించుమించుగా నందఱు వధింపఁదగిన జీవులే కలరు. మృత్యువు పురికొలుపఁ దమచావునకే యిపుడు వచ్చియున్నవారు. ఇపుడు వధింపఁదగనిరాజు లిందుఁ గలరు. వారెల్లఁ జూచుచుండ నీసేనను భూమికి బలియిత్తును. గజహయరథపదాతిసంభృతం బగు నీయనేకాక్షౌహిణీసైన్యమును మాత్రమే చంపుదును. జరా

---

* చింతయామాస భగవాన్ హరిః కారణమానుషః, తద్దేశకాలానుగుణం స్వావతారప్రయోజనమ్, హనిష్యామి బలం హ్యేతద్భువి భారం సమాహితమ్, మాగధేన సమానీతం వశ్యానాం సర్వభూభుజామ్, అక్షౌహిణీభిస్సంఖ్యాతం భటాశ్వరథకుంజరైః, మాగధస్తు న హంతవ్యో భూయః కర్తా బలోద్యమమ్. ఏతదర్థోఽవతారోఽయం భూభారహరణాయ మే, సంరక్షణాయ సాధూనాం కృతోఽన్యేషాం వధాయ చ. అని భాగవతము.

సంధుఁ జంపుట కిది యదను కాదు. వీనిఁ బ్రాణములతో వదలిన మత్సరగ్రస్తుఁడు కావునఁ బగసాధింపఁ బూని మరలఁ బెక్కు మందిని గూర్చుకొని వచ్చును. వారిం బొలియించిన భూభారము తగ్గును. ఇట్లు పెక్కుసారు లొనరించిన నీతనిమూలము ననే భూదేవి భారమువాయ సుఖించును. నా యవతార ఫలము భూభారహరణము, సాధుపరిపాలనము కదా. దుష్టులు తొలుదొలుత వధింపఁబడకయున్న మరలమరల నాపై యుద్ధమునకు సంసిద్ధు లగుదురు. దాన జీవులు పెక్కుమంది పొలియుదురు. చావునకు సిద్ధముగనుండుకర్మమునే చేసినవారెల్ల నాపైఁ గినుకపూనుదురు. వారు మడియుదురు. నాయవతారమునకుఁ దగినఫలము గలుగును.

అని యిట్లు తనలోఁ దలపోసికొని యీవిధమెల్ల స్వాభేదరూపుఁడగు నన్నకెఱింగించువాఁడై యేకాంతమున బలరాముం జీరి దేశకాలాదుల స్థితులెఱిఁగించి మాగధునిప్రయత్నంబుఁ దెలియఁజెప్పి యాదవులకుఁ గలిగిన మనఃక్షోభము చక్కఁగాఁ జెప్పి మనకృత్య మిద్దియే యని తెలుపుచుండెను.* ఆతఱి నంబరమునుండి రెండురథములు దిగియెను. అవి సూర్య తేజస్సువలె వెలుంగుచుండెను. సూతులు రథపరికరములు గుఱ్ఱములు లోనగునవియన్నియుఁ గొఱంత లేకుండెను. ఆ రెండు రథములపై దివ్యములు నతిప్రాచీనములు నగునాయుధము లమ

---

* ఏవంధ్యాయతి గోవింద ఆకాశా త్సూర్యవర్చసౌ, రథౌ పుప స్థితౌ సద్య స్ససూతౌ సపరిచ్ఛదౌ, ఆయుధాని చ దివ్యాని పురాణాని య దృచ్ఛయా, దృష్ట్వా తాని హృషీకేశ స్సంకర్షణ మథాబ్రవీత్ = అని భాగవతము.

ర్పఁబడి యుండెను. వాని ప్రకాశము సూర్యకోటుల మించి యుండెను. అవి యాదృచ్ఛికముగా వచ్చినవియే గాని యితరు లుపంపినవి కావనవచ్చును. వానికి నీడగురథము నీ లోకమున నుండుట యసంభవమనక తప్పదు. ఆరథవర్యము లంబరము నుండి దిగినంతనే భగవంతుఁడు సంకర్షణుం జూచి యిట్లు పలికెను. *

మహాశయులారా! బలరామకేశవుల యద్భుతచరిత్ర మిందుఁ గలదు. దానినించుక వినవలయును. భగవంతుఁడు తన యవతారఫలమును జూపఁ బూనెను. ఇపుడు బాల్యచిహ్నము లుండ వీలులేదు. తనస్వస్వరూపము చూపవలసి యున్నది. చక్రము భగవంతున కొకయలంకారము. అది యుండినఁగాని భగవంతునిరూపము సంపూర్ణము కాదని కొందఱిమతము.

---

* తతో బలశ్చ కృష్ణశ్చ మతిం చక్రే మహాబలః, ఆయుధానాం పురాణానా మాదానే మునిసత్తమాః, అనంతరం చక్రశార్ఙ్గే తూణౌచా క్షయ్యౌ శరైః, ఆకాశాదాగతౌ వీరౌ తదా కౌమోదకీ గదా, హాలం చ బలభద్రస్య గగనా దాగమత్కరమ్, సంవర్తాగ్నిసమం విప్రా స్సునందం ముసలం తథా—అని బ్రహ్మపురాణమునఁ గలదు. యుద్ధముచేయఁబూని నగరము వెలువడి బలరామగోపాలు రిరువురు సేనాగ్రమున నిలిచి స్మరింపఁగాఁ దమయాయుధములు సన్నిహితములైనవని దీనిభావము. భాగవతమున "యదృచ్ఛయా" అని యున్నందున స్వేచ్ఛగా ననఁగా నితరులచేఁ బంపఁబడక భగవదిచ్ఛచే నరుదెంచెననియే భావముగా గ్రహింపఁ దగును. లేకున్న రథములకుఁ బ్రాణములున్నవా యను ప్రశ్నము రావచ్చును. కావున నీ పురాణములన్నియుఁ బదభేదమున నొక్కయర్థమునే తెల్పుచున్నవి.

ఇపుడు మహాహావ మాసన్నమైనది. ఇందుఁగల పెక్కుజీవులు తనచే బలరామునిచే మృతినొందఁ దగినవారు గలరు. భగవంతుని యవతారఫలమునకుఁ దోడ్పడఁ బుట్టినవారేకాని వేఱుకాదు. వారు పుట్టకయున్న భూభారము తీఱదు. జరాసంధాదులు భూభారహరణ లీలానాటకమునందుఁ బాత్రముల వంటివారు. ఆనాటకమును శ్రీకృష్ణుఁడు సూత్రధారుఁడై సాగించును. బలరాముఁడు భావుకుఁడు. అనఁగా సూత్రధారునకు సహాయభూతుఁడని గ్రహింపఁదగు. ఈనాటకము వీరరసైక ప్రధానము శృంగారాదిరసము లంగములు కావలదా యని ప్రశ్నింతురేమో? అన్నియు నిం దమరియుండును. భగవద్దివ్యరూపమును మృతినొందిన పుణ్యాత్ముఁడు కాంచుటయే శృంగారము. ఇట్లే నవరసములు నీనాటకమునఁ గనఁబడఁ గలవు. యుద్ధ మేలాగుసాగెను? ఎందఱెందు మృతినొందిరి? ఎవ్వరెవ్వరెట్లెట్లు యుద్ధముచేసిరి? అనిమాత్ర మేకథను జదువకుఁడు. దానఁ గాలమును వ్యర్థముచేసిన ట్లగును. ఏయేజీవు లెట్టిపుణ్యము చేసికొనిరి? భగవంతుఁడు యుద్ధము చేసినాఁడా? వారివారిమృత్యువు వారికిఁ బ్రతిపక్షశూరుఁడుగా నిలిచి పోరాడుచున్నదా? ఎందఱందుఁ బుణ్యాత్ములు గలరు? ఇప్పట్టున సర్వసాక్షి నిర్లిప్తుఁడు. అన్నపేరులు శ్రీహరికిం జెల్లునా? చెల్లవా? అను నీ మొదలగువిషయములం బ్రధానములుగా భావించి కథను జదువుచు వీనిని సమన్వయము చేసికొనుఁడు. అపుడు పఠనమునకుఁ జక్కనిఫలము గలుగు. ఎవ్వరెవ్వ రెంతెంతసేపు పోరాడిన నేమి? అస్త్రము లెవ్వరెక్కడఁగాఁ బ్రయోజనమేమి? ప్రధాన మదిగాదు. కర్మము దృఢపాశములతో నెవ్వరె

వ్వారి నీడ్చుకొని వచ్చి హంతకునిముందు త్రోయుచున్నదో, ఎవ్వరెవ్వ రెవరిచేఁ జావవలసి యున్నదో, ఆచంపువాఁ డేమని యూహించుచున్నాఁడో, చచ్చువాఁ డేమనుకొనుచున్నాఁడో, చూచువా రేమని తలఁచుచున్నారో, ఇందుఁ జంపువాని కెంత శక్తియున్నదో, అని యెఱుంగు టుచితము.

ఒకనినొకఁడు చంపఁజాలఁడు. కర్మ మదృశ్యతీవ్రపాశములఁ దగిలించి యీడ్చుకొని వచ్చును. ఆతనికర్మమే కారణభూతుఁడుగా నున్నజీవునిలోఁ బ్రవేశించి తానే యాతనిం జంపును. తనప్రతాపమునఁ జంపితినని హంతకుఁ డూహింపఁడు. వీనినన్నింటిని భగవంతుఁడు చూచుచుండును. కావుననే సర్వసాక్షియనునామ మా పరమేశ్వరునకుం జెల్లును. సాక్షిమాత్రుఁడై యుండుననఁగా నేయేపని యెట్లెట్లు సాగవలయునో యట్లట్లు సాగునట్లు చేయును. సర్వకారణకారణుఁడన భగవంతుఁడే కదా. దీనిసార మేమనఁగా తనకర్మమే తన్నుఁ జంప నింకొరునిఁ బురికొల్పుచున్నదని యెఱుంగవలయును. ఇదియే పరమార్థము. అట్లు లెఱింగినవాఁడే తత్త్వవేత్త. వానికి మిత్రామిత్రులకుఁ గలభేదము తోఁపదు. సర్వసముఁడగు. అజ్ఞానములేక మఱొకఁడు తన్నుఁగొట్టెనని రోష మూనుటచేతనే పామరుఁ డగును. జ్ఞానికి మూర్ఖునకుం గలభేద మిదియే.

ఈ మహాయుద్ధమున స్వస్వకర్మపరిణతిచేఁ జావఁదగిన ప్రాణు లనేకులు గలరు. వారియం దొక్కనికైనఁ దనమృతి యెప్పుడైనదియుఁ దెలియదు. కావున మూర్ఖులనఁ బడుదురు. భగవంతుఁడు తానీ క్షుద్రులఁ జంప నీమహాప్రయత్నము చేయునా? సాక్షిమాత్రుఁడుగ నుండును. వారివారికర్మమే వారివారి

నీడ్చుకొనివచ్చి మృత్యువునోటఁ ద్రోయును. ఈబాణము పని సాధించినట్లు కనఁబడును. కావున లోకమున నొక్కని వేఱొక్కఁడు చంపుటనునది కల్ల. నిమిత్తమాత్ర మొకఁడుండును. అదియే ప్రధానముగా మనము భావింతుము. కాని కర్మ మిట్లు చేయుచున్నదని యూహింపము. మన మెఱుంగఁదగినవిషయ మిదియేకాని వేఱొకటి కాదు. దీని నెఱుంగుటచే నింకొకరిని ద్వేషించుట వదలిపోవును. అంతకంటె మనకుఁ గావలసిన దేమున్నది ?

ఇఁక భగవంతుని యద్భుతకృత్యమును వినుఁడు. శత్రువులు పురమును ముట్టడించిరని యెఱింగెను. యాదవులా వాహినిని నిలుపఁజాలరనియు నెఱింగెను. వెంటనే యన్నతోటి తనపూర్వశస్త్రాస్త్రములం దలంచెను. రథముతో నన్నియు సన్నిధిం జేరెను. ఆకాశమునుండి దివ్యరథములు రెండు సకలాస్త్రసంపన్నములై వచ్చెను. భగవంతుని యిచ్ఛామాత్రమున బ్రహ్మాండము లొక్కసారి యుప్పతిల్లునన్న నిఁక నరదము దిగి వచ్చుటొక యద్భుతమా? నిరాధారస్థలమునుండి యరదము దిగుటసంగతము కాదాయని ప్రశ్నింపవచ్చును. కాని యాప్రశ్నమంత యుక్తియుక్తము కాదు. దేనికేది యాధారమో యెఱుంగఁజాలక చేయుప్రశ్న మిద్ది. సూర్యుని రథగమనమున కాధార మేది? భూమినిలుచుట కాధార మేది? సకలబ్రహ్మాండములుండుట కాధార మేది? అన్యోన్యమాశ్రయించి భగవచ్ఛక్తిచే నిలిచియున్నవి. మహాభారతమునందు ధర్మరాజు సూర్యున కేమియాధారమను ప్రశ్నమునకు "సత్య మాధారమంద్రు" అని చెప్పెను. సత్యమనఁగా భగవద్రూపమని

భావము. సత్యరూపుఁడు కదా పరాత్పరుఁడు. పరాత్పరుని యాధారమున నన్నియుఁ బ్రవర్తిల్లుచున్నవి. ఈ విషయ మెఱుంగక నవీనశోధకులు పరస్పర మాకర్షించుకొనుచున్నందున నిలిచియున్న వనిరి. ఆకర్షణశక్తి యన్నింటికిఁ గలదఁట. ప్రాణము లేనివస్తువులకు శక్తి యెక్కడిది? అను వివేకము వారికి లేదు. శక్తియనఁగా భగవంతుఁ డం దావహించియున్న వాఁడని వా రెఱింగినచో దత్త్వవేత్తలే యగుదురు. అది లేనికారణమునఁ బదార్థతత్త్వ మెఱిఁగినవారై పరమేశ్వరారాధనమును గోల్పోయెను. ఆవస్తువున కాశక్తి యెట్లు కలిగినదని ప్రశ్నింపఁగా నాకాశమును జూడవలయును గదా. లేక స్వభావ మనవలయు. స్వభావ మనుమాటకర్థమే వా రెఱుంగరని నాయాశయము. తెలియక తెలిసినట్లు నటించుట మీస్వభావమన్న బదులు చెప్పఁ జాలరు. దీనితత్త్వ మేమనఁగా, సర్వత్ర వ్యాపించియున్న భగవంతుఁడు లోకప్రవర్తనార్థము ఒక్కొక్కపదార్థమునందున్న తనశక్తికళ కొక్కొక్కశక్తిని గల్పించెను. సర్వశక్తులు భగవంతునకుఁ దప్ప మఱేవస్తువునకు లేదను గుణపాఠమును లోకులకుఁ దెలుపుటకని యెఱుంగవలయును. సకలపదార్థములయందు భగవత్కళ కలదు. "ఆబ్రహ్మస్తంభపర్యంతం వ్యాప్య తిష్ఠతి సోఽచ్యుతః" అన్నసూక్తి యందఱెఱింగినదియే కదా. ఛేదించినదారువునకుఁ బ్రాణము లేదని యందఱెఱుంగుదురు. కాని యందు భగవత్కళ లేకయున్నఁ బరమాణువులై పోవక నిలుచుటెట్లని యాలోచింపరు. భగవత్కళ లేనిపదార్థమునకు వస్తువను పేరే లేదని భావము. కావున భగవత్సంకల్ప మమోఘమనియు దానికడ్డము లేదనియు

మన మెఱుంగకయున్న బుద్ధిమంతులము కాఁ జాలము. ఈ భావ మెఱింగినవారికి నంబరమునుండి దివ్యరథములు దిగివచ్చె నన్న విచిత్రముగాఁ దోఁపదు. అది యెఱుంగనివారి కన్నియు విచిత్రములే. ఇఁక నీవిషయమును విశేషించి పెంచి వ్రాయఁ బూనక యీవిషయమున శ్రీకృష్ణజన్మఖండమునుండి యించుక వ్రాసి పైకథను సాగించెదను.

* ఒకనాఁడు మధురానగరమునుండి శ్రీహరి దూరము నకరిగి వటమూలమునఁ గూరుచుండి తనకృత్యమేమని యోజించెను. బలరాముఁడు చెంగటనుండెను. తొలుత గరుడుని స్మరించెను. అవ్వల లవణార్ణవమును విశ్వకర్మను దలంచెను. వారు వచ్చులోపల గోపాలబాలవేషమును త్యజించెను. నృపవేషమును ధరించెను. † ఆవెంటనే హరి స్మరింపకయున్నను జక్ర మరుదెంచెను. చక్రము భగవంతునిచ్ఛ నెఱుంగును. రాజవేషమునుధరించుట పరాక్రమము చూపఁబూనియే కదా. అపుడు తానులేకున్న నెట్లు పనిసాగును? అన్నయూహచే భగవంతుఁ డేక్షణమున బాలవేషమును వదలి రాజవేషమును ధరించెనో యాక్షణమ చక్రము సన్నిహితమయ్యెను. దానికి సుదర్శన మనుపేరు గలదు. దాని ప్రకాశము సూర్యకోటిబింబములకు లేదనుట స్వభావోక్తియే యనక తప్పదు. తేజోవిషయమును మాత్ర మాలోచించిన నది శ్రీహరిసమానమని చెప్పక తప్పదు.

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండము నూటమూఁడవ యధ్యాయము నుండి సంగృహీతమని యెఱుంగవలయును.

† ఏతస్మిన్నంతరే చక్ర మాజగామ హరిం స్వయమ్ = అని మూలము.

వైరివిమర్దనమున నసదృశము. అస్త్రములన్నింటిలో నిదియొ
క్కటే వ్యర్థముకానిది. తక్కినవన్నియు నొక్కప్పుడేని వ్యర్థ
ములగును. భక్తులకు సేవ్యమయినది. చక్రము శ్రీకృష్ణుని కర
పద్మమున నమరఁగనే రత్నయానము ముందు నడచుచుండఁగా
గరుత్మంతుఁడు సాక్షాత్కరించెను. శిష్యునింగూడి విశ్వకర్మ
వచ్చెను. లవణార్ణవము రూపమును దాల్చి వచ్చెను. శ్రీహరి
కందఱు నమస్కరించి శీర్షములచేఁ బాదముల స్పృశించిరి.
సుస్మిత మాననచంద్రమండలమునఁ దాండవమాడుచుండ శ్రీ
కృష్ణుఁడు వారిం గాంచి యిట్లు పలికెను.

ఆర్యులారా! ఇంతదనుకనే యిట వ్రాయవలసియు
న్నది. ద్వారకానగరనిర్మాణమునందు దీని యనుబంధమును
వ్రాయుదును. ఈ గ్రంథమున జరాసంధయుద్ధము లేదు. ద్వార
కానగరనిర్మాణమునకు నీ జరాసంధయుద్ధమే కారణము. కావున
నీకథను వ్రాసి యవ్వల వ్రాసెదను. శ్రీకృష్ణజన్మఖండసంగృహీత
విషయమును వ్రాయుటేల యనఁగా, శ్రీకృష్ణుఁడు తాను
జేయఁబూనిన కృత్యములఁ దలంచి, తదనుగుణములగు సాధన
ముల స్మరించినంతనే వచ్చెననియు, స్మరించినంతన యవివచ్చుట
విచిత్రము కాదనియుఁ దెలుపుటకే యని గ్రహింపవలయును.
ఇంతట నీవిషయము నుజ్జగించి జరాసంధయుద్ధమును లోపలి
కథ కనుబంధముగా వ్రాసెదను.

జరాసంధుని సేనాసన్నాహముం గాంచి శ్రీహరి బల
రామునితో నిట్లు పలికెనని వ్రాసి నిలిపియుంటిని గదా. దాని
కనుబంధముగా నీక్రిందికథను బఠింపుఁడు. బలరామా! చూ
చితివి కదా. జరాసంధునిసేన లెట్లు పురమును ముట్టడించి

నవో, నీప్రాపుగాంచియు యాదవులు వ్యసనార్ణవమున మునింగి యున్నవారు. కావున వీరికష్టములఁ దొలఁగించుట నీకు విధి కదా. ఇదిగో దివ్యరథము నీకొఱకు వచ్చి నిలిచియున్నది. నీ దివ్యాయుధములన్నియు నిం దున్నవి. * ఈయరదము నారోహించి యీవచ్చిన వైరివాహినిం గెలిచి ప్రళయ మాసన్నమయ్యెనని భయంపడుచున్న యీ యాదవులనెల్ల నుద్ధరింపుము. మన మవతరించినది సాధురక్షణాసాధుశిక్షణార్థమే కదా. ఇరువదిమూఁడక్షౌహిణులసేన యిపుడు మనచేఁ జంపఁబడఁ దగును. పుడమికిం గలబరువును దీర్పుము. అన నట్లే యని బలరాముఁ డంగీకరించెను.

అంత నారామకృష్ణులు కవచంబులు తొడిగిరి. దివ్యరథముల నధిరోహించిరి. దివ్యాస్త్రములం దాల్చిరి. అంబరమునుండి రథము నెక్కివచ్చినసారథి దారుకుఁ డయ్యెను. శ్రీకృష్ణుఁడు బలరామునిఁగూడి దారుకుఁడు రథము చిత్రగతుల నడుప యుద్ధరంగమును బ్రవేశించెను. బలరాముఁడుకూడ నరిగెను. ఆదివ్యరథములు రెండును యుద్ధరంగమునఁ బ్రవేశించు నపుడు మింటనుండి చూచుదేవతల కా భగవంతుని రెండు మూర్తులు దివ్యతేజముల వెలుంగుచుండ భటులనెల్ల వారి చెంతకు మృత్యుదేవత పెక్కురూపములఁ దాల్చి పాశముల వారిమెడలకుఁ దగిలించి యీడ్చుకొని వచ్చి వారిముందటఁ ద్రోయుచున్నట్లును, వారిదర్శనమాత్రమున వారెల్ల మ్రందుచున్నయట్లును గనఁబడియెను. వారెల్ల భగవంతుని యద్భుత

* ఏతదర్థం హి నౌ జన్మ సాధూనాం మీశకర్మకృత్, త్రయోవింశత్యనీకాఖ్యం భూమేర్భార మపాకురు = అని భాగవతము.

కృత్యముల నెఱుంగ శక్యమాయని యబ్బురపడిరి. జయజయ నాదములఁ దమభక్తిని దెలుపుకొనిరి."కృతకృత్యాస్మః"అనిరి.

* అంత రామకృష్ణులిర్వురు రణరంగమునఁ బ్రవేశించిరి. శ్రీకృష్ణుఁడు మోమెత్తి సేనలఁ గలయంజూచెను. ఆసేనలు జగంబు నొక్కుత్తుగ మ్రింగఁజూచున ట్లుండెను. అందుఁ బెక్కండ్రు యోధాగ్రేసరు లుండిరి. శ్రీకృష్ణునింబోలియింప నిదియ యదనుగదాయని వా రూహించి యాసేనలతో వచ్చిరి. వారెల్ల జరాసంధునకు మేలుగూర్ప నెంచినవారే. అతనిపనికై తమప్రాణముల నర్పింప సిద్ధపడువారే. కారూషుఁడు, దంతవక్త్రుఁడు, వీర్యమున విఖ్యాతిఁగను చేదిరాజును, గాళింగాధిపతియుఁ, బౌండ్రకుఁడును, సాంకృతియు, గైశికుఁడును, భీష్మకుఁడును, దత్తనయుఁడును, ధనుర్ధారులలో నగ్రేసరుఁడగు రుక్మియు నుండిరి. ఈరుక్మియే శ్రీకృష్ణునియందు ద్వేషముగలవాఁడనువిషయము రుక్మిణీకల్యాణమున స్పష్టమగును. మఱియు వేణుదారియుఁ గ్రథభూపాలుఁడు, నంశుమంతుఁడును, అంగరాజును, వంగాధీశుఁడును, కౌసల్య కాశిరాజులును, దశార్ణనాథుఁడును, విదేహపతియు, మద్రరాజును, త్రిగర్తదేశాధిపతియు, సాల్వభూనాయకుఁడును, మహాబలముగల దరదనామభూపతియు, యవనాధీశ్వరుఁడును, భగదత్తుఁడును, సౌవీరరాజును, శైబ్యుఁడును, పాండ్యనరపతియు, గాంధారాధిపతియగు సుబలుండును, నగ్నజిత్తును, గాశ్మీరేశ్వరుఁడును, గోనర్దుఁడును, దుర్యోధనాదు

---

* ఈభాగము హరివంశము ననుసరించి వ్రాయఁబడినది. భాగవతాదులలో నీపేరులుగలవా రున్నయట్లు గానరాదు.

లును, వీరుగాక యింకను బేరుగల రాజవర్యులెల్ల బలసమగ్రులై జరాసంధునిం గూడి జనార్దనునందున్న యీసున యుద్ధము చేయ నరుదెంచిరి.

ఇందు ధార్తరాష్ట్రులు నూర్వురు చేరిన ట్లున్నది. ఇది సుసంగతమా యను ప్రశ్నము రావచ్చును. సుసంగతమే కాని యసంగతము కాదు. దుర్యోధనాదులకుఁ బాండుసూనులయం దెడ తెగనిపగ గలదు కదా. పాండునందనులయందుఁ బక్షపాతము యాదవులకుఁ గలిగియుండుట వారికిఁ దెలియనివిషయము కాదు. శ్రీకృష్ణుని యద్భుతకార్యములు వారెఱింగియే యుండిరి. శ్రీకృష్ణున కర్జునునియం దెక్కుడు ప్రీతియనియు వారు తెలిసికొని యుండిరి. వారు దండెత్తిపోయి మధురముట్టడింపఁ బూనఁగూడదా యన్న ధృతరాష్ట్రుఁ డంగీకరింపఁడు. భీష్మద్రోణకృపాశ్వత్థామాదులు నంగీకరింపరు. వీరిసాయము లేకయున్నఁ దమ కేపనియు జేయ శక్యముగాదనుట వారిహృదయములందు నాటియే యుండెను. కావునఁ దమరు దండయాత్రకుఁ బోకయున్నను జరాసంధుఁడు దండయాత్ర చేయఁబూనఁగా నాయాత్రయందుఁ దమరును బాల్గొన్నచో జరాసంధుఁడు రామకృష్ణులఁ బొలియించుననియుఁ, దరువాతఁ దమరు పాండవుల నసహాయుల నశ్రమంబునఁ జంపవచ్చుననియు భీష్మద్రోణులు పాండవపక్షపాతులైనను దెగించి తమపక్షము మాని యాపక్షమునఁ బ్రవేశింపరనియు వారెఱింగిరి. కావున జరాసంధుని సంగరయాత్రయందు భీష్మద్రోణాదుల సాయముగోరక తమరు సోదరులు మాత్రమే సేనలంగూడి మధురపైఁ జనిరి. ఇం దసంగతప్రసంగ మేమాత్రము లేదని యెఱుంగవలయును.

రామకృష్ణులం గూడి యాదవులుకొందఱు రణరంగమున కరిగిరి. యాదవబల మా జరాసంధవాహినీపురోభాగమున సూర్యమండలముచెంత మిణుఁగురుఁ బుర్వులవలెఁ గన్పట్టెను. సంగరాంగణమును జేరఁగనే యందలియోధులం గలయం జూచి కృష్ణుండు హృష్టమతియై బలరామునిం జూచి యన్నా! దేవతాకార్యము త్వరపెట్టుచున్నది. భూమి భారమున శ్రమంపడుచున్నది. ఇఁక నాలస్యము చేయరాదు. మింటనుండి దేవతలు ప్రార్థించుచున్నవారు. మనల వధించుపొంటె రాజులెందఱో వచ్చియున్నవారు. చూడుము. వీరిరణోత్సాహ మపారము. ధ్వజపటము లెగురుచున్నవి. రథములు త్వరపడుచున్నవి. పదాతులు మృత్యువక్త్రబిలమును జొర సంసిద్ధముగనున్నవి. తడవుసేయక మృతి కాసన్నులగువారిని బొలియించి భూభారము తగ్గునట్లు చేయుటొప్పు. అనుటయు రాముండట్ల కావింతమనియె. అంత శ్రీహరి యాదవవీరుల నిలిపి యన్నయుఁదానును సమరాభిముఖు లైరి. శ్రీహరి పాంచజన్యమును బూరించెను. ఆశంఖనాదము శ్రవణవివరములఁ జొరఁబడఁగా గజములు హయములు బోరగిలఁ బడియెను. పదాతులహృదంతరముల మరణభీతి పాదుకొనియెను. సేనాముఖమును శ్రీకృష్ణుఁడు బలరాముఁడు చేరఁగాఁ బలుభంగుల బాణములు వారిపై నదాతులు కురిపించిరి. వా శాబాణములు చేరకుండఁగ నాపుకొనుచు శత్రుశిరముల భూమి నలంకరించిరి. రక్తధారల భూపరాగమును జల్లార్చిరి. ఆపరాక్రమమును గాంచి యుద్ధండభుజబలవిరాజితుఁడగు జరాసంధుఁడు ముందునకు వచ్చి వారినిర్వురను గాంచి శ్రీకృష్ణునుద్దేశించి యిట్లు పలికెను.

* ఆర్యులారా! జరాసంధుఁడు మూర్ఖుఁడు కాఁడు. విజ్ఞానసంపన్నుఁడు. అతఁడీసమయమున శ్రీకృష్ణునింగూర్చి పలికినమాటలు వేదాంతసారములు. ఆయర్థము నా కల్పించినది కాదు. వ్యాఖ్యానమును బరిశీలింపుఁడు. జ్ఞానసంపన్నుఁడైన యుద్ధము చేయవచ్చునా యని ప్రశ్నింపకుఁడు. భగవన్మాయామోహితుఁడై భగవత్కార్యమునకు సహాయము చేయ శత్రుపక్షమునఁ జేరినను భగవంతుని దర్శింపఁగనే జ్ఞానముదయింపక పోదు. అది లేకపోయినచో నా పరాత్పరునిదర్శనము వ్యర్థమగును. ఎట్టిపాపములైనఁ దన్నామస్మరణమున నశించుచున్న నిఁకఁ బ్రత్యక్షముగాఁ జూచినఁ బాపములునశించి విజ్ఞాన ముదయింపదనుట వెఱ్ఱివాదము. భగవత్తత్వమెఱుంగని మూర్ఖులవాదమది. అట్లయినఁ గలిగినవిజ్ఞానము నశించునా? నశింపకున్న వాఁడేల యుద్ధముచేయును? భక్తుఁడు కావలసినదియే కదా. అట్లుగాక జరాసంధుఁడు పెక్కుపర్యాయములు యుద్ధసన్నద్ధుఁ డయ్యెనే, ఏల? అను ప్రశ్నము చేయవచ్చును. సమాధానమును వినుఁడు. భగవద్దర్శనమున జ్ఞానముదయింపక తప్పదు. కార్యముకొనసాగవలయును గాన భగవంతుఁ డతనిమూలమున నేయేకార్యములు కావలయునో వానినన్నింటిని జేయింప నాతని మాయచే

---

* తావాహ మాగధో వీక్ష్య హే కృష్ణ పురుషాధమ, గుప్తేనచ త్వయామంద నయోత్స్యే యాహి బంధుహన్. న త్వయా యోద్ధు మిచ్ఛామి బాలకే నేహ లజ్జయా=అని మూలము. పురుషాః అధమాః యస్మాదితి వాస్తవోఽర్థః హే పురుషోత్తమేతి గుప్తేన దంశితత్వా త్సర్వాంతరత్వాద్దర్శనానర్హేణ. హే మంద. బధ్నాతీతి బంధుః. అవిద్యా తాం హంతీతి హన్ హే అవిద్యానిరసనేతి. యాహి ప్రాప్నుహి. అని వ్యాఖ్య.

నాచ్ఛాదించును. అట్లుచేయకున్న లోకప్రవృత్తి సాగదు. ఇన్ని పనులు నెఱవేర్పవలసినభార మా భగవంతునియం దున్నది. కావున నట్లు చేయును. ఆతనివలనఁ గావలసినకార్యములు ముగియఁగనే విజ్ఞానమొసంగి భక్తునిగాఁ జేయును. ఇదియే భగవంతుని యలవాటు. ఇది యనేకోదాహరణములచే స్థిరప డుపవచ్చును. నోరుతెఱచి తల్లికి సకలబ్రహ్మాండములు కనం బడఁ జేసెఁగదా. అజ్ఞాన మాయశోదకు మఱునిమేషము నిల్చి నదియా? ఎట్లుపోయినది? భగవన్మాయచే ననక తప్పదుకదా? అట్టిసిద్ధాంతమే యిక్కడ నన్వయించిన నీప్రశ్నమున కవకా శమే యుండదు. ఇఁక జరాసంధునిమాటలు వానియందుఁగల ప్రాతీతికార్థవాస్తవార్థములఁ బరికింపుఁడు.

మందుఁడా! అధమపురుషుఁడా! దాఁచిపెట్టుకొనియుండు నీతో రణముసేయ నే నిష్టపడను. నీవు బంధుద్రోహివి. మఱి యు నజ్ఞుఁడవు. చిన్నవాఁడవు కూడ నగుదువు. ఇట్టినీతో నని సేయ నాకే సిగ్గగుచున్నది. పొమ్ము పొమ్ము. అనియె. ఇది ప్రాతీ తికార్థము. విశేషార్థ మేలాగనిన.

ఎవ్వనిముందు పురుషులెల్ల నధములగుదురో ఆతఁడు పురుషాధముఁ డనంబడు. అనఁగాఁ బురుషులలో నుత్తముఁ డన్నమాట. అనఁగా నోపురుషోత్తమా యనునామమునఁ బిలి చెను. మంద! అనునది రెండవసంబోధనము. ఆలోచించి పని చేయువాఁడని దానియర్థము. మెల్లగాఁ గార్యముచేయువానిని లోకమున మందుఁ డందురు. మందగమన మనఁగా నర్థమేమి? భూతభవిష్యద్వర్తమానకాలవిదుఁడవగు మహానుభావా యని దీని యర్థము. బంధుహా=అనునది మూఁడవ సంబోధనము.

బంధించునది బంధువనంబడు. అనఁగా నవిద్యయని యర్థము. దానిని హరించువాఁడు బంధుహర్త అనఁబడును. అవిద్యా ధ్వంసకుఁడా యని దీని యంతరార్థము. గుప్తేనత్వయా=అనఁగా సర్వభూతాంతర్యామివి గావునఁ జూడ శక్యుఁడవు కావని తాత్పర్యము. దీనిని వాక్యరూపముగా వినుఁడు. ఓపురుషో త్తమా! త్రికాలజ్ఞా! అజ్ఞానధ్వంసకా! పరమేశ్వరా! సర్వభూత ములయం దంతర్యామివై వెలయు నిన్ను దర్శింప యోగీశ్వరు లకే నశక్యము. ఇఁక నావంటిపామరున కది శక్యమా? కాదు. ఐన నాపూర్వజన్మసుకృతపరిపాకమున నెట్లో దర్శన మిచ్చితివి. ఇట్టినీతో యుద్ధము చేయఁ బూనుదునా? పూనను. అంతియ కాక ముద్దులుమూటఁగట్టుచున్న బాలరూపమున సాక్షాత్క రించితివి. లోకసామాన్యదృష్టిం జూచినను నీవయస్సునకు నా వయస్సునకుఁ జాలయంతరము గలదు. ఇట్టిబాలకునితో నే క్రూరుఁడును యుద్ధము చేయఁడు. బాలరూపమున సాక్షాత్క రించినమాత్రమున బుద్ధిలేక నీతోఁ బోరుదునా? నాకు సిగ్గు గాదా? కాఁబట్టి నన్నుఁ జేరుము. అనఁగా నీకళ నాయందెక్కు వగాఁ బ్రవేశపెట్టుము. నన్నుద్ధరింపుము. ఇదిగో కాచియు న్నాఁడను. అని జరాసంధుఁడు పలికెనని గ్రహింపుఁడు.

ఈఘట్టమున మహాకవి పోతనామాత్యుఁడు చెప్పినపద్య రత్నములం బరిశీలింపుఁడు:—

సీ. అదలించి రొప్పంగ నాలమందలుగావు
గంధగజేంద్రసంఘములుగాని
పరికించి వినఁగ నంబారవంబులు గావు
వాజీంద్రహేషారవములుగాని

పదహతిఁ గూల్పంగఁ బ్రాతబండ్లివి కావు
నగసమానస్యందనములుగాని
ప్రియము లాడంగ నాభీరలోకము గాదు
కాలాభవైరివర్గంబుగాని
తే. యార్ప వనవహ్ని గాదు బాణాగ్ని గాని
మఱియ బృందావనము గాదు మొనలుగాని
యమునఁ గాదు నటింప ఘోరాజిగాని
పోరు నీకేల గోపాల పొమ్ము పొమ్ము.

మ. తరుణిం జంపుటయో బకుం గెడపుటో ధాత్రీజముల్
గూల్చుటో, ఖరముం ద్రుంచుటయో ఫణిం బఱపుటో గా
లిన్ నిబంధించుటో, గిరిహస్తంబునఁ దాల్చుటో లయమ
హాగ్నిస్ఫారదుర్వార దు, ర్భర బాణాహతి నెట్లు నిల్చెదవు
సప్రాణుండవై గోపకా.

వ. అదియునుంగాక.

సీ. గోపికావల్లకీఘోషణంబులు గావు
శింజినీరవములు చెవుడు పఱచు
వల్లవీకరముక్త వారిధారలు గావు
శరవృష్టిధారలు చక్కుసేయు
ఘోషాంగనాపాంగ కుటిలాహతులు గావు
నిశితాసినిహతులు నిగ్రహించు
నాభిరకామిని హస్తాబ్జములు గావు
ముష్టిఘాతంబులు మురువుడించు
తే. నల్లవ్రేపల్లె గాదు ఘోరావనీశ
మకరసంఘాతసంపూర్ణ మగధరాజ

వాహినీసాగరం బిది వనజనేత్ర
నెఱసి నిను దీవికై వడి నేఁడు ముంచు.

ఇంతదనుక మూలమున లేనియర్థము నిందుఁ జొప్పింపఁబడిన దనుట స్పష్టము కాదా. దీనిపిదప శ్రీకృష్ణుఁడు బదులుచెప్పఁగా నందులకు రోషించి జరాసంధుఁడు పల్కిన శ్లోకపద్యము కలదు. ఆపద్యమును దిలకింపుఁడు.

ఉ. బాలుఁడ వీవు కృష్ణ బలభద్రునిఁ బంపు రణంబుచేయ గో
పాలక బాలుతోడ జనపాలశిఖామణియైన మాగధుం
డాలము చేసెనంచు జనులాడెడి మాటకు సిగ్గుపుట్టెడిన్
జాలుఁ దొలంగు దివ్యశరజాలుర మమ్ము జయింపవచ్చునే.

అని యున్నది. పురుషాధమ, మంద, బంధుహా౯, అనుపదముల యం దిమిడియున్న యర్థము వదలిపెట్టఁ బడినది. బాలకేన లజ్జయా అను రెండుపదములయందుఁ గలయర్థము మాత్రమే గ్రహింపఁబడినది. గుప్తేనచ త్వయా అనుపదమునఁగల యత్యద్భుతార్థము స్పృశింపఁ బడలేదు. కేవలమూర్ఖుఁడు జరాసంధుఁ డనియే యీపద్యములనుండి తేలునుగాని భగవంతునికృపకుఁ బాత్రుఁడన్న యర్థ మిం దేమాత్రము గానరాదు. మహాకవి యాశయమెట్టిదో తెలిసికొనఁ జాలకున్నాఁడను. పద్యములు మిగుల హృద్యములుగా నున్నవి. కాని మూలమున విచిత్రార్థ మిం దించుకంతయైనఁ గానరాలేదనిమాత్రము చెప్పక తప్పదు. ఏది యెటులున్నను భగవంతునియందు వారికిఁగల భక్త్యనురాగము లనంతములు. పద్యములు సరసజనహృద్యములు. తర్వాతి విషయము నవధరింపుఁడు.

ఇట్లు జరాసంధుఁడు పలుకఁగా విని శ్రీకృష్ణుఁడు బదులు చెప్పఁ బూనునంతలో నతఁడు బలరాముని దిక్కు మొగంబై బలరామా! నీవు యుద్ధమర్మముల నెఱుంగుదేని శ్రమముల కోర్చి పోరాడు నలవాటుగలవాఁడవేని నాతోఁ బోరాడఁ బూనుము. నాబాణములం దెగి స్వర్గమున కరుగుము. శక్తి యున్నచో నన్నుఁ దెగటార్పుము. ఏమందువు? అనుటయు శ్రీహరి జరాసంధునితో రాజా! శూరులగువారు ప్రల్లదము లాడరు. తమకుఁ గలపౌరుషమును గార్యరూపమునఁ జూపు దురు. నీ వాతురుఁడవు. చావు గోరుచున్నవాఁడవు. ఇట్టి నీతో మా కేటిమాటలు? నీమాటల మే మాలకింపము. అని పలుకఁగా జరాసంధుఁ డాగ్రహించెను. ఇప్పట్టున మూలము.

న వై శూరా వికత్థంతే దర్శయంత్యేవ పౌరుషమ్,
న గృహ్ణీమో వచో రాజన్నాతురస్య ముమూర్షతః. ౧౯

మహాకవి పోతనగారిపద్యము:—

క. పొగడుకొనుదురే శూరులు
మగఁటిమిఁ జూపుదురు గాక మాగధ! నీకున్
మగతనము గలిగెనేనిం
దగు వెఱయ వికత్థనములు దగవీపోరన్.

ఇందు "ఆతురస్య ముమూర్షతః" "చావును గోరి ఆతురంపడుచున్న" యనునర్థము గానరాదు. ఏలొకో? మగతనము గలిగెనేనిన్, అనుదానిలో నీభావ మిమిడియున్నదనియో తెలియఁజాలకున్నాఁడను.

ఇట్లాగ్రహించి జరాసంధుఁడు ధ్వజపటము మెఱుంగులు తుఱంగలింప వెలయుచుండఁగాఁ జమత్కారముగ రథము

నడపునట్టిసారథి యరదమును నడపుచుండఁగా స్యందనంబునఁ గూరుచుండి మహత్తరసేనాసమేతుఁడై రామకృష్ణుల మార్కొనియెను. ఇట్లు పౌరుషమును గనఁబఱుపం బూని రామకృష్ణులం దలపడి ఘోరాహవంబు చేయఁబూని వాయుదేవుఁడు విజృంభించి సూర్యుని మేఘములచేతను, అగ్నిని పరాగముల చేతను గప్పునట్లు తీవ్రనారాచములఁ గప్పెను. ఆబాణములచే గరుడకేతనమున వెలయుచుండు శ్రీకృష్ణుస్యందనము, తాళధ్వజమున గుఱుతింపఁజాలు బలరామునరదంబు నీరెండును గప్పఁబడి కనఁబడవయ్యెను. ఈ మహాసంగరమును జూచువేడుకం బూని మధురానగరకాంతలు గోపురములపై హర్మ్యములపై నట్టలపైఁ గూరుచుండియుండిరి గాన రథములు రెండును గనఁబడకపోఁగా దురంతదుఃఖమునఁ గన్నీరు వదలిరి. క్షణకాలము మూర్ఛల మునింగిరి.

ఇట్లు రామకృష్ణుల బాణములం గప్పి సాయముగా వచ్చియున్న యాదవబలంబులఁ జీకాకు పఱచెను. ఆ మహాకృత్యమునకే యతఁడు గర్వించెను. దాన నాపరమేశ్వరుఁ డాగ్రహించెను. ధనుస్సుఁ గేలనంది తమయాదవసేనలు కుందుటకుం జాలినొంది యాగ్రహించి జ్యాలతఁ గోటికెక్కించి నిశాతనారాచములం గూర్చి జరాసంధునిఁ దద్వీరభటులను నొవ్వఁజేయఁ బూని ప్రయోగించెను. ఆబాణములు కాలదండములం బోలి నలుదెసలంబఱచి సేనలపైఁ బడియెను.ఆబాణములు సోఁకినంతనే కొన్ని యేనుంగులకుఁ గుంభస్థలములు బ్రద్దలయ్యెను. కొన్నింటికి దంతములు తెగిపోయెను. మఱియుం గొన్నింటికిఁ దొండములు ఖండితములై ధరఁ బడియెను. హయములలోఁ

గొన్నింటికిఁ గంఠములు నికృత్తము లయ్యెను. కొన్నింటికి నానావయవములు ఖండితము లయ్యెను. రథములు చూర్ణములై సారథులు ముందే మడియ రథికులు వారిపాటును జూడఁజాలక పోయిరో యన్నయట్లు ప్రాణములవదలి వీరస్వర్గము నలంకరించిరి. పాదములు హస్తములు తలలు మెడలు తెగిపడుచుండఁ గాల్బలములు క్రిందఁబడుచుండిరి.

ఇట్లు గజహయరథికపదాతులు తెగుటఁ బ్రవహించు రక్తపూరము మహానదిని బోలియుండెను. ఆ రక్తప్రవాహము నందు భుజములనే సర్పములును, శిరస్సులను తాఁబేలులును, గజశవరాసులు లంకలుగను, గుఱ్ఱములు మొసళ్లుగను, తెగి కొట్టుకొనిపోవు వీరభటహస్తములను మీనములును, వెండ్రుకలను నాచుతీఁగలును, ధనుస్సులను నలలును, వివిధాయుధ ములు ప్రవాహవేగమునం బొలుచున్న గుల్మములు (తీఁగెల గుంపులు)ను, బలకలను సుడులునుగా నుండెను. ఆ రక్తప్రవాహము చూచువారిలో భయస్వభావులకు మిగుల భీతినిగల్గించుచు ధీరులకు నానందకరమై యత్తఱిం బొల్పారెను. ఇట్లు శ్రీకృష్ణుఁడు శత్రువులం బరిమార్చుచుండ బలరాముఁడు చెలరేఁగి కాలమృత్యువు నిరసించు ముసలాయుధమున శత్రునికరముల నుగ్గాడుచు మహాసముద్రమును దిరస్కరించు మాగధ సేనను జించి చెండాడెను. ఇట్లన్నదమ్ము లిరువురు పరాక్రమించి తమశక్తిం జూపఁగా నా జరాసంధుని సేన లిరువదిమూఁడక్షౌహిణులు ముహూర్తమాత్రమున మంత్రించినట్లు రూపడంగెను. తన లీలాచేష్టలచే ముల్లోకములకు సృష్టిస్థితిసంహారములం గూర్చుభగవంతునకు శ్రీకృష్ణునకుఁ దుచ్ఛ జరాసంధసేనలం బరి

మూర్చు టొకప్రఖ్యాతి గాదు. కాని మానవత్వమూనినందున నించుక వర్ణనీయంబని యెఱుంగఁదగు.

తనసైన్యములు ముహూర్తమాత్రమున నశింపఁగాఁ దన రథము భగ్నముకాఁగా వెలవెలఁబోవుచున్న యాజరాసంధుని మించినపూన్కి బలరాముఁడు విక్రమించి త్వరపడి పట్టుకొని వరుణపాశంబులచేతను బెఱత్రాళ్లచేతను బంధింపఁ బూనెను. అంతియగాక వాని విశేషావమానమునకు లోనుగాఁ జేయఁ బ్రయత్నించెను. కాని హరి యాకార్యముల కిది సమయము కాదనియు నూహించి నివారించెను. బలరాముఁడు పట్టుకొని తన్నవమానింపఁ బూనుటయు శ్రీకృష్ణుఁడు విడిపించుటయుఁ దనకు మఱింత యవమతిం గల్పింపఁగాఁ దాను బ్రపంచమున విఖ్యాతబలపరాక్రమవంతుఁడయ్యును మహావాహినీవంతుఁ డయ్యు నాయిద్దఱు గోపాలబాలకులచే నోడుటకుఁ దనసేన లెల్ల భస్మీభూతమగుటకుం జింతించి మరలి నిజపురంబునకుఁ బోవఁజాలక తపోవనంబున కరుగఁ దలంచెను. తనకు సహాయముచేయవచ్చిన రాజులెల్ల నాతనిం బొడివినిలుచుండి మహారాజా! జరాసంధచక్రవర్తీ! ఈపరాజయంబునకుఁ జింతించెద వేల? కర్మబంధసంప్రాప్తము కదా యివి. దీనికి వగచిన లాభమేమి? దైవగతి యెట్టివారికేని దుర్లంఘ్యము కదా. ఇది నీ యెఱుంగనివిషయమా. అను నీమొదలగు ననేక లౌకికన్యాయదృష్టాంతముల చేత నాతనిచింతఁ బాపిరి.

జరాసంధుఁడు భావికాలప్రచోదితుండౌట వనగమనప్రయత్నమును జాలించి యవమానపరితాపతప్తహృదయుఁడై యెట్లో యింటికిం బోయెను. శ్రీహరియుఁ దన యాదవబలం

బుల కించుకయు నష్టములేకయుండఁ బరవాహినులఁ జెండాడి మరలి నగరంబుఁ బ్రవేశించుచుఁ ద్రిదశులుకురిపించు పూలవానల కానందించుచు నాత్మవిజయమునకు నానందపరవశులై పౌరులుకావించు ప్రశంసావచనములకును, వందిమాగధ వైతాళికుల స్తుతిపాఠంబులకును, వీణావేణుమృదంగాది శుభవాద్యములకును గరంబానందించుచు ధ్వజపటాద్యలంకృతమగు మధురానగరమును బ్రవేశించి యందు రాజమార్గంబులఁ బౌరపురంధ్రులొసరించు నీరాజనాశిషంబుల నంగీకరించుచుఁ దననివాసముచేరి యుద్ధరంగమున దొరకిన భూషణాద్యమూల్యవస్తువుల నెల్ల యదుప్రభుఁడైన యుగ్రసేనున కర్పించి బలరామునిం గూడి సుఖంబుండెను.

జరాసంధుఁడును దనయవమానమును బాపుకొనం దలంచి మఱియుఁ బెక్కుసేనలం గూర్చుకొని మధురానగరమును ముట్టడించి ఘోరాహవము చేయఁబూనెను. శ్రీహరియు బలరామునింగూడి యాదవసేనలం గైకొని నగరము వెడలి శత్రుసేనలం బొలియించి జరాసంధు నేమనక విడిచిపుచ్చెను. వాఁడు మరల నిజపురంబున కరిగి కొంతకాలముండి బహుళసేనాపరివృతుండై మరల మధురను ముట్టడించెను. ఇట్లు పదునేడుపర్యాయములు మధురానగరము భస్మముచేయఁబూని ముట్టడించి యొక్కపర్యాయమైనను గెలుపునొందక పాఱిపోయెను. బలరామ శ్రీకృష్ణులతోడ్పాటుగల యాదవవీరులు పెక్కుచెదరక జరాసంధుని సేనాకూపారము నిలువరింపఁ జాలెను. పదునెనిమిదవపర్యాయ మత్యధికసేనలం గూర్చుకొని రాఁ బ్రయత్నము చేయుచుండెను.

మహాశయులారా! ఈకథయందొక్కవిషయము వ్రాయఁదగినది గలదు. జరాసంధుఁడు విద్వాంసుఁడు. మహాపరాక్రమవంతుఁడు. పెక్కుసంగరముల నరివీరుల జయించిన మేటి. అట్టులయ్యు మధురానగరమును ముట్టడించి విధివశమున నోడిపోయెను. ఇదేసమయమని పెక్కుమందిరాజు లా జరాసంధునకుఁ దోడ్పడిరి. ఇరువదిమూఁడక్షౌహిణులసేన లాతని వశమందు దేహము లర్పింప సంసిద్ధముగా నుండెను. అందఱు పెక్కుసంగరముల నాటితేఱినవారలే కాని వేఱుగాదు. ఇట్టులయ్యుఁ దొలియుద్ధమున నోడిపోయెను. సేనలన్నియు యుద్ధభూమిని దలలు పోఁగొట్టుకొనియెను. తాఁ బట్టుపడియెను. శ్రీహరి విడిపించెను. ఆయవమానమున నిఁక గిరివ్రజమున కరుగరాదని తలంచి తపోవనమునకుఁ బోవఁ బ్రయత్నించెను. కాని యాకార్యము కొనసాగిన నాతనిమూలమునఁ గావలసిన భూభారహరణకార్యము కాదు. కాఁబట్టి భగవంతుఁ డాలోచించెను. వీఁడుండినఁగాని వీనిని నమ్మి పెక్కుమందిరాజులు యుద్ధమునకు రారు. యుద్ధము సాగినఁగాని యనేకప్రాణులు మృతినొందరు. అట్లు సాగినఁగాని భూభారము తగ్గదు. కావున జరాసంధునకుఁ బౌరుషమును వృద్ధిచేయవలయునే గాని శాంతమునకుఁ జోటు మది నునుపరాదు. అని యోజించి వానికి సాయమొనరింపవచ్చి యుద్ధముననోడి జీవచ్ఛవములవలెనున్న రాజులందఱకు మత్సరము నెలకొనఁ జేసెను. వారు దాన ముందటికంటె మహారోషపూరితాంతరంగులై కత్తులదూసి యిపుడే బలరామాదియోధులఁ జించి చెండాడఁజాలమాయని పలికిరి. వారిమాటలు జరాసంధున కప్పటికి రుచించెను. తపోవనమున

కరుగఁదలఁచుకొన్న యతనిపూన్కి వడుసగా శాంతించెను. వారందఱు యాదవవీరులను రామకృష్ణులను బోరిపుత్తురన్న యాశ దృఢపడియెను. అంతకుముందే కన్నులారఁజూచిన వారి పౌరుషమపుడు ఫలించునని యతనికిం దోఁచెను. వారాడు వీరాలాపములు హితోపదేశములు సత్యములని యాతనికి స్ఫురించెను. తపోవనగమనమునకంటె యుద్ధప్రయత్నము చేయుటయే రాజధర్మమని యూహించెను.

భగవంతుఁ డాలోచించినదేదో యది యందఱకు రుచించునను టనిక్కము. ఒక్కఁడైనను యుద్ధమును జేయఁజాలక పిఱికిపందలై పరుగెత్తినరాజులకు మరలఁ దమరు గెలుపుగొందుమని యూహించుటయే పైసిద్ధాంతమును దృఢపఱచుచున్నది. వారి కించుకంతయైన శంకకలుగకుండుటకన్న విచిత్రమేమున్నది? వారు బోధింపకున్న జరాసంధుఁడు తపోవనమున కరుగును. ఎందఱో రాజులు చావవలసి యున్నది. ఇన్నికార్యములు సాగవు. ఒక్కజరాసంధుఁ డెవ్వరిమాట లాలింపక యవమానమునఁ గృశించి రాజ్యము తృణమని మాని తపోవనంబున కరిగిన భూభారము తగ్గుటకు వీలులేదు. కావున భగవంతుఁడు వానిసామంతులు మిత్రులు మొదలగువారి కాతని నడ్డుటకుఁ బురికొల్పెను. వారు భగవత్సంకల్పానుసారము వానికి హిత ముపదేశించిరి. వైరిబలములనెఱింగియు సకల వారినిజయింతమని బుద్ధిని గనఁబఱచిరి. ఆమాట లాతని కత్తఱి హితములుగాఁ దోఁచెను. స్వానుభవమున నెఱిఁగిన విషయముకూడ మాటలతోఁ జెదరిపోయెను. మరల యుద్ధమునకుంబోయిన గెలువఁగలమనునాశ యాతనికిం బొడకట్టెను.

యుక్తియుక్తముగఁ దోఁచెను. ఇంతకుముందు శ్రీరామకృష్ణుల దాడి కొక్కనిముసమైన నోర్వనిశూరులఁ దాను గన్నులారఁ గాంచియు మరల వారు గెలుపును దనకుఁ గూర్తురని నమ్మెను. ఇట్లు నమ్మునట్లు చేసినదేది? విధి. విధి బలవత్తరము కదా. దానిని మీఱ నెవ్వరికే నయితిగాదు. దానిత్రిప్పులకు లోఁబడనివాఁ డొక్కభగవంతుఁడే. ప్రపంచముల మఱెవ్వరును లేరని యెఱుంగవలయు. విధియన నేమోయని సంశయింపఁ బనిలేదు. భగవత్సంకల్పమే. ఆసంకల్పమే ప్రకృతియనంబడు. విధియనియుఁ జెప్పంబడు. దానిత్రిప్పులకుఁ ద్రిమూర్తులే లోఁబడుదురనఁగాఁ దక్కినవారిమాట యిటఁ జెప్పనేటికి? హరిహరులు సంగరమొనరించిరి కదా. అప్పటి శివధనుస్సుగదా జనకచక్రవర్తి యింట నుండెను. వారికేమి పరస్పర మోడింపఁజాలమను జ్ఞానములేదా. విధిచేష్టను మార్ప శక్యముగాదనువిషయమును మన మెఱుంగవలయును. అట్టిచోట విధిచెయ్వులఁ దప్పించుకొను టెట్లు? తత్పాదారవిందార్చనముచేతనే గాని వేఱు మార్గము లేదు. దీనినే వైష్ణవులు శరణాగతి యందురు. ఈ విషయమే శ్రీమచ్ఛంకరభగవత్పాదులవారు సౌందర్యలహరి యం దిట్లు తేటపఱిచిరి.

" శ్లో. త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ
స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా,
భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం
శరణ్యే లోకానాం తవహి చరణావేవ నిపుణౌ.

వ్యా. అయంభావః. హస్తాభ్యామభయవరదానం సర్వసాధారణ మితికృత్వా త్వచ్చరణావేవ తాదృశాభయవరదానే

స్వయమేవ వ్యాపృత్తా. అతస్తవనకర్తవ్యం హస్తాభ్యా మభయ వరప్రదానం ప్రయోజనాభావాత్. సర్వసాధారణప్రసంగాత్. లోకైకశరణ్యత్వ వ్యాఘాతశ్చేత్యుపదేశ ఇతి.”

భగవదిచ్ఛను బ్రార్థించి నీవుతప్ప వేఱుగతిలేదని నమ్మియుంటయే కర్తవ్యమని దీనిసారము. కావున నేకార్యముచేయుటకు మనము శక్తులముగామనియు సర్వము భగవదిచ్ఛచే సాగుచుండుననియు దాని నివారింప మనముగాదు త్రిమూర్తులుగూడ నశక్తులనియు నెఱుంగుట ముఖ్యము. దీనినెఱింగియు నను స్థానమున నునుచుకొనక పోవుటకంటె నవినీతి యింకొక్కటి లేదని యెఱుంగవలయు. ఇంకఁ బెంచివ్రాయక తరువాతికథను వ్రాసెదను.

వికద్రువను గోపకుఁడు శ్రీకృష్ణునకు భావికర్తవ్యమును జెప్పుట.

* జరాసంధుఁడు పదునేడుమాఱులు దాడిసలిపి యోడిపోవఁగా యాదవులు శ్రీకృష్ణబలదేవులంగూడి హాయిగా నుండిరి. జరాసంధుని యంతఃపురమునకు రాజగృహమని పేరు. కొందఱు తన్నగరమున కాపేరందురు. రాజగృహేశ్వరుఁడనఁగా జరాసంధుఁడని జనవిదితము. ఆజరాసంధుఁ డిన్నిమాఱు లోడిపోయినను దనపుత్రికలిద్దఱు ప్రోత్సహింపఁ బదునెనిమిదవమాఱు దండయాత్రకు సన్నద్ధుఁడయ్యెను. యాదవు లెంతప్రయత్నము చేసినను బదునేడుపర్యాయములు జరాసంధుని వధింపఁజాలక పోయిరి. ఓడిపోవుటయేగాని యతఁడు చచ్చుటమాత్రము సాగకుండెను. జరాసంధుఁడు బృహద్రథుని కుమారుఁడు. రాజ

---

* ఈవిషయము హరివంశవిష్ణుపర్వము ముప్పదియేడవ యధ్యాయము నుండి వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

గృహేశ్వరుఁడు. శ్రీకృష్ణునిఁ బొలియింపనేకోరుచుండువాఁడు. కావునఁ బదునెనిమిదవమాఱు గొప్పదండుతో మథురను ముట్టడింపఁ బ్రయత్నించెను. యాదవు లావృత్తాంతము నెఱింగిరి. జరాసంధునిభయము మనల వదలకున్నదే యని పరితపించిరి. అందఱొక్కచోఁ జేరి యాలోచింపసాగిరి. శ్రీకృష్ణుఁడు బలరామునింగూడి యాసభలో నుండెను. పెద్దపిన్న లటఁ జేరిరి. ముందొనర్పందగు పనియేమని యూహింపసాగిరి. ఆసభలో మహాతేజుఁడు నీతిశాస్త్రకోవిదుఁడునగు వికద్రువను గోపకుఁ డుండెను. ఆయాలోచనల నన్నింటి నాలకించెను. తనకుం దోఁచినభంగి నిట్లు చెప్పఁబూనెను. ఉగ్రసేనుఁడు వినుచుండ శ్రీకృష్ణునితో నిట్లు పలికెను.

గోవిందా! తండ్రీ! యీయదుకులసముత్పత్తివిధ మెఱింగించెద. ఆలకింపుము. అది తెలుపుట కిది తగినకాలము. ఆమీఁద నీకు హితమైనఁ జేయుము. యదువంశ మేకాలమున నెట్లుత్పత్తి యయ్యెనో యెఱింగించెదను. వ్యాసులు జ్ఞానదృష్టి నవలోకించి నాకొక్కపర్యాయము తెలిపెను. ఆవిషయము నే చెప్పెదను. మనువంశము సుప్రసిద్ధము కదా. అది యిక్ష్వాకువంశమను నామమునఁ బరఁగెను. ఇక్ష్వాకుమహారాజునకుఁ గొడుకుగలఁడు. హర్యశ్వుఁడని యాతని నామధేయము. మహేంద్రసమాన విక్రముఁడై విఖ్యాతిని గాంచెను. ఆహర్యశ్వునకుఁ బ్రీతిపాత్రురాలగు భార్య గలదు. ఆమె మధుదానవుని పుత్రిక. మధుమతి యని యామెపేరు. ఇంద్రునకు శచీదేవివలె నారాజున కామధుమతి యనువ్రతయై యుండెను. నవయౌవనస్ఫురితయై రూపవతియై భర్తకుఁ బ్రాణతుల్యయై నియతవ్రతయై యుండెను.

ఆమె రాక్షసేంద్రకులసంజాతయౌటఁ గామరూపిణియు నయ్యెను. వియద్గమనమున నెచ్చటికైనఁ బోవఁగలశక్తియు నామెకుఁ గలదు. ఆమెయే హర్యశ్వుని సుగుణసంపదకు నానందించి యాతనిం గోరెను. ఆతఁ డామెను బెండ్లియాడెను. దాంపత్య మనుపమానమై యుండెను.

కొంతకాలమున కాతనియన్న హర్యశ్వుని రాజ్యము నుండి వెడలఁగొట్టెను. అయోధ్యను వెడలిపోవలసిన హర్యశ్వుఁడు చింతాక్రాంతుఁడై యేమిచేయుటకుఁ దోఁచక తన్ను నమ్మియున్న స్వల్పపరివారమునుగూడి భార్యంగలిసి వనమున నుండఁబోయెను. కాలగతులనెఱిఁగిన యాకమలేక్షణ ప్రాణనాథునితో నొక్కనాఁ డిట్టులనియె. ప్రాణేశా! రాజ్యపరిత్యాగ దుఃఖమును వదలుము. నన్నుంగూడి నాతండ్రియగు మధుదానవు నింటికిఁబోవ సమ్మతింపుము. మాతండ్రినివసించు మధువనము నిరంతరమనోహరఫలపుష్పసంభృతము. ఆవనమున సంతోషమున విహరింతము. నాతల్లిదండ్రులు విశేషించి నిన్నుం బ్రేమింతురుగాని రాజ్యహీనుఁడని చిన్నచూపునఁ జూడరు. మాయన్న లవణాసురుఁడు నన్ను విశేషించి యాదరించువాఁడు. కావున నాయందున్నప్రీతిచే నిన్ను గౌరవించును. ఆవనమున మనమిరువురము రాజ్యముననున్నయట్లే యుండుదము. అచ్చటి వనవిహారము నందనవనమున విహరించుదేవతలం బోలియుండును. స్వర్గసుఖము లందుఁగలవని యెఱుంగుము. మీయన్న రాజ్యమదమున విఱ్ఱవీఁగి నిన్నుం దిరస్కరించెను. కావున నాతనిపైఁ గలయభిమానమును మాని నా మాట నంగీకరింపుము. గౌరవహీనమగు నీరాజ్యము తుచ్ఛము.

సేవకునివలె నిందుండుట మర్యాదగాదు. మనమిరువురము నా తండ్రియింటికిం బోవుదము.

హితములై కాలోచితములై న్యాయసమ్మతములైయున్న యా మధుమతీవాక్యముల కారాజు సమ్మతించి యన్నను రాజ్యమును వదలి మధువనమునకుం బోయెను. భార్యయు మితపరిజనులు వెంటనే పోయిరి. మధుదానవుఁ డల్లునిఁ గూఁతును మిగుల గారవించి వారిరాక కపరిమితానందము నొంది వత్సా! ఆయాసంపడక వచ్చితివిగదా. నిన్నుంజూడ సమ్మోదము మదిఁ గుదురుకొనియెను. మధువన మియ్యదితప్ప నారాజ్యమెల్ల నీకొసంగెదను. అంతఃపురము లిచ్చెదను. స్వేచ్ఛగా నందు నివసింపుము. ఈవనమందు మత్పుత్త్రకుఁడు లవణాసురుఁ డుండును. వాఁడు నీకెల్లభంగుల సాయపడును. నీవు శత్రునిబర్హణమును గోరినచో నాతఁడు నీకు బాసటయై జయము చేకూర్చును. సముద్రానూపభూములచే నున్నతమై సిరులసొంపారు నీ రాజ్యమును బూజ్యభంగిఁ బాలింపుము. ఈనా రాజ్యమునందు గోసహస్రములు గలవు. ఆభీరజనులు పిక్కటిల్లుచుందురు. ఐశ్వర్యము సాంద్రమై యుండును. ఈరాజ్యమునకు ముఖ్యనగరము గిరిపురమగును. అవి శత్రుదుర్గమము. విశాలసౌధవిరాజితము. అది నివాసము నీకుఁగాఁదగును. ప్రియసుఖముల నొసంగునది. నిరామయము. జలసమృద్ధము. అనేక సాంద్రవనసంశోభితము. ఆనర్తమనుపేరఁ బరఁగునీరాజ్యము నీ కొసంగెదను. కాలయోగమున నీరాజ్యమున నీయధీనము కాఁగలదని నమ్మెదను. పార్థివవృత్తమును వదలక యిందు నివసించి పూజ్యభంగి రాజ్యమేలుము. యయాతిపుత్త్రునిసంబంధమున నీవంశము యాదవవంశ

మనుపేరం బ్రఖ్యాతము కాఁగలదు. ఇఁకమీఁద నీవంశము చంద్రవంశముగా మాఱఁగలదు. యయాతిపుత్త్రుఁడగు యదువు యోగము నభ్యసించి నీకుఁ గుమారుఁడగు. తండ్రిశాపమున రాజ్యహీనుఁడు గాన వనమున యోగాభ్యాసముచేసి నీవంశమున జనించును. కావున నాతఁడే యీ రెండువంశములకుం గర్త కాఁగలఁడు. ఇట్లు నీవంశము చంద్రవంశముగా మాఱి యాదవాహ్వయమున నొప్పి ప్రసిద్ధిని గాంచఁగలదు. కావున నీరాజ్యము సర్వసమృద్ధమును గైకొని పాలింపుము. నీ కీరాజ్యమునొసంగి తపోవనమునకుం బోయెదను. ఈ రాజ్యపాలనమున లవణాసురుఁడు నీకుఁ దోడ్పడంగలఁడు. నీ వంశాభివృద్ధిం గోరి నాయీరాజ్యమును గైకొని పాలింపుము.

అని మధుదానవేశ్వరుఁడు పలుక హార్యశ్వుఁ డంగీకరించి గిరివ్రజపురమును బరిగ్రహించెను. దానవేంద్రుఁడు తపోవనమున కరిగెను. ఆతపోవనము సముద్రాంతికమున నుండెను. హార్యశ్వుఁడు గిరివ్రజనగరమున నివసించి రాజ్యమును బాలించుచుండెను. ఆరాజ్య మానర్తమన విఖ్యాతంబై గోధనము మిక్కుటముగా వెలయ స్వల్పకాలమున నెల్లరాజ్యములలో నుత్తమోత్తమంబై నెగడెను. సముద్రతీరవనములచే విభూషితమై అనూపభూములు గలిగి విచిత్రక్షేత్రములు సర్వసస్యసమృద్ధములై యొప్పారఁగా ప్రాకారము గలగ్రామములు చెన్నుమీఱుచుండఁ గీర్తనీయంబై యుండెను. రాష్ట్రవర్ధనుఁడగు నాహార్యశ్వుఁ డారాజ్యమును న్యాయమార్గమున విఖ్యాతిమీఱఁ బ్రజానురాగము వృద్ధినొందుచుండఁ బాలించెను.

రాజ్యలక్షణములు గొఱంతఁగాంచక యుండెను. దినదినాభివృద్ధి నొంది నాఖ్యైశ్వర్యము లొప్పెను.

ఇట్లుండఁ గొంతకాలము నా మధుమతీదేవి యదువను పేర విఖ్యాతినొందు కుమారునిం గనియె. దుందుభినిస్వనము గల యాయదువు వృద్ధినొందెను. అతని జూచినంతనే బాల్యమునందే పరరాజులు వడఁకుచుండురు. రాజలక్షణములన్నియు నాతనియందుఁ గన్పట్టుచు నుండెను. యయాతికి నీయదువే పుత్రుఁడై యుండునపుడు పూరుఁడనువాఁడు జ్యేష్ఠుఁడై యుండెనో ఈజన్మమున నాతఁడే యీతనికిఁ గొమరుఁడై పుట్టెను. హర్యశ్వుఁడు పదివేలసంవత్సరములు రాజ్యమును బూజ్యభంగిఁ బాలించి యప్రతిముఁడై విఖ్యాతింగాంచి స్వర్గపురము నలంకరించెను. యదువును బ్రజలే పట్టాభిషిక్తుని జేసిరి. యదువు రాజై తస్కరాదిబాధలు లేకయుండ రాజ్యమును బాలించుచు వంశకర్త యయ్యెను. ఈతనికాలమున నీవంశము యాదవవంశమనం బ్రఖ్యాతిం గాంచెను.

ఆయదుభూపాలుఁ డొక్కతరుణమున గుణోదారలగు దారలంగూడి తారకాసహితుఁడగు శశాంకునిచందమున సాగరజలముల జలక్రీడల సల్పెను. అందొక మహాసర్పము నివసించుచుండి యీయదువు నీడ్చుకొనిపోయి సర్పపురమునం జేర్చెను. ఆసర్పపురము పాతాళలోకమందుండి మణిమయ గృహద్వారముల శోభిల్లుచు నుండెను. రత్నరాసు లానగరమున గవ్వలవలె నుండెను. అచ్చటివృక్షములు ప్రవాళచ్ఛాయ గలవి. సదాకుసుమములు ఫలములు వానియం దుండును. వానిశాఖలయం దెల్లయెడల బాలనాగములు వ్రేలాడుచుం

డును. అవి రాత్రులయందు సాగరజలంబుల నుండును. పగళు లందెల్ల నీవృక్షశాఖల వ్రేలాడుచు విహరించుచుండును. ఆనగరము సముద్రమునడుమఁ గట్టఁబడినది. భూతలముననున్న నగరములవలెఁ గన్పట్టుచుండెను. ఆపురవరమును బరికించి యదునరపతి పరమప్రమోదమానసుఁ డయ్యెను.

ఆనగరమును బ్రవేశించి యందుఁ బద్మపత్రాకారమణినిర్మితసింహాసనమునఁ గూరుచున్న సర్పరాజును గాంచెను. ఆద్విజిహ్వపతి యవ్యగ్రుఁడై ధూమ్రవర్ణుఁడై యుండువాఁడు. యదునరపతింగాంచి యాదరమున నిట్లు భాషించెను. వత్సా! నిన్ను వంశభూషణుని గొడుకుంబడసి చాలకాలము న్యాయమార్గమున రాజ్యమేలి నీతండ్రి హర్యశ్వుఁడు స్వర్గపురము నలంకరించెను. యదురాజా! ఆవంశము నీపేర యాదవనామమునఁ బరఁగును. నీవంశమునఁ గొంతకాలమునకు దేవతలు సర్పములు పుట్టఁగలవు. నాకు సద్వృత్తిభూషణభూషితలగు కుమారికలైదుగురు కలరు. యువనాశ్వతనయుని సోదరి నా పత్ని. ప్రాజాపత్యవిధిని వీరిని వివాహమాడుము. నీవు వరార్హుఁడవు. కావున నీకు వరమిచ్చెద. భోమకుకురభోజాంధక యాదవదాశార్హవృష్ణినామముల నేడువిధములుగా నీవంశము ప్రఖ్యాతిం గాంచి మర్త్యలోకమున వెలయును. అని వరమిచ్చి ధూమ్రవర్ణముల విరాజిల్లు తనపుత్రికల నైదుగురను ధారాపూర్వకముగా నాతని కొసంగెను. వరము నొసంగెను. ఆకన్యకలను యదువు మహాదరమున గ్రహించెను. వివాహానంతరము యదురాజు మామంగాంచి యార్యా! యీనీపుత్రికల యందుఁ బితృమాతృతేజోవిరాజితులగు కొడుకులు గల్గుదురు

గాక. మనసమయమునకు బద్ధులై సలిలాభ్యంతరమునఁ జరిం పఁగలిగి కామరూపులై వారు నీవంశము నలరింతురు గాక. అని యీవర మనుగ్రహింపుమని కోరి యాతఁ డంగీకరింపఁ గన్యకలను వరమును గైకొని యదుభూపాలుఁడు జలముల నుండి చంద్రునివలె వెడలివచ్చెను. పంచభార్యలనడుమఁ దార కాపంచకాంతరమున నలరు నమృతకిరణునిం బోలి యాతఁడు చూడనొప్పెను. వివాహకాలవేషము వానిం బాయకుండెను. దివ్యాంగరాగము కనఁబడుచు మనోహరముగ నుండెను. తన భార్యలకు వారింజూపి తనపోయివచ్చినవిధ మెఱిఁగింప వా రాపత్నులంగలిసి యాదృతిమై నుండిరి. ఇంచుకంతయు మనః ఖేదమునొందక యుండిరి. అని పలికి పికద్రువు తరువాతికథను జెప్పఁబూనెను.

మహాశయులారా! ఈకథ విచిత్రముగా గాన్పించును. సముద్రోదకములందు జలక్రీడలుసల్పుట విచిత్రము గాదు. రాజులకుఁ బెక్కండ్రుపత్నులుండుటయు విచిత్రము గాదు. ఆసమయమున రాజును ఘోరజలసర్పము పట్టుకొనుటయుఁ జిత్రము గాదు. ఆ పట్టుకొనినపాము యదువును సర్పపురము నకుం గొంపోవుటయు నందొకసర్పరాజు సింహాసనాసీనుఁడై యుండి యాదృతిసంభాషించి వరమొసఁగి మనుష్యుఁడగు యదు వునకుఁ దనపుత్రికాపంచకము నొసంగి పంపుటమాత్ర మబ్బుర ముగాఁ దోఁచును. సర్పలోకమునకుం బోయినపుడు యదువు నొక్కపామైనఁ గఱవకుండుటయు నాశ్చర్యమును గొలుపు విషయమే. ఆపాములకు విషము లేదందుమా పురాణములు పెక్కులు గరళజ్వాలలఁ గ్రక్కుచుండుసర్పములు పాతాళ

మునఁ గలవని వర్ణించినవి. గరళముండిన నదియొక యలంకార ముగాని యితరులం గఱచుటకుం గాదందుమా యదియు నంతగా మదికి సరిపడువిషయము గాదు. కేవలాన్యృతకల్పన లివి యనుట కాస్తికులకు నోరాడదు. నమ్మినవారిని నమ్మనిండు. నమ్మనివారిని నమ్మకపోనిండు అని యూరకుందమా అది సమాధానము చెప్పఁజాలకుంటను బోధించును. కావున నిష్పక్షమునఁ బ్రమాణబుద్ధిగలవారల కనుకూలించునట్లు సమాధానమును జెప్పఁబూనితి. ఆలకింపుఁడు.

భగవంతునిశక్తి యచింత్యము. ఈమాట నంద అంగీకరింపక తప్పదు. సృష్టివైచిత్ర్యము లనంతములు. ఎవరుగాని యిట్టి చమత్కారముమాత్ర మేసృష్టికిఁ గలదని నిర్ణయింపఁ జాలరనుట నిర్వివాదాంశము. పరిశోధకు లింతదనుక నేయేవిచిత్రములఁ గనుఁగొనిరో యింతకన్న నికఁ నెక్కుడువిచిత్రములు లేవని వారును జెప్పఁజాలరనియు నానమ్మకము. చెప్పఁబూనినను నమ్మఁదగినవిషయ మిదిగాదని బదులుచెప్పువారును బెక్కుమంది యుండకపోరు. సృష్టి పూర్వకాలముననున్న ట్లిప్పుడు లేదు. చాలమార్పులు గలిగినవి. ప్రకృతి నవీనచిత్రములు పూర్వకాలముననుండిన విపుడు బయల్పడుచున్నవి. ఎనుబది యడుగుల యెత్తుగలజంతువు కాలొకటి యిటీవలఁ గనఁబడిన దఁట. ఇఁక నాజంతువెంత యెత్తుండునో యూహించిన నద్భుతముగఁ దోఁచును. అంతటిజంతువు లిపుడు కానరావు. కావున సృష్టి దానికిఁ బ్రతినిధిగ నిపుడున్నది. దీనికింగారణము కాలమని కొంద అందురు. అది పొరపాటు. భగవతి చిత్రచేష్టితమని నే నందును. కాల మొక్కరీతి నుండునది. దానివిభా

గము కేవలకల్పితము. వ్యవహారార్థము కల్పింపఁ బడినది. కావునఁ గాలము హేతువు కాదు. కాలరూపుఁడగు భగవంతుఁడే కారణమన్న శిరసావహించెదను.

మానవులకు స్వర్గపాతాళవాసులతో సంగతి గలదని యంగీకరింపకతప్పదు. రాకపోకలుండెను. అన్నియుఁ గల్పితములన వీలులేదు. ఇపుడిపుడు ఖగోళవాసులతో మాటలాడు వారును, బ్రయత్నించువారును, యంత్రముల సిద్ధముచేయుచుండువారును గలరు కదా. యంత్రములద్వారా కాక తపోబలమున నాకాలమున రాకపోకలు సాగుచుండెను. సర్పములు కామరూపములు సృష్ట్యాదియందు రూపములు సంకీర్ణములుగ నుండునని పురాణములు చెప్పుచున్నది. అధోభాగము సర్పాకారము. ఊర్ధ్వభాగము మానవాకృతి. ఇది పాతాళవాసులయందు మర్యాదగ నుండెను. గుఱ్ఱములకు ఱెక్కలుండెను. ఇపుడు లేవేల? అను ప్రశ్న మసంగతము. పక్షిమర్యాద గుఱ్ఱములయం దుండెను. ఇపుడు శుకములు గోరపక్షులు మనుష్యులవలె మాటలాడుట ప్రాచీనసృష్టిమర్యాదలో మిగిలియున్నదని యెఱుంగవచ్చును. అన్నిపక్షుల కా యలవా టుండెనేమోయన్న లేదని సిద్ధాంతముచేయ నవకాశము లేదు. ఆయలవాటు క్రమముగా నశించి బీజరూపముగాఁ గొన్నిజాతులపక్షులయం దున్నదన్నది యుక్తియుక్తము. ఏదేశపుగుఱ్ఱము లా దేశభాషతోఁ జెప్పినవిషయముల గ్రహించుచున్నవి కదా. ఇట్లే యన్నియునని మన మూహింపవచ్చును. మనకున్న యల్పజ్ఞానమునఁ బెక్కువేల హాయనములనాఁటివార్త లసత్యములనుట వింతకదా. అట్టి సాహసకార్యమునకుఁ బూనరాదు.

పూనిన నపహాస్యభాజన మగును. తపస్సు పూర్వకాలమునఁ బ్రధానము. అది యిపుడు గగనారవిందము. ఆఇంద్రియ నిగ్రహ మపుడు వ్రతము. అది యిపుడు శశవిషాణము. చిర కాలోపవాసము లప్పటియలవాటులు. అది యిపుడు గ్రంథ స్థము. నూఱుసంవత్సరములకు మించినకాలము జీవించుట యప్పటికాలస్వభావము. నూఱువత్సరములైన జీవించుట యిపు డద్భుతావహము. ఇరుప్రొద్దు భుజించుట పూర్వకాల జనాభ్యాసము. పెక్కుసారులు భుజించుట, ఫలముల మెక్కుట, చేఁదుపానకము త్రాగుట, అది త్రాగకయున్నఁ దలతిరు గుట యిప్పటి సదాచారములు. భగవత్సేవ సర్వజనసా ధారణముగాఁ బూర్వపుటాచారము. భగవత్సేవ విరళమ గుట యిప్పటి యసదృశాచారము. శీతోదకస్నానము పూ ర్వపద్ధతి. ఉష్ణోదకస్నాన మిప్పటిపద్ధతి. రోగము లెప్పుడో వచ్చుట ప్రాచీనకాలాచారము. రోగములు రాకుండు టొకా నొకప్పుడనునది యిప్పటియాచారము. అడిగినవారికి నాము ష్మికవిషయములఁ దెల్పుట పూర్వులమర్యాద. అడుగని వారి కుపన్యాసరూపముగాఁ దెల్పుట యిప్పటివారి మర్యాద. గ్రంథములువ్రాయుట పూర్వులపాండిత్యము. ఉపోద్ఘాతము లువ్రాయు టిప్పటివారి పాండిత్యము. యోగదృష్టి పూర్వుల కుండెను. దర్పణాత్మీసహాయైకదృష్టి యిప్పటివారి కున్నది. కుత్సితదూషణము పూర్వము పాపము. అది యిప్పుడు పుణ్య ము. వేదములఁబఠించుట పూర్వుల యలవాటు. ఉపన్యాసముల వేదికలయందు వేదముల స్మరించుట యిప్పటియలవాఁటు. తన కున్నశక్తిని క్రియారూపమునఁ దెలిపి వాగ్రూపమునఁ దెలుప

కుంట మున్నున్నపద్ధతి. తనకు లేనిశక్తిని గ్రియారూపమునఁ దెలుప వలనుపడదు గాన వాగ్రూపమునఁ దెలుపుట యిప్పటి వారి పద్ధతి. ఖేచరమార్గమున నెందేనరుగుట పూర్వకాలయోగుల సామర్థ్యము. ధూమశకటమునందో నౌకయందో విమానమునందో మర్యాదాస్థానమునఁ గూరుచుండి యరుగు టిప్పటి యోగుల సామర్థ్యము. శాపానుగ్రహఫల మొనఁగూర్చుట పూర్వమహర్షుల మహశ్శక్తి. వార్తాపత్త్రికలయందుఁ దనభావమును వ్రాయు టిప్పటిమహర్షుల మహశ్శక్తి. త్రిలోకములయందెందున్న వస్తువునైనను గనుఁగొనుట ముందున్న మహాత్ముల నైజము. ప్రత్యక్షవస్తువుల యంత్రసహాయమునఁ దెలిసికొను టిప్పటిమహాత్ముల నైజము. భగవంతుఁడు ప్రత్యక్షమైనను జెప్పుకొనకయుండుట ప్రాక్కాలిక సజ్జనాచారము. భగవంతుఁడు దేవాలయముల శిలారూపమునఁ బ్రత్యక్షము కాఁగా నాయెదుట సాక్షాత్కరించెనని నలువురతోఁ జెప్పుట యిప్పటి సజ్జనులయాచారము. వ్యర్థముగా ధనవ్యయము చేయక మంత్రతంత్రముల యథాక్రమముగా వివాహాదిసంస్కారముల నొనర్చుట పూర్వాచారము. వ్యర్థముగా ధనవ్యయము చేసి మంత్రతంత్రముల యథాక్రమముగా వివాహాదిసంస్కారములఁ దగ్గించు టిప్పటియాచారము. సర్వకర్మముల బ్రహ్మార్పణము చేయుట ముందటివారి స్వభావము. సర్వకర్మముల నాత్మార్పణము చేసికొను టిప్పటివారి స్వభావము. తాఁ జేసినదాన మితరులకుం దెల్పకుండుట పూర్వస్వభావము. తాఁ జేసినదానము గోరంత కొండంతలు చేసి వార్తాపత్త్రికలమూలమున నెల్లరకుం దెల్పు టిప్పటి కాలస్వభావము. ఆత్మస్తుతి పాపమనుట ముందటి

వారి మార్గము. ఆత్మస్తుతికంటె మహాపుణ్యము వేఱొకటి లేదని చెప్పు టిప్పటివారి మార్గము.

ఇట్టు లనేకవిషయములు పూర్వమున కిప్పటికిని మార్పు నొందినవి. ఇప్పటి యాచారములయందుఁ గొన్ని మంచివి లే వనరాదు. పూర్వాచారములయందు దోషము లేనేలేదనరాదు. కాలము మాఱినందున నలవాటులు మాఱినవనుటయే యీ వ్రాఁతకు ఫలము. కావున నిప్పటి యలవాటులంబట్టి పూర్వ పద్ధతు లిట్టివని కనుఁగొనుట యశక్యమని తెల్పుచున్నాఁడను. కాఁబట్టి సర్పలోకము లేదని సర్పములకు మనుష్యులకును సం బంధము లేదని వచించుట వట్టిసాహసము. ఆలోక మిప్పుడు కనఁబడక యుండవచ్చు. ఆసర్పములు వానిశక్తి మాఱియుండ వచ్చును. అంతియకాని పూర్వముకూడ నుండ నవకాశము లేదనుటమాత్రము హఠవాదము. సృష్టియందుఁగల ప్రకృతి చమత్కారము తెలియ శక్యముకాదు. తృణమునందుఁ గొన్ని పుష్పములు విచిత్రాకారములఁ గనంబడును. వానివర్ణములు మనోహరములుగ నుండు. అవి యుదయముననే వికసించుట వరుసగాఁ బత్రములఁ బెంచుట మరల నిమీలనమునొందుట సకాలమునఁ జేయుచుండును. వాని కా కాలనియతి నేర్పిన దెవ్వరు? భగవంతుఁడే కదా. పాషాణములలోఁ గొన్నింటికిఁ బ్రకాశముకల్పించి రత్నములని వ్యవహరింపఁజేసిన దెవ్వరు? భగవంతుఁడే కదా. చీమలు మొదలగునత్యల్పజంతువు లుదయ ము మొదలు పాటుపడునట్లు నేర్పినదెవరు? ఏపాఠశాలయం దీపాఠము నేర్పిరి? పుట్టగనే వాని కాయలవాటు గల్గెను గదా. ఎవరుచెప్పిరన్న నాభగవంతుఁడే యనవలయుఁ గదా.

ఇట్టియుదాహరణము లెన్నియో చూపి సృష్టిపద్ధతి యిట్టిదని యెఱుంగ శక్యముకాదని చెప్పవచ్చును. ఒకరు నమ్మినను నమ్మకున్నను నాకక్కఱ లేదు. సత్యము చెప్పఁబూనిన సృష్టిచమత్కృతి నిదమిత్థమ్మని నిర్ణయింపఁ జాలమని చెప్పక తప్పదు. కాఁబట్టి యీ గాథయందు నమ్మఁదగనివిషయము లేదని తెలిపి యీభాగము నింకను బెంచి వ్రాయక తరువాతికథను వ్రాయుచున్నాఁడను.

## ముచుకుందాదుల యుత్పత్తి.

ఆయదుభూపాలుఁడా నాగకన్యలయం దైదుగురియందు నైదుగురను గొడుకులను వంశోద్ధారకులను బడసెను. ముచుకుందుఁడు, పద్మవర్ణుఁడు, మాధవుఁడు, సారసుఁడు, హరితుఁడని వారిపేరులు. వీరెల్లఁ బంచమహాభూతములకు సరియనఁదగినవారు. వారింజూచి రాజు పరమానందభరితుఁడయ్యెను. వారు సంప్రాప్తయౌవనులై పర్వతములం బోలి ధైర్యముగలవారలై యుండిరి. బలదర్పముల వెలయుచు వారొక్కనాఁడు తండ్రికడకేగి యిట్లు ప్రశ్నించిరి. తండ్రీ! వయస్స్ఫురితుల మైతిమి. మహాబలముగలవార మైతిమి. మేమేమిచేయఁదగునో యాజ్ఞాపింపుము. అన వినియదుమహీపాలుఁడు బెబ్బులులంబోలి కార్యమునకై త్వరపడుచున్న కొడుకులంగాంచి కుతూహలమున నిట్టు లాజ్ఞాపించెను. నాకొడుకగు ముచుకుందుఁడు విద్యవృక్షవంతములను పర్వతముల నావరించి రెండునగరముల నిర్మించి యందుండఁదగును. సహ్యపర్వతోర్ధ్వభాగమునఁ బద్మవర్ణుఁడను కుమా

---

* ఈభాగము హరివంశాంతర్గత విష్ణుపర్వము ముప్పదియొనిమిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడెనని యెఱుంగునది.

రుఁడు నిలిచి దక్షిణదిక్కును గాపాడుచు నుండఁదగును. సహ్యాపర్వతమున కవ్వలనున్న భాగమునందుండు చంపకవనమందు నాకుమారుఁడగు సారసుఁడు నగరము నిర్మింపఁజేసి యందు నివసింపఁ దగును. హరితుఁడను మత్పుత్త్రుఁడు హరితోదకమున నలరుసాగరమునందుఁ గలద్వీపమున నివసించు టొప్పు. జ్యేష్ఠపుత్త్రుఁడగు మాధవుఁడు ధర్మజ్ఞుఁడుగా వెలసి నారాజ్యమును యువరాజుగఁ బాలింపందగు. అని పలికి వారికెల్ల నాయాయిరాజ్యములఁ బాలించుపద్ధతుల నెఱిఁగించి ఛత్త్రచామరాదుల నొసంగి రాజ్యలక్ష్మి కనువగు వేషములం గూర్చెను. వారెల్ల దిక్పాలకులంబోలి తండ్రి యానతిచొప్పునఁ దమతమ స్థానముల కరిగిరి. ఆయాయిత్రావుల నాయాపురముల నిర్మించుకొనిరి.

ముచుకుందుఁడు వింధ్యపర్వతమధ్యభాగము నాశ్రయించి నర్మదాతీరమున దారుణోపలసంకటప్రదేశమున నగరమునిర్మింపఁ బ్రయత్నించెను. ఆస్థలమును శోధించి వివిక్తముగ నొనరించెను సేతువు నదిపై నిర్మించి పరిఖను ద్రవ్వించి యగాధజలసంభృత మగునట్లు చేసెను. నగరముచుట్టు దేవతాయతనములఁ గట్టించెను. రథ్యలను వీథులను రాజమార్గముల నేర్పఱచెను. నగరమునకు నలుప్రక్కల వనముల నుపవనముల నర్మింపఁ జేసెను. సమృద్ధధనమగు నానగరము సురపురముఁం బోలియుండెను. త్వరపడి కాలముమించకుండ నానరపతి నగరమును నిర్మించెను. స్వతేజోనిర్మితమగు నా శుభనగరమునకు నామకరణము తానే చేసెను. ఆనగరము ఋక్షవంతమను పర్వతము నాశ్రయించి మాహిష్మతియనం బ్రఖ్యాతిం గాంచెను.

రెండుపర్వతముల నడుమ నానగరము రిపుభయంకరమై సకల సుఖాకరమై యొప్పెను. ఋక్షవంతముచెంత వేరొకనగరమును నిర్మించెను. పురికానగరమని దానికిఁ బేరిడెను.

ఇట్లు రెండుపురముల నిర్మించి వానిని ధర్మమునఁ బాలించుచు నుండెను. పద్మవర్ణుఁడు తండ్రియనుమతి ననుసరించి సహ్యపర్వత పృష్ఠభాగమున వేగవతీనదీతీరమున సకల తరులతా నిబిడమగుతావున నగరము నిర్మించెను. తనరాష్ట్ర మల్పమని యెఱింగి తదనుగుణముగా నగరనిర్మాణ మొనర్చెను. ఆరాష్ట్రము పద్మావతమనియు నానగరము కరవీరమనియుఁ బ్రఖ్యాతిం గాంచెను. సారసుఁడును గ్రౌంచనగరమును దండ్రియానతి మెయి నిర్మించెను. ఆనగరము తామ్రవృత్తికగల భూమిపై నిర్మింపఁ బడియెను. చంపకాశోకాది భూరుహములు చుట్టును బలసియుండెను. వనబహుళంబగుట వనవాసిజనపదంబన నది ప్రఖ్యాతంబయ్యె. ఆరాష్ట్రమునం దెల్లతావుల సర్వద్రుకుసుమ ఫలములు సర్వకాలముండునట్లు రాజు నిర్మించెను. హరితుఁడను యదుపుత్త్రుఁడు పితృనాజ్ఞఁ దలందాల్చి సముద్రమునడుమ విరాజిల్లు నాద్వీపమును బాలించెను. ఆభాగము నవరత్నస్ఫీతము. నారీజనమనోహరము. అతని సేవకులు దాశనామమునం బరఁగుదురు. వారు నీటమునిఁగి చాలకాలముండి బయలుపడఁగలరు. వారివంశము మద్గురమనం బరఁగెను. సముద్రమునడుమనుండు శంఖములఁ దీయుట వారికి వృత్తి. మఱియు నందుఁగొందఱు ప్రవాళాంజనసంభవములగు నమూల్యవస్తువులను దీయుదురు. సువర్ణము నాద్వీపమున దొరకును. మౌక్తికములు సమృద్ధములై యుండును. జలములఁ గన్పడురత్నజాతు లాద్వీపమున

నున్నయవి మతెందును లేవని యెఱుంగునది. ఆదేశమున నుండు మానవులు నిషాదులు. సముద్రము నోడలచే నెల్లరదాఁటించుచు నుందురు. మత్స్యమాంసమే వారికి సాధారణాహారపదార్థమని తెలియందగు. విశేషరత్నము లందుదొరకుటంబట్టి రత్నద్వీప మనువిఖ్యాతి నారాజ్యము గాంచెను. దూరదేశముల కందలిరత్నాది సద్వస్తువులు నౌకాసహాయమునఁ గొనిపోఁ బడుచుండును. కాన వాణిజ్యము మెండుగా సాగుచుండెను. హరితుఁ డాద్వీపమున కధిపతియై ధనదుంబోలి యపార ధనాధిపతి యయ్యెను.

కృష్ణా! ఈరీతి నిక్ష్వాకువంశమునుండి యదువంశము నిర్మింపఁబడియె. ఇక్ష్వాకుకులమునుండియే యిది వెడలినదని యెఱుంగందగు. దీని నాయదుపుత్త్రులు నల్వురు నాలుగుభాగములుగా నొనరించిరి. యదుభూపతియు జ్యేష్ఠపుత్త్రుఁడగుమాధవునందు రాజ్యమునిచి వయస్సుచెల్లఁగా యోగమహిమమున స్వర్గము నలంకరించెను. ఆమాధవునికుమారుఁడు సత్వతుఁడు. ఆతఁడు సత్వగుణప్రధానుఁడు, ధర్మాత్ముఁడు నయియుండెను. ఆ సత్వతునికుమారుఁడు మహారథుఁడగు భీముఁడు. ఆతనివిఖ్యాతిచేతనే సత్వతవంశమెల్ల సాత్వత మనంబరఁగెను. ఆభీముఁడు రాజ్యము చేయుచుండుతఱి శ్రీరామచంద్రుని సోదరుఁడగు శత్రుఘ్నుఁడు లవణాసురుని జంపి యామధువనమును ఛేదించెను. ఆమధువనమున్నతావుననే యీమధురానగరము నిర్మింపఁ బడినది. శత్రుఘ్నుఁడే యీనగరమును నిర్మించెను. రామభరతలక్ష్మణశత్రుఘ్నులపిదప నీరాజ్యమును భీముఁడు గ్రహించి పాలించెను. రామచంద్రతన

యుఁడు కుశుఁడు రాజ్యమును బాలింపఁగా లవుఁడనునాతని యనుజన్ముఁడు యువరాజుగ నుండుతఱి భీమునికుమారుఁడగు నంధకుఁడు రాజ్యమును బాలించెను. ఆ యంధకునికుమారుఁడు రైవతుఁడు. ఋక్షుఁడు రైవతతనయుఁడు. పర్వతమూర్ధమున రైవతుఁడు పుట్టినకతమున నాపర్వతము రైవతపర్వత మనుప్రఖ్యాతి నొందెను. ఆ రైవతునికొడుకులలో విశ్వగర్భుఁ డనువాఁడు మహాయశమును గాంచెను. ఆతఁడే రాజ్యమునుబాలింప సమర్థుఁ డయ్యెను. ఆవిశ్వగర్భునకు దేవతాకాంతలఁ దిరస్కరించు రూపలావణ్యములుగల ముగ్వురు భార్య లుండిరి. ఆముగ్వురు నల్వురుకొడుకులం గాంచిరి. ఆకుమారులందఱు దిక్పాలకులకు నీడని చెప్పఁదగినవారు. వసువు, బభ్రువు, సుషేణుఁడు, సభాక్షుఁడు అని వారిపేరులు. వీరందఱు యాదవులనియే పిల్వఁబడిరి. వీరి నల్వురచేత నీయదువంశము విస్తృతింగాంచ నొనర్పఁబడినది. వీరిపుత్రపౌత్రులం బెంచుకొని పెక్కుమందిరాజులు ప్రజావంతులైరి.

కుంతివిషయమున వసువనురాజునకు వసుదేవుఁడు కుమారుఁ డయ్యెను. కుంతియు సుప్రభయనియు నిద్వురుకుమారికలు గల్గిరి. కుంతి పాండురాజునకుఁ బత్నియయ్యెను. ఆయమభూమిందిరుగు దేవకాంతయే యనవలయు చేదిరాజగు దమఘోషునకు సుప్రభ భార్యయయ్యెను. శ్రీకృష్ణా! నీవంశచరిత్ర మీవిధమునఁ జెప్పితిని. నీకెట్లు తెలియునందువేమో పూర్వము శ్రీకృష్ణద్వైపాయనుఁడు నాకుం దెల్పెను. వంశోద్ధారకా! యీయదువంశము భూమియందు నష్టప్రాయమైనది. దీనిని బ్రహ్మదేవునింబోలి యుద్ధరింపుము. శత్రుబాధలం దొలఁ

గింపుము. జయశ్రీనిగాంచి మమ్ముఁ గాపాడుము. నీప్రాపున మేమెల్ల బ్రదుకఁగల మనునమ్మక మున్నయది. నీవు సర్వజ్ఞుఁడవు. సర్వభావనుఁడవు. నీవు జరాసంధు నోర్వఁగలవు. నీప్రాపున మేమెల్ల యోధులమగుదుము. జరాసంధుఁడు బలపరాక్రమముల విఱ్ఱవీఁగి రాజేంద్రులమూర్ధములపై నున్నవాఁడు. యుద్ధసాధనములు పెక్కు లాతనికడఁ గలవు. మేమాయుధములవిషయమై యెన్నిమడుంగులో యతనికంటెఁ దక్కువగ నున్నవారము. ఈనగర మింతకుముం దెన్నిమాఱులో శత్రువులముట్టడికిఁ జిక్కినది. ఇపుడొక్కదినమైన ముట్టడికిఁ దాళఁజాలదు. ఆహారపదార్థములు క్షీణించినవి. వంటచెఱకులుకూడ లేవు. దుర్గములు సడలియున్నవి. పరిఖలు జలసమృద్ధములుగ లేవు. ద్వారరక్షకయంత్రములు శూన్యములైనవి. ఇపుడు వీనిని గ్రొత్తగా నిర్మింపవలయును. యుద్ధశాలల సంస్కరింపవలయును. కంసుఁ డింతకుముందు దీనిం గాపాడుచున్నకతనఁ బ్రజలు రక్షణభారము నతనిపైనిడి హాయిగ నుండిరి. ఆతఁడు మృతినొందుట, క్రొత్తగా మాపై నీభారము పడుట, పలుసారులు శత్రువు లీనగరమును ముట్టడించుట, యనునీకారణముల నిఁక నీపురము శత్రుకృతపీడ నోర్వఁజాలదనుట నిక్కము. మనబలములు యుద్ధమున శ్రమంపడియున్నవి. పెక్కుమాఱులు పోరిపోరి యలసినవి. ఇఁక యుద్ధము పొసఁగు నేని యీరాజ్యము ప్రజలతో నశించును. ఇందులకు సంశయములు లేవు. రాజ్యకాంక్షులుగల దుష్టరాజులు మాతోని యాదవులపైఁ గలవిరోధము నాధారముచేసికొని యోడించిరి. ఓడింపఁబడినవారెల్ల రెండుతెగలైరి. కాన నైకమత్యము

చెడినది. కావున నిపు డేది కర్తవ్యమని తోఁచునో యాపని చేయుము. రాజ్యకాంక్ష గలరాజులచే వంచింపఁబడితిమి. జరాసంధభయార్తులమై రాజ్యక్షోభమున పగలఁబొగిలి నగరజనులు మమ్ము భీతులనినిందింపఁ గడఁగుందియున్న మ మ్ముద్ధరింపుము. శ్రీకేశవా! యాదవులపై రాజులకెల్ల విరోధము కలదు. కావున వీరినడుమఁ జిక్కుపడితిమి. నీయందున్న విశ్వాసముచే నా మతమిదియని విన్నవించితిని. మరలమరల విన్నవింపఁబని లేదు. ఇందు నేపని యెట్లుచేయశక్యమో యాపని యట్లు చేయవలయును. ఈసేన నీవునడుప నడుచును. మేమెల్ల నీప్రాపున నుండఁ దగువారము. ఈవిరోధము నీమూలమునఁ గలిగినది. నిన్నుఁ గాపాడుకొనుచు మమ్ముఁ గాపాడుము. నాయీ మాటలకు క్షమింపుము. అని పలికి యూరకుండెను.

ఆర్యులారా! ఈచరిత్రమునుండి విశేషాంశములు నేర్చుకొనఁదగినవి లేవుగాని విచిత్రాంశ మొక్కఁడు గలదు. దానిని బరిశీలించుటం జేసి ప్రాచీనకాలమున దేశమర్యాద లెట్లున్నవనునది విశదమగును. అది యెఱుంగుటయు ముఖ్యమే. అదేదనఁగా వినుఁడు. యదువు తన తనయులకు బ్రదుకుమార్గము చూపవలసి యుండెను. సంప్రాప్తయౌవను లగుకొడుకులు తండ్రినిం గాంచి యొక్కనాఁ డిక మేమెట్లు జీవింపవలయునో ఆజ్ఞాపింపుమా యని ప్రార్థించిరి. తండ్రియుఁ బరమానంద భరితుఁ డయ్యెను. లోకమున మనుజునకు సుఖ మాఱువిధములుగాఁ గలుగును. వేఱుమార్గమునఁ గలిగినది సుఖమే కాదు.

"శ్లో. అర్థాగమో నిత్యమరోగతా చ
ప్రియాచ భార్యా ప్రియవాదినీ చ,

వశ్యాశ్చ పుత్రోఽర్థకరీ చ విద్యా
షడ్జీవలోకేషు సుఖాని రాజన్!"

పుత్రులున్నంతనే లాభములేదు. వశ్యులుగా నుండవలయు. యదుతనయులు నల్వురు సమర్థులు. పితృవశ్యులు. కావున నాతండ్రియే సుఖవంతుఁ డనవలయును. అట్టికొడుకులు లేని తండ్రి సుఖవంతుఁడు కాఁడు. యదు వా కుమారులకుఁ జక్క నిమార్గ ముపదేశించెను.

"పితృసమో జ్యేష్ఠః"

అన్న న్యాయము ననుసరించి యాతని యువరాజును జేసెను. ఇరువురకుఁ బర్వతప్రాంతముల నగరములు నిర్మించుకొనియుండ నాజ్ఞాపించెను. ఒక్కని సాగరద్వీపమును బాలింప ననుమతినిచ్చెను. ఎవ్వరి కేపనియందుఁ జమత్కృతియుండునో వారి కా పనినొసంగిన మేలు. బలవంతముగా మాఘుస్నానము చేయించి నట్లు నిపుణత చూపఁజాలనికార్యమందుఁ బ్రవేశపెట్టుట తండ్రికే నితరులకేని న్యాయమునుగాదు. యదువు తనకుమారులలో నెవరి కరణ్యవాసమునందును నూత్నరాష్ట్రనిర్మాణమునందును దక్షతగలదో వారినిఁ బర్వతప్రాంతముల నుండుఁడనియెను. రత్నపరీక్షాదులయం దిష్టముగలకుమారునకు ద్వీపమునుబాలింప నాజ్ఞనిచ్చెను. ఇత్తెఱంగునఁ జేయుటచే వారెల్లఁ దమచమత్కృతిఁ జూపఁజాలిరి. అడవులు ఛేదించి నగరమును నిర్మించి జానపదుల నందుఁజేర్చుట పూర్వాచారము. ప్రజల కందువసియింప ననువగుపద్ధతులు చూపి వారినలరింపఁజేయుట పూర్వులకున్న యలవాటు. ఇప్పుడది మాఱిపోయినది. అడవులచెంత నుండువా రరోగులు దృఢకాయులుగ నుందురని పూర్వులు

చక్కక నెఱుంగుదురు. పర్వతప్రాంతములనుండుట వారి కెక్కువ మక్కువ. అందు నివసించిన నారోగ్యమును గల్గించు గాలియు సారవంతములగు నాహారపదార్థములు లభించునని యు వానిచే నాయువు పెరుఁగుననియు వారివిశ్వాసము. జల సమృద్ధికిఁ గొఱఁతయుండదనియు వర్షము లధికముగాఁ గురి యుననియు వా రెఱుంగుదురు. గోధనము పూర్వుల కెక్కువ. గోక్షీరములఁ ద్రాగుచుండెడివారు. భూలోకామృతమని యా వుపాలకుఁ బేరు. క్రొత్తఁగాఁ దీసినపాలకుఁ బీయూషమని పేరు గలదు. పాలుకాచి త్రాగుటకన్న నురుగాఱనిపాలు త్రాగుట మేలనియు రోగములు నశించుననియు వా రెఱుంగు దురు. ధారోష్ణములని వానింబిలుచుట విన్నారము కదా. అట్టిక్షీ రములు ధేనువులు చక్కని పచ్చికమేసిననే యొదవును. అందుల కరణ్యప్రాంతముల నివసించుట మంచిదని వా రూహించిరి. అడ వులఁ బెంచిన వర్షమునకుఁ గొఱంత లేకుండుటగాక యందున్న యమూల్యపదార్థములు లభించునని ప్రాక్కాలికజనుల యాశ యము. అట్టియాశయము లిక్కాలమున నశించి నగరవాస ముత్తమోత్తమమని భావించుచున్నారు. స్వభావసౌందర్యము పర్వతములయందుఁ గలదుగాని మఱెందుగలదు? అట్టివిశేష ములం జూచుభాగ్యము గల్గుట సామాన్యమా? మఱియుఁ బర్వతములయందు మహర్షులుందురు. వారిదర్శనము సకలవిధ ముల జ్ఞానదాయకము. వారు లోకుల కుపకరింపఁ దిరుగుట కలదు. వారిదర్శనము పరమపురుషార్థ మీఁజాలునని నమ్మువా రెక్కుడుసంఖ్యగలవా రుండిరి. ఇపుడు వారు కనఁబడక తిరు గుచున్నవారు. లోకవృత్తమును దిలకించుచున్నవారు. ఎవరై

నను భక్తులు దొరకుదురా. భగవత్తత్త్వము నుపదేశింతమా యని నాలుకలు చాపుచున్నవారు. డాంబికులై మే మేమహాత్ములమని మూర్ఖులు వేషధారులై లోకులవంచించు మాటల పల్కుచుండ మహర్షు లౌరా! ఎట్టికట్టడికాలము వచ్చినది యని యచ్చెరువందుచున్నారు. కొందఱు మహర్షులపేరులు పెట్టుకొని తోఁచినట్టులు పల్కుచుండ నంతకంటెఁ బామరులు వారలం గొల్చుచుండ నవ్వారిని మఱికొందఱు పూజించుచుండ, వారు తరణోపాయ ముపదేశింతురని మఱికొంద ఱాశ్రయించుచుండ నిశ్చయముగా వీరుమహాత్ములే మనల నుద్ధరించుటకవతరించిరని యింకను గొందఱునమ్మి వారిపాదసేవచేయుచుండ నందఱును మోసపుచ్చితిమికదా మనకంటె మహర్షులు గలరా యని యాడాంబికులు సంతసించుచుండఁ బ్రచ్ఛన్నవేషముల మహర్షులు కలికాల మిట్టిది గదాయని వగచుచుఁ బరమేశ్వరా! ఈపామరుల గాపాడుపాంటె నవతరించి కుమార్గములనుండి వీరిని మరలించి డాంబికుల నోరుమూయించి భగవద్గీతార్థముల నాచరణమునకుఁ దే నియమించి దుష్కృతముల నడఁగించి మానవుల వీరిని గాపాడుమా యని ప్రార్థించుచున్నారు. భగవంతుఁడు కలికాలమున నిట్లుండవలసినదేయని యూరకుండఁ దలంచుచున్నవాఁడు. ప్రకృతిచెలరేఁగి విచ్చలవిడి విచిత్రసృష్టి నొనరించుచున్నది. మాకంటె నుత్కృష్టమతులు లేరని యెల్లవారును దలంచుచుండునట్టు లొనరించి విహరించుచున్నది. శ్రుతిస్మృతులు ప్రమాణములు కావనువాదములు ప్రబలుచున్నవి. ఎవ్వరికి వారే యధికులమనుభావము పెచ్చుపెరుఁగుచున్నది. ధర్మకార్యములు కీర్తింగోరియే చేయఁబడు

చున్నవి. భగవద్భక్తి యుపన్యాసములయందు నర్తనము చేయు చున్నది. కంఠహారములు చేసినవిషయము లుపన్యసింపఁబడు చున్నది. సభలలో భక్తుల మనిపించుకొన నెందఱో ప్రయత్నించుచున్నారు. కొందఱు ప్రయత్నింపఁ బూనుచున్నవారు. ఇంకను గొందఱు ప్రయత్నింతమా వలదా యని యాలోచించుచున్నారు. మీరు ప్రయత్నించిన మేము తోడ్పడుదుమని మఱికొందఱు వాగ్దానము చేయుచున్నారు.

మహాశయులారా! కాలమెట్లు మాఱుచున్నదో పరికింపుఁడు. ధర్మము లెట్లున్నవో యూహింపుఁడు. ధర్మము ననుసరించి వర్షములు లోనగునవి యెట్లు లోకుల కుపకరించుచున్నవో తలంపుఁడు. మనుష్యులయాయుస్సు వరుసగా నెట్లుతగ్గుచున్నదో చింతింపుఁడు. రోగములు క్రొత్తక్రొత్తపేరుల నెట్లు చెలరేఁగుచున్నవో పరీక్షింపుఁడు. ఆహారనియమ మెంతపాడైనదో చూడుఁడు. యోగాభ్యాసము శశవిషాణము నెట్లుమించినదో చూడుఁడు. ధర్మప్రవక్తలు తమ రాచరింపనిధర్మముల నెట్లుపదేశించుచుఁ దన్మూలమున ద్రవ్యమునార్జించి ధన్యుల మనుకొనుచున్నారో కనుఁగొనుఁడు. హరిదాసుల మర్యాదలఁ గాంచుఁడు. వేదాంతుల ద్రవ్యాశ మేరుతుల్య మగుచున్నది. సదాచారము లడుగంటుచున్నవి. మతధర్మము లేటిపా లగుచున్నవి. ధర్మము నుపదేశింపనివాఁ డరుదు. ఔరా! కాల మెంత తలక్రిందగుచున్నది. నిన్నటియాచారము నేఁడు కానరాదు. భగవత్సేవ వ్యాప్రూపమున నున్నది. చెప్పినధర్మములఁ దా నాచరింపనివారిసంఖ్య మితిమీఱుచున్నది. ఇట్టి మహత్తర కష్టకాలమునఁ దరణోపాయ మేది? భగవన్నామసంకీర్తనమే.

దానికి ద్రవ్య మక్కఱలేదు. ఇతరులసాయ మక్కఱలేదు. ప్రాయశ్చిత్తములు లేదు. ఉపవాసములతో బనిలేదు. గురువు లుపదేశింప నవసరము లేదు. కాలనియమము నాశ్రయింపఁ బనిలేదు. ఆశ్రమములు మఠములు రమ్యహర్మ్యములు కావలసినది లేదు. శ్రద్ధయొక్కటి యున్నఁ జాలును. సకలపాపములను దొలఁగించును. సకలపురుషార్థముల నాపాదించును. శాంతము నెలకొల్పును. జ్ఞానము నుత్పాదించును. ఇంత సులభమగు కార్యముచే సకలతపఃఫలములు లభింప నుండ దానిని మానుట న్యాయముకాదు. ఎవరుధ్యానించిన వారికోర్కెలు తీర్ప శ్రీకృష్ణపరమాత్మ సంసిద్ధముగ నున్నాఁడు. ఎవరును నన్నాశ్రయించువారు కానరారు కదా యని యూహించుచున్నాఁడు. తనదివ్యనామసంకీర్తనము చేయువారు దొరకినఁ జాలు నదే పదివేలని కోరుచున్నాడు. ఇట్టితరుణమును బోఁగొట్టుకొనుట మనకు ధర్మముకాదు. నిశ్చలచిత్తమున నిష్కపట భక్తితో నిర్వ్యాజప్రీతితో శాంతము గలిగి భగవంతుఁడగు శ్రీకృష్ణనామమును స్మరింతము. శ్రీకృష్ణపాదారవిందముల ధ్యానింతము. పూజింతము. ఇంతకంటె మంచిమార్గము వేఱొకటి కానరాదు. ప్రకృత మీచరిత్రము నీప్రకరణమున నింతటితోఁ బూర్తిచేయుచున్నాఁడను. ఈచరిత్రమును బఠించుటకు ఫలముగా శ్రీకృష్ణపరమాత్మస్తుతిని బఠింపుఁడు. మీఁదిప్రకరణమును ద్వారగాఁ బఠింప నూహింపుఁడు.

ఓం శాంతిః. శాంతిః. శాంతిః.

శ్లో. మధురైకరసం వపుర్విభోర్మధురావీథిచరం భజామహే
నగరీమృగశాబలోచనానయనేందీవరవర్షతర్షితమ్. ౧౬

పర్యాకులేన నయనాంతవిజృంభితేన
వక్త్రేణ కోమలదరస్మితవిభ్రమేణ
మంద్రేణ మంజులతరేణ చ జల్పితేన
నందస్య హంత తనయో హృదయం ధునోతి. ౨౦

కందర్పకండూలకటాక్షబందీ
రిందీవరాక్షీరభిలాషమాణాః
మందస్మితాధారముఖారవిందాః
వందామహే వల్లభధూర్తపాదాః. ౨౧

వయమేతే విశ్వసిమః కరుణాకరమూర్తి కింవదంత్యంగే,
అపిచ విభోతవలలితే చపలతరా మతిరియం బాల్యే. ౨౪

మధురిమభరితే మనోభిరామే
మృదులతరస్మితముద్రితాననేందౌ
త్రిభువననయనైకలోభనీయే
మహసి వయం వ్రజభాజి లాలసాస్స్మః. ౨౭

శ్రీకృష్ణకర్ణామృతము. 3 ఆశ్వాసము.

అవతారప్రయోజనప్రదర్శనారంభమను నేడవప్రకరణము
సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1928.

కావ్యస్మృతితీర్థ:

## శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి గ్రంథములు.

ఆంధ్రశ్రీమద్రామాయణము, నిర్వచనము, వ్యాఖ్యానములలోని భావము కూడ విడువక తెనిఁగింపఁబడినది. ఏశ్లోకమున కేపద్యమో తెలియుటకై శ్లోకసంఖ్యగూడఁ దెలుపఁబడినది. విశేషార్థములుండుతావులఁ గ్రింద వివరముగఁ వ్రాయఁబడినది. గొప్పపీఠిక గలదు.

| | | |
|---|---|---|
| 3 సంపుటములుగల ప్రతిరు. 12 0, 7 సంపుటముల ప్రతి | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 5 | 0 |
| హాలాస్యమాహాత్మ్యము, స్కాందపురాణమునుండి తెనిఁగింపఁబడినది. మధురాపురిమాహాత్మ్యమును దెలుపును. మీనాక్షీసుందరేశ్వరుల విలాసచరిత్రములు డెబ్బదిరెండుకథ లిందుఁగలవు ... | 1 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము, భండాసురుని లలితాదేవి చంపుట మొదలగు గాథలనేకము లిందున్నవి. ... | 1 | 8 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకనాటకము ... | 0 | 10 |
| పాండవాజ్ఞాతవాసనాటకము ... | 0 | 12 |
| శ్రీరామవనవాసనాటకము ... | 0 | 10 |
| సంగ్రహరామాయణము, వచనము, సులభశైలి ... | 0 | 10 |
| సంగ్రహభారతము ,, ,, ... | 1 | 0 |
| సంగ్రహభాగవతము ,, ,, ... | 1 | 0 |
| హనుమద్విజయము, పద్యకావ్యము ... | 0 | 8 |
| కదపమండలచరిత్ర ... | 0 | 8 |
| శ్రీకృష్ణావతారతత్త్వము, ఇది యనేకపురాణములనుండి మనోహరగాథలు వచనరూపముగా వ్రాయఁబడినది. ప్రథమసంపుటము | 1 | 8 |
| ద్వితీయసంపుటము 1 8 తృతీయసంపుటము | 1 | 8 |
| చతుర్థసంపుటము 1 8 పంచమసంపుటము | 1 | 8 |
| షష్ఠసంపుటము 1 8 సప్తమసంపుటము | 1 | 8 |
| నూతనపంచాంగము ... | 0 | 1 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

# వైదిక గ్రంథములు.

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| మావాస్యాతర్పణము | ... | 0 | 2 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు | ... | 0 | 3 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము | ... | 0 | 3 |
| ఋగ్వేదదేవతార్చన, బ్రహ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 2 | [illegible] |
| ఋగ్వేదశ్రాద్ధప్రయోగము, చిన్నసైజు | ... | 0 | 4 |
| ఋగ్వేదసంధ్యావందనము, సటీక | ... | 0 | 3 |
| పంత్రములు, (ఆరాధ్యులది) | ... | 0 | 2 |
| ోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| దేవతార్చన, చిన్నసైజు | ... | 0 | 2 |
| ంచసూక్తములు, సస్వరము | ... | 0 | 2 |
| పంచోపనిషత్తులు, బ్రహ్మమేధసహితము | ... | 0 | 6 |
| ృతర్పణము, చిన్నసైజు | ... | 0 | 2 |
| హ్మయజ్ఞము, సస్వరము | ... | 0 | 3 |
| , సస్వరము, చిన్నసైజు | ... | 0 | 12 |
| స్వరము (ఏకాగ్నికాండ) | . | 0 | 6 |
| ణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రప్రశ్నములు ్రము | ... | 3 | 0 |
| ప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 8 |
| ధ్యావందనము, ఖిలము, సస్వరము | ... | 3 | 0 |
| టో పురుషసూక్తము, శ్రీసూక్తము, ఆంధ్రటీకాతాత్పర్యము | | 0 | 6 |
| టో ఆబ్దికమంత్రములు | ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| మంత్రప్రశ్నములు, మూలము | ... | 0 | 3 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు | ... | 0 | 6 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము | ... | 0 | 6 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు | ... | 0 | 2 |
| రుద్రము—నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు | ... | 0 | 3 |
| రుద్రాధ్యాయము, సటీక | ... | 1 | 8 |
| మంత్రపుష్పము, సటీక | ... | 0 | 2 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |

# జ్యోతిషగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము (1867-1926) | | 10 | 0 |
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| గూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి | ... | 2 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 1 | 0 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 3 |
| ఛప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము... | | 0 | 12 |
| జ్యోతిషార్ణవనవనీతము | ... | 2 | 0 |
| నక్షత్రచూడామణి, చక్కని ప్రతి | ... | 0 | 6 |
| పుష్పబంధము, సాధారణప్రతి | ... | 0 | 8 |
| మహాదశ్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 0 | 12 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| బృహజ్జాతకము, ఆంధ్రటీకా తా॥ వ్యా॥ సహితము | ... | 3 | 8 |
| మయవాస్తువు " | ... | 0 | 3 |
| భృగుసూత్రములు " | ... | 0 | 6 |
| భావార్థచంద్రిక, ఆం॥ టీకా॥ తా॥ | ... | 1 | 0 |
| వృద్ధపారాశర్యము, సాంధ్ర తాత్పర్యము | ... | 1 | 0 |
| లఘుజాతకము " | ... | 0 | 12 |
| వనమాల (వర్షఫణి) " | ... | 0 | 4 |
| వాస్తుసర్వస్వము " | ... | 0 | 6 |
| శకునశాస్త్రము, (శిఖానర[illegible] [illegible]ంశోధకము) | ... | 0 | 4 |
| రెట్టమతశాస్త్రము, సాంధ్ర తాత్పర్యము | ... | 1 | 0 |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 1 | 8 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అనుష్ఠించిన ప్రశ్నగ్రంథమునకు తెనుఁగు | ... | 0 | 4 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| సనత్కుమారశిల్పిశాస్త్రము " | ... | 0 | 4 |
| స్వప్నశాస్త్రము " | ... | 0 | 3 |
| సర్వార్థచింతామణి | ... | 1 | 0 |
| డిటో సటీక | ... | 3 | 8 |
| హారావళి, సాంధ్ర తాత్పర్యము | ... | 3 | 8 |
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 6 |
| డిటో తెనుఁగుపద్యకావ్యము | ... | 0 | 6 |
| హోరారత్నమాల, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 12 |

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు, వాచకములు, నిఘంటువులు, నాగరిలిపిగ్రంథములు మావద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292 ఎస్ప్లనేడ్ [illegible]

శిశువులఁ బోషించి గృహశుద్ధిని జేసికొనుచు వంటచేయవలసి నట్లు శాసించుట యుక్తమగుచో స్త్రీలు శివపూజాదులు చేయ వచ్చునని శాసింపవచ్చును. గృహవిషయమునను, ద్రవ్యమును దాఁచుట, వ్యయము చేయుట లోనగుపనులందును స్త్రీలకుఁ దలమునుకలగుచుండ శివపూజకూడఁ జేయవలయునని మునులు శాస్త్రించినఁ గ్రూరాత్ములని మనమే నిందింప కుందుమా. ఇవ న్నియుఁ గలిపి యూహింపఁగా వారఖిలజ్ఞులని తేటపడియెడిని.

ఇట్లు యశోద కుశలవార్తల నడిగి పరశివునకుఁ బూజ చేయించి యతిథికి నిష్టభోజనము సమకూర్చెను. ఇదియే యా కాలపు మర్యాద. ఇప్పటికాలపుమర్యాదలతోఁ బోల్చిచూచి నచో నెంత మార్పునొందినవో తెలియఁగలవు. అవ్వల నుద్ధ వుఁడు భగవదాజ్ఞానుసారము రాధామందిరమున కరిగెను. త్రోవలో గోపబాలకులు శ్రీకృష్ణునిరాకను బ్రతీక్షించుచు స్మ రించుచు రోదనములు చేయుచుండిరి. ఇది లోకస్వభావమా అమానుష బాలకస్వభావమా పరికింపుఁడు. గోలోకమునుండి శ్రీకృష్ణసేవార్థ మవతరించిన పార్షదులు. వారించుకంతయు నామహాపురుషవియోగము నోర్వఁజాలరు. తద్గతప్రాణులు. కాఁబట్టియే శ్రీకృష్ణదర్శనమును గోరి యవకాశము నోర్వఁ జాలక రోదనములు చేయుచుండిరి. ఉద్ధవుఁడు వారిం గాంచి యచ్చెరువందెను. గోపిక లొక్కపెట్ట నుద్ధవునిం గాంచి భగ వంతుని కుశలమడిగిరి. ఎప్పుడువచ్చునని ప్రశ్నించిరి. ఏల? వా రును రాధామాధవసేవార్థ మవతరించిన గోలోకవాసినులు, అంతియకాని కులటలు గాదు. ఈభావము గల్గినవారికి వారి చర్యలే తెలివిచెప్పఁగలవు. అట్లు భావించుట మహాపాపకార్య

మని పొచ్చరింపఁగలవు. గోపికలు భగవత్పాదారవిందసేవా పరాయణలనుట తేటపఱుపఁగలవు.

ఆవల నుద్ధవుఁడు బృందావనమున రాసమండలమును గన్నులారఁ గనుఁగొనియెను. ఆరాసమందిరము నిత్యోత్సవ విరాజితము. బ్రహ్మాదులకే సేవ్యము. నిత్యాలంకార సంభృతము. దానిమహిమము భక్తులు కానివారికిఁ దేటపడునది కాదు. భగవంతుఁడు గొల్లపిల్లలతో వ్యభిచరించెనన్న వారి కింత కంటె వేఱూహలు ప్రసరించునా. పూర్వపుణ్యమునఁగాని భక్తి భావ మలవడదు. అది యలవడినఁగాని భగవచ్చరితము రుచింపదు. భక్తిహీనుల కన్నియు విపరీతములుగాఁ దోఁపకమానవు. వలన నాతనిమది సదా ప్రముదితమైయుండక దుఃఖముతో నిండియుండును. సుఖ మాత్రానికున్నదన్న శూన్యము. అంధునకు వెన్నెల రుచింపనిచందమున భగవత్సేవ వ్యర్థమని భావించువారలకు నింతకంటె మఱేమి తెలియఁగలదు. కావున వారి మాటలకుఁ జెవిరంధ్రమునఁ జోటీయరాదు. వినినను విననట్లే భావింపవలయును.

ఆమీఁద నుద్ధవుఁడు రాధామందిరమున కరిగెను. కక్ష్యాంతరములు గడచెను. గోపిక లుద్ధవునకు మర్యాద చేసిరి. కడపటిద్వారమునఁ గావలియుండు గోపికల కధిష్ఠాత్రు దేవి యగు మాధవి యతనిరాకను దేవి కెఱుకపఱచి తదనుమతి నొంది పిలుచుకొని యాతిథేయములఁ గల్పించెను. రాధాదేవిం జూచినంతనే ఉద్ధవున కాశ్చర్యకర మగుభావ మంకురించెను. ఆదేవిని వినుతించెను. ఆస్తుతిని దిలకింపుఁడు. సకలదేవతాస్వరూపిణి యని తెల్పుచు త్రిమూర్తు లీదేవియంశసంభూ